# లీలాశుక యోగీంద్ర

# శ్రీకృష్ణకర్ణామృతము

చెన్నపట్టణము, 1895

Record no. 256

Līlāśuka Yōgīndra

Śrīkṛṣṇakarṇāmṛtamu

Cennapaṭṭaṇamu, 1895

Record no. 256

Bibliographic Record Target

లీలాశుక యోగీంద్ర.

శ్రీకృష్ణకర్ణామృతము / లీలా శుక యోగీంద్ర విరచితంబగు ఈగ్రంథము, వెలగపూడి వెంగనామాత్య చేబరిష్కరింపఁబడినది.- చెన్నపట్టణము : వంకాయల కృష్ణస్వామిశెట్టి, 1895.

212 p. ;20 cm.

Record no. 256

Līlāśuka Yōgīndra.

Śrīkr̥ṣṇakarṇāmr̥tamu / Līlāśuka Yōgīṃdra viracitambagu īgranthamu, Velagapūḍi Veṅganāmātya cēbariṣkarimpam̐baḍinadi.- Cennapaṭṭaṇamu : Vaṅkāyala Kr̥ṣṇasvāmiśeṭṭi, 1895.

212 p. ;20 cm.

Record no. 256

శ్రీ రస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

శ్రీలీలా శుక యోగీంద్ర విరచితంబగు

# శ్రీకృష్ణకర్ణామృతము.

ఈగ్రంథము,

వెలగపూడి వెంగనామాత్యరచితాంధ్ర

పద్యములతోడం జేర్చి టీకా తాత్పర్యసహితంబుగ

పండితులసహాయముచే బరిష్కరింపఁబడి

వంకాయల-

కృష్ణస్వామిశెట్టివారిచే

చెన్నపట్టణము పెద్దినాయునిపేట

పెరుమాళ్లుగుడితోటవీధి ౨౩ వ నెంబరుగల

గృహమున స్థాపించియుండు

వాణీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

౧౮౯౫ వ సంవత్సరము.



# అవతారిక

ఆంధ్రదేశంబున శ్రీకాకుళంబను దివ్యదేశంబునందు నివసించు శైవబ్రాహ్మణకులోద్భవుండైన శ్రీలీలాశుకుండను కవీశ్వరుండానగరమునందు చింతామణియను దేవదాసియందాసక్తుండై కృత్యాకృత్యవివేకశూన్యుండై యుండగాఁజూచి యావేశ్య వీరవిద్యాప్రౌఢిమయు వాక్పటిమయు నిరర్థకంబయ్యెనని యనుతాపంబునొంది సోమగిరియను యోగీంద్రునాశ్రయంబుగలుగునటులం జేసె ఇట్లా లీలాశుకుండు పూర్వజన్మసంచిత సుకృత పరిపాకంబున నట్టి సదాచార్యానుగ్రహంబువడసి విషయవైరాగ్య భగవద్భక్త్యాదులు గలవాఁడై యాచార్యోపదేశ ప్రకార యోగంబున శ్రీకృష్ణమూర్తిఁగనుంగొని యానందపరవశుండై తానుగనుంగొనిన స్వరూపంబులను స్తోత్రరూపంబుగఁ గర్ణామృతంబను నీగ్రంథముగా విరచించి భగవంతునికి సమర్పించెను పిదప వెలగపూడి - వెంగనామాత్యుండా శ్లోకంబులకు నాంధ్రవృత్తంబులు రచించె అట్టి యీగ్రంథము టీకాతాత్పర్యసహితంబుగ పండితులచే దిరుమలభట్టారక వేంకటేశ్వరుల వ్యాఖ్యానానుసారంబుగఁ బరిశోధించి ముద్రింపఁబడియె.





శ్రీరస్తు.

# శ్రీకృష్ణకర్ణామృతము.

## ప్రథమాశ్వాసము.

క॥ హృద్యానవద్యకిన్నర। విద్యాధరవాద్యమాన వినోదృతికిన్।
ఖద్యోతసమద్యుతిచ। క్రోద్యాయుధతతికి వేంకటాచలపతికిన్॥

క॥ ఖండనముఖతాండవితా। ఖండితకోదండచండకాండోద్ధతికిన్।
మండలితపింఛచూడగతా। జాండావిస్ఫూర్తికి వేంకటాచలపతికిన్॥

క॥ శుంభద్దోస్తంభగదా। స్తంభితమదజృంభమాణసౌంభకదృప్తి
కిన్। సంభృతకనకాంబరతటి। దంభోదాకృతికి వేంకటాచలపతికిన్॥

ఉ॥ ఈమహనీయమూర్తికి త్రయీగృహమైన త్రికేశేషభూధర। స్వామికి దా
ర్త్యగామికి భుజంగమశాయికి నిష్టదాయికిన్। మామకవాఙ్మనోహరసమాధురికి
వ్వదిసొంపునింపు। కర్ణామృతమాంధ్రవైఖరిసమర్పణమొనరింతు వేడుకన్॥

శ్లో॥ చిన్తామణిర్జయతు సోమగిరిర్గురుర్మే శిక్షాగురుశ్చ భగవాన్
శిఖిపింఛమౌళిః। యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు లీలాస్వ
యంవరరసం లభతే జయశ్రీః॥

టీక॥ చిన్తామణిః-చింతామణియనుమంత్రము, జయతు- సర్వోత్కర్షముగానుం డుగాక, చింతామణిః - చింతామణియనువేశ్య, జయతుచింతామణిః - చింతామణివలెన భీష్టములనిచ్చునట్టి, సోమగిరిః-సోమగిరియను, మే-నాయొక్క, గురుః-ఆచార్యుడు, జయ తు-శిక్షాగురుః శిక్షా-ప్రవృత్తినివృత్తులకు, గురుః-గురుడును, భగవాన్-ఐశ్వర్యాదిషడ్గు ణసంపన్నుండైన, శిఖిపింఛ-మౌళిశ్చ-శిఖిపింఛ- నెమలిపురి, మౌళిః-శిరస్సునగలిగిన శ్రీ కృష్ణస్వామియు, జయతు యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు; యత్-ఎవ్వారియొక్క, పాద- పాదములనెడు, కల్పతరుపల్లవశేఖరేషు-కల్పవృక్షముయొక్క శ్రేష్ఠమైనచిగురుటాకుల యందు, జయశ్రీః-జయలక్ష్మి, లీలాస్వయంవరరసం; లీలా-విలాసములోడ, స్వయంవర- ణా సేవరించుటయందు, రసం-అభిలాషను, లభతే-పొందుచున్నదో-అట్టిగురువులనియ న్వయము; యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు-అనుచోట-యత్పాదకల్పతరుపల్లవములు, శేఖరేషు-శిరోభూషణములుగాగలిగి నారలయందు అనియునర్థముగలదు.

శా॥ శ్రీచింతామణియోగిసోమగిరియుఁ శ్రీకృష్ణదేవుండు దా|రాచార్య
స్థితి నొందెం దచ్చరణకల్పాంకూరముల్ మాళి పై । దాచంగ లిన వారిఁ బూచితసయం
తంచ్చానబిలస్సభ । శ్రీచాతుర్యముతో వరించు జయలక్ష్మీకన్య ప్రౌఢాకృతిన్॥

తా॥ కవి - తానారంభించిన గ్రంథము నిర్విఘ్నముగా నెఱవేఱుటకొఱకు ఈ శ్లోకముచేత మంగళము నాచరించుచున్నాడు. అది యెట్లన్నన, తనకు సద్విషయమందు నుపయోగింపదగిన విద్యను గలుగఁజేసిన చింతామణియను మంత్రమును, కేవలవిషయ ప్రవణుఁడగు తన్ను భగవద్విషయమందు బ్రవర్తింపజేసిన చింతామణియను వేశ్యయు, భగవత్సాక్షాత్కార సాధనమగు నుపదేశంబు నొసంగి తత్కోరికలన్ని ఈడేర్చిన సోమగిరియను నాచార్యుండును సదాచారానుగ్రహమువడసిన తనయొక్క హృదయంబున వసించి సత్కార్యముల బ్రవర్తింపజేయుటం బట్టియు దుష్కార్యముల నివర్తింపజేయుటం బట్టియు బరమగురుడై సకలజనులచేత నుపాసింపదగిన బ్రహ్మము తానే యనుటకు నిరూపకంబులైనట్టి జ్ఞానవీర్య వైరాగ్యైశ్వర్య యశశ్శ్రీలను షడ్గుణంబులుం గలిగి యస్మదాది దీనులు జీవించుటకు మూలమైన సౌలభ్యంబను మహాగుణంబునకు సూచకమైన శిఖిపింఛాద్యలంకారములతోడం గూడి గోపవేషముతోడ విలసిల్లు శ్రీకృష్ణమూర్తియు - సర్వోత్కృష్టత్వేన వర్తించుచుండుఁగాక యని వారియందలి ప్రీత్యతిశయముచే వచించుటవలన నిది యాశీస్సును మంగళమాయెను. కల్పతరుపల్లవములవలె సంతార్థముల నివ్వజాలినట్టి వారి పాదములను, జయలక్ష్మి తనంత గోరి వరించుచున్నది అనగా ఆపాదముల నుపాసించువారికి సర్వకార్యములయందు జయము గలుగునని ముఖ్య తాత్పర్యము. ఇదియునుంగాక ఈశ్లోకమందు ఉత్తరార్ధపదముల సారస్యముచేత లోకమందుఁ దక్కని భూషణములుగల పురుషులయందు కన్యకలాశపడునట్టుగా నీజయలక్ష్మి యనుకన్య పల్లవములను శిరోభూషణములుగలవారలయందు నభిలషించెననియు తాత్పర్యము. ఈలాగున నీశ్లోకమందుగాని తక్కినశ్లోకములయందుగాని తరుచుగా తాత్పర్యవర్ణనము సేయదగును. అయినను గ్రంథవిస్తరభీతిచేత, బాలురకు దురూహమవునను భీతిచేతను నిష్కృష్ట తాత్పర్యమే చెప్పంబూనితిమి. ఇదియుగాక, కొందఱు ఈశ్లోకమందు మఱికొన్ని యర్థముల వర్ణనము జేయుచున్నారు అయితే అది క్లిష్ట కల్పనముగాన నుపేక్షింపంబడియె. ౧

శ్లో॥ అస్తి స్వస్తరుణీకరాగ్రవిగళత్కల్పప్రసూనాప్లుతం । వస్తుప్ర
స్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులం। స్రస్తస్రస్తనిరుద్ధ
నీవివిలసద్గోపీసహస్రావృతం। హస్తన్యస్తనతాపవర్గమఖిలో
దారం కిశోరాకృతి॥ ౨

టీక॥ ప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులం - ప్రస్తుత - కొనియాడఁబడిన వేణు - పిల్లనగ్రోవియొక్క, నాద - ధ్వనియొక్క - లహరీ - ప్రవాహముచేఁ, యిన - నిర్వా

శ్లో॥ చాతుర్యైకనిధానసీమచపలాపాంగచ్ఛటామన్థరం । లావ
ణ్యామృతవీచిలాలితదృశంలక్ష్మీకటాక్షాదృతం । కాళిన్దీపులి
నాంగణప్రణయినం కామావతారాఙ్కురం బాలంనీలమ
మీవయంమధురిమస్వారాజ్యమారాధ్నుమః॥

టీక ॥ చాతుర్యైకనిధానసీమచపలాపాంగచ్ఛటామన్థరమ్ - చాతుర్యా-చతు రత్వమునకు, ఏక- అద్వితీయమయిన, నిధాన- నిక్షేపముయొక్క, సీమ- మేరలయిన ట్టి, చపల- చంచలములయిన, అపాంగ- కడగన్నులయొక్క, ఛటా - సమూహము చే, మన్థరమ్- భారముగలిగినవాఁడగు, లావణ్యామృతవీచిలాలితదృశమ్ - లావణ్యా- ముత్యపుతేటవంటి కాంతియను-అమృత,అమృతముయొక్క- వీచి, అలలచేత- లాలిత, కొనియాడబడిన- దృశమ్, చూపుగలవాఁడగు- లక్ష్మీకటాక్షాదృతమ్, లక్ష్మీ- శ్రీమ హాలక్ష్మియొక్క, కటాక్ష- కడగంటిచూపులచే, ఆదృతమ్ - ఆదరింపబడినవాఁడగు, కాళిందీపులినాంగణప్రణయినం- కాళిందీ, యమునానదియొక్క- పులిన, ఇసుకదిన్నె లయొక్క- అంగణ, ప్రదేశములయందు-ప్రణయినం, ప్రేమగలవాఁడగు- కామావతా రాఙ్కురం,- కామ- మన్మథునియొక్క, అవతార- అవతారమునకు, అఙ్కురం- మొ లకయయినవాఁడగు, మధురిమస్వారాజ్యం- మధురిమ, సౌందర్యమునకు- స్వారాజ్యం స్వర్గరాజ్యమువలెనతిశయాస్పదుఁడయినవాఁడగు- నీలం, నీలవర్ణుఁడునగు- బాలం, చిన్నవానిని- అమీ, ఈసంసారులగు - వయం, మేము - ఆరాధ్నుమః, ఆరాధింతుము గాక. ... ... ... ..., ... ... ❋

తా॥ చాలున్మంజులతాలవాలచపలాపాంగోల్లసల్లీలునిం। గాళిందీపు
లినాంగణప్రణయిశృంగారైకఖేలుఁ శుభ। శ్రీలోలుం గరుణావలోకన సుధా
శీలున్నీనీలప్రభా। జాలుం గొల్చెద రామణీయకరసస్వారాజ్యసాలున్మదిన్॥ 3

తా॥ పూర్వంబు కలదని ప్రతిపాదించిన బ్రహ్మమగు శ్రీకృష్ణుఁడను బాలుఁడే సంసార నివృత్తికాములకు పాస్యుఁడు గనుక వాని నారాధించెదము - వాఁడు యెట్టివాఁడంటే దీనికతిశయించిన చాతుర్యము లేదని చెప్పదగిన చాతుర్యముతో చంచలించుచున్న కడగ న్నులు నునిగనిగ మెఱయు తళుక్కులను చూపులను గలిగి యమునాపులినములో కామో ద్రేకమును గలుగునట్టుగా నీలమణివన్నెతో వర్తించుచు శ్రీదేవిచే ప్రేమతో విలోకితుండై దర్శనమాత్రంబున సకలజనులకు విశ్వాసంబు బుట్టించునట్టి సౌందర్యాతిశయంబును బా ల్యంబునందుఁబూనియుండువాడనుట. ... ... .. ... ... ... ❋

శ్లో॥ బర్హోత్తంసవిలాసికున్తలభరంమాధుర్యమగ్నాననం ప్రోన్మీల
న్నవయౌవనం ప్రవిలసద్వేణుప్రణాదామృతం। ఆపీనస్తనకు
ట్మలాభిరభితో గోపీభిరారాధితం జ్యోతిశ్చేతసి నశ్చకాస్తి జగ
తామేకాభిరామాద్భుతమ్॥ ౪

౦-సుఖముచేతను-నిర్వ్యాకులమునిశ్చలమైన- స్వస్తరుణీ- కరాగ్రవిగళత్కల్పప్రసూనాప్లుతం-స్వఃస్తరుణీ- దేవతాస్త్రీలయొక్క- కరాగ్ర- చేతికొనలనుండి-విగళత్- జారుచున్న- కల్పప్రసూన- కల్పవృక్షపుష్పములచేత- ఆప్లుతమ్-వ్యాపింపబడినట్టి- ప్రస్తప్రస్తని రుద్ధనీవివిలసద్గోపీసహస్రావృతమ్- ప్రస్తప్రస్త- అడుగడుగుకుజారుచున్నవానిలోనమానమగుచు-నిరుద్ధ- నిరోధింపఁబడి-నీవి-పోకముళ్లచే- విలసత్- ప్రకాశించుచున్నట్టి- గోపీ- గోపికలయొక్క- సహస్ర-వేలచేత-అవృతమ్ - చుట్టుకోబడినట్టి- హస్తన్యస్తనతాపవర్గమ్- హస్త-చేతిలో-న్యస్త-ఉంచబడిన- నత- శరణాగతులయొక్క- అపవర్గమ్- మోక్షముగల్గినట్టి-అఖిలోదారం- అఖిల- సకలదేవతలకంటె-ఉదారం- మహోదాతయయినట్టి- కిశోరాకృతి- కిశోర- బాలునియొక్క-ఆకృతి- ఆకారముగలిగినవస్తువు-అస్తి-ఉన్నది- ఈశ్లోకముచేతకవిపూర్వముగురుపూర్వముగాఁబ్రార్థింపఁబడినదైవము లేదనువారలనుధిక్కరించిశ్రీకృష్ణరూపంబైబ్రహ్మమువిలసిల్లుచున్నదియనిచెప్పినందునవస్తునిర్దేశమంగళంబు నాచరించినవాఁడాయెను.

శా॥ శోకల్లాఁగఁగేలఁబూనిగుములైగోపాంగనల్గొల్వనా । శ్రీకాస్వల్బినినుండికల్పసుమముల్నిండారవర్షింపఁగా । సోఁకన్వేణువినోదనాదలహరింజొక్కించుచుంజోకుఁచుండి । శ్రీకైశోరముఁబూనుదేవునినతశ్రీముక్తిగాల్చెదన్॥

తా॥ సకలవ్యామోహకమయినవేణుగానముఁజేయుచుఆనాదమైఖరిచేతానునానందనిర్భరుండయిఆకాశమందు ప్రేమపరవశలై దేవస్త్రీలుకల్పకకుసుమములనువర్షింపగా గోపికలుకామాతిశయముచేవీడిపోఁకముళ్ళనుచేతులనడఁచిపట్టుకొని చుట్టుకొనియుండ నీలాగునజగమునుతనచరణారవిందప్రవణముజేసి అపవర్గమునిచ్చుటవలననే సకలదేవతాశ్రేష్ఠంబయిసకలాశ్రయణీయత్వహేతువగు సౌలభ్యంబునకు నిరూపకంబగుబాలభావంబుచేవిలసిల్లుపరత్వముచేనిట్టిదియనినిరూపింపగూడకకేవలవస్తువనిమాత్రముచెప్పఁదగినశ్రీకృష్ణరూపబ్రహ్మంబు వ్రేపల్లెయందున్నదియనుట॥ స్మృతిః॥ ఏవంవిన్యస్తదేహస్సన్ । ధ్యాయేత్కృష్ణంహృదంబుజె । కళాయకుసుమశ్యామమంభోరుహానిభేక్షణమ్। వేణుగానరతందేవంబర్హిబర్హావతంసకం। దివ్యపీతాంబరధరంపూర్ణచన్ద్రనిభాననమ్। వన్యైర్న్యస్తమాలపుష్పైశ్చశోభితంవనమాలయా । నేత్రోత్పలైశ్చగోపీనామర్చితంసున్దరాకృతిమ్। హారకేయూరమకుటకుండలోదగబన్ధనైః । విరాజమానంశ్రీవత్సకౌస్తుభోద్భాసితోరసం । గోపాఙ్గనాపరివృతంమూలేకల్పతరోస్థితమ్। హేమపీఠేస్థువిమలేసర్వరత్నోపశోభితే। రుక్మిణీసత్యభామాభ్యాంపార్శ్వస్థాభ్యాంవిరాజితే। గోపాలైర్గోగణసమూహైశ్చవయస్యైర్వరమత్సరైః।అవృతందేవతాస్సంఘైఃపుష్పవృష్టికరైర్దివి। వేణునాదసమ్మాకృష్టచిత్తవృత్తిభిరర్చితమ్।దివ్యేనవేణునాదేననయస్తంస్వవశంజగత్। ఏవంగోపాంగనానాథంధ్యాత్వాహృదయపఙ్కజే। సమాహితమనాభూత్వాజపేమన్త్రమనుత్తమమ్॥



టీక॥ బర్హోత్తంసవిలాసికుస్తలభరం- బర్హ, శిఖిపింఛములను- ఉత్తంస, శిరోభూషణములచేత- విలాసి, ప్రకాశించుచున్నట్టి- కుంతల, ముంగురులయొక్క-భరం, భారముగలిగినట్టి-మాధుర్య, సౌందర్యవిశేషమందు- మగ్న, మునిఁగిన- ఆననం ముఖముగలిగిన- ప్రోన్మీలన్నవయౌవనం, ప్రోన్మీలత్- వర్ధిల్లుచున్న, నవ- నూతనమైన, యౌవనం- యౌవనముగలిగిన, ప్రవిలసద్వేణుప్రణాదామృతం- ప్రవిలసత్, మిక్కిలివిలసిల్లుచున్నట్టి- వేణు- వేణువుయొక్క, ప్రణాద-ధ్వనియను, అమృతం-అమృతముగలిగిన, ఆపీనస్తనకుట్మలాభిః-ఆపీన, పొంగిన - స్తనకుట్మలాభిః, మొగ్గవంటి స్తనములుగల- గోపీభిః, గోపికలచేత-అభితః- నలుప్రక్కలను, ఆరాధితం - ఉపచారములుచేయబడిన, జగతాం- లోకములకు, ఏకాభిరామాద్భుతం- ఏక, అద్వితీయమయిన. అభిరామ, సుందరవస్తువుగావున- అద్భుత, ఆశ్చర్యకరమయిన- జ్యోతిః, తేజస్సు- నః, మాయొక్క- చేతసి, చిత్తమందు- చకాస్తి, ప్రకాశించుచున్నది. ... ... ... ... *

ఉ॥ చకోరనిముద్దునెమ్మొగముచందమునందపుమందహాసముంజొక్కపుజవ్వనంబుసిగఁజుట్టినబర్హముపేణుగానమున్నొక్కొనఁజొక్కిగోపికలునిండుతమింకుచకుట్మలాలిచే। నొక్కుచుఁగారవించినమనోహరతేజము వాల్చెనామదిన్॥

తా॥ కవి- పూర్వశ్లోకముచే నారాధింపఁగోరినదేవుండు- ధ్యానరూపంబగునారాధనంబుచేయ హృదయంబున సాక్షాత్కరించినప్రకారంబుననుసంధించుచున్నాడు- శిఖిపింఛాలంకృతంబయిన కేశభారముతోడ సౌందర్యపూర్ణంబగుమొగముతోడ ప్రతిక్షణ విలక్షణమయినయౌవనముతోడఁగూడిఅమృతమువలె నత్యంతమధురముగా వేణుగానము జేయ- తదాకారరసంబునందు కామముచేనాప్పడి స్తనములతోగోపికలు చుట్టుకొని తమకోరికెలునెఱవేర్చుకొననుపచారములుసేయగా లోకంబాశ్చర్యమగ్నంబగునట్లుమనోహరుండయిభగవంతుఁడు తేజోరాశిగాతోచెనుట. ... ... *

శ్లో॥మధురతరస్మితామృతవిముగ్ధముఖామ్బురుహంమదశిఖిపిఞ్ఛలా
ఞ్ఛితమనోజ్ఞకచప్రచయం । విషయవిషామిషగ్రసనగృధ్నుని
చేతసిమేవిపులవిలోచనంకిమపిధామచకాస్తిచిరమ్॥

టీక॥ మధురతరస్మితామృతవిముగ్ధముఖామ్బురుహం-మధురతర, అత్యంతమనోహరమయినట్టి- స్మిత, చిరునవ్వను- అమృత, అమృతముచేత - విముగ్ధ, మిక్కిలిసుందరమయిన- ముఖామ్బురుహం, కమలమువంటిముఖముగలిగిన-మదశిఖిపిఞ్ఛలాఞ్ఛితమనోజ్ఞకచప్రచయం, మద- మదముగలిగిన, శిఖి- నెమలియొక్క, పిఞ్ఛ - బర్హముచేత, లాఞ్ఛిత- గురుతుగలదిగాఁజేయఁబడిన, మనోజ్ఞ- మనోరంజకంబైన, కచప్రచయం-కేశపాశముగలిగిన, విపులవిలోచనం- విపుల, విశాలములయిన- విలోచనం, నేత్రములుగలిగిన- కిమపి ,అనిర్వచనీయమయిన- ధామ, తేజస్సు-విషయవిషామిషగ్రసనగృధ్నుని,

యవిష శబ్దాదివిషయములనెడి, విష - విషముగలిగిన - అయిన, మాంసముయొ క్క- గ్రసన, మ్రింగుటయందు- గృధ్నుని, ఆశపడినట్టి న్నా- మే, నాయొక్క- చేతసి, హృదయమందు- చిరం, చిరకాలముగా- చకాస్తి, ప్రకాశించుచున్నది. ... *

చ॥ వదలకసహ్యామావిషయనాంఛకులోనయి సంచరించునా। మదశిఖి పింఛభూషణసమంచితకుంతలభవ్యవేషముక్। మృదుమధురస్మితామృతసము గ్ధముఖాబ్జముహోలదృష్టులింపొదవినదివ్యతేజముసమున్నతినున్నదనిత్యసిద్ధమై॥

తా॥ సుఖమునకుంబోలెదుఃఖమునకుగారణములగుటవలనవిషముతోడఁగూడిన మాంసముతోసమానంబులగు శబ్దాదివిషయంబులని ద్రియములతో ననుభవించుచున్నట్టి నాహృదయమందుకలక్షణములయిన యప్రాకృతవిషయములకాస్పదమయిన భగవం తునిదివ్యమూర్తినాదు భాగ్యవశమున నేచుచున్నది- తన్మూర్తి యెట్టిదియంటే సేవిం చువారిచిత్తమురంజిల్లంజేయుదరస్మితంబుగలమొగంబుతో - పలువన్నెలు గలనెమలిపు రిచేత నలంకరింపఁబడిననల్లనికురులతో- మోముతయునెఱయుంబాలసిమెఱయు కన్ను లతోడంగూడి- యిట్టిదియట్టిదియని నిరూపింపంగూడనిపాలుపుమీఱినతేజోమయమయి విలసిల్లుచున్నదియనుట- ఇచ్చట కొన్నివిశేషములు పూర్వోక్తములయినను భక్తిపారవ శ్యముచేత వేయివేయిగాఁ జెప్పుటచేత, పౌనరుక్త్యశంకకు అవకాశంబు లేదు. *

శ్లో॥ముకుళాయమాననయనాంబుజం విభోర్మురళీనినాద
మకరన్దనిర్భరమ్ । ముకురాయమాణ మృదుగణ్డ మణ్డలం
ముఖపఙ్కజంమనసి మే విజృంభతామ్॥ ౬

టీక॥ ముకుళాయమాన యనాంబుజం. ముకుళాయమాన, మొగ్గిచినట్లున్న-ఆ నగా ముకుళించినవానివలెనాచరించుచున్న, నయనాంబుజం. తామరలవంటికన్నులుగ లిగిన, మురళీనినాదమకరన్దనిర్భరం మురళీ, వేణువుయొక్క - నినాద, ధ్వనియనియెడి- మకరంద, తేనెచేత- నిర్భర, సంపూర్ణమయిన- ముకురాయమాణమృదుగణ్డమ ణ్డలం, ముకురాయమాణ అద్దములవలెనాచరించుచున్న, మృదు- మెత్తనయిన, గణ్డమ ణ్డలం- చెక్కిలతావులుకలిగిన, విభోః- శ్రీకృష్ణదేవునియొక్క, ముఖపఙ్కజం- మోము దామర, మే- నాయొక్క, మనసి- హృదయమునందు, విజృంభతాం- ప్రకాశించుగాక.

మ॥ మురళీనినాదమరందబిందులహరీమోదంబుచేలోచనాం। బురు హంబుల్ముకుళింపనోష్ఠమణిసొంపుల్మీఱనాదర్శభా। సురగండస్థలియొప్పఁగ్రస్త చికురస్తోమంబు ఫాలంబుపై । ముముపుల్నాఁజెలంగుకృష్ణవదనాంభోజంబు భావించెదన్॥

తా॥ ముందు- ప్రకాశించినవస్తువుమఱియు ప్రకాశించుగాకయని ప్రార్థించుచు న్నాఁడు- వేణుగానము చేయునపుడు తామర తేకువంటికన్నులకాంచెముమూసుకొన



వేణువునూదుటచేత నుబ్బియద్దమువలెనున్నగా మెఱయుచున్న చెక్కిళ్ళతోఁగూడిన కరందమువంటి తియ్యనిధ్వనిగలిగిన శ్రీకృష్ణునిముఖారవిందము నాహృదయంబునందోచు చున్నదనుట. ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥కమనీయకిశోరముగ్ధమూర్తేః కలవేణుక్వణితాదృతాననేన్దోః।
మమ వాచి విజృంభతాం మురారేర్మధురిమ్ణః కణికాపి కాపి కాపి॥

టీక॥ కమనీయకిశోరముగ్ధమూర్తేః- కమనీయ, యిచ్చగింపఁదగినట్టి కిశోర, బాల్యముతోఁగూడిన- ముగ్ధ, సుందరమయిన- మూర్తేః, దేహముగలిగిన - కలవేణు క్వణితాదృతాననేన్దోః, కల- అవ్యక్తమధురమైన, వేణుక్వణిత- వేణుధ్వనిచేత- ఆదృ తం, ఆదరింపఁబడిన - ఆననేన్దోః, చంద్రునివంటిముఖముగలిగిన- మురారేః, శ్రీకృష్ణుని యొక్క- మధురిమ్ణః, సౌందర్యముయొక్క- కాపికాపి, అతిసూక్ష్మమైన- కణికాపి, లే శమయినను- మమ, నాయొక్క, వాచి- వాక్కునందు, విజృంభతాం-ప్రకాశించుగాక.

మ॥ కలవేణుక్వణితాదృతాననమురాకాచంద్రసాంద్రద్యుతిన్। దిలకిం పంగమనీయముగ్ధశిశుమూర్తిస్ఫూర్తివర్తిల్లును। త్పలపత్రోజ్జ్వలనీలవర్ణగుణ సంఘామాధురీసాధురీ । తులలోనించుకనైననావచనసందోహంబులన్జెం దెడిన్॥ ౭

తా॥ ఎల్లవారునుమాటిమాటికిఁ జూడనాశపడునట్టి చక్కదనమునుంబాల్యము నుంగలదివ్యదేహముగలవాఁడై చంద్రునివంటిముఖమందుఅమృతమువంటి వేణునాదము విలసిల్లుచున్నట్టికృష్ణునియొక్క తాత్కాలికవిలక్షణసౌందర్యమను తేనెయొక్క చిన్న బిందువైనను నానాలికయందుపడుగాక అనగా ఆసౌందర్యమందు ఇంచుకంతయినను నేను వర్ణింతుగాకయనుట. ... ... ... ... ... ... ... ... *

శ్లో॥మదశిఖణ్డిశిఖణ్డవిభూషణం మదనమన్థరముగ్ధముఖామ్బుజమ్।
వ్రజవధూనయనాఞ్చలవఞ్చితం విజయతాం మమ వాఙ్మయజీవితమ్॥ ౮

టీక॥ మదనమన్థరముగ్ధముఖామ్బుజం- మదన, మన్మథునిచేత- మన్థర, మాంద్య ముగలిగిన- ముగ్ధ, సుందరమయినట్టి- ముఖామ్బుజం, ముఖకమలముగలిగిన- వ్రజవధూ నయనాఞ్చలవఞ్చితం, వ్రజవధూ- గోపికలయొక్క, నయన- కన్నులయొక్క, అంచల- కొనలచేత, వఞ్చితం- వంచింపఁబడిన, మదశిఖణ్డిశిఖణ్డవిభూషణం-మదశిఖణ్డి, మదము గలనెమలియొక్క- శిఖండ, పింఛము- విభూషణం, భూషణముగలిగినవస్తువు- మమ నాయొక్క, వాఙ్మయజీవితం- వాఙ్మయ, కవితకు - జీవితం, జీవనమై- విజయతాం, స ర్వోత్కర్షముగానుండుగాక. ... * ... * ... * * * *

ఉ॥ చకోరనిముద్దుమోమునుమసాయకెకెకురలధికరింపగాఁ। జొ కరపు నెమ్మిబోదనునుసోగరసంబుశిరంబునందుఁ బెం। పెకర వ్రజాంగనాజనని

రీక్షణవంచితమైననాధుస । వ్యాకృతవాక్యజీవితమజాండకటాహమునిండి యుండెడిన్॥

తా॥ మన్మథావేశముచేతవిలాసముబొందిమనోహరమయినముఖముతోగూడిగోకలకడకంటిచూపులచే-తద్వశమయితిరుగుచున్నట్టిశిఖిపింఛభూషణమగువస్తువు - అనఁగా- శ్రీకృష్ణుండునాకవిత్వమునకుజీవనమయి- అనఁగా-నాచేతస్తుతింపఁబడువాడై-వర్ధిల్లుఁగాకయనుట.

శ్లో॥పల్లవారుణపాణిపఙ్కజసంగివేణురవాకులం।
ఫుల్లపాటలపాటలీపరివాదిపాదసరోరుహం।
ఉల్లసన్మధురాధరద్యుతిమంజరీసరసాననం।
వల్లవీకుచకుమ్భకుఙ్కుమపఙ్కిలంప్రభుమాశ్రయే॥

టీక. పల్లవారుణపాణిపఙ్కజసఙ్గి వేణురవాకులం - పల్లవ, చిగుళ్ళవలె- అరుణ, యెఱ్ఱనైన- పాణి, హస్తములనియెడి- పఙ్కజ, కమలములతో -సంగి-చేరియున్న, వేణు- వేణువుయొక్క, రవ- నాదముచేతను, ఆకులం - ఆసక్తిగలిగిన, ఫుల్లపాటలపాటలీపరివాదిపాదసరోరుహం- ఫుల్ల, వికసించిన- పాటల, కలుగొట్టుపూవుయొక్క- పాటలీ, యెఱుపును -పరివాది, దూషించుచున్న - పాద, పాదములనియెడి - సరోరుహం, తామరలుగలిగిన- ఉల్లసన్మధురాధరద్యుతిమంజరీసరసాననం, ఉల్లసత్- ప్రకాశించుచున్నట్టి, మధుర- మాధుర్యముగల, అధర- మోవియొక్క, మంజరీ- సమూహముచేత, సరస- సరసమైన, ఆననం - ముఖముగలిగిన, వల్లవీకుచకుమ్భకుంకుమపఙ్కిలం- వల్లవీ, గోపికలయొక్క- కుచకుమ్భ, కుంభములవంటి స్తనములయొక్క - కుఙ్కుమ, కుంకుమచేత- పఙ్కిలమ్, మలినమయిన - ప్రభుం, ప్రభువైనకృష్ణుని - ఆశ్రయే, సేవించుచున్నాను.

ఉ॥ పల్లవకోమలంబయినపాణితలంబునఁదేనెమోవిరం।జిల్లెడుమోముదన్మ్రపయిఁజేర్చినవేణువుమ్రోయఁజొకుంబుచు। న్వల్లవకామినీజనఘనస్తనకుంకుమపంకభాసియై। వేల్లితపాటలారుణనవీనపదాబ్జువిభుందలంచెదన్॥

తా॥ కలుగొట్టుచిగురులవంటిపాదములతోనలిచివేణువును చిగురువంటిచేతులచే పట్టివాయించునప్పుడు పువ్వుగుత్తువలెమెఱయుమోవికాంతులుముఖమందు ప్రసరింపగానట్టిసౌందర్యజాచికామప్రేమపరవశలయిగోపికలు ఆలింగనముసేయవారిచన్నులయందుండెడి కుంకుమపంకముమేనెల్లవ్యాపించివిలసిల్లునాశ్రితరక్షణసమర్థుడైనట్టి కృష్ణునియాశ్రయించెదననుట- ఇదిగాకనీనాలుగువిశేషణములచేతను వేణుగానముజేయు నొకసమయంబునుభగవంతుఁడు కెంజిగురుపువ్వులుపూవినల్లని ప్రమానువలెతోచెననియుతాత్పర్యమవుచున్నది.

శ్లో॥అపాఙ్గరేఖాభిరభఙ్గురాభిరనఙ్గలేఖారసరఙ్జితాభిః।అనుక్షణంవల్లవసున్దరీభిరభ్యర్చ్యమానంవిభుమాశ్రయామః॥ ౧౦

టీక॥ వల్లవసుందరీభిః - గోపస్త్రీలచేత, అనఙ్గలేఖారసరఞ్జితాభిః - అనఙ్గ, మన్మథునియొక్క - లేఖా, పత్రికలయొక్క - రస, రసభూతమైనసామర్థ్యముచేత.



రంజితాభిః, ప్రకాశింపఁజేయఁబడినట్టి-అభఙ్గురాభిః, దీర్ఘములయినట్టి- అపాంగరేఖాభిః, కడకంటిచూపులపఙ్క్తులచేత - అనుక్షణమ్, మాటిమాటికి - అభ్యర్చ్యమానం,పూజింపఁబడుచున్న,విభుమ్-విభుడైన కృష్ణుని,ఆశ్రయామః-ఆశ్రయించుచున్నాము,

ఉ॥ ఇంచుకనైనజాలిఁగనిమెంచక వేయిలమించుచుఁబోండ్లగ్రొ।మ్మించులమించులీనెడునమేయమనోభవమాధురీరసో। దంచితచారుచంచలదృగంచలధారలసారెపూజఁగా।వించగజెల్వుమీఱువిభువేణునినాదవినోదుఁగొల్చెదన్॥

తా॥ వేణుగానావసరమందుగోపస్త్రీలుకామాతిశయముచేకడకన్నులతోజూచునట్టిసర్వలోకేశ్వరుఁడయిన- శ్రీకృష్ణస్వామి నాశ్రయించెదము - ఆక్రేగంటిచూపులెట్టివన్నఁ- మన్మథుఁడపంపించినచీకటివలెకామోద్రేకముగలుగఁజేయునట్టిసామర్థ్యముతోఁగూడి దీర్ఘములై వెలుగుచున్నవియనుట - వీనిచేతనర్చింపఁబడుచున్నవిభునిఆశ్రయించుట యనఁగాఅట్లుచూచుటయుభగవంతునికారాధనమౌననితాత్పర్యమవుచున్నది.

శ్లో॥హృదయేమమహృద్యవిభ్రమాణాంహృదయంహర్షవిశాలలోలనేత్రమ్।తరుణంవ్రజబాలసున్దరీణాంతరళంకిఞ్చనధామసన్నిధత్తామ్॥

టీక॥ తరుణం- యౌవనముతోఁగూడినదిగనుక నె, తరళం - చంచలమైనట్టి, హర్షవిశాలలోలనేత్రం- హర్ష, సంతోషముచేత -విశాల, వెడల్పులయినట్టి-లోల, చంచలములయిన- నేత్రం, నేత్రములుగలయట్టి- హృద్యవిభ్రమాణాం, హృద్య-మనోహరములయిన, విభ్రమాణాం- విలాసమ్ములుగల, వ్రజబాలసున్దరీణాం - వ్రజ, వ్రేపల్లెయందుండిన- బాల, లేప్రాయముగల- సున్దరీణాం, స్త్రీలయొక్క- హృదయం, హృదయమందున్న- కిఞ్చన, చెప్పనలవిగాని, ధామ - తేజము, మమ - నాయొక్క, హృదయే-చిత్తమందున్న, సన్నిధత్తామ్- ఉండుగాక.

ఉ॥ మంజువిలాసవిభ్రమసమాశ్రయమువ్రజభామినీమనో । రంజకయౌవనాకరముఁరాజితహర్షవిలాసదృక్ప్రభా । పుంజముపింఛభూషణవిభూషితధామమునెమ్మినామనః । కంజనివాసమైమనుచుఁగావుతసత్కరుణాధురీణమై॥

తా॥ తేజమ్మనంబుగల్గియుండుఁగావున చపలంబై సంతోషంబుచేవెడలుపగుకన్నుఁదోయిగలిగిమనోహరంబులగు విలాసంబులుగలలేప్రాయంబుగోపికల - హృదయంబులవెలుంగుచు - యిట్టిదియనియెఱుంగరాకయుండునొకతేజంబునామనంబునవెలయుగాకయనుట. ... ... ... ... ... ... ※

శ్లో॥ నిఖిలభువనలక్ష్మీనిత్యలీలాస్పదాభ్యాఙ్కమలవిపినవీథీగర్వసర్వఙ్కషాభ్యామ్।ప్రణమదభయదానప్రౌఢిగాఢోద్ధతాభ్యాఙ్కిమపివహతుచేతఃకృష్ణపాదాంబుజాభ్యామ్॥

టీక॥ నిఖిలభువనలక్ష్మీనిత్యలీలాస్పదాభ్యాం- నిఖిల, సమస్తమైన- భువన, లోకములయందలి- లక్ష్మీ, కాంత్యధిదేవతకు- నిత్య, నిరంతరమును- లీలాస్పదాభ్యాం-విహారస్థానములైనట్టివియు-కమలవిపినవీథిగర్వసర్వంకషాభ్యాం, కమలవిపిన-పద్మవనములయొక్క, వీథి- సమూహముయొక్క, గర్వ- అహంకారముయొక్క, సర్వంకషాభ్యాం నిర్మూలకములైనట్టివియు, ప్రణమదభయదానప్రౌఢిగాఢోద్ధతాభ్యాం-ప్రణమత్, నమ్రులైనవారలకు-అభయదాన-అభయంబునిచ్చుటచేతనైన, ప్రౌఢి- ఆధిక్యముచేత, గాఢ-దట్టముగానట్టుగాను, ఉద్ధతాభ్యాం- అతిశయించిన, కృష్ణపాదాంబుజాభ్యాం- కృష్ణ, శ్రీకృష్ణమూర్తియొక్క- పాదాంబుజాభ్యాం, పాదకమలములవల్లను- మమ, నాయొక్క- చేతః, చిత్తము- కిమపి, చెప్పశక్యముగానిసంతోషమును- వహతు, వహించుగాక.

మ॥ లలితాశేషవిశాధినాధనగరీలక్ష్మీవిలాసాస్పదం। బులు నీరేరుహగర్వసర్వవిభవప్రోన్మూలనశ్రీపదం।బులు వందారుమనోరథార్థఘటనాపూర్ణానుకంపాస్పదం।బులు శ్రీకృష్ణపదంబులూనిమనమామోదంబునం బొందెడున్॥

తా॥ నిఖిలలోకంబులందుండెడి శ్రీకాంతదేవతకు విహారస్థానంబులై- సేవించెడివారలభయంబులుడుపంజాలి- తామరపువ్వులందెగడుచున్న శ్రీకృష్ణునిచరణంబులవలన నాచిత్తంబు చెప్పనలవిగానిసంతసంబునొందుంగాతయనుట.

శ్లో॥ ప్రణయపరిణతాభ్యాం ప్రాభవాలమ్బనాభ్యాం ప్రతిపదలలితాభ్యాం ప్రత్యహం నూతనాభ్యాం। ప్రతిముహురధికాభ్యాం ప్రస్నువల్లోచనాభ్యాం ప్రభవతు హృదయే నః ప్రాణనాథః కిశోరః॥

టీక॥ ప్రణయపరిణతాభ్యాం- స్నేహమయములైనట్టి, ప్రాభవాలమ్బనాభ్యామ్- ప్రాభవ, ప్రభుత్వమునకు-ఆలమ్బనాభ్యాం, ఆశ్రయములైనట్టి-ప్రతిపదలలితాభ్యాం, ప్రతిపద- ప్రతిక్షణమును, లలితాభ్యాం- సుందరములైనట్టి, ప్రత్యహమ్ - ప్రతిదినమును, నూతనాభ్యామ్- క్రొత్తలైనట్టి, ప్రతిముహుః- మాటిమాటికి, అధికాభ్యాం - విశాలములగుచున్న, ప్రస్నువల్లోచనాభ్యామ్ - ప్రస్నువత్, ఆశ్రితాభీష్టములవర్షించుచున్న- లోచనాభ్యాం, నేత్రములతోడ- కిశోరః, బాలుడైన- ప్రాణనాథః, ప్రాణనాథుడైనకృష్ణుడు- నః, నాయొక్క- హృదయే, చిత్తమందు- ప్రభవతు, తోచుగాక.

చ॥ ప్రతిదినమున్విలాసరసభాసురమైనిరతంబుజూచినన్।మతిహితమై ప్రభుత్వమహిమంబునకెల్లను బట్టుగొమ్మయై। యతురదయాకళోదితములై విలసిల్లెడుకన్నుదోయితో। సతతముప్రాణబంధుడగుచక్రినిబాలుడు తోచుగావుతన్॥

తా॥ స్నేహమయములై దొరతనంబునకెల్ల పట్టుగొమ్మలయి దినదినముక్రొత్తయి



ప్రతిక్షణమును విలాసంబులచే నెక్కువలయియాశ్రయించినవారలకఖిలార్థంబులనొసగుకన్నులతోఁ బ్రాణబంధుడగుబాలుడు నామనంబునఁ దోచుగావుతయనుట.

శ్లో॥ మాధుర్యవారిధిమదాన్ధతరఙ్గభఙ్గీశృఙ్గారసఙ్కలితశీతకిశోరవేషమ్। ఆమన్దహాసలలితాననచన్ద్రబిమ్బమానన్దసంప్లవమనుప్లవతాం మనో మే॥

టీక॥ ఆమందహాసలలితాననచన్ద్రబిమ్బం-ఆమన్దహాస, చిఱునగవుచేత-లలిత, మనోహరమైన- ఆనన, ముఖమను- చన్ద్రబింబం, ఇందుబింబముగలయట్టి - మాధుర్యవారిధిమదాన్ధతరఙ్గభఙ్గీశృఙ్గారసఙ్కలితశీతకిశోరవేషం - మాధుర్య, సౌందర్యమను-వారిధి, సముద్రముయొక్క - మదాన్ధ, మదప్రయుక్తములయిన - తరఙ్గ, అలలయొక్క- భఙ్గీ, వ్రక్కలచేతనైన- శృఙ్గార, శృంగారరసముతోడ- సఙ్కలిత, కూడినట్టి- శీత, చూచెడివారలకన్నులకుసుఖకరమయిన- కిశోరవేషం, బాలునియాకృతిగల- ఆనన్దసంప్లవం, ఆనందస్వరూపుఁడగుకృష్ణుని- మే, నాయొక్క- మనః, మనస్సు - అనుప్లవతాం, అనుసరించుగావుత. ... ... ... ※

చ॥ కందళితస్మితామృతవికాసముఖాబ్జముమాధురీఝరీ। స్యందపరంగభంగినవయౌవనవిభ్రమగోపవేషమా। నందరసైకరూపముసనందకుమారసుధాబ్ధిలోననా। డెందముదేలియాడఁగఁగడించియఘంబనుపంకమంటునే॥

తా॥ చిఱునగవుచేసొగసునొందుమోముచందురుంగలిగి- సౌందర్యంబనియెడిసముద్రముయొక్క అలలచేనయినసింగారంబులోఁగూడి- సేవించెడివారలకన్నులకుసుఖంబుఁజేయుచుబాలభావంబుచేఁదేజరిల్లుసత్యజ్ఞానానందస్వరూపుఁడగు శ్రీకృష్ణునినామనంబనుసరించుగాకయనుట. ... ... ... ... ※

శ్లో॥ అవ్యాజమంజులముఖామ్బుజముగ్ధభావైరాస్వాద్యమాననిజవేణువినోదనాదం। ఆక్రీడతామరుణపాదసరోరుహాభ్యామార్ద్రే మదీయహృదయే భువనార్ద్రమోజః॥

టీక॥ అవ్యాజమంజులముఖామ్బుజముగ్ధభావైః- అవ్యాజ, నిరూపాధికమైన- మంజుల, సౌందర్యముగల- ముఖామ్బుజ, ముఖములయొక్క- ముగ్ధ, సుందరమైన- భావైః, చేష్టలచేత- ఆస్వాద్యమాననిజవేణువినోదనాదమ్, ఆస్వాద్యమాన- అనుభవింపఁబడుచున్న, నిజ- స్వకీయమయిన, వేణు- పిల్లనగ్రోవియొక్క, వినోద- వినోదార్థమయిన, నాదం- ధ్వనిగలయట్టి, భువనార్ద్రమ్- భువన, లోకములయందు- ఆర్ద్రం (చూచువారలచూపులకు)సుఖమును- జేయుచున్న, ఓజః- తేజము, అరుణపాదసరోరుహాభ్యాం

అరుణ, ఎఱ్ఱనైన- పాదసరోరుహాభ్యాం, పాదకమలముల చేత- ఆర్ద్రే- ఆర్ద్రమయిన మదీయహృదయే- మదీయ, నాసంబంధియయిన- హృదయే, చిత్తమందు - ఆక్రీడతాం విహరించుగాకుత. ... ... ... ... ※

మ॥ హసదవ్యాజవనోహరాననముతో నాలోలదృక్పాళితో । నసకృ
ల్లీఖనిరూఢవేణులతతో నాతాటకమాల్యంఘ్రిపారసయుగ్మంబున నింపుసొం
పులుదలిర్పం దాండవంబాడుచు । న్వసియించుకైభవనార్ద్రతేజనుమహానం
దంబునన్నాకుదిక్॥

తా॥ స్మితసిద్ధసౌందర్యంబుచే మరియున్న ముఖకమలసంబంధియైన భ్రూవిక్షేపాదిశృంగారచేష్టలచేతను సేయుచున్న వేణుగానమును మెచ్చుచును లోకంబులవారల చూపులకు సుఖముం జేయుచున్న తేజంబెత్తినగునడుగుదామముల చేత - భక్త్యతిశయముచే గరగుచున్న నామన బంటవిహరించుగాక యనుట. ... ... ... ※

శ్లో॥ మణినూపురవాచాలం వందే తచ్చరణం విభోః। లలితాని యదీయాని లక్ష్మాణి వ్రజవీథిషు॥

టీక॥ యదీయాని- ఏపాదసంబంధులయిన- లక్ష్మాణి (పద్మాంకుశాది రేఖారూపములయిన) చిహ్నములు- వ్రజవీథిషు, వ్రజ - వ్రేపల్లియొక్క, వీథిషు- వీధులయందు; లలితాని- మనోజ్ఞములయినవో, విభోః- వ్యాపకుండైన శ్రీకృష్ణస్వామియొక్క, మణినూపురవాచాలం- మణి, పద్మరాగాదిమణులతో గూడిన -నూపుర, కాలియందియల చేత- వాచాలం, మ్రోయుచున్న తచ్చరణమ్, తత్ - ప్రసిద్ధమైన, చరణం-పాదమునుగూర్చి, వందే- నమస్కరించుచున్నాను. ... ... ※

చ॥ హలకులిశాదిలక్షణసమూహితముద్రనచంచదస్థితిన్ । వెలసిసిరిం
జెలంగువ్రజవీథులనూపురరత్నకింకిణీ । లలితఝుళంఝుళారవము లన్నలుదిక్కులు పిక్కటిల్లగా। దలవరినాబ్రవర్తిలుపదద్వయిగొల్తుహరిన్భజించెదన్॥

తా॥ హలకులిశాంకుశాది రేఖాలక్షణంబులచే వ్రేపల్లియవీధుల నలంకరించుచున్నది. యల మ్రోతనలు గడలనిండజేయు శ్రీకృష్ణునిచరణంబులు భజియించెదననుట.

శ్లో॥ మమ చేతసి స్ఫురతు వల్లవీవిభోర్మణినూపురప్రణయిమంజుశింజితం। కమలావనేచరకళిందకన్యకాకలహంసకణ్ఠకలకూజితాదృతం॥

టీక॥ కమలావనేచరకళిందకన్యకాకలహంసకణ్ఠకలకూజితాదృతమ్ - కమలా, లక్ష్మీదేవియొక్క- వనే, విహారవనమయిన పద్మవనమందు- చర, సంచరించుచున్నయట్టి కళిందకన్యకా- యమునానదియందుండెడి, కలహంస - హంసలయొక్క, కణ్ఠ - కణ



ములయందలి, కల- అవ్యక్తమధురమగు, కూజిత- ధ్వనిచే, ఆదృతం - ఆదరింపఁబడుచున్న (ఇక్కడ- అదృశమ్, అనిపాఠాంతరముగలదు- ఈపక్షమందు కూజితములో, అదృశమ్- సమమైనదియనియర్థము; ఇట్లనివ్యాఖ్యాకృదభిప్రాయము) విభోః- శ్రీకృష్ణమూర్తియొక్క, మణినూపురప్రణయిమంజుశింజితమ్- మణి, రత్నమయములయిన-నూపుర, కాలియందియలయొక్క- ప్రణయి, స్నేహయుతమైనట్టి- మంజు, మనోజ్ఞమైన - శింజితమ్, ధ్వని- మమ, నాయొక్క- చేతసి, చిత్తమందు- స్ఫురతు, తోచుగాత.

మ॥ దినమున్నాదు హృదంతరాళమున వర్తిల్లుంగళిందాత్మజా । వన
జాళిన్విహరించునంచకలరావంబున్విడంబించున । వ్వనజాతేక్షణుపాదనూపుర
మణిధ్వానంబు గోపాంగనా । జనరాసోత్సవనృత్తగీత కలనాసాచివ్య
ధౌరేయమై॥

తా॥ యమునానదీకమలవనమందువిహరించునంచలయొక్క అవ్యక్తమధురముల గుకంఠధ్వనులకుసమానమైన శ్రీకృష్ణుని కాలియందియల మనోజ్ఞంబగు మ్రోతయింపగుచు నామనంబునదోచుగావుతమనుట. ... ... ... ※

శ్లో॥ తరుణారుణకరుణామయ విపులాయతనయనకమలాకుచ
కలశీభరపులకీకృతపులకం। మురళీరవతరళీకృతమునిమానస
నలినం మమ ఖేలతి మదచేతసి మధురాధరమమృతమ్॥

టీక॥ తరుణారుణకరుణామయవిపులాయతనయనం - తరుణారుణ, క్రొంజెముగానెఱ్ఱనయినట్టి- కరుణామయ, దయాస్వరూపములయినట్టి - విపుల, వెడలుపులయినట్టి- ఆయత, పొడవులయినట్టి- నయనం, నేత్రములుంగలయట్టి-కమలాకుచకలశీభరపులకీకృతపులకం, కమలా- లక్ష్మీదేవియొక్క, కుచకలశీ - కలశములవంటి స్తనములయొక్క, భర- భారమందలి, పులకీ- గగ్గురుచేత, కృత- చేయఁబడిన, పులకం- గగ్గురుపాటుగలయట్టి, మురళీరవతరళీకృతమునిమానసనలినం- మురళీరవ, వేణునాదముచేత-తరళీకృత, చంచలముగాఁజేయఁబడిన- ముని, మునులయొక్క- మానస, మనస్సులను-కమలం, కమలములుగలయట్టిన్ని- మధురాధరం, మధుర - మనోజ్ఞమైన, అధరం- అధరోష్ఠముగల, అమృతం- మోక్షస్వరూపమగు శ్రీకృష్ణాఖ్యవస్తువు- మమ - నాయొక్క, మదచేతసి- మత్తచిత్తమందు, ఖేలతి- క్రీడించుచున్నది. ... ... ※

మ॥ తరుణాంభోజారుణలోచనద్వయిఁగృపాధౌరేయమైయొప్పసా । గర
కన్యాకుచకుంభపాళికంబుల కల్గన్పట్టమానీంద్రహృ । త్సరసీజంబులుసంచరిం
చమురళీసంజాతగీతామృతస్ఫురణన్ దాల్గ రఁగంజరించుహరికైశోరంబు భా
వించెదన్॥

తా॥ లేతదామరలవంటి యరుణనేత్రములు వెడలుపులయి నిడుపులయి కృపారసంబుగురియుక

పాఱంగనూరకకన్ను మోడ్చున । జలరుహపత్రనేత్రుని యసత్యపునిద్దుర కేను మ్రొక్కెదన్॥

తా॥ కొంచెముతో సమమగునట్లుగా నడ్డగింపంబడుచుంగోమలంబుగ నుండెడి చిరునగవును - ప్రేమావిర్భావంబుచే బొడమిన యెల్లరకుం దెలియు గద్గదపాటును - వినియెడివారల చెవులకింపగు గోపికల యుపాలంభవచనంబులుం గలిగి వెలయునర మోడ్చుగన్నుదోయిగల శ్రీకృష్ణుని కపటపు నిద్దురను పాసించుచున్నాననుట.

శ్లో॥ విచిత్రపత్రాఙ్కురశాలిబాలా స్తనాన్తరం మానిమనోన్త
రం వా। అపాస్య బృన్దావనపాదపాస్య ముపాస్యమన్యన్నవి
లోకయామః

టీక॥ విచిత్రపత్రాఙ్కురశాలిబాలా స్తనాంతరం - విచిత్ర - నానావిధములగు సపత్రాఙ్కుర - మకరికాపత్రవిశేషముల చేత - శాలి - ఒప్పుచున్న - బాలా - లేప్రాయపు నెలతయొక్క - స్తన - చన్నులయొక్క - అంతరం - మధ్యప్రదేశమును - మానిమనోంతరం వా - మౌని - మునులయొక్క - మనః - మనస్సుయొక్క - అంతరం వా - మధ్యమును - బృందావనపాదపాస్యం - బృందావన - బృందావనమందలి - పాదప - వృక్షముయొక్క - ఆస్యం - ఉనికిపట్టును - అపాస్య - విడిచి - ఉపాస్యం - శ్రీకృష్ణుని వాసస్థానమును - అన్యత్ - ఇతరమును - నవిలోకయామః - చూడము.

చ॥ లలితవిచిత్రపత్రమహితా కుచపాళి దళింవ జావన । స్థలలవలీలతా గృహవితర్దికలం గమునిమానసాబ్జముల్ । జలరుహపత్రనేత్రునివిలాసనివాసములిందు దక్కనే । నెలవునసైనగన్గొనగనేతుగ మేధూతగ శిఖావతంసుని గ॥

తా॥ నానావిధంబులగు మకరికాపత్రవిశేషంబులచే నొప్పు లేజవ్వనంపు చేడియల కుచమధ్యంబులను - బృందావనంబు తరువుల చేరువల నుండక్కడక్కన నెలవులం గృష్ణమూర్తిని గనుంగొననొదియనుట.

శ్లో॥ సార్థంసమృద్ధైరమృతాయమానై రాధ్మాయమానై ర్మురళీనినాదైః । మూర్ధాభిషిక్తం మధురాకృతీనాం బాలంకదానామవిలోకయిష్యే॥

టీక॥ ఈశ్లోకంబు మొదలు నాలుగుశ్లోకములచేత మనంబున దోచిన శ్రీకృష్ణమూర్తిని గన్నులగనుంగొనగోరి ప్రార్థించుచున్నాడు - అధ్మాయమానైః - ముఖవాయువు చే సంపాదింపబడుచున్నట్టి - సమృద్ధైః - సంపూర్ణములయినవిగనుక నె - అమృతాయమానైః - అమృతమువలెనాచరించుచున్న - మురళీనినాదైస్సార్థంరి - వేణునాదములతో గూడి - మధురాకృతీనాం - సుందరజనులలోపల మూర్ధాభిషిక్తం - సార్వభౌముడగు -



బాలం - బాలుడైన, (శ్రీకృష్ణమూర్తిని) కదానామ - ఏసమయమందు, విలోకయిష్యే - చూడగలను. ※

ఉ॥ చక్కని వారి నెల్ల నెకసక్కెములాడెడు చక్కనయ్య మై। చొక్కుచు దానమానలసచ్ఛోభితగానరసామృతంబున। దిక్కులచిక్కులెల్ల మురళిం బలికించెడి బాలునెన్నడో। గ్రక్కున గాంచి యొత్తుకొని కన్నుల నొత్తుదు దత్పదాబ్జముల్॥

తా॥ కోనువునందు డు నెల్లగుణంబుల చేనతిశయిల్లి నకతంబున నమృతంబువలె నాచరించుచున్నవియై ముఖమారుతంబున సంపాదింపబడియెడి, వేణుధ్వనులతోడ వన్నెకాండ్రకెల్లం దొరయై వెలుంగు బాలుండైన శ్రీకృష్ణమూర్తి నేతటిం గాంచెదననుట. ※

శ్లో॥ శిశిరీకురుతే కదా నునస్శిఖిపిఞ్ఛాభరణశ్శిశుర్దృశోః । యుగళం విగళన్మధుద్రవస్మితముద్రామృదునా ముఖేన్దునా॥

టీక॥ శిఖిపిఞ్ఛాభరణః; శిఖిపిఞ్ఛ, నెమలిపురిని - ఆభరణః, భూషణముగలిగిన, శిశుః - బాలుడగు కృష్ణుడు, విగళన్మధుద్రవస్మితముద్రామృదునా; విగళత్, జాఱుచున్న, మధుద్రవ - తేనియవాకగల, స్మిత - చిఱునగవుయొక్క, ముద్రా - ముద్రచేత, మృదునా - కోమలమైన, ముఖేన్దునా - చంద్రునివంటి ముఖముతోడ, నః - మాయొక్క, దృశోః, నేత్రములయొక్క, యుగళం - ద్వంద్వమును, కదాను - ఏసమయమందు, శిశిరీకురుతే - చల్లగాజేయుచున్నాడు. ※

మ॥ తలుకుంగన్నుల చూపు కోపు సుధజిందన్ మందహాసంబువె । న్నెలనిగ్గుల్ వెదజల్ల నెమ్మిపురివన్నెచ్చెన్నెమై మీఱని । ర్మలవక్త్రేందుకళావిలాసమున జేరన్వచ్చి కందోయి శీ । తలము జేయగ నందనందనుని నాత్మం గాంచుటెన్నడో॥

తా॥ నెమలిపురిభూషణంబుగల శ్రీకృష్ణమూర్తి మకరంద ప్రవాహంబుగల తేనెగవుగుటుతుచేతం గోమలంబై చందురుంబోలిన నెమ్మొగంబు తోడం గానుపించి నా కన్నుగవ నెత్తటిచల్లచేయుననుట. ※

శ్లో॥ కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన తారుణ్యసంవలితశైశవవైభవేన । ఆపుష్ణతా భువనమద్భుతవిభ్రమేణ శ్రీకృష్ణచన్ద్ర శిశిరీకురులోచనం మే॥

టీక॥ అద్భుతవిభ్రమేణ; అద్భుత, గోవర్ధనోద్ధరణాది కార్యముల చేత ఆశ్చర్యభూతములైన, విభ్రమేణ - విలాసము గలదిగనుకనే, భువనం - లోకమును, ఆపుష్ణతా - పోషించుచున్నట్టి, కారుణ్యకర్బుర కటాక్షనిరీక్షణేన; కారుణ్య - దయచేత, కర్బుర -

చిత్రవర్ణముతోఁగూడిన, కటాక్ష- కడకన్నులయొక్క, నిరీక్షణేన-చూపులుగల, తారుణ్యాసంవలితశైశవవైభవేన; తారుణ్య- యౌవనముతోడ, సంవలిత - కూడుకొన్న, శైశవ- బాల్యముయొక్క, వైభవేన - సంపదచేత, శ్రీకృష్ణచంద్ర- చంద్రసదృశుడవైనయో శ్రీకృష్ణస్వామి, మే- నాయొక్క, లోచనం- నేత్రమును, శిశిరీకురు- చల్లగా చేయుము. *

శా॥ కూడెంగూడసి ప్రాయపున్నొగసు టెక్కుల్మిక్కిలైకెక్కఁగా । నీ డుంజోడున లేనివీక్షణసుధావృష్టిన్ జగత్పుష్టికిన్ । దోడ్తన్నిండగు గోకులాంబునిధి చంద్రుండంగా కాంతిసాంద్రుండవై । బూడంబూడఁగ దృక్చకోరికలు గాంచున్ సంతతానందమున్ ॥

తా॥ గోవర్ధనోద్ధరణంబు మొదలగు నాశ్చర్యకరంబులగు విలాసంబులంగలిగి జగంబు నెల్ల బోషించెడిదై కృపారసంబుచే నైన చిత్రవర్ణంబుతోఁ గూడిన కడకంటి చూపులుగలిగి యవ్వనంబుతోడఁ గూడిన బాల్యంబుఁగలిగి తేజరిల్లు దివ్యమంగళవిగ్రహంబుచేత ఓ శ్రీకృష్ణస్వామి నాకన్నులకానందంబడుమనుట. *

శ్లో॥ కదావా కాళిన్దీకువలయదళశ్యామలతరాః కటాక్షాలక్ష్యన్తే కిమపికరుణావీచినిచితాః । కదావా కన్దర్పప్రతిభటజటాచన్ద్రశిశిరాః కమప్యన్తస్తోషం దదతి మురళీకేళినినదాః ॥

టీక॥ కాళిందీకువలయదళశ్యామలతరాః; కాళిందీ, యమునయందలి కువలయ నల్లకలువలయొక్క, దళ- రేకులవలెను, శ్యామలతరాః- మిక్కిలి శ్యామలవర్ణముగల, కటాక్షాః- కడకన్నులు, కిమపికరుణావీచినిచితాః; కిమపి-చెప్పనలవిగాని, కరుణా- దయయొక్క, వీచి-అలలచేత, నిచితాః - వ్యాపింపబడినవియై, కదావా- ఎప్పుడు, మయా-నాచేత- లక్ష్యంతే - చూడబడుచున్నవి. కందర్ప ప్రతిభటజటాచంద్ర శిశిరాః; కందర్ప, మన్మథునియొక్క, ప్రతిభట-శత్రుడగు హరునియొక్క, జటా - జడలయందుండెడి, చంద్ర- చంద్రునివలె, శిశిరాః- ఆహ్లాదకరములగు- మురళీకేళినినదాః- మురళీ, వేణువుయొక్క, కేళి- క్రీడార్థమైన, నినదాః - నాదములు, కిమపి-చెప్పనలవిగాని, అంతస్తోషం- అంతఃకరణాహ్లాదమును, కదావా- ఎప్పుడు, దదతి ఇచ్చుచున్నది.

ఉ॥ ఎన్నఁడొ యామునోత్పలసితేతరలోలదళార్ద్రదృగ్విలాసోన్నతి నాపయిన్ నిగుడియుండుట శంభుజటాటవీతటా । సన్నసుధాంశుశీతలలసన్మురళీనినదామృతంబుచే । వెన్నుఁడు నాదు వీనులకు విందొనరింపఁ దలంచునెన్నఁడో ॥

తా ॥ యమునయందలి నల్లకలువరేకులకైవడి నల్లనగుచు జెప్పనలవిగాని కరుణాంతరంగంబులనిండింపబడు కడకన్నులు నాచే నెన్నఁడు గానబడును శివునిజడయందలి



చంద్రునికరణి నాహ్లాదంబును సంగంజాలిన వేణువినోదనాదంబులెన్నఁడు నా మనంబున కుంసంతోషంబు జేయునోయనుట. *

శ్లో॥ అధీరమాలోకితమార్ద్రజల్పితం గతఞ్చ గమ్భీరవిలాసమన్థరం । అమన్దమాలిఙ్గితమాకులోన్మదస్మితఞ్చ తే నాథ వదన్తి గోపికాః ॥

టీక॥ హే నాథ- ఓ శ్రీకృష్ణస్వామి, తే-నీయొక్క, ఆలోకితం-చూచుటను, అధీరం-చలనముగాను, గతం- నడచుటను, గంభీరవిలాసమంథరం; గంభీర- తెలియనశక్యమైన, విలాస - విలాసములచేత - మంథరం, మందమునుగాను- ఆర్ద్రజల్పితం- సరసంబుగా మాటాడుటను, ఆకులోన్మదస్మితం; ఆకుల, వ్యాప్తమగు, ఉన్మద-మిక్కిలి మదముతోఁగూడిన, స్మితం-నగవునుగలదానిగాను, ఆలింగితం- కౌగిలించుటను, అమందం- గాఢమైనదానిగాను, గోపికాః-గోపికలు, వదంతి-చెప్పుచున్నారు. *

ఉ॥ అందముగులుకు నీయల సయానము మాటల తేనె సోనమేల్ జెందు మృదుస్మితంపుసుధఁ జెందఁగ టాక్షము తౌరమించుచున్ । విందులుగాఁ గిలింత కడువింతయటంచును గోపకాంతలా । నందముతోడఁ బల్కెదరు నాథ భవన్మహిమానుభావమున్ ॥

తా ॥ ఓ శ్రీకృష్ణమూర్తి నీచూపు నతిచపలంబుగను గమనంబు నతిమందంబుగ నాలింగనంబు నతిగాఢంబుగను- వచనంబు నతివిలాస సరసదరహాసంబుగ నెల్లగోపికలుం బల్కెదరు గావున నాకన్నులకు నీదర్శనంబు గోరుచున్నదియనుట. *

శ్లో॥ అస్తోకస్మితభరమాయతాయతాక్షం నిశ్శేషస్తనమృదితం వ్రజాఙ్గనాభిః । నిస్సీమస్తబకితనీలకాన్తిధారం దృశ్యాసం త్రిభువనసున్దరం మహస్తే ॥

టీక॥ అస్తోకస్మితభరం; అస్తోక, అధికమైన, స్మిత - చిఱునగవనియెడి, భరం- భారముగలయట్టి, ఆయతాయతాక్షం; ఆయతాయత-దీర్ఘములైనవానితో సమములైన, అక్షమ్- నేత్రములుగలయట్టి, వ్రజాంగనాభిః - గోపస్త్రీలచేత, నిశ్శేష స్తనమృదితం; నిశ్శేష,మిగులనట్టుగాను, స్తన- స్తనములచేత, మృదితం- పీడింపబడినయట్టి, నిస్సీమస్తబకితనీలకాంతిధారం; నిస్సీమ-మేరలేనట్టుగాను, స్తబకిత- సంజాతగుచ్ఛములుగాజేయబడిన, నీల- నల్లనివియైన- కాన్తి- కాంతులయొక్క- ధారం- ధారలగలయట్టి, త్రిభువనసున్దరం; త్రిభువన- మూఁడులోకములయందుండెడి వారలకంటె- సుందరం - సుందరమైన- తే- నీయొక్క - మహః - తేజశ్శరీరము- దృశ్యాసమ్ - చూచెదగాత. *

ఉ॥ మబ్బుజిగిన్ గణింపదగు సముంచితకోమలనీలదేహమున్ । గుబ్బమిటారి చన్దవనక్రోద్దినిత్రవేతలు గౌఁగిలింపఁగా । నబ్బుచు మందహాసరుచి యొప్పఁగఁ

గొప్పగుకన్నుదోయిచే । నబ్బురమైనచక్కనియొయ్యారపుతేజముఁ గాంచెదస్మదిన్॥

తా॥ అతిశయంబగుమందహాసంబును - మిక్కిలిగొప్పలగుకన్నులుంగలిగి గోపికలపాలిండ్లచేనధికంబుగబీడింపంబడుచు మేరలేనినల్లనైనకాంతిప్రవాహంబుగలిగి లోకత్రయంబునందుండు సోయగంబులగుంపుకయివడి వెలుంగు నీతేజశ్శరీరంబు జూచెదం గాకయనుట. *

శ్లో॥ మయిప్రసాదంమధురైఃకటాక్షైర్వంశీనినాదానుచరైర్విధే
హి।త్వయిప్రసన్నేకిమిహాపరైర్నస్త్వయ్యప్రసన్నేకిమిహా
పరైర్నః॥

టీక॥ వంశీనినాదానుచరైః ; వంశీనినాద - వేణునాదమును- అనుచరైః- అనుసంచరించుచున్నయట్టి-మధురైః- మనోజ్ఞములైన - కటాక్షైః - కడకంటిచూపులచేత మయి- సంసారబద్ధుఁడనైననాయందు- ప్రసాదం - అనుగ్రహమును- విధేహి - చేయుము- త్వయి ( సర్వేశ్వరుఁడవైననీవు ) ప్రసన్నేసతి - ప్రసన్నుఁడవగుచుండ- ఇహ- ఈలోకమందు - అపరైః-ఇతరులతోడ- నః-మాకు-కిం - ఏమిప్రయోజనము- త్వయి- నీవు - అప్రసన్నేసతి - ప్రసన్నుడవుగాకుండ - ఇహ - ఈలోకమందు - అపరైః- ఇతరులతోడ - కిం - యేమిప్రయోజనము. *

ఉ॥ నీవుప్రసన్నదృష్టిఁగరుణించిననాగుణమెట్టిదేనియున్ । బావనమౌ
నునీకృపకుఁబాత్రముగాకచరించువేళన । న్గావగఁజాలరెవ్వరునుఁ గావునవే
ణురవానుసారలీ।లావహమౌకటాక్షమునలాలనజేయుమునందనందనా॥

తా॥ నీవుప్రసన్నుండవైనప్పుడీలోకంబుఁ బరులతోనేమి ప్రయోజనంబు - నీవు ప్రసన్నుండవుగాకయుండిననీలోకంబుననితరులతోడ నేమికార్యంబుకావున సంసారబద్ధుండనగునాయందు వేణుగానంబు ననుసరించుమనోహరంబులగుకడకంటి చూపులచే ననుగ్రహంబుజేయుమనుట. *

శ్లో॥ నిబద్ధమూర్ధాఞ్జలిరేషయాచే నీరన్ధ్రదైన్యోన్నతముగ్ధకణ్ఠం।
దయామ్బుధేదేవభవత్కటాక్షదాక్షిణ్యలేశేన సకృన్నిషిఞ్చ॥

టీక॥ ఏషః- ఈనేను- నిబద్ధమూర్ధాంజలిస్సన్ ; నిబద్ధ - కూర్పఁబడినయట్టి-మూర్ధ- మూర్ధమయిన-అంజలిస్సన్ - కేల్మోడ్పుఁగలవాఁడనై - నీరన్ధ్రదైన్యోన్నతముగ్ధకణ్ఠమ్; నీరన్ధ్ర-దట్టమయిన- దైన్య - దీనతచేత- ఉన్నత- ఎత్తఁబడిన - ముగ్ధ-గద్గదముగాఁ జేయఁబడిన - కణ్ఠమ్ - కుత్తుకఁగల్గునట్టుగాను- యాచే-యాచించుచున్నాను- దయామ్బుధే- దయాసముద్రుఁడనైన- హేదేవ - ఓశ్రీకృష్ణస్వామి- భవత్కటాక్ష దాక్షిణ్య



లేశేన - భవత్ - నీయొక్క - కటాక్ష-కడకన్నులయొక్క-దాక్షిణ్య - వితరణముయొక్క - లేశేనకొంచెముచేత- సకృత్ -ఒకమాఱు-నిషిఞ్చ-తడుపుము. *

ఉ॥ వేమఱుఁగేలుమోడ్చినిను వేఁడెదనే నెలుఁగెత్తియుత్తలిన్ నామొఱ
యాలకింపుకరుణానిధిదీనశరణ్యసంతతా । ధామభవత్కృపారససుధామధు
రాబ్ధితరంగపాళిలో।నేమికొంతనాపైనొకించుకనించిననందనందనా॥

తా॥ ఓయిదయాసముద్రుఁడవైనశ్రీకృష్ణ - కృపారసంబుఁదొలుకుకడకంటిచూపులచేనన్నొకపరిఁజూడుమనుచుని సంసారబద్ధుండయినయేనుదైన్యంబుననెలుఁగురాల్పఁ బ్రార్థించెదననుట. అనగానీకటాక్షదర్శనంబునశరభంగుఁడు మొదలగు వారలవలెఁగృతార్థుఁడనగుదుననుట. *

శ్లో॥ పిఞ్ఛావతంసరచనోచితకేశపాశే పీనస్తనీనయనపఙ్కజపూజ
నీయే।చన్ద్రారవిన్దవిజయోద్యతవక్త్రబిమ్బే చాపల్యమేతినయ
నన్తవశైశవేనః॥

టీక॥ పిఞ్ఛావతంసరచనోచితకేశపాశే ? పింఛ - నెమలిపురియను - అవతంస- భూషణముయొక్క - రచనా- అలంకారక్రియకు-ఉచిత - తగిన-కేశపాశే- సిగగలయట్టి - పీనస్తనీనయనపఙ్కజపూజనీయే ? పీనస్తనీ-జవ్వనులయొక్క - నయన నేత్రములనియెడు- పఙ్కజ - కమలములచేత - పూజనీయే - పూజింపఁదగినయట్టి- చన్ద్రారవిన్దవిజయోద్యతవక్త్రబిమ్బే ; చన్ద్ర - చంద్రునియొక్క - అరవిన్ద - కమలముయొక్కయు- విజయ - జయించుటయందు- ఉద్యత- ఉద్యుక్తమయిన - వక్త్రబిమ్బే- ముఖమండలముఁగల- తవ-నీయొక్క- శైశవే-బాల్యమందు-నః-మాయొక్క - నయనం - నేత్రము-చాపల్యం-చపలత్వమును-ఏతి-పొందుచున్నది. *

మ॥ పొగరున్ సిబ్బెపుఁగుబ్బలుబ్బఁగఁదమిన్ బూబోండ్లు గందోయిదమ్మిగమిన్ బూజలొనర్పనెమ్మిపురిఁగ్రొమ్మించుల్ సిగన్ దట్టమై నిగుడన్ జందురుజౌకసేయుముఖకాంతిన్వింతమై యొప్పునీ సొగసుం బ్రాయముఁ జూచినానయనముల్ సొంపొందఁగాఁగోరెడిన్॥

తా॥ నెమలిపురియనుభూషణంబులచేఁగైసేయఁదగినసిగగలిగి - జవరాండ్రకన్నుదామరలఁచేఁబూజింపఁదగి చంద్రుని కమలంబును జయింపనుద్యుక్తంబగుచున్నముఖమండలంబునుంగలిగిననీబాల్యంబందునామనంబాసఁజేయుచున్నదియనుట.

శ్లో॥ త్వచ్ఛైశవంత్రిభువనాద్భుతమిత్యవైమి యచ్చాపలఞ్చమను
నాంవివాదగమ్యం । తత్కిఞ్జరోమివిరణన్మురళీ విలాసము
గ్ధంముఖామ్బుజముదీక్షితుమీక్షణాభ్యామ్॥

టీక॥ త్వచ్ఛైశవం- త్వత్, నీయొక్క- శైశవం, బాల్యము - త్రిభువనాద్భుతం, త్రిభువన- మూడులోకములకును, అద్భుతం- ఆశ్చర్యసంపాదకమని, అవైమి- ఎఱుంగుదును, మమ- నాయొక్క, చాపలం- చపలమనునది, యత్- ఏదిగలదో, తత్ - అది, అద్భుతం- ఆశ్చర్యసంపాదకమని, అవైమి- ఎఱుంగుదును, వాగవివాదగమ్యం- వాక్, వాక్కులచేత- అవివాద, వివాదములేనట్టుగాను- గమ్యం, తెలుసుకోఁబడినయట్టి- విరణన్మురళీవిలాసముగ్ధం, విరణత్- మిక్కిలిమ్రోయుచున్న, మురళీ- వేణువుయొక్క, విలాస- గానవిశేషములచేత- ముగ్ధం, సుందరమైన- ముఖాంబుజం, ముఖకమలములను- ఉదీక్షితుం, చూడెడికొఱకు- కింకరోమి, ఏమిచేయుదును.

మ॥ పరమాశ్చర్యము నీదు శైశవము సెప్పన్ రాదు లోకంబునన్ । మదు సన్నాహపలత్వమట్టిదయనిర్వాచ్యంబు చర్చింపహా । మురళీనాదసుధామనోహరముఖాంభోజాతమీకన్నులన్ । బరిశీలింపఁగఁ గోరినాఁడ సులభంబా తారతమ్యజ్ఞతన్॥

తా॥ నీబాల్యంబు ముల్లోకంబులకు నాశ్చర్యంబు బుట్టించెడిదియని యెఱుంగుదును విషయంబులవెంటనంటు నాచాపల్యంబు నట్టిదయని యెఱుంగుదు నెట్టిదియని ద్వివాదంబుగ వాక్కులకు విషయమై వేణుగానామృతంబుచే సుందరంబగు నీనెమ్మోముఁ జూడఁగోరియున్నవాఁడ నేమిసేయుదుననుట.

శ్లో॥ పర్యాచితామృతరసాని పదార్థభఙ్గీ ఫల్గూని వల్గితవిశాలవిలోచనాని । బాల్యాధికాని మదవల్లవభావితాని భావే లుఠన్తి సుదృశాం తవ జల్పితాని॥

టీక॥ పర్యాచితామృతరసాని- పర్యాచిత, స్రవించుచున్న- అమృతరసాని, సుధారసముఁగలయట్టి- పదార్థభఙ్గీఫల్గూని, పదార్థ-మణిసువర్ణాదులయొక్క, భఙ్గీ-పద్ధతులయొక్క, ఫల్గూని- అసారముఁగలయట్టి, వల్గితవిశాలవిలోచనాని - వల్గిత, రతిమొదలగువానిచూపించు చేష్టలతోఁగూడినట్టి, విశాల- విశాలములయిన, విలోచనా- నేత్రములుఁగలయట్టి, బాల్యాధికాని- బాల్యాతిరిక్తములయినట్టి, మదవల్లవభావితాని మద- యౌవనవంతులయిన, వల్లవ- గోపకులచేత, భావితాని-చెప్పఁదగిన, తవ- నీయొక్క, జల్పితాని- వచనములు, సుదృశాం- విద్వాంసులయొక్క, గోపికలయొక్కయని యథార్థము- భావే, మనస్సందు- లుఠన్తి, వర్తించుచున్నవి.

ఉ॥ కమ్మని తేనియల్ జిలుకఁగా వెలదేఱని మానికమ్ములన్ । జిమ్ముచుఁ బెళ్కుచూపు విలసిల్లఁగ వల్లవభావితమ్ములై । యిమ్మగు శబ్దాలరీతికెన యింపఁగ రాని నిజోక్తి బాలిక । ల్నెమ్మది నెంచి యెంచి తమినెక్కొనఁ జేర్చిన శౌరిఁ గాంచెదన్॥



తా॥ స్రవించుచుండు నమృతంబుఁ గల్గి మణిసువర్ణాదులయందు సారత్వంబు దెలుఁపునని రతిమొదలగువానిసూచించు చేష్టలంగలకన్నులం గలిగి బాల్యంబు నతిక్రమించినవియై యౌవనవంతులగు గోపాలకులచే సంభావింపఁబడిన నీవచనంబులు విద్వాంసులమనంబులయందుఁ దిరుగుచున్నవియనుట.

శ్లో॥ పునః ప్రసన్నేన ముఖేన్దుతేజసా పురోవతీర్ణస్య కృపామహామ్బుధేః । తదేవ లీలామురలీరవామృతం సమాధివిఘ్నాయ కదా ను మే భవేత్॥

టీక॥ పునః ప్రసన్నేన- మిక్కిలిస్వచ్ఛమైన, ముఖేన్దుతేజసా- ముఖేన్దు, ముఖచంద్రునియొక్క- తేజసా, తేజస్సుతోఁగూడ- పురోవతీర్ణస్య, పురః- పురోభాగమందు, అవతీర్ణస్య- అవతరించిన, కృపామహామ్బుధేః - దయాసముద్రుండైన శ్రీకృష్ణస్వామియొక్క, తత్- ఆప్రసిద్ధమైన, లీలామురళీరవామృతం- లీలావిలాసముతోఁగూడిన, మురళీరవామృతమేవ- అమృతమువంటి వేణునాదమే- మే, నాయొక్క, విఘ్నాయ- సమాధి, ధ్యానమునకొఱకు, సమాధివిఘ్నాయ, విఘ్నముకొఱకు, కదాను- ఎప్పుడు, భవేత్ -అగును.

ఉ॥ అందెలు ఘల్లుఘల్లురన నాడుచు వేణువునందు గీతమా । నందముతోడఁ బాడుచు నాటి తెఱంగున గన్నదోయికిన్ । విందు ఘటిల్లఁగన్ బైదువు నిల్చి ప్రసన్నముఖాంబుజంబుతో । నందకుమారుఁ డెన్నటికొ నన్బునొ నాదుసమాధిభంగమున్॥

తా॥ మిక్కిలిస్వచ్ఛంబగు నెమ్మొగంబను చందురుని తేజంబుతో దయాసముద్రుండై నాముందటం గానుపించిన శ్రీకృష్ణమూర్తియొక్క విలాసంబుతోఁగూడిన వేణుగానంబు నాసమాధి నెప్పుడు సెఱచుఁగాతయనుట.

శ్లో॥ భావేన ముగ్ధచపలేన విలోకనేన మన్మానసే కిమపి చాపలముద్వహన్తం । లోలేన లోచనరసాయనమీక్షణేన లీలాకిశోరముపగూహితుముత్సుకాః స్మః॥

టీక॥ ముగ్ధచపలేన- ముగ్ధ, సుందరమయిన- చపలేన, చంచలమైనట్టి - విలోకనేన, చూపుచేత- భావేన, చేష్టచేతను- మన్మానసే, మత్- నాయొక్క, మానసే- చిత్తమందు, కిమపి- అనిర్వాచ్యమైన, చాపలం, చపలత్వమును, ఉద్వహన్తం, చేయుచున్నట్టి, ఈక్షణరసాయనం- ఈక్షణ, చూపులకు, రసాయనం, లేహ్యవిశేషమైన, లీలాకిశోరం, లీలా, విలాసముతోఁగూడిన, కిశోరం, బాలుఁడైన శ్రీకృష్ణుని, లోలేన, శ్రీకృష్ణదర్శనాకాంక్షియగు, ఈక్షణేన- చూపుచేత, ఉపగూహితుం - ఆలింగనముజేయుటకొఱకు- ఉత్సుకాస్స్మః, ఉద్యుక్తులమైతిమి.

ఉ॥ చక్కని మోముతోఁ జెలిమి సల్పెడు ముద్దుల కోడిగంబుతోఁ। జొక్కు ఫునవ్వుతోఁ బెళుకు చూపులతోఁ దమిఁ గొల్పు బాలకుం। గ్రక్కున నక్కఁ జేర్చుకొని కన్నులపండువు గావ నంబులో। నక్కరడీరఁగాం చెదన హర్నిశ మున్ వసుదేవభాగ్యమున్॥

తా॥ సుందరంబగు చూపుచే జెప్పనలవిగాని చపలంబగు జేష్టచేతను నామనంబు జలింపం జేయుచున్న కన్నుల పండువగు బాలకృష్ణమూర్తిని మిక్కిలి యాసక్తిం జేయు చూపు చే గాగిలింప నుద్యుక్తుండనై తిననుట.

శ్లో॥ అధీరబిమ్బాధరవిభ్రమేణ హర్షార్ద్రవేణుస్వరసమ్పదా చ।
అనేన కేనాపి మనోహరేణ హా హన్త హా హన్త మనో ధునోతి॥

టీక॥ కేనాపి- నిర్వచింపనశక్యమయినట్టి, మనోహరేణ - మిక్కిలి మనోజ్ఞమైన, అనేన- ఈలోచుచున్న, అధీరబిమ్బాధరవిభ్రమేణ- అధీర, చపలమైన - బింబ, దొండపండువంటి- అధర, అధరోష్ఠముయొక్క- విభ్రమేణ, విలాసముచేత - హర్షార్ద్రవేణుస్వరసంపదా చ, హర్ష - మనోజ్ఞములుగా జేయంబడిన, ఆర్ద్ర- సుఖకరములైనట్టి, వేణుస్వర- పిల్లనగ్రోవియందలి సప్తస్వరములయొక్క, సంపదా చ - సమృద్ధిచేతను, మనః- మనస్సు, ధనోతి- చలించుచున్నది, హా హన్త-అన్యాయము, హా హంత-అన్యాయము,

మ॥ చలబింబాధరలీలఁ గ్రొమ్మెఱుఁగుఁ గా శారీర కారితిచ్ఛటల్। జలదానీకముగా రణన్మురళిగర్జారీతిగా నెంచిని। చ్ఛటలు నాట్యంబు మనోమయూరమె మనరింగ్నెచ్చుకందోయికిన్। ఫలమీ మోహనరూపముం గనెడు సౌభాగ్యంబు చింతింపఁగన్॥

తా॥ మనోహరంబగు చెప్ప నలవిగాకయుండియు నుండటం దోచుచున్న చలించుచున్న కెంపు మోవి లీలచేతను మనోహరంబుగాఁ జేయబడిన వేణునాదసంపదచేత-నామనంబు చలించుచున్నదియనుట.

శ్లో॥ యావన్న మే నిఖిలమర్మదృఢాభిఘాతనిస్సంధిబన్ధనముదేతి న
వోపతాపః। తావద్విభో భవతు తావక వక్త్రచన్ద్రచన్ద్రా
తపద్విగుణితా మమ చిత్తధారా॥

టీక॥ హే విభో- ఓయి శ్రీకృష్ణ, నవోపతాపః- మరణవేదనావిశేషము, మే-నాయొక్క, నిఖిలమర్మదృఢాభిఘాతనిస్సన్ధిబన్ధనం- నిఖిల, సమస్తమైన- మర్మ, నెఱకులయందు- దృఢ, మిక్కిలి- అభిఘాత, కొట్టుటచేత- నిస్సన్ధిబంధనం, పోగొట్టంబడిన అవయవవిశేషములుగలుగునట్టుగాను- యావత్, ఎంతకాలము- నోదేతి, పుట్టకయుండునో- తావత్, అంతపర్యంతము - మమ, నాయొక్క - చిత్తధారా, చిత్తపరంపర,



తావకవక్త్రచంద్రచంద్రాతపద్విగుణితాః; తావక - నీసంబంధియైన, వక్త్రచంద్ర- ముఖచంద్రునియొక్క, చంద్రాతప- వెన్నెలచేత, ద్విగుణితా- రెండింతలుగా చేయబడినది, భవతు- అగుగాత,

*

మ॥ శతవర్షంబులమీఁద నొందు దురవస్థన్ జెందిలోఁగుందిబాధితమై యింద్రియగోళముల్ సగులసంధీభూతముల్ గాకముం। దతిసుప్రాంగ్రముఁగాతదావకసుధాధారాళవేణుస్వనో। న్నతలావణ్యరమానివాసము ఖచంద్రజ్యోత్స్నఁ నాముందటన్॥

తా॥ ఓయి శ్రీకృష్ణమూర్తి- ఎంతకాలంబు సమస్తమర్మస్థానఘాతంబునఁ బ్రిదిలు నవయవంబులుగలుగునట్టు నాకు మరణంబు దోపకయుండునో అంతపర్యంతంబును నేత్రమార్గంబున వెడలు నాచిత్తపరంపర నీ నెంమోము చంగుము వలనం బొడను వెన్నెలచే నుప్పొంగుగాత యనుట.

*

శ్లో॥ యావన్న మే నరదశా దశమీ దృశోఽపి రన్ధ్రాదుదేతి తిమిరీకృతస
ర్వభావా। లావణ్యకేళిసదనం తవ తావదేవ లక్ష్యాసముత్క్వ
ణితవేణుముఖేన్దుబిమ్బమ్॥

టీక॥ తిమిరీకృతసర్వభావాః తిమిరీకృత, చీకటులుగా జేయబడిన-సర్వ, సమస్తమైన- భావా, పదార్థములుగలిగిన- దశమీ, పదియవదియయిన- నరదశా; నర- మనుష్యులయొక్క, దశా- అవస్థ, మే- నాయొక్క, దృశః - నేత్రములయొక్క, రంధ్రాత్- రంధ్రమువల్లను, యావత్- ఎంతకాలము, నోదేతి-పుట్టదో, తావత్ - అంతపర్యంతము, లక్ష్మ్యా- సౌందర్యముచేత, లావణ్యకేళిసదనం; లావణ్య, కాంతివిశేషమునకు- కేళీసదనం, క్రీడాగృహమైనట్టి-తవ. నీయొక్క- సముత్క్వణితవేణుముఖేందుబిమ్బం; సముత్క్వణిత- మిక్కిలి యుత్పత్తియగుచున్న ధ్వనివిశేషముగల, వేణు- పిల్లనగ్రోవికలిగిన, ముఖ- ముఖమనియెడి, ఇందుబిమ్బం- చంద్రబింబమును, చిత్తధారా- చిత్తపరంపర, ఏతు- పొందుగాత, ఈ రెండు శ్లోకంబులకును తాత్పర్యంబొక్కటియగాన- నాంధ్రకవిపద్యంబొక్కటియె సెప్పెనని తెలియునది

*

శ్లో॥ ఆలోలలోచనవిలోకనకేళిధారా నీరాజితాగ్రసరణేః కరుణామ్బురాశేః। ఆర్ద్రాణి వేణునినదైః ప్రతినాదపూర్ణైరాకర్ణయామి మణినూపురశిఞ్జితాని॥

టీక॥ ఆలోలలోచనవిలోకనకేళిధారానీరాజితాగ్రసరణేః; ఆలోల, చంచలములయిన- లోచన, నేత్రములుగల గోపస్త్రీలయొక్క- విలోచన,చూపులయొక్క- కేళి విలాసములతో గూడిన- ధారా, పఙ్క్తులచేత- నీరాజిత, నివాళింపఁబడిన - అగ్రసరణేః

పురోభాగముగల- కరుణాంబురాశేః, దయాసముద్రుఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క- ప్రతినాదపూరైః ప్రతినాద, ప్రతిధ్వనులచేత - పూరైః,సంపూర్ణకములైన-వేణునినదైః, వేణుధ్వనులతోఁగూడి- ఆర్ద్రాణి, రసవంతములైన-మణినూపురశింజితాని; మణి- రత్నమయములయిన, నూపుర- కాలియందియలయొక్క,శింజితాని- ధ్వనులను,ఆకర్ణయామి- వినుచున్నాను. ※

మ॥ నతురక్షించుకృపాపయోధియగుకృష్ణస్వామిలోలావలోకనధారాయువిభ్రోవకారతులోసంగుంబూచుచుస్వీకమై । జన తేరక్ ప్రతినాదపూరమురళీసంగీతతాళానురం। జనమంజీరరవామృతంబుచెవినించక్ విందునింపొందగక్॥

తా॥ చంచలంబులగుతనచూపులయందలివిలాసంబులచేనివాళింపంబడుచున్న పురోభాగంబుగలదయాసముద్రుఁడైన శ్రీకృష్ణునియొక్క ప్రతిధ్వనులచేనొగడువేణునాదంబులతోఁగూడినరత్నమయంబులైనకాలియందియలనాదంబువినుచున్నాననుట. ※

శ్లో॥ హేదేవ హేదయిత హేజగదేకబన్ధో హేకృష్ణ హేచపల
హేకరుణైకసిన్ధో । హేనాథ హేరమణ హేనయనాభిరామ
హాహాకదానుభవితాసిపదందృశోర్మే॥

టీక॥ హేదేవ- ఓయిదేవ, హేదయిత - ఓయిప్రియుఁడ, హేజగదేకబంధో- ఓయిజగద్బంధుఁడ, హేచపల- ఓయిచపలుఁడ, హేకరుణైకసింధో - ఓయిదయాసముద్రుఁడ, హేనాథ- ఓయినాథుఁడ, హేరమణ - ఓయిరమణుఁడ, హేనయనాభిరామ- ఓయినేత్రమనోహరుఁడ, హేకృష్ణ- ఓయికృష్ణుఁడ, మే- నాయొక్క, దృశోః- నేత్రములయొక్క, పదం- విషయమును, హాహా- అకటా, కదాను- ఎప్పుడు, భవితాసి- అగుచున్నావు. ※

శా॥ ఓదేవోత్తమ యోరమేశదయితాయోలోకరక్షామణీ । యోదామోదరకృష్ణచంచలహరీయోసత్కృపాంభోనిధీ । యోశ్రీనాథసనాథయో రమణనీనొప్పారురమ్యాకృతిక్ । మోదంబొప్పఁగజూతునెన్నటికినామోహంబుసంధిల్లఁగక్॥

తా॥ లీలాశుకుండు ప్రత్యక్షుండగుశ్రీకృష్ణునిఁగనంగోరియతండి యీకారణంబులనగపడకుండునోయని యూహించితదనుకూలంబులగునుత్తరంబుల శ్రీకృష్ణమూర్తినిఁ గూర్చివిన్నపంబుజేయుచున్నాఁడదియెట్టులనిన- ఓకృష్ణమూర్తి-అకటానాకన్నులకెన్నటికింవోచెదవోయని ప్రార్థించిఅప్రకాశమానుండనగునేను నీకెటుల ప్రత్యక్షంబుగానేతునని శ్రీకృష్ణుండుపల్కునోయని శంకించి- దేవుండవుండవుగాన స్వతస్సిద్ధప్రకాశభావంబునీయందయనికించేసినాకగపడుటకేమికో అంతయనివిజ్ఞాపనంబొనరించి స్వతస్సిద్ధ



ప్రకాశభావంబునాయందుగలిగియుండినను- నాకునీవు ప్రేమాస్పదుండవుగావుగాననీకు నేగానుపించననునోయని శంకించి- ఓయికృష్ణనీవునాకుదయితుండవుగావుననీకునేప్రేమాస్పదుండఁగాకపోవుటెట్లనివివరించి-ఓయినాకునీవు ప్రేమాస్పదుండవయిననునీయట్టివానికిమఱియెవ్వనికైననగపడుదుంగాక-నీకగపడనోపననునోయనియూహించి- చపలుండవుగావున చాపల్యంబునంజేసినాకన్నులకగపడకుండుదువని- వచియించి-చాపల్యంబునంజేసినీకునేనగపడకయుండెదననునోయనిఎంచి- కరుణైకసింధుఁడవుగాన చాపల్యంబుకన్నదయయధికంబుగనీయందుండుటంజేసియవశ్యంబునునీవునాకుంగానంబడవలయునని విన్నపంబాచరించి- దయాసముద్రుండవయ్యును నీకునాకు నేమివిశేషసంబంధంబుగలిగినప్రత్యక్షంబగుదుననునోయనియాలోచించి- నాకునీవుసాధుండవుగావున స్వస్వామిభావరూపవిశేషసంబంధంబునీకునాకుంగలిగియుండునది కారణంబుగనాకుంగానవచ్చుటనీకవశ్యకర్తవ్యంబని వేఁడుకొని- ఇట్టివిశేషసంబంధంబునాకెల్లరయందుండుటంజేసి బహుస్త్రీనాయకుండగువాఁడొక్కత్తెయందవిశేషానురాగంబుజేయుపగిదియే నాకగానంబడియెద- ననునోయనితలంచి - రమణుండవైన కతంబుననెల్లరయందు నిరుపాధికుఁడవై సమంబుగరమియించుటకునీకు స్వభావంబకదా- కావునంజేసియైనను ప్రత్యక్షుండవుగావలయునని ప్రార్థించి- రమణుండనైననునీమనంబునందరమియించెదంగాక కన్నులకెటులగానంబడియెదననునోయనితలంచి- నయనాభిరాముండవుగావుననాకన్నులకుంబండువుగప్రత్యక్షంబొసఁగుటయెన్నఁడోకోయని ప్రార్థించుననుట.

శ్లో॥ అమూన్యధన్యానిదినాన్తరాణిహరేత్వదాలోకనమన్తరేణ।
అనాథబన్ధోకరుణైకసిన్ధోహాహన్తహాహన్తకథంనయామి॥

టీక॥ కరుణైకసిన్ధో- దయాసముద్రుఁడవైనయట్టి, అనాథబన్ధో-దీనబంధుఁడవైన, హేహరే- ఓకృష్ణ, త్వదాలోకనమన్తరేణ - నీదర్శనంబుమాని, అధన్యాని - కృతార్థములుగాని, అమూని - ఈదర్శనరహితములయిన, దినాంతరాణి - దినములను, హాహంత- అకటకటా- కథం,ఏప్రకారము-నయామి,గడుపుచున్నాను.

శా॥ నిన్నుంగానకనీకథల్వినకనిన్వేమాఱుఁజిత్తంబులో। నెన్నంజాలక నిన్నుజేర్గొనకనిన్నేవేళఁబూజింపలే । కన్నాయార్తనికేతనాంగణనిధీయయ్యోదయాంభోనిధీ! యెన్నేనిందినముల్గ్రమించితివృథాయేమందునాదుర్దశక్॥

తా ॥ దయాసముద్రుండవై దీనబంధుండవైన యోకృష్ణనీదర్శనంబులేకకృతార్థంబులుగానియీదినంబులనకటకటాఎవ్విధంబునంగడపఁజాలుదుననుట.

శ్లో॥ కిమిహకృణుమఃకస్యబ్రూమఃకథంకృతమాశయాకథయత
కథామన్యాంధన్యామహోహృదయేశయః। మధురమధురస్మే

రాకారే మనసో నయనోత్సవే కృపణకృపణా కృష్ణే తృష్ణా చిర
మ్బత లమ్బతే॥

టీక॥ బత- ఓజనులార, మధురమధురస్మేరాకారే; మధురమధుర, సుందరస
దృశమైనయట్టి- స్మేర, కాంతియుతమయిన- ఆకారే, ఆకృతిగలయట్టి - మనోనయనో
త్సవే; మనః- మనస్సునకు, నయన- నేత్రములకు, ఉత్సవే- సంతోషకారణుఁడయిన,
కృష్ణే- శ్రీకృష్ణమూర్తియందు, కృపణకృపణా- కృపణసదృశమైన, తృష్ణా- ఆశ, చిరం,
బహుకాలమును ఁడి, లంబతే- అవలంబించుచున్నది, ఆశయా- ఆశచేత, కథం-ఏప్రకా
రము, కృతం- చేయఁబడెను, కస్య- ఎవ్వనికి, బ్రూమః- చెప్పుదుము, కిం - ఏమి, శృణు
తః- వినుము, కృష్ణః- కృష్ణుఁడు, హృదయేశయః- హృదయమందున్నాఁడు, అహో-
ఆశ్చర్యము, అన్యాం- మఱియొకటియైన, ధన్యాం- కృతార్థమైన, కథాం- కథను, క
థయత- చెప్పుఁడు. ※

శా॥ ఏశాస్త్రంబులయందు నేగురునితో నేనందు నెట్లన్న నా కో। య్యాశల్
ధన్యులు దెల్పలేరకదప్రత్యక్షంబుగా నద్దయా। రాశిల్ నేత్రవనోభిరామస్మితవ
క్త్రశ్రీప్రాభవుం యాదవా। ధీశున్ గోరి మదీయ తృష్ణ యకటా దీనత్వముల్ జెం
దెడిన్॥

తా॥ అనేకసౌందర్యసంపన్నంబగు నాకారంబుగలిగి మనంబునకును నేత్రంబుల
కును సంతోషంబు జేయనోపు శ్రీకృష్ణునియందు చిరకాలంబును డియధికంబయిన యాస
యవలంబించుచున్నది- యిట్టియాశచే నేమిసేయువాడ నెవ్వనివలన నేమివిందునో జనులా
రకృష్ణుఁడు హృదయంబున నున్నవాఁడు తనింగాంచుటకుపాయంబును డు వుడనుట. ※

శ్లో॥ ఆభ్యాం విలోచనాభ్యామమ్బుజదళలలితలోచనమ్బాలమ్।
ద్వాభ్యామపి పరిరబ్ధుం దూరే మమ హన్త దైవసామగ్రీ॥

టీక॥ ఆభ్యాం - ఈపర్వతాదిమహద్వస్తువులఁ జూడ సమర్థములయినట్టి, ద్వా
భ్యాం- రెండైన, విలోచనాభ్యాం- మిక్కిలియుఁ జూడ సమర్థములయినకన్నులచేత, అ
మ్బుజదళలలితలోచనం; అమ్బుజదళ, తామరరేకులవలెను- లలిత, సుందరములయిన-
లోచనం, నేత్రములుగల- బాలం, అర్భకుఁడైన శ్రీకృష్ణుని - పరిరబ్ధుం, ఆలింగనముఁ జే
యుటకు- దైవసామగ్రీ, అదృష్టము- దూరే, దూరమగుచున్నది- హన్త, అన్యాయము.

ఉ॥ ముద్దులుఁగులుకు బాలుఁడని ముచ్చటఁగౌఁగిటఁ గ్రుచ్చి యెత్తఁగా। నో
ద్దికయైమెలంగెడు భుజోన్నతికంబురుహాక్షుఁడంచునే। ప్రొద్దును వేడుకంజూడఁ
దలపోసినఁ జిక్కఁడుగ నేఁడోయికిన్। గోద్దికేమి యీ దైవము సమూలముగా మికినే
మిసేయుదున్॥



తా॥ పర్వతాదిమహద్వస్తువులం గాంచనోపిన దైనదిక్షేపంబులగు నీరెండుక
న్నులచే నర్భకుండగు పుండరీకాక్షునాతనిం జూచంగోరు నాకు దైవంబను కూలింపదయ్యో
న కటా యనుట. ※

శ్లో॥ అశ్రాన్తస్మితమరుణారుణాధరోష్ఠం హర్షార్ద్రద్విగుణమనో
జ్ఞవేణుగీతమ్। విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం వీక్షిష్యే
తవవదనామ్బుజం కదాను॥

టీక॥ అశ్రాన్తస్మితం; అశ్రాన్త, ఎడతెగని- స్మితం, చిఱునగవుగలయట్టి- అరు
ణారుణాధరోష్ఠం; అరుణారుణ- ఎఱ్ఱనగు దానితో సమమైన, అధరోష్ఠం - అధరముగల
యట్టి, హర్షార్ద్రద్విగుణమనోజ్ఞవేణుగీతం; హర్షార్ద్ర, సంతోషముతోఁ గూడి-
ద్విగుణ, రెండంతలయి- మనోజ్ఞ, మనోహరంబగు - వేణుగీతం, వేణుగానముఁగలయ
ట్టి- విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం; విభ్రామ్యత్- చలించుచున్న, విపుల- వెడలు
పులగు, విలోచన- కన్నులయొక్క- అర్ధ, ఏకదేశముచేత- ముగ్ధం, సుందరమైన- తవ,
నీయొక్క- వదనామ్బుజం, ముఖకమలమును- కదాను, ఎప్పుడు, వీక్షిష్యే - చూచుచు
న్నాను. ※

మ॥ మురళీగానసుధాధునీకలితసమ్మోదంబు నిండఁగా। నరమో
దుప్పొంగ నుదోయి శెలఁగ మరంగానాతామ్రబింబాధర। స్ఫురణన్ నవ్వెన్నెల లేటలేనగ
పులక్ సొంపొందునె మ్మోముఁ గా। మర సేవింపఁగ గల్గునుత్సవము సంభావించు
టింకెన్నఁడో॥

తా॥ ఎడతెగని చిఱునగవుగలిగి మిక్కిలి యెఱ్ఱనగు నధరోష్ఠంబుగలిగి సంతో
షంబునం జేసి ద్విగుణంబై మనోహరంబైన వేణుగానంబుఁ గలిగి చలించుచున్న నేత్రైకదే
శంబుచే సుందరంబై వెలుఁగు నీ నెమ్మోముఁ దామర నెన్నటికిం గాంచుచున్నాననుట. ※

శ్లో॥ లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం నీలారుణాభ్యాం నయనా
మ్బుజాభ్యామ్। ఆలోకయేదద్భుతవిభ్రమాభ్యాం కాలే కదా
కారుణికః కిశోరః॥

టీక॥ కారుణికః- దయాప్రధానుఁడగు, కిశోరః- బాలకృష్ణమూర్తి - లీలాయ
తాభ్యాం; లీలా- విలాసముచేత, ఆయతాభ్యాం - పొడవులయినయట్టి, రసశీతలాభ్యాం;
రస, శృంగారరసముచే- శీతలాభ్యాం, మనోహరములయినయట్టి- నీలారుణాభ్యాం, నీల-
నల్లనయినట్టి, అరుణాభ్యాం- ఎఱ్ఱనైనయట్టి, అద్భుతవిభ్రమాభ్యాం- అద్భుత, ఆశ్చర్య
సంపాదకములయిన- విభ్రమాభ్యాం, విలాసములుగల- నయనామ్బుజాభ్యాం, నేత్రక
మలములచేత- కాలే కదా, ఏక్షణమందు- మాం, నన్ను- ఆలోకయేత్, చూచును.

తిన్ననికల్వఱేల్పువెలుఁగొకదికుఁ గనుఁగొనఁగా నలంకరించినరీతిఁ బెంపు దళుకొత్తఁగ నొప్పెడునట్టి నెమ్మిపి
ఱ్ఱింపఁగఁజేసినవమేచకశోణతమించుమించులీలన్నిరసించు నిస్తులవిలాసరసాయ
తశీతలంబులౌ కన్నులనన్ను నెన్నటికి గాంచునొ బాలకుఁడాదరంబునన్॥

తా॥ విలాసంబులచేనతిశయిల్లి శృంగార రసంబునంజేసియతిమనోహరంబులయినీ
లారుణకాంతులం దేఱరిల్లి యాశ్చర్యకరంబులగు విలాసంబులంగలిగి వెలయుకన్నుఁదామర
లచేత యగ్రప్రధానుండగు బాలకృష్ణుఁ డెన్నటికినన్ను జూచునోయనుట. ❋

శ్లో॥ బహుళచికురభారం బద్ధపింఛావతంసం చపలచపలనేత్రం చా
రుబిమ్బాధరోష్ఠం । మధురమృదులహాసం మన్దరోదారలీలం
మృగయతినయనం మే ముగ్ధవేషం మురారేః॥

టీక॥ బహుళచికురభారం? బహుళ, గొప్పదైన- చికురభారం, కేశసమూహ
ముగలయట్టి- బద్ధపింఛావతంసం? బద్ధ- కూర్పబడిన, పింఛ- నెమలిపురి, అవతంసం- శి
రోభూషణముగాఁగలయట్టి, చపలచపలనేత్రం; చపలచపల, చంచలసదృశములయి
న- నేత్రం, కన్నులుగలయట్టి- మధురమృదులహాసం? మధుర - మనోజ్ఞమయిన, మృ
దుల- కోమలమయిన, హాసం- నవ్వుగలయట్టి, మందరోదారలీలం? మన్దర, మందరప
ర్వతముయొక్క- ఉదార, గంభీరమ్ములగు- లీలం, విలాసముగలయట్టి- మురారేః, శ్రీకృ
ష్ణునియొక్క- ముగ్ధవేషం, ముగ్ధ- సుందరమైన, వేషం- వేషమును, మే- నాయొక్క,
నయనం- నేత్రము, మృగయతి- వెదకుచున్నది. ❋

చ॥ లలితపుఁగుంపుసొంపుఁగళలన్వెలసిల్లెడు మోవినవ్వుఁదే । టలునును
గొప్పకొప్పునఁ బెడంగగుపింఛము బెళుకుఁజూపులున్ । సలలితమందరాద్రిధృతిసం
పదయుం జెలువారుశౌరిమం । జులతరవేషము న్వెదకిచూడఁగ నాకనుఁదోయిఁ
గోరెడిన్॥

తా॥ గొప్పయగుకొప్పుపైనలంకరించిన నెమలిపురి దండలను చంచలంబులగు నే
త్రంబులను- సుందరంబయిన దొండపండువంటి యధరంబును మనోజ్ఞంబయి కోమలంబ
యిననగవును- మందరసమానంబగుధైర్యంబును గలిగిన శ్రీకృష్ణుని సుందరవేషంబును నా
కన్నుదోయి చూడఁగోరియున్నదనుట. ❋

శ్లో॥ బహులజలదచ్ఛాయాచోరం విలాసభరాలసం మదశిఖిశిఖాలీ
లోత్తంసం మనోజ్ఞముఖామ్బుజం। కమపి కమలాపాఙ్గోదగ్ర
ప్రసన్నజగజ్జితం మధురిమపరీపాకోద్రేకం వయం మృగయామహే॥

టీక॥ బహులజలదచ్ఛాయాచోరం? బహుల, అధికమగు- జలద, ఉదకమును ఇ
చ్చుచున్న మేఘముయొక్క- ఛాయా - కాంతిని, చోరం - దొంగిలించుచున్నయట్టి,



విలాసభరాలస- విలాసభర- విలాసములచేత, అలస- అలసుఁడైనట్టి, మదశిఖిశిఖాలీలో
త్తంసం- మదశిఖి, మత్తమయూరముయొక్క- శిఖా, పింఛము- లీలా, విలాసార్థమ
యిన- ఉత్తంసం, భూషణముగాఁగలయట్టి- మనోజ్ఞముఖామ్బుజం, మనోజ్ఞ- సుందరమ
యిన, ముఖామ్బుజం- ముఖకమలముగలయట్టి, కమలాపాఙ్గోదగ్రప్రసన్నజగజ్జితం-
కమల, తామరరేకులవంటి- అపాఙ్గ, కడకన్నులయొక్క- ఉదగ్ర, లేశములచేత- ప్ర
సన్న- కృతార్థముగాఁజేయబడిన, జగత్- లోకములందలి, జితం - తుచ్ఛపదార్థ
ములుగలయట్టి, కమపి- అనిర్వాచ్యమయిన, మధురిమపరీపాకోద్రేకం- మధురిమ, సౌం
దర్యములయొక్క- పరీపాక, పరిపాకముయొక్క- ఉద్రేకం, అతిశయముగలకృష్ణుని- వ
యం, మేము- మృగయామహే, వెదకుచున్నాము. ❋

మ॥ తనకాయచ్ఛాయకటాక్షవీక్షణముచేఁ దైలోక్యజాడ్యంబులెల్లనివర్తిం
పమనోహరాననముతో లావణ్యవేషంబుతో । ఘనధారాధరకాంతితో శిఖాక
ర్ణవతంసంబుతో నసుసైయుండెడువానినారయుచును ద్యత్ప్రీతిసేవించెదన్॥

తా॥ నీలమేఘంబుబోలెనల్లనగు శరీరకాంతిగలిగి యొయ్యారంబులనలసుఁడయి
నెమలిపురికర్ణావతంసంబుగలిగి మనోజ్ఞంబగు ముఖకమలంబుగలిగి తామర రేకులవంటిక
డకన్నులచే నెల్లలోకంబులను పవిత్రంబులుగాఁజేయుచు సౌందర్యాతిశయంబుచే దేజరిల్లి వె
లయు శ్రీకృష్ణదేవుని నే వెదకుచున్నాననుట. ❋

శ్లో॥ పరామృశ్యన్దూరే పరిషది మునీనాం వ్రజవధూదృశాం దృశ్యం
శశ్వత్త్రిభువనమనోహారివదనమ్। అనామృశ్యం వాచామనిద
ముదయానామపి కదా దరీదృశ్యే దేవ దరదళితనీలోత్పలనిభం॥

టీక॥ అనిదముదయానాం - ఇట్టిదేశకాలంబులనుదయించినవని తెలియనలవిగా
ని, వాచాం- వేదాంతవాక్యములచేత, అనామృశం - ప్రతిపాదింపనలవిగానివాఁడుగ
నుకనే, పరిషది- పృథ్వ్యస్థలవిశేషమందు, మునీనాం- వేదాంతవిదులయినమునులకు, ప
రామృశ్యమపి- మనోగమ్యుఁడయినప్పటికిని, దూరే- దూరుఁడగును, వ్రజవధూదృశాం-
వ్రజవధూ, గోపస్త్రీలయొక్క- దృశాం, నేత్రములచేత- దృశ్యం, చూడదగినట్టి - శ
శ్వత్, వాలాయముగాను- త్రిభువనమనోహారివదనం, త్రిభువన- ముల్లోకములకును, మ
నోహారి- మనోజ్ఞంబగు, వదనం- ముఖముగలయట్టి, దరదళితనీలోత్పలరుచిం - దరదళి
త, కొంచెముగావిరిసిన- నీలోత్పల, నల్లకలువలయొక్క - రుచిం, కాంతివంటికాంతి
గల- దేవ, దేవుఁడయినకృష్ణుని- కదా, ఏసమయమందు- దరీదృశ్యే, లెస్సగాజూచు
చున్నాను. ❋

మ॥ మదిలోనిత్పైదఁగోపికానయనపద్మశ్రేణికెల్ల స్ఫుటుఁడై । విదితంబై

మునిపాయికాగ్రసభకన్వేషింపఁగాదూరమయి । యితమిద్ధంబని వేదపాళికన్ వైయెంచన్ బరించన్ మొద । ల్తువలేనట్టినవోత్పలాభమగువస్తున్నోహనా కారముల్॥

తా॥ ఇట్టిదేశకాలంబులంబొడమినవియని తెలియఁబడవిగాని వేదాంతవాక్యంబులచేఁ బ్రతిపాదింప శక్యుండు గనుకన్నైమిశారణ్యాది పుణ్యస్థలంబులందుండు నధీత వేదాంతులయిన మునులమనంబులకు గమ్యుండయ్యును మా[ర]డగుచు గోపస్త్రీనేత్రంబులచే జూడదగినవుల్లోకంబుల వారలకును మనోజ్ఞంబగు ముఖంబుచే దేజరిల్లియరవిరిసిన నల్లకలువలకాంతింబోన్ని కాంతిచే తెలియుశరీరంబుఁగలిగి వెలుఁగు దేవుని నెప్పుడు చూచుచున్నాననుట. ❋

శ్లో॥ లీలాంబుజాననమధీరముదీక్షమాణం నర్మాణి వేణువివరేషు నివేశయంతం ।
లోలాయమాననయనం నయనాభిరామం
దేవం కదాను దయితం వ్యతిలోకయిష్యే ॥

టీక॥ లీలాంబుజాననం-లీలా, విలాసముతోఁగూడిన-అమ్బుజ, కమలములవంటి-ఆననం-ముఖముగలయట్టి, అధిరం- చంచలమగునట్టుగాను, ఉదీక్షమాణం-చూచుచున్నయట్టి; వేణువివరేషు; వేణు, పిల్లనగ్రోవియొక్క - వివరేషు, రంధ్రములయందు - నర్మాణి, సంకేతములను- నివేశయంతం, ప్రవేశింపఁజేయుచున్నట్టి- లోలాయమాన, ఈషచ్చంచలములయిన- నయన, నేత్రములుగలయట్టి- నయనాభిరామం, నయన- నేత్రములకు, అభిరామం- అహ్లాదమునుఁజేయుచున్న, దయితం- ప్రియుఁడయినకృష్ణుని, కదాను- ఎప్పుడు, వ్యతిలోకయిష్యే- చూచుచున్నాను; కదాను- ఎప్పుడు, వందే- నమస్కరించుచున్నాను. ❋

ఉ॥ ఏతఱిఁజూచి మ్రొక్కఁగలనేతఱిఁజూచునతండు నన్నహో । జాతమృదుస్మితాననునిఁజంచలలోచను వేణుగీతసం। కేతముచేతఁగోపికలఁగేళికినైజతగూర్చునేర్పరిన్ । నూతనపంచసాయకమనోహరమూర్తినిఁగంటికింపుగన్॥

తా॥ విలాసయుతంబగుకమలంబుబోలియున్న మొగంబుఁగలిగి చంచలంబగునట్లు చూచుచు వేణురంధ్రంబులయందు గోపికల సంకేతంబులఁదెలుపుచు నీషచ్చంచలంబులగునేత్రంబులు గలిగి చూచువారలచూపులకు నాహ్లాదంబుబుట్టించుచు వెలుంగు ప్రియుండగు కృష్ణుని నెప్పుడు యనంగాంచుదు నెత్తి నమస్కరింతుననుట.

శ్లో॥ లగ్నం ముహుర్మనసి లమ్పటసమ్ప్రదాయం రేఖావలేఖిని రసజ్ఞ మనోజ్ఞ వేషం। లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశురాకేన్దులాలిత ముఖేన్దు ముకున్దబాల్యమ్॥



టీక॥ రసజ్ఞమనోజ్ఞవేషం; రసజ్ఞ, సారగ్రాహియైనట్టి - మనోజ్ఞ, సుందరమయిన- వేషం, అలంకారముఁగల- లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశురాకేందులాలితముఖేందుముకుందబాల్యం; లజ్జత్, లజ్జించుచున్నయట్టి - మృదు, కోమలమైన - స్మిత, మందహాసమనియెడి- మధు, తేనియచేత- స్నపిత, తడపఁబడిన - అధర, అధరోష్ఠముయొక్క- అంశు- కాంతులుగలిగినట్టి, రాకేందు- పూర్ణిమాచంద్రునిచేత- లాలిత, సన్మానింపఁబడిన- ముఖ, ముఖమనెడు, ఇందు- చంద్రునిగలిగిన, ముకుంద- శ్రీకృష్ణమూర్తియొక్క, బాల్యం- శైశవము, రేఖావలేఖిని; రేఖా, శ్రీకృష్ణసౌందర్యమనియెడి, అవలేఖిని- చిత్తరువుఁగల, మే- నాయొక్క, మనసి- మనమందు, ముహుః- మాటిమాటికిని, లగ్నం- కూడుచున్నదియై, లమ్పటసమ్ప్రదాయం- ఆయాసమునిచ్చెడిది, భవతి- అగుచున్నది. ❋

ఉ॥ సన్నపునవ్వునిప్పటిలఁ జందురుకావిమెఱుంగు మోవియున్ । బున్నమచందమామయొఱపున్నగుమోమును ముద్దుగుల్కఁగా లీ । లన్నెలవైన మోహనవిలాసముఁగాంచిన గోపవేషసం । పన్నునిఁజిన్ని ప్రాయమెదఁ బాయక వ్రాసినయట్టులుండెడున్॥

తా॥ సారవంతంబై మనోహరంబగు నలంకారంబుగలిగి లజ్జించుచున్నకోమలంబగు చిఱునగవను తేనియచేఁదడుపంబడిన అధరోష్ఠంబు కాంతులుగలిగి పూర్ణిమాచంద్రునిచే లాలింపబడుచున్న ముఖచంద్రునిగల శ్రీకృష్ణబాల్యము నామనంబున వ్రాసినయటులుండి కన్నులకగపడక యాయాసంబుజేయుచున్నదియనుట. ❋

శ్లో॥ అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీసరసతరసరసిరుహ
సదృశదృశి దేవే । వ్రజయువతిరతికలహవిజయనిజలీలామద
ముదితవదనశశిమధురిమణి లియ్యే॥

టీక॥ అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీసరసతరసరసిరుహసదృశదృశి; అహిమకర, సూర్యునియొక్క- కర, కిరణములయొక్క- నికర, సమూహముచేత- మృదు, కోమలమగునట్లుగాను- మృదిత, కొంచెముగాస్పృశింపఁబడిన- లక్ష్మీ, కాంతిచేత- సరసతర, మిక్కిలిసరసమయిన- సరసీరుహ, కమలములకు- సదృశ, సమానమైన దృశి, నేత్రములుగల- దేవే, శ్రీకృష్ణునియందు - వ్రజయువతిరతికలహవిజయనిజలీలామదముదితవదనశశిమధురిమణి; వ్రజయువతి- గోపికలయొక్క, రతి- రతమనియెడి, కలహ- కలహమందు, విజయ- జయముచేతనైన, లీలామద- విలాసమదముచేత, ముదిత - సంతోషించుచున్న, వదనశశి- ముఖచంద్రుడుగల, మధురిమణి - సౌందర్యమందు, లియ్యే- లీనుఁడనగుచున్నాను.

చ॥ రతికలహమ్మునన్నతులరాయిడిఁజేసిజయించివిఱుచును । ద్ధతిగను వీరుసులేనగవ్వు నందముగులేఁడు మోముదన్నెనే । నతులవిఘాతఘానుకిర ణాప్తివికస్వరభాస్వరాంబుజా । యతనయుసద్వయిస్సెలగు నామధురద్యుతి లీనుమయ్యెడుక్॥

తా॥ సూర్యకిరణసమూహంబుచే స్పృశింపఁబడినకాంతిచేసుం దరంబులగుకమలంబులకు సమానంబులైన నేత్రంబులుగలిగిగోపస్త్రీలతోడ సలుప్రరతుల నిరోడియుద్ధంబులనైనజయంబుఁ గాంచిన శోభాకమును స్వకీయంబగులీలామహంబున సంతసిలుముఖ చంద్రుడుగలిగివెలుంగుశ్రీకృష్ణదేవునిసౌందర్యంబునఁదులీనుండనగుచున్నాననుట.

శ్లో॥ కరకమలదళదళిత లలితతరవంశీకలనినదగళ దమృతఘనసర
సిదేవే। సహజరసభరభరితదరహసితవీథీ సతతవహదధర
మణిమధురిమణిలీయే॥

టీక॥ కరకమలదళదళితలలితతరవంశీకలనినదగళదమృతఘనసరసి; కరకమల, హస్తకమలములయొక్క-దళ- శ్రేణిచేత, దళిత- స్వరభేదములనుఁబోధింపఁబడినయట్టి, లలితతర- మిక్కిలిరమ్యమైన, వంశీ- వేణువుయొక్క, కల- అవ్యక్తమధురమగు, నినద- ధ్వనిచేత, గళత్- జాఱుచున్న, అమృత - అమృతముయొక్క, ఘన- అధికమయిన, సరసి- సరస్సుగలయట్టి, సహజరసభరభరితదరహసితవీథీసతతవహదధరమణిమధురిమణి; సహజ, స్వాభావికమైన- రసభర, రసముచేత- భరిత, నిండింపఁబడిన-దరహసిత, మందహాసములయొక్క- వీథీ, పఙ్క్తులను, సతత - ఎప్పుడును,వహత్ -వహించుచున్న, అధరమణి- అధర-రత్నముయొక్క, మధురిమణి సౌందర్యముఁగల, దేవే- శ్రీకృష్ణునియందు, లియే- లీనుఁడనగుచున్నాను. ❋

చ॥ లలితకరాంగుళీదళదళన్మురళీమధురస్వరామృతో । జ్జ్వలసరసిన్మనోజ్ఞసహజస్మితకందళచంద్రచంద్రికా । వలదరుణాధరోష్ఠసుధు నాసిత చారుముఖాంబుజంబునన్ । దొలఁగకనాదుమానస మధుప్రతమియ్యెడలీన మయ్యెడిన్॥

తా॥ కరాంగుళులచే స్వరభేదంబులఁబొందింపఁబడుచుమనోహరంబగు వేణురవంబనియెడియమృతంబుకొలనుగలిగి స్వభావసిద్ధంబు గరసనంతంబులగు చిఱునగవులగుం పులఘరిద్యుంచు నధరంబుసౌందర్యముఁగల శ్రీకృష్ణదేవునియందులీనుఁడ నగుచున్నా ననుట. ❋

శ్లో॥ కుసుమశరశరసమరకుపితమదగోపీకుచకలశఘుసృణరసలస
దురసిదేవే । మదలులితమృదుహసితముషితశశిశోభాముహు
రధికముఖకమలవ మధురిమణిలీయే॥



టీక॥ కుసుమశరశరసమరకుపితమదగోపీకుచకలశఘుసృణరసలసదురసి; కుసుమశర, మన్మథునియొక్క- శర, బాణములైనపుష్పములచేతనైన - సమర, యుద్ధముచే- కుపిత, కోపయుక్తములయిన- మద, మత్తలయిన, గోపీ- గోపికలయొక్క, కుచకలశ- కలశములవంటి స్తనములయందలి, ఘుసృణ - అంగరాగవిశేషముయొక్క, రస- రక్తిచేత, లసత్- ప్రకాశించుచున్న, ఉరసి - వక్షముఁగలయట్టి, మద - మదముతోడ, లులిత- కలసియున్న, మృదుహసిత- మందహాసముచేత, ముషిత - అపహరింపఁబడిన, శశి- చంద్రునియొక్క, శోభా- కాంతిచేత, ముహుః- అధికమయిన, ముఖకమల- నెమ్మోము కెవాయరయొక్క, మధురిమణి- సౌందర్యముఁగల, దేవే- శ్రీకృష్ణమూర్తియందు, లియే- లీనుఁడనగుచున్నాను. ❋

ఉ॥ పువ్వులబువ్వఁగానలుకఁబూనినవల్లవపల్లవాధరల్ । గ్రొవ్వునబువ్వుటీఁజనుగుత్తులనొత్తిన కుంకుమంబెడన్ । నివ్వటిలన్నరొంపుజిగినీటులఁ దేటల గొల్లలాడులే । నవ్వులగోముమోమున గనందగునందకుమారుజెందెదన్॥

తా॥ పువ్వులచల్లులాటయందోటుపడి కోపంబుసేయుగోపికలబంగరుకుండలంబోనిచన్నులకాయిడినంటినకుంకుమపూఁతచేవెలుఁగువక్షంబును - మదంబుతోఁగూడిన కోమలంబగుచిఱునగవుచేవెన్నెలఁగొల్లలాడుమోము చక్కదనంబునుఁగలిగి తేజరిల్లు శ్రీకృష్ణదేవునందులీనుండగుచున్నాననుట. ❋

శ్లో॥ ఆనమ్రామసితభ్రువోరుపచితామక్షీణపక్ష్మాంకురే ష్వాలో
లామనురాగిణోర్నయనయోరార్ద్రాం మృదౌ జల్పితే । ఆతా
మ్రామధరామృతే మదకలామమ్లానవంశీరవే ష్వాశాస్తేమ
మలోచనం వ్రజశిశోర్మూర్తిం జగన్మోహినీమ్॥

టీక॥ అసితభ్రువోః; అసిత, నల్లనయిన- భ్రువోః, కనుబొమలయందు - ఆనమ్రాం, కొంచెమువక్రమైనట్టి - అక్షీణపక్ష్మాంకురేషు; అక్షీణ- దట్టమైన, పక్ష్మ - ఱెప్పలయొక్క, అంకురేషు- రోమాంకురములయందు, ఉపచితాం- వృద్ధినొందినయట్టి, అనురాగిణోః- దయగలిగిన, నయనయోః- నేత్రములయందు, ఆలోలాం- చంచలమైనట్టి, మృదౌ- మృదువైన, జల్పితే- మాటయందు, ఆర్ద్రాం- సరసమయినట్టి- అధరామృతే, అమృతమువంటియధరమునందు- ఆతామ్రాం, అరుణమయినట్టి- అమ్లానవంశీరవేషు; అమ్లాన- గంభీరమయిన, వంశీరవేషు - వేణునాదములయందు, మదకలాం; మదోపదముచేత- కలాం, అవ్యక్తమధురమయినట్టి- జగన్మోహినీం; జగత్- లోకములను, మోహినీం- మోహసంపాదకమయి, వ్రజశిశోః- గోపాలబాలునియొక్క, మూర్తిం- దివ్యమంగళవిగ్రహంబును, మమ- నాయొక్క, లోచనం- నేత్రము, ఆశాస్తే- ప్రార్థించుచున్నది. ❋

ఉ॥ కాంచుట యెన్నఁడీక్షణసుఖంబుగఁ దొంగిలి తెప్పలున్న నా। యించి నవింటివంటి బొమలింపగు మో●లు కెంపు మోవిఁ బాం। కించిన పిల్లఁగ్రోవి బలికించు హళాహళియుక్ దయోన్నతిన్ । మించిన జిల్కుఁజూపుగల మిక్కిలి చక్కని ముద్దుబాలకున్॥

తా॥ ఈషద్వక్రంబులగు నల్లనికనుబొమలును జెంపొందిపట్టంబులగు తెప్పలంతలి వెంట్రుకలును జ చలంబులయి కరుణారసంబుఁ దొలుకుకన్నులును సరసంబును గంభీరంబునగు వేణునాదంబును గలుగుటం జేసి జగంబులకానందజనితసంమోహంబును తప్పి దీ-చునట్టి గోపాలబాలుని దివ్యమంగళవిగ్రహంబుఁ గన్గోరెద ననుట. ※

శ్లో॥ తత్కైశోరన్తచ్చవక్త్రారవిన్దన్తత్కారుణ్యన్తే చ లీలాకటా
క్షాః । తత్సౌన్దర్యం సా చ మన్దస్మితశ్రీస్సత్యం సత్యం దుర్లభం
దైవతేషు॥

టీక॥ తత్కైశోరం; తత్, నామనంబందుఁదోఁచినయట్టి - కైశోరం, బాల్యమును- తచ్చ, నాచిత్తమందుఁదోఁచినయట్టి- వక్త్రారవిన్దం, ముఖకమలమును- తత్కారుణ్యం; తత్- నామనంబందగుపడినయట్టి, కారుణ్య- దయయును, తే - నాహృదయమందుఁగానుపించినయట్టి- లీలాకటాక్షాశ్చ; లీలా, విలాసములతోఁగూడిన-కటాక్షాశ్చ, కడకంటిచూపులును, తత్సౌన్దర్యఞ్చ; తత్, నాచిత్తంబున సాక్షాత్కరించినయట్టి- సౌందర్యఞ్చ, సోయగమును- సా, నామదియందుఁగానంబడిన- మందస్మితశ్రీశ్చ? మందస్మిత- లేనగవుయొక్క, శ్రీశ్చ- సంపదయును, దేవతేషు- ఇంద్రుండు మొదలగు వేలుపులయందు, దుర్లభం- లేదు, సత్యం- యథార్థము, సత్యం- యథార్థము. ※

శా॥ ఆకారుణ్యకటాక్షవీక్షణములాయందంపు లేబ్రాయమా । యాకారద్యుతియాదరస్మితముఖీరామోము చక్కందనం । బాకన్నాయపదంబులానడల య్యొయ్యారంబు లేవేల్పులం । దేకాలంబున లేదు లేదనుచు నే నెందేని జాటించెదన్॥

తా॥ సమాధినిష్ఠుండనగు నాయెదఁ బరికించిన చోనగుపడిన శ్రీకృష్ణదేవుని యబ్బాల్యంబు నదయయు నా నెమ్మోముఁదామరయు నాకడకన్నులచూపులు నాసోయగంబు నాలేనగవు నే వేల్పులయందేనియు లేదనుచు నిక్కంబుగా బల్కెదననుట. ※

శ్లో॥ విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం విశ్వాసస్తబకితచేతసాంజ
నానాం। పశ్యామః ప్రతినవకాన్తికన్దళార్ద్రం పశ్యామః పథి
పథి శైశవం మురారేః॥



టీక॥ మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క, శైశవం - బాల్యమును, ప్రతినవకాంతికందళార్ద్రం- ప్రతినవ, ప్రతిక్షణనూతనములైన- కాంతి, కాంతులయొక్క -కందళ, మొలకలచేత- ఆర్ద్రం, సరసమైనదానిగాను- పశ్యామః, మనము చేనెఱుంగుచున్నాము- విశ్వాసస్తబకితచేతసాం, విశ్వాస- విశ్వాసముచేత స్తబకిత, సంజాతగుచ్ఛములఁగల- చేతసాం, చిత్తములుగల- జనానాం, జనులయొక్క- పథిపథి- ఆయాయిస్థలములయందు- విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం, విశ్వ- సమస్తమయిన, ఉపప్లవ - ఉపద్రవములయొక్క, శమ- శాంతియందు, ఏక- ముఖ్యమగునటుల, బద్ధ- ఘటింపఁబడిన, దీక్షం- నియతిగలదానిగాను, పశ్యామః- మనంబుచేఁ నెఱుఁగుచున్నాము.

మ॥ నతధారాధరకాంతికందళముకన్నుల్చల్లఁ జేయన్సమ । గ్రతరాతంకపరంపరాశమనదీక్షన్నేహముల్వ్రజకా । యతగాంచ న్నెరనమ్మినట్టి ప్రజకత్యానందమౌ దేవకీ। సుతునొయ్యారపుబాలలీలఁ గనవచ్చున్నాఁడు దృగ్వీథులన్॥

తా॥ ఆశ్రితులగుజనంబులసర్వోపద్రవంబులం బోవనడుచు నియమంబు గలిగి ప్రతిక్షణంబును గ్రొత్తలగు కాంతులచే స్వరసంబై వెలుంగు శ్రీకృష్ణుని బాల్యంబును గనుంగొనుచున్నాననుట.

శ్లో॥ మౌళిశ్చన్ద్రకభూషణా మరకతస్తమ్భాభిరామం వపు
ర్వక్త్రఞ్చిత్రవిముగ్ధహాసమధురం బాలే విలోలే దృశౌ । వాచ
శ్శైశవశీతలా మదగజశ్లాఘ్యా విలాసస్థితిర్మన్దం మన్దమయే
క ఏష మథురావీథీమితో గాహతే॥

టీక॥ అయేబాలే- ఓవనిత, మౌళిః- సిగ, చంద్రకభూషణా- చంద్రక, నెమలిపురియనెడి- భూషణా, ఆభరణముగలది- వపుః, శరీరము- మరకతస్తమ్భాభిరామం? మరకత - యింద్రనీలమణియొక్క, స్తంభ - స్తంభమువలె, అభిరామం, సుందరము - వక్త్రం, ముఖము - చిత్రవిముగ్ధహాసమధురం, చిత్ర - విచిత్రమైనట్టి, విముగ్ధ- మిక్కిలిసుందరమైనట్టి, హాస- చిఱునగవుచేత, మధురం- మనోహరము, దృశౌ- కన్నులు, విలోలే- చంచలములు, వాచః- పలుకులు, శైశవశీతలాః - శైశవ, బాల్యముచేత- శీతలాః, చల్లనైనవి- విలాసస్థితిః, విలాస - లీలయొక్క, స్థితిః- ఉనికి, మదగజశ్లాఘ్యా- మదగజ, మదపుటేనుఁగువలె- శ్లాఘ్యా, కొనియాడఁదగినది- (ఇట్టిగుణంబులుగలిగి) మన్దంమన్దం- మెల్ల మెల్లన, ఇతః, ఇటునుండి, మథురావీథిం- మథురా, మథురాపట్టణముయొక్క- వీథిం, వీథిని - కఏష గాహతే, వీడెవ్వఁడు ప్రవేశించుచున్నాఁడు.

ఉ॥ మౌళిఁ దటిన్ఘటించినసమంచితపింఛము మందహాసమున్ । లోలవిశాలలోచనములుం జెలువొప్పను ముద్దుమాటలున్ । నీలపుడాలునేఁ నైనిగ్గులుగల్గిన్నబాలుఁ డెవ్వఁడో । ప్రాలెడు నీని జూఁడుము మథురాపురవీథులఁ బాటలాధరా॥

తా॥ మధురాపురంబు తెఱువు ప్రవేశించునట్టి శ్రీకృష్ణునింగనిరి యొక దివ్య విలాసిని తొడంబలుకుచున్నది- నెమలిపురిచేనలంకరింపఁబడిన సిగయును విచిత్రంబు సుందరంబును గు చిరునగవుగల నెంమొగంబును జంచలంబులగు కన్నులును బాల్యంబువలన సరసంబులగు నాలాపంబులును మత్తగజంబులవలెకొనియాడఁదగిన విలాసంబును గలిగి మెల్ల మెల్లన-వ టనుండి మధురాపురంబు తెరువు ప్రవేశించువీ డెవ్వండు వీనిం జూడుమనుట. ❋

శ్లో॥ పాదౌస్య పాదవినిర్జితాంబుజవనౌ పద్మాలయాలంకృతౌ। పా
ణీ వేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియౌ। బాహూదో
హదభాజనంమృగదృశాంమాధుర్యధారాగిరో। వక్త్రంవా
గ్విభవాతిలంఘితమహోబాలంకిమేతన్మహః।

టీక॥ పాదవినిర్జితామ్బుజవనౌ-పాద, అంశముచేత - వినిర్జిత, జయింపఁబడిన- అమ్బుజవనౌ, కమలవనములుగల, యస్య- ఏశ్రీకృష్ణునియొక్క, పాదౌ - పాదములు, పద్మాలయాలఙ్కృతౌ- పద్మాలయా- లక్ష్మీదేవిచేత, అలఙ్కృతౌ - పూజింపఁబడినవియో, వేణువినోదనప్రణయినౌ- వేణు, పిల్లఁగ్రోవియొక్క- వినోదన, వాయించుటయందు- ప్రణయినౌ, ప్రీతిగల- యస్య, ఏకృష్ణునియొక్క- పాణీ, హస్తములు-పర్యాప్త, పరిపూర్ణమైన- శిల్ప, విజ్ఞానముయొక్క - శ్రియౌ, సంపదగలవియో - యస్య, ఏకృష్ణునియొక్క- బాహూ, భుజములు- మృగదృశాం - స్త్రీలకు, దోహదభాజనం- దోహద, దోహదక్రియకు - భాజనం, స్థానమో, ( దోహదమనఁగా నసమయమందుఁ దరులతలను బుష్పింపఁజేయు క్రియ - అట్లు శ్రీకృష్ణుని బాహువులు స్పృశించుట మాత్రంబున బాలికలపైన ప్రౌఢలనుగాఁ జేయు సామర్థ్యముగలవియనుట) యస్య - ఏశ్రీకృష్ణునియొక్క, గిరః- మాటలు, మాధుర్యధారాః- మాధుర్య, తియ్యదనముయొక్క- ధారాః, ప్రవాహములుగలవియో - యస్య, ఏశ్రీకృష్ణునియొక్క - వక్త్రం, ముఖము వాగ్విభవాతిలఙ్ఘితం, వాగ్విభవ- వాగ్వైభవమును, అతిలఙ్ఘిత -అతిక్రమించినదియో. ఏతత్- ఈకృష్ణరూపమైన, మహః- తేజస్సు, బాలం కిం- శిశువాయేమి, అహో-ఆశ్చర్యము. ❋

చ॥ చెలువలకెల్ల దోహదముజేయుకరంబులు లచ్చి కాకరం। బులు జిత
పద్మముల్చరణముల్మురళీ రచనాచమత్క్రియా। కలితము కేలు దమ్ముముఖ
కాంతులు ఖిన్నతలు తేనె[illegible]లాయి। సుటంగ గలయట్టి శైశవ విడంబన తేజమిదేమి
చిత్రమో॥

తా॥ శ్రీమహాలక్ష్మిచేత గంధపుష్పాదులనలంకరింపఁబడునవియుఁ దామరలను- గెల్చనవియుఁ గ్రోవిని మ్రోయించుటయందుఁ బూర్ణంబగు విజ్ఞానంబు గల కరంబులును వాగ్జ్ఞానగోచరంబఁగు నెంమొగంబును గలయీ తేజసును శిశువని చెప్పవచ్చునా యనుట.



శ్లో॥ బర్హంనామవిభూషణంబహుమతంవేషాయశేషైరలంవక్త్రం
ద్విత్రవిశేషకాంతిలహరీవిన్యాసధన్యాధరం।శేషైరల్పధియా
మగమ్యవిభవైశ్శృంగారభంగీమయం। చిత్రంచిత్రమహోవిచిత్ర
తమహోవిచిత్రంమహః॥

టీక॥ వేషాయ- అలంకారముకొఱకు, శేషైః- ఇతరములగు భూషణములచేత, అలం- సాధ్యము లేదు, బర్హంనామ- బర్హమని ప్రసిద్ధమయిన, విభూషణం- భూషణము, బహుమతం- అంగీకరింపఁబడినది, వక్త్రం- ముఖము, ద్విత్రవిశేషకాంతిలహరీవిన్యాసధన్యాధరం- ద్విత్ర - రెండుమూఁడయిన, విశేష - తిలకములయొక్క, కాంతి- కాంతులయొక్క, లహరీ- ప్రవాహముయొక్క, విన్యాస- వ్యాప్తిచేత, ధన్యా- స్తుత్యమైన, అధరం- మోవిగలది- అల్పధియాం-స్వల్పబుద్ధిగలవారలకు, అగమ్యవిభవైః- అగమ్య, అగోచరమైన- విభవైః- వైభవముగల, శేషైః-స్వభావములచేత, శృఙ్గారభఙ్గీమయం- శృఙ్గార - శృంగారములయొక్క, భఙ్గీమయం-పరంపరాప్రాచుర్యముగల, మహః- తేజస్సు, చిత్రం- ఆశ్చర్యము, చిత్రం-ఆశ్చర్యము, అహో-ఆశ్చర్యము, విచిత్రం- ఆశ్చర్యముగలది - అహో, ఆశ్చర్యము -చిత్రం, ఆశ్చర్యము- విచిత్రం, మిక్కిలియాశ్చర్యము.

ఉ॥ సొమ్ములు మేనికందపనిచూడక పింఛమొపూని మోముపై । గమ్మనిబొ
ట్లుదొరతెరలుగా విలసిల్లగగావి మోవిచే । ల్వమ్మురసోత్తరంగ విభవమ్మున
గమ్యమునై తనర్పజి। ట్రమ్మొక పాటివారికి దరంబెనుతింపనొయ్యారి తేజముర్॥

తా॥ కాంచనరత్నమయంబులైన భూషణంబులంగైకొనక నెమలిపురియొప్పైన భూషణంబుగ ధరియించి చందనకస్తూర్యాదితిలకంబులచే నందంబగు ముఖారవిందంబున రసోత్తరంబగు శైశవోల్లసితమెఱయ సింగారంబులరాశియో యన వెలుంగు శ్రీకృష్ణరూపంబగు తేజంబతివిచిత్రంబై యుండుఁగాన నిట్టి తేజంబు నల్పబుద్ధులగువారలకు నుతింపనలవియగునే యనుట.

శ్లో॥ అగ్రేసమగ్రయతికామపి కేళిలక్ష్మీమన్యాసుదిక్ష్వపివిలోచనమే
వసాక్షీ। హాహన్తహన్తపథదూరమహోకిమేతదాశీః కి
శోరమయమమ్బజగత్త్రయేమే॥

టీక. హన్తపథదూరం- హన్త హన్త, హస్తప్రసారణమునకు- దూరం, దూరముగు నట్లుగాను- అగ్రే, ముందటను- కామపి, నుడువనలవిగాని- కేళిలక్ష్మీం, కేళి- విహారముయొక్క, లక్ష్మీం- సంపదను, సమగ్రయతి- నిండింపఁజేయుచున్నది, అన్యాసు- ఇతరములయిన, దిక్ష్వపి- దిక్కులయందును, కేళిలక్ష్మీం- విహారసంపదను, సమగ్రయతి-

ఖండింపఁజేయుచున్నది, విలోచనమేవ- నేత్రమే, సాక్షీ- ప్రమాణము, హాహన్త- అకటకటా, హేఅమ్బ- ఓతల్లి, జగత్త్రయం- లోకత్రయమును, మే- నాకు, కిశోరమయం- బాలమయముగాను, ఆసీత్- ఆయెను, ఏతత్- ఇది, కిం- ఏమి, అహో- ఆశ్చర్యము.

శా॥ చూడంజూడమనోహరాకృతికమంజోద్యంబుగా బాలకుఁ। డాడన్స్యందటగౌగిలింతుననిడాయంజిక్కఁడారీతినే । క్రీడించున్దిశలందు నిందులకు నక్షిద్వంద్వమే సాక్షియో । జాడన్స్మజ్జగమంబబాలమయ మాశ్చర్యంబు నాకెంతయున్॥

తా॥ చూడఁజూడమనోహరంబయి యాడుచుఁ గౌఁగిలింపఁబోవ దూరంబయి యెల్ల దెసలయందుఁ గ్రీడించుచుండు నిందులకుఁ గన్నుఁగవయ సాక్షి. యోతల్లి ముజ్జగంబును బాలమయంబయ్యె నిదియే మిక్కిలి చిత్రంబనుట.

శ్లో॥ చికురమ్బహుళంవిరళమ్భ్రమరం మృదులం వచనంవిపులంన
యనం । అధరంమధురంవదనం లలితఞ్చపలఞ్చరితంచ కదా
నుభవే॥

టీక॥ కృష్ణస్య- శ్రీకృష్ణమూర్తియొక్క, బహుళం- దట్టమైన, చికురం- కుంతలములను, విరళం- పలచనైన, భ్రమరం- ముంగురులను, మృదులం- కోమలమైన, వచనం- వాక్యమును, విపులం- విశాలమైన, నయనం- నేత్రములను, మధురం- మనోజ్ఞమయిన, అధరం- అధరోష్ఠమును, లలితం- సుందరమయిన, వదనం- ముఖమును, చపలం- చంచలమయిన, చరితఞ్చ- చరిత్రమును, కదా- ఎప్పుడు, అనుభవే- చూచుచున్నాను.

ఉ॥ వెన్నెలగోపకాంతలకు వేడుకగో రెడుచాపలంబుతో। గన్నులబెళుకుతో నగుమొగంబున వ్రాలుచలాలకాళితో। దిన్ననిపలుకుతో ముడివిదిద్దినగొప్పశిరోజపాళితో। నెన్నడు నాదు ప్రేమాలజరియించునో వెన్నుడు కావి మోవితోన్॥

తా॥ గోపికలంగోరెడు చపలంబును విశాలంబులగు కన్నులును సొగసగు నగుమొగమును గ్రాలుముంగురులును నును మెరుంగు గొప్పకొప్పును దియ్యదనంబుఁ దెలుపు ముద్దుపల్కులును, మనోజ్ఞంబగు- కెమ్మోవియుఁగలిగి తేజరిల్లు శ్రీకృష్ణమూర్తి నెప్పటికిం గాంచెదనోయనుట.

శ్లో॥ పరిపాలయనఃకృపాలయేత్యసకృజ్జల్పితమాత్మబాంధవఃము
రళీమృదులస్వనాన్తరేవిభురాకర్ణయితాంకదానునః॥

టీక॥ హేకృపాలయ- ఓదయావంతుఁడ, నః- మమ్మును, పరిపాలయ- రక్షింపుము, ఇతి- ఇట్లని, అసకృజ్జల్పితం- అసకృత్, మాటిమాటికిని డిందెడు - జల్



పనమును, విభుః- శ్రీకృష్ణమూర్తి, ఆత్మబాన్ధవస్సన్; ఆత్మ, నాకు- బాంధవస్సన్, బంధువుడగుచును- మురళీమృదులస్వనాంతరే; మురళీ- వేణువుయొక్క, మృదుల- కోమలమయిన, స్వనాంతరే- ధ్వనిమధ్యమందు, కదాను - యెప్పుడు, ఆకర్ణయితా- వినును.

చ॥ నిరుపమవేణుగానమహనీయసుఖానుభవైకమగ్నుఁడై । కరఁగిపరాకుఁగైకొనినకంజదళాక్షుఁడుదత్తచిత్తుఁడై । నిరతమునన్నుగావుమనిసత్కృపరాయని మాటిమాటికిన్ । మొరయిడునట్టి నావచనముల్ దయతోనెపుడాలకించునో॥

తా॥ తులలేని వేణుగానంబున నైనసుఖానుభవంబున బరాకంబొందిన శ్రీకృష్ణుని భుండమునాకు బంధుఁడై ననురక్షింపుమో దయానిధియని మాటిమాటికి మొరయిడుచున్న నావచనం బెప్పటికి వినునోయనుట,

శ్లో॥ కదానుకస్యాన్నువిపద్దశాయాం కైశోరగన్ధిఃకరుణామ్బుధి
ర్నః। విలోచనాభ్యాంవిపులాయతాభ్యాం వ్యాలోకయిష్య
న్విషయీకరోతి॥

టీక॥ కస్యాన్నువిపద్దశాయాం- ఏయాపత్సమయంబున, కైశోరగంధిః - ఈషద్బాల్యముగల, కరుణామ్బుధిః- దయాసముద్రుఁడగు శ్రీకృష్ణమూర్తి- విపులాయతాభ్యాం విపుల, వెడలుపులయినట్టి- ఆయతాభ్యాం, నిడుపులయినట్టి- విలోచనాభ్యాం, నేత్రములచేత- వ్యాలోకయిష్యన్, మిక్కిలిచూడఁగలవాఁడై- నః, మము- కదాను, ఎప్పుడు- విషయీకరోతి, గోచరునిఁగాఁ జేయుచున్నాడు.

చ॥ ఒకవలవంతఁజింతిలుచునుండెడినన్ను శిశుత్వగంధమా । త్రకలితయౌవనంబుదనరన్గరుణావరుణాలయుండువా । యకశతపత్రపత్రవిపులారుణలోచనలీలఁజూచుచూ । డికకిందగువీడటంచుఁ బరికించుటలెన్నఁడు గల్గనేర్చునో॥

తా॥ ఎట్టియాపత్కాలంబుననైన నను కొంచెంబుగ నుండు బాల్యంబుగలిగి వెలయు దయాసముద్రుఁడయిన శ్రీకృష్ణదేవుండు వెడలుపులయి నిడుపులయి వెలుంగు కన్నులచేఁ జూడవీడన్నాండకదాయని నను నెప్పుడు గాంచునోయనుట.

శ్లో॥ మధురమధురబింబేమఞ్జులంమన్దహాసేశిశిరమమృతవాక్యేశీత
లన్దృష్టిపాతే । విపులమరుణనేత్రేవిశ్రుతంవేణునాదే మరకత
మణినీలంబాలమాలోకయేను॥

టీక॥ అధరబిమ్బే- దొండపండువంటియధరమందు, మధురం- తియ్యనయినయట్టి, మందహాసే- చిరునగవందు- మంజులం- మనోజ్ఞమయినయట్టి, అమృతవాక్యే- అమృతముం

శిఖిమాటయందు-శిశిరం, చల్లనయినయట్టి-దృష్టి పాతే, చూపందు-శీతలఁ, చల్లనయినట్టి-అరుణనేత్రే; అరుణ- ఎఱ్ఱనైన, నేత్రే- నేత్రమందు, విపులం - విశాలమయినట్టి, వేణునాదే- వేణుధ్వనియందు, విశ్రుతం- మిక్కిలివినుచున్నయట్టి, మకరతమణినీలం; మరకతమణి, ఇంద్రనీలమణివలెను- నీలం, నల్లనయిన- బాలం, బాలగోపాలుని- ఆలోకయేను, చూచుచున్నానాయేమి.

చ॥ చల్లనిబెళుకుఁజూపుసుధజల్లెఁడుమాటలుదియ్యమోవియుఁ। నల్లలి తారుణద్యుతివిశాలవిలోచనముల్మృదుస్మితో । తుష్ఫల్లముఖాంబుజంబుఁబరిపూరితవేణువినోదనాదముఁ । నల్లనిమేనిక్రొమ్మెఱుఁగునన్విల సిల్లినబాలుఁ గాంచెదఁ॥

తా॥ తియ్యదనంబుఁదెల్పుకెమ్మోవియుమనోహరంబగు చిఱునగవునమృతంబు నొలుకుముద్దుపలుకులునుఁజల్లనగుచూపును గెంజాయరంజిల్లువెడలుపగుకన్నుగవయును బరిపూర్ణకాంతయిన వేణుగానంబునుంగలిగియింద్రనీలరత్నంబునుబోలునెమ్మేనిచాయచే దేజరిల్లుబాలకృష్ణునిఁ జూచెదననుట.

శ్లో॥ మాధుర్యాదపిమధురం మన్మథతాతస్యకిమపికైశోరం। చాపల్యాదపిచపలం చేతోమమహరతిహన్తకింకుర్మః॥

టీక॥ మాధుర్యాదపి- సకలజనసిద్ధసౌందర్యంబుకన్నను, మధురం- సుందరమైనయట్టి, చాపల్యాదపి- సకలజనచపలతకన్నను, చపలం-చంచలమైనయట్టి, కిమపి- చెప్పనలవిగాని, మన్మథతాతస్య; మన్మథ- ప్రద్యుమ్నునికి- తాతస్య, తండ్రియైనశ్రీకృష్ణుని యొక్క, కైశోరం- బాల్యము, మమ- నాయొక్క, చేతః- చిత్తమును, హరతి- హరించుచున్నది- కింకుర్మః, ఏమిసేయుదును- హన్త, అకట.

ఉ॥ గబ్బిమెఱుంగుబోండ్లతటకాపడిలోలతఁజూచునంతలో। నిబ్బరమైన తత్తరమునెక్కొనసందముకన్నసందమై । యబ్బురమైనబాల్యముననద్దిరయంగజుగన్నతండ్రియా। గుబ్బుననామదింగలఁగుగుట్టుగలంచెనింకేమి సేయుదుఁ॥

తా॥ సకలజనంబులందుండెడిసౌందర్యంబునకన్న నధికంబగుసౌందర్యంబుగలిగిన సకలలోకచాపల్యంబునకన్ననధికంబగు చంచలంబుగలిగివెలుఁగుమదనితండ్రియగుశ్రీకృష్ణదేవునిచెప్ప నలవిగానిబాల్యంబునామనంబుఁగలంచుచున్నదియికనేమిసేయుదుననుట.

శ్లో॥ వక్షస్థలేచవిపులంనయనోత్పలేచమన్దస్మితేచమృదులంమదజల్పితేచ। బిమ్బాధరేచమధురంమురళీరవేచబాలంవిలాసనిధిమాకలయేకదాను॥

టీక॥ వక్షస్థలేచ-వక్షస్థలమందును, నయనోత్పలేచ- కలువవంటి నేత్రమందును-



విపులం, విశాలమైనయట్టి- మందస్మితేచ, చిఱునగవందును- మదజల్పితేచ; మద-మదయుక్తమైన, జల్పితేచ-వచనమందును; మృదులం, కోమలమైనయట్టి-బిమ్బాధరేచ; బిమ్బ-దొండపంటివంటి, అధరేచ- మోవియందును, మురళీరవేచ- వేణుగానమందును, మధురం-హృద్యమయినట్టి, విలాసనిధిం; విలాస, విలాసములకు-నిధిం, నిక్షేపమై- బాలం-బాలుఁడయినకృష్ణుని, కదా- ఎప్పుడు, ఆలోకయేను- చూచుచున్నాను.

మ॥ భళిరాకన్నులబెళుకుఁజొమ్ముజిగిజెప్పఁగరాదు వేణుధ్వను । ల్దరహాసంచగగావిమోవిరుచివింతల్ చెటలేదవ్వాని। గ్గులుమధ్యూరె సుధామనోహరమృదూక్తుల్మాయురేయిట్టి । యొప్పులకుప్పంధిలకించు భాగ్యమహిమంబుల్నాకునింకెన్నఁడో॥

తా॥ విశాలంబగువక్షఃస్థలంబునుగన్నులుంగలిగికోమలంబగుమందహాసంబునువచనంబునుంగలిగితీయనగునధరంబును వేణుగానంబునుంగలిగివిలాసంబులనిక్షేపంబగుచుఁదేజరిల్లుబాలకృష్ణునెన్నటికింగాంచెదనోయనుట.

శ్లో॥ మారస్స్వయంనుమధురద్యుతిమణ్డలంనుమాధుర్యమేవనుమనోనయనామృతంను। వాణీమృజంనుమమజీవితవల్లభోను బాలోయమభ్యుదయతేమమలోచనాయ॥

టీక॥ మమ- నాయొక్క, లోచనాయ- నేత్రములకొఱకు, బాలః- బాలుఁడు, అభ్యుదయతే, ఆవిర్భవించుచున్నాడు-అయం, ఈబాలుఁడు-మారస్స్వయంను, మన్మథుఁడాయేమి- మధురద్యుతిమండలంను; మధురద్యుతి- చంద్రునియొక్క- మణ్డలంను-బింబమాయేమి- మాధుర్యమేవను, సౌందర్యమేనాయేమి- మనోనయనామృతంను; మనః, మనస్సుయొక్కయు, నయన- నేత్రములయొక్కయు-అమృతం, అమృతమాయేమి- వాణీమృజంను, వాక్పరిశుభ్యమాయేమి-మమ నాయొక్క జీవితవల్లభోను, ప్రాణనాథుడాయేమి.

ఉ॥ మారుడొకాకయంబుధికుమారుడొమానసలోచనామృతా । కారమొ మాధురీగుణవికారమొమంజులవాక్చమత్క్రియా । సారమొ నాదుజీవమణిసారమొలేకమఱేమివిచిత్రమో । మీఱెడుబాలభావమునమెచ్చులు గులుకొఁదునాదెచూడఁగఁ॥

తా॥ నాకన్నులకుంగానఁగుచున్నయిబ్బాలుండుమన్మథుండో, లేకచంద్రుండో సౌందర్యంప్రరాశియో నామనోనయనామృతమో వాక్చమత్కారమో లేకనాప్రాణవల్లభుండోయనియిత్తెఱంగున నిశ్చయరబునవికల్పించెననుట.

శ్లో॥ ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్రమావిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం। ఆద్యంపుమాంసమవతంసితబర్హిబర్హమాలోకయన్తికృతినఃకృతపుణ్యపుంజాః॥

టీక॥ ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్రం; ఆర్ద్ర, సరసములయిన- అవలోకిత, చూపులుగలయట్టి- దయా, దయచేత- పరిణద్ధ, కూర్పఁబడిన- నేత్రం, నేత్రములుగలయట్టి- ఆవిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం; ఆవిష్కృత- ప్రకాశింపబడిన, స్మిత- లేనగవనెడి- సుధా, అమృతముచేత- మధుర, మనోజ్ఞమయిన- అధరోష్ఠం, మోవిగలయట్టి- అవతంసిత బర్హిబర్హం; అవతంసిత-శిరోభూషణముగాఁ జేయబడిన, బర్హిబర్హం- నెమలిపురిగలయట్టి, ఆద్యం- జగత్కారణుఁడయిన, పుమాంసం- శ్రీకృష్ణమూర్తిని, కృతపుణ్యపుఞ్జాః; కృత- చేయఁబడిన, పుణ్యపుంజాః- పుణ్యసమూహములుగల, కృతినః, విద్వాంసులు- ఆలోకయంతి, చూచుచున్నారు.

ఉ॥ అందముచిందు మోముదరహాససుధామధురాధరోష్ఠను। స్పన్ద దయావలోకనవిశాలవిలోచనముల్ శిరంబునం॥ బొందుగ నెమ్మిపింఛమును బూనిన యాద్యుని దేవదేవుని। న్నందకుమారు గాంతురు సనాతన పుణ్యమునన్ బుధోత్తముల్॥

తా॥ సరసంబులగు చూపులుగలిగి దయాకరంబులయి విశాలంబులగు నేత్రంబులును బ్రకాశించు చిరునగవను నమృతంబు చేత మనోహరంబగు నధరంబును శిరోభూషణంబుగ ధరించిన నెమలిపురి యుంగలిగి సర్వ జనులకుఁ గారణభూతుఁడై వెలయు శ్రీకృష్ణదేవుని పరమపుణ్యంబు చేసిన పెద్దలు జూచుచుందురు గదా యనుట.

శ్లో॥ బాలోయమాలోలవిలోచనేన వక్త్రేణ చిత్రీకృతదిఙ్ముఖేన। వే
షేణ ఘోషోచితభూషణేన ముగ్ధేన దుగ్ధే నయనోత్సుకం నః॥

టీక॥ ఘోషోచితభూషణేన; ఘోష, గొల్లపల్లియకు- ఉచిత, తగిన- భూషణేన, సొమ్ములుగల- వేషేణ, అలంకారముచేత - ముగ్ధేన, సుందరమయినట్టి- ఆలోలవిలోచనేన; ఆలోల- చంచలములైన, విలోచనేన- నేత్రములుగలయట్టి, చిత్రీకృతదిఙ్ముఖేన; చిత్రీకృత-చిత్తరువుగలవానిగా జేయబడిన, దిఙ్ముఖేన-దిఙ్ముఖములుగల, వక్త్రేణ-ముఖముచేత, అయంబాలః- ఈబాలుఁడు-నః మాయొక్క-నయనోత్సుకం, చక్షుస్సంతోషమును - దుగ్ధే, సంపాదించుచున్నాడు.

ఉ॥ ఎల్లెడఁ జిత్రరూపము వహించినచక్కని మోముదన్నుతో। గొల్లవిలాసవేషమున కుంధగు సొమ్ములతోఁడ జల్పయోగోల్ల పదక్షిళిలల సమున్నతితో విలసిల్లు బాలకుం। డుల్లము పల్లవింపన యనోత్సవమారఁ జరించుచున్నఁడో॥

తా॥ గొల్లపాళెంబునకుఁ దగిన సొమ్ములచే నలంకరింపఁబడి విశాలంబులగు నయనంబులుగలిగి యెల్లదెసలం జిత్రింపనయాటుల వెలుగు నెమోముచేఁ దేజరిల్లు నిబ్బాలుండు నాకన్నులకత్యంత సంతోషంబుఁ జేయుచున్నాడనుట.

శ్లో॥ ఆన్దోళితాగ్రభుజమాకులనేత్రలీలమార్ద్రస్మితార్ద్రవదనా



మ్బుజచంద్రబింబం। శింజానభూషణశతం శిఖిపింఛమౌళిం శీ
తం విలోచనరసాయనమభ్యుపైతి॥

టీక॥ ఆన్దోళితాగ్రభుజం- ఆన్దోళిత, ఈషత్కంపితములగు, అగ్రభుజం- భుజాగ్రములుగలయట్టి, ఆకులనేత్రలీలం - ఆకుల- వ్యాకులమయిన, నేత్రలీలం - నేత్రవిలాసముగలయట్టి- ఆర్ద్రస్మితార్ద్రవదనాంబుజచంద్రబింబం. ఆర్ద్ర- సరసమయిన, స్మిత- లేనగవుచేత, ఆర్ద్ర- సరసమయిన, వదనాంబుజచంద్రబింబం- చంద్రునివంటి ముఖకమలముగలయట్టి, శింజానభూషణశతం- శింజాన, మ్రోయుచున్న- భూషణశతం, ఆభరణశతముగలయట్టి-శిఖిపింఛమౌళిం, శిఖిపింఛ-నెమలిపురి, మౌళిం-శిరమందుగలయట్టి, శీతం, (చూచువారల నేత్రములకు) చల్లనయినయట్టి- లోచనరసాయనం, లోచన- నేత్రములకు, రసాయనం - దివ్యౌషధమైన శ్రీకృష్ణాఖ్యవస్తువు, మమ-నాకు, అభ్యుపైతి-అభిముఖముగా వచ్చుచున్నది.

చ॥ వికవికనవ్వుచున్నదిటు వ్రేలుకులుల్ నును పాలబుగ్గలుం। జిలికెమెఱుంగుచూపురహిఁ జెన్నగనాననశీతలద్యుతిన్। ప్రకటితగోపశాబకసభానవభూషణమై చెలంగు బాలకుఁడు మదీయమానసతలంబున సిగ్గెను సొంపునించుచున్॥

తా॥ కొంచెముగా సంచలించుచున్న మూపులును బ్రకాశించుచున్న విశాలంబులగు నేత్రవిలాసంబులును సరసంబగు చిఱునగవుచేఁ దేజరిల్లు నెమ్మోముదామరయును మ్రోయుచున్న భూషణశతంబును నెమలిపురిచే నలంకరింపఁబడిన సిగయును గలిగి చూచువారల చూపులకుఁ జలదనంబు నొసఁగుచు కన్నులపండువగు శ్రీకృష్ణరూపంబగు వస్తువు నాకభిముఖంబుగ వచ్చుచున్నదియనుట.

శ్లో॥ పశుపాలబాలపరిషద్విభూషణం శిశురేష శీతలవిలోలలోచనః।
మృదులస్మితార్ద్రవదనేందుసంపదా మదయన్మదీయహృదయం
విగాహతే॥

టీక॥ పశుపాలబాలపరిషద్విభూషణం- పశుపాలబాల, గోపాలబాలురయొక్క- పరిషత్, సభకు- విభూషణం, అలంకారభూతుఁడైనయట్టి - శీతలవిలోలలోచనః, శీతల- చూచువారలరక్షించుచున్నయట్టి, విలోల-చంచలమయిన, లోచనః- నేత్రములుగల, ఏషః శిశుః, ఈబాలుఁడు-మృదులస్మితార్ద్రవదనేందుసంపదా, మృదుల-కోమలమయిన- స్మిత, లేనగవుచేత- ఆర్ద్ర, సరసమయిన- వదనేందు, ముఖచంద్రునియొక్క- సంపదా, సమృద్ధిచేత- మదీయహృదయం, మదీయ- నాసంబంధమైన, హృదయం- హృదయమును, మదయన్- మదముగలదానిఁగాఁ జేయుచు, విగాహతే- పొందుచున్నాఁడు.

ఉ॥ అందెలు మువ్వలున్ మొరయ హస్తములూపఁగఁగంకణధ్వనుల్। సందడి జేయ నానన విలాసము చందురు గేరిడి సేయఁగా। నందవిశాలలోలనయనల్ మిస్సుతో శిఖిపింఛమౌళితో। నందము దెందులోచనరసాయనమల్ల దెసఁ జెచ్చెరెల్లగన్॥

తా॥ గోపాలబాలక సభయందు భూషణంబులం దేజరిల్లుచుం జూచువారలకు రక్తకంబులయి చంచలంబులగు కన్నులుగలయి బ్బాలుండు కోమలంబగు చిఱునగవు చేసరసంబగునెమ్మొగంబు వెండురునం దంపుసమృద్ధిచే వెలుంగుచు నాహృదయంబు ముదింపం జేయుచుం గానవచ్చుచున్నాం డనుట.

శ్లో॥ తదిదముపనతం తమాలనీలం తరళవిలోచనతారకాభిరామమ్
ముదితముదితవక్త్రచంద్రబింబం ముఖరితవేణువిలాసజీవితం॥

టీక॥ తమాలనీలం- తమాల, చీకటిమ్రాకులవలె- నీలం, నల్లనిదైనయట్టి- తరళవిలోచనతారకాభిరామం, తరళ, చంచలములయిన-విలోచన- కన్నులయొక్క, తారకః మ్రుగుడ్లచేత, అభిరామం- సుందరమైనయట్టి - ముదితముదితం, మిక్కిలిసంతోషించునట్టి- వక్త్రచంద్రబింబం, చంద్రమండలమువలెనున్న ముఖముగలయట్టి- ముఖరితవేణువిలాసజీవితం, ముఖరిత- మ్రోయుచున్న, వేణు- పిల్లనగ్రోవియొక్క, విలాస - స్వరవిశేషములకు, జీవితం- ప్రాణంబయినకృష్ణుండనెడివస్తువు, మే- నాకు, ఉపనతం - యెదుటనున్నది.

ఉ॥ నీలఘనాభమైనయతినిర్మలవేణునినాదజీవమై। లోలతటిల్లతాలలితలోచనతారకమై ప్రసన్నతో। ద్వేలముఖేందుమండలనవీనవిలాసకలాకలాపమై। బాలుని లీలవచ్చికనుపట్టె మహాద్భుతతేజమియ్యెడన్॥

తా॥ చీకటిమ్రాకులవలె నల్లనిదయి నిగ్గులుగలకాంతులు చంచలంబులగు విలోచనంబు చేమనోహరుండును- సంతసంబునొందుకతనం జంద్రునింబోనివదనంబుగలవాండును- వేణునాదవిలాసంబులసంభ్రమంబున శ్రీకృష్ణుండు నాకెదుర య్యెననుట.

శ్లో॥ చాపల్యసీమచపలానుభవైకసీమ చాతుర్యసీమచతురాననశిల్పసీమ। సౌరభ్యసీమసకలాద్భుతకేళిసీమ సౌభాగ్యసీమతదిదం వ్రజభాగ్యసీమ॥

టీక॥ చాపల్యసీమ- చాపల్య, దుష్టచేష్టలకు-సీమ, పొలిమేరయయినట్టి- చపలానుభవైకసీమ- చపలా, లక్ష్మియొక్క- అనుభవ, భోగంబునకు-ఏక, ముఖ్యమైన- సీమ, ఇరువైనయట్టి - చాతుర్యసీమ, చాతుర్య- చతురవచనములకు, సీమ -ముఖ్యస్థానమైనయట్టి, చతురాననశిల్పసీమ- చతురానన- బ్రహ్మయొక్క, శిల్ప - నిర్మాణసామర్థ్యమునకు, సీమ- పొలిమేరయైనయట్టి, సౌరభ్యసీమ, సౌరభ్య-సకలపరిమళవస్తువులకు- సీమ- ముఖ్యస్థానమైనయట్టి, సకలాద్భుతకేళిసీమ- సకల, సమస్తములయిన- అద్భుతకేళి, ఆశ్చర్యవిలాసములకు- సీమ, ముఖ్యస్థానమయినయట్టి - సౌభాగ్యసీమ, సౌభాగ్య



సౌందర్యమునకు, సీమ - ముఖ్యస్థానమయినయట్టి, వ్రజభాగ్యసీమ - వ్రజ, గొల్లపల్లెలో- నున్నజనులయొక్క, భాగ్య- అదృష్టఫలమునకు, సీమ- పొలిమేరయైన, తత్ - కృష్ణుడనెడివస్తువు, ఇదం- నాయెదుటనున్నది.

చ॥ కలిమినెలంతవేడుకలకందువ సంటవిలోలవృత్తికిన్। నెలవు శుభాళికాస్పదము నేర్పులప్రోవ జశిల్పికల్పనా। ఫలమతిచిత్రకేళులకు బాళెము తావుల కెల్లతావు। గోకులజనభాగ్యసీమయిది గోకను గొంటి నిగంటి కింపుగన్॥

తా॥ అధికంబులగుదుష్టచేష్టలకును లక్ష్మీవిలాసంబులకును - సకలచాతుర్యంబులకును బ్రహ్మనిర్మాణసామర్థ్యంబులకును - సకలపరిమళపదార్థంబులకును సమస్తాశ్చర్యవిలాసంబులకును- సకలసౌందర్యంబులకును- గోపాలకులభాగ్యఫలంబులకును ముఖ్యస్థానంబగు కృష్ణాభిధానలోకోత్తరవస్తువు నాకెదురయ్యెననుట.

శ్లో॥ మాధుర్యేణద్విగుణశిశిరం వక్త్రచంద్రం వహంతీ వంశీవీథీవిగళదమృతస్రోతసా సేచయంతీ। మద్వాణీనాం విహరణపదం మత్తసౌభాగ్యభాజాం మత్పుణ్యానాం పరిణతిరహో నేత్రయోస్సన్నిధత్తే॥

టీక॥ మద్వాణీనాం- నాపలుకులకు, విహరణపదం- విహారస్థానమయిన, మత్తసౌభాగ్యభాజాం- అధికసౌందర్యమొందిన- మత్పుణ్యానాం, నాయదృష్టములయొక్క- పరిణతిః, పరిపాకము- (అనంగా శ్రీకృష్ణస్వామి) మాధుర్యేణ, సౌందర్యముచేత- ద్విగుణశిశిరం, మిక్కిలియాహ్లాదంబును త్పాదించునట్టి- వక్త్రచంద్రం, చంద్రునివంటిముఖంబును- వహంతీ, వహించుచున్నదై - వంశీవీథీవిగళదమృతస్రోతసా, వంశీ- పిల్లనగ్రోవియొక్క, వీథీ- రంధ్రపరంపరనుండి, విగళత్- జారుచున్న, అమృతస్రోతసా- అమృతప్రవాహసదృశమైనగానవిలాసముచేత - సేచయంతీ, కర్ణానందము సేయుచున్నదై, (మమ - నాయొక్క,) నేత్రయోః- కన్నులకు, సన్నిధత్తే -సమీపించుచున్నాండు.

శా॥ లావణ్యాంబుధి చంద్రబింబముఖలీలన్దాల్చి వంశీనినా। దావిర్భూతసుధాప్రవాహమున నోలాడం బ్రవర్తిల్లినా। ద్వైవాకారము నావచోవిహారణస్థానంబు నాపుణ్య। సద్భావం బార బ్రసన్నమయ్యెను యశోదాపుత్రరూపంబునన్॥

తా॥ నాపలుకులకు విహారస్థానంబును- సర్వోత్తమంబులగు నాయదృష్టంబుయొక్క- ఫలపరిపాకంబుగు శ్రీకృష్ణుండు సౌందర్యంబుచే సకలజనానందంబు సంపాదించుచున్న చందురుంబోని ముఖంబును వహించుచున్నవాండును- పిల్లనగ్రోవిని సందులనుండి వెడలుచున్న యమృతంబువోని గానంబుచే జెవులకింపు సేయునట్టివాండును నై - నాకుం బ్రత్యక్షమయ్యెనని యంట.

—* ఇట్లు ప్రత్యక్షమైన శ్రీకృష్ణునికి నమస్కరించుచున్నాఁడు. *—

శ్లో॥ తేజసేస్తు నమో ధేనుపాలినే లోకపాలినే। రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే॥

టీక॥ శేషశాయినే- శేష, ఆదిశేషునియందు- శాయినే, పవ్వళించినట్టి - రాధా, రాధయొక్క- పయోధరా, స్తనములయొక్క- ఉత్సఙ్గ, మీఁదను - శాయినే, పవ్వళించినట్టి- లోకపాలినే, జగద్రక్షకమైనట్టి- ధేనుపాలినే, ధేనూం- గోవులను, పాలినే- కాచునట్టి, తేజసే- తేజమునకొఱకు, నమః- నమస్కారము, అస్తు- అవుఁగాక

ఉ॥ పాయనిభక్తి మ్రొక్కెదనపారకృపారసధేనుపాలికిన్। సంధాయికి లోకరక్షణవిధాయికి ఘాసురరాధికాకుచ। స్థాయికి బన్నగాధిపవిశాలఘనామణిసౌధవీధికా। శాయికి గోపికానయనసారససారఫలప్రదాయికిన్॥

తా॥ శేషశయనుండును సకలలోకపరిపాలకుండును పరబ్రహ్మంబయ్యు మదనసౌలభ్యము దెలియఁజేయుటకై రాధాస్తనంబులందుఁ బరుండువాఁడును నావులఁ గాచువాఁడునైన శ్రీకృష్ణునికొఱకు నమస్కారము సేసెదననుట.

శ్లో॥ ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుఙ్కుమసనాథకాన్తయే। వేణుగీతగతిమూలవేధసే తేజసే తదిదమోం నమోనమః॥

టీక॥ ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుఙ్కుమసనాథకాన్తయే - ధేనుపాల, గోపాలురకు- దయితా, ప్రియురాండ్రయిన స్త్రీలయొక్క- స్తనస్థలీ, స్తనప్రదేశమునందు- ధన్య, కృతార్థమయిన- కుఙ్కుమ, పసుపు మొదలగు చూర్ణవిశేషములతో- సనాథ, కూడుకొన్న- కాంతయే, కాంతిగలయట్టి- వేణుగీతగతిమూలవేధసే, వేణు- పిల్లనఁగ్రోవియొక్క, గీత- గానముయొక్క. గతి- స్వరవిశేషములకు, మూలవేధసే- మూలబ్రహ్మమయిన, తేజసే - శ్రీకృష్ణరూపమయిన తేజంబుకొఱకు, తదిదం - ఆయీ, ఓం నమోనమః- ప్రణవపూర్వకములయి పలుమఱుఁ జేయు నమస్కారములు.

మ॥ పసిగాపుం జిగురాకుఁబోండ్ల మెఱుఁగుంబాలిండ్లకాశ్మీరఫుం। రసముల్ కొబ్బిలనుబ్బి నిర్భరపరీరంభస్థితిం దేల్చు। నుల్లసితంబై మురళీనినాదగతి మూలబ్రహ్మమై కింటికిం। బోసగం జాలెడు మూర్తికిన్ మ్రొక్కెదన్ గేలోంకారపూర్వంబుగన్॥

తా॥ గోపికాస్తనంబులయందలి కుంకుమంబుతోఁ గూడిన శరీరకాంతి గలదియును- వేణుగానంబులకు మూలబ్రహ్మంబయిన తేజంబునకుఁ బ్రణవపూర్వకంబుగాఁ గఁ బలుమాఱు నమస్కరించెదననుట - ఇట్లు నమస్కరించిన పిమ్మట తనకెదుట వచ్చుచున్న శ్రీకృష్ణుని విలాసంబు వర్ణించుచున్నాఁడు.



శ్లో॥ మృదుక్వణన్నూపురమన్థరేణ బాలేన పాదామ్బుజపల్లవేన। అనుస్వనన్మంజులవేణుగీతమాయాతి మే జీవితమాత్తకేళి॥

టీక॥ ఆత్తకేళి- ఆత్త, పొందబడిన- కేళి, విహారంబులుగల - మేజీవితం, నా ప్రాణంబైన శ్రీకృష్ణుండను తేజంబు- మృదుక్వణన్నూపురమన్థరేణ, మృదు- చెవులకింపగునట్లుగా, క్వణత్- మ్రోయుచున్న, నూపుర- అందియలచేత, మన్థరేణ- మందసంచారముగలయట్టి, బాలేన - చిన్నదైనట్టి, పాదామ్బుజపల్లవేన తామర చేకులవంటి పాదంబులచేత, అనుస్వనన్మంజుల -వేణుగీతం, అనుస్వనత్, అందియలననుసరించి ధ్వనించుచున్నట్టి- మంజుల, మనోహరమైన, వేణుగీతమ్ - వేణునాదము గలుగునట్లుగా, ఆయాతి- వచ్చుచున్నది.

ఉ॥ పిల్లనివేణుగీతికను సాదిగ తాళగతుల్ సెలంగి ఘుల్ ఘుల్లురటంచు నందియలు గజ్జలు నొక్కటఁటబికటఁటల్లగా। బల్లవకోమలాంఘ్రులను బాలకుఁడాడుచు బాడుచుండ నా। వేలితవృత్తి వచ్చెఁ గసువిందుగ జీవము వచ్చుకై వడిన్॥

తా॥ నా ప్రాణభూతుండగు కృష్ణుఁడు విహారంబులఁ బొందుచు మృదువుగ మ్రోయుచున్న యందియలచే మందసంచారంబు నొందుననియును దామరచేకులుం బోనివియును నగు చిన్నియడుగులచే నూపురంబులకనురూపంబుగా ధ్వనిచేయుచున్న వేణుగానంబునకు సమానంబుగ నర్తనంబు సేయుచు వచ్చుచున్నాఁడనుట,

శ్లో॥ సోయం విలాసమురళీనినదామృతేన సించన్నుదఞ్చితమిదం మమ కర్ణయుగ్మమ్। ఆయాతి మే నయనబన్ధురనన్యబన్ధురానన్దకన్దళితకేళికటాక్షలక్ష్మీః॥

టీక॥ ఆనందకందళితకేళికటాక్షలక్ష్మీః- ఆనందకందళిత, ఆనందాంకురముల చేయుచున్నట్టి- కేళీ, విలాసప్రధానములయిన- కటాక్ష, కడకంటిచూపులయొక్క - లక్ష్మీః, లక్ష్ములుగలయట్టి- మే, నాయొక్క- నయనబన్ధుః, నయన- నేత్రములకు- బంధుః, బంధువైనయట్టి- అనన్యబంధుః, సర్వబంధువైన శ్రీకృష్ణుండు- ఉదఞ్చితం, వినుటకు ముద్యుక్తమైన- ఇదం, నాయొక్క- కర్ణయుగ్మం, కర్ణ- చెవులయొక్క, యుగ్మం- జంటను, విలాసమురళీనినదామృతేన- విలాస, వినదగిన- మురళీ, పిల్లనఁగ్రోవియొక్క- నినద, ధ్వనియనెడి, అమృతేన- అమృతముచేత, సిఞ్చన్- తడుపుచున్నవాఁడై, ఆయాతి - వచ్చుచున్నాఁడు.

ఉ॥ మాలిమి చేసి గోపికల మానము గాచినవాఁడు పిచ్చికాబోలను నేఁడు వేణురవముం జెవినింపుచు నాదుకంటికిన్। మేలలరం బ్రమోదనిర్భరకేళికటాక్షలక్ష్ముడై। బాలుఁడనన్యబంధుఁడెడవాయక యిట్లరుదెంచె వచ్చెగా॥

తా॥ ఆనందాంకురంబులనుత్పాదించునట్టియసంఖ్యేయంబులగు విలాసకటాక్షంబులుగలవాఁడును, సర్వబంధుండును నాసయనంబులకత్యంతప్రియుండునునగు- కృష్ణుండాశగలదైన నాకర్ణద్వయంబును మనోహరంబగుమురళీనాదామృతంబుచే నిండుచున్నవాఁడై వచ్చుచున్నాఁడనుట.

శ్లో॥ దూరాద్విలోకయతివారణఖేలగామీధారాకటాక్షభరితేన
విలోచనేన। ఆరాదుపైతిహృదయఙ్గమవేణునాదవేణీదుఘేన
దశనావరణేనదేవః॥

టీక॥ హృదయఙ్గమవేణునాదవేణీదుఘేన- హృదయఙ్గమ, హృద్యమైన - వేణునాద, వేణుధ్వనియనియెడి- వేణీ, ప్రవాహమును- దుఘేన, పిదుకుచున్న- దశనావరణేన, అధరోష్ఠముచేత, ఉపలక్షితః - చూడఁబడుచున్న, దేవః- శ్రీకృష్ణుడు, ధారాకటాక్షభరితేన- ధారా, ప్రవాహముగాఁజేయబడిన- కటాక్ష, కడకన్నులచేత - భరితేన, నిండింపఁబడిన- విలోచనేన, కన్నుఁదోయిచేత- దూరాత్, దూరమునుండి- విలోకయతి, చూచుచున్నాఁడు- వారణఖేలగామీ, వారణ- యేనుగువలె, ఖేలగామీ- లలితముగునట్టుగమనశీలుఁడగుచు, ఆరాత్ - సమీపమునుండి, ఉపైతి- వచ్చుచున్నాఁడు.

మ॥ ఘనమత్తేభవిలాసయానము సెలంగన్ దవ్వులంజూచి। చల్లనిధారాళకటాక్షవీక్షణసముల్లాసంబుతోఁ జెంగటం। జనుదెంచెన్ దశనచ్ఛదంబు వెలయన్నాస్వామి సమ్మోదమో। హనవంశీనినదప్రవాహముఖ లీలావాప్తి దెల్పందయన్॥

తా॥ మనోహరంబగు వేణునాదంబనియెడి ప్రవాహంబుంబిదుకు కెమ్మోవిచేఁ గానంబడు శ్రీకృష్ణదేవుండు ప్రవాహంబుగ జేయబడిన కడకంటిచూపులచే నిండింపబడిన కన్నుంగవచే దూరంబుగనుండి చూచుచు మత్తగజంబుంబలె సుందరమగు గమనంబు గలవాఁడగుచు సమీపమునుండి వచ్చుచున్నాఁడనుట.

శ్లో॥ త్రిభువనసరసాభ్యాందివ్య లీలాకులాభ్యాం దృశిదృశిశిశిరా
భ్యాందీప్తభూషాపదాభ్యాం। అశరణశరణాభ్యామద్భుతా
భ్యాంపదాభ్యామయమయమనుకూజద్వేణురాయాతిదేవః॥

టీక॥ దేవః- శ్రీకృష్ణమూర్తి, అనుకూజద్వేణుః- అనుకూజత్, మ్రోయుచున్న వేణుః, పిల్లనఁగ్రోవిగలవాఁడగుచు- త్రిభువనసరసాభ్యాం, త్రిభువన - ముల్లోకములకును, సరసాభ్యాం- మనోహరములయినవియు, అద్భుతాభ్యాం - ఆశ్చర్యసంపాదకములయినవియు, దీప్తభూషాపదాభ్యాం- దీప్త, ప్రకాశించుచున్న- భూష, భూషణములకు- పదాభ్యాం, నివాసములైనవియు- దివ్యలీలాకులాభ్యాం, దివ్య- దేవసంబంధములైన



లీలా- విలాసములచేత, ఆకులాభ్యాం- వ్యాకులములయినవియు- దృశిదృశి, ప్రతిదర్శనమందును- శిశిరాభ్యాం, ఆహ్లాదసంపాదకములయినవియు- అశరణశరణాభ్యాం, అశరణ- అగతికులకు, శరణాభ్యాం - రక్షకములైనవియునైన, పదాభ్యాం- పాదములచేత, అయమయం- వీఁడు, ఆయాతి- వచ్చుచున్నాఁడు.

శా॥ క్రీడాభూషణధాములై యశరణశ్రేయస్కరణ్యంబులై। చూడం జూడగ జల్లనై సొగసునై చోద్యంబులై దేవతా। చూడారత్నములైన పాదములరా సొంపారు వేణుధ్వనుల్। జాడల్ దెల్పగ వీడె వీడె యననాస్వామిన్ విలోకించెదన్॥

తా॥ మ్రోయుచున్నపిల్లనఁగ్రోవిగలవాఁడగుచు ముల్లోకంబులకు మనోజ్ఞంబులైన యాశ్చర్యంబుగలుగఁజేయునవియై ప్రకాశించుచున్న భూషణంబులకు నెలవులై దివ్యవిలాసంబులతోఁ గూడి చూడఁజూడఁ జల్లనవియై యశరణ్యంబులయిన పాదంబులచే నలంకృతఁజేయనునటుల సమీపంబున శ్రీకృష్ణుండు వచ్చుచున్నాఁడనుట.

శ్లో॥ సోయంమునీన్ద్రజనమానసతాపహారీసోయంమదవ్రజవధూ
వసనాపహారీ। సోయంతృతీయభువనేశ్వరదర్పహారీసోయం
మదీయహృదయామ్బురుహాపహారీ॥

టీక॥ యః- ఎవ్వఁడు, మునీన్ద్రజనమానసతాపహారీ - మునీంద్ర, మునిశ్రేష్ఠులయొక్క- జన, సమూహముయొక్క- మానసతాప, మనస్తాపమును- హారీ, అపహరింపసమర్థుఁడో- సః- ఆపురుషుఁడు, అయం- ఇతఁడే, యః- ఏపురుషుఁడు, మదవ్రజవధూవసనాపహారీ- మద, మత్తలయిన- వ్రజవధూ, గోపస్త్రీలయొక్క- వసన, వస్త్రములను- అపహారీ, అపహరింపసమర్థుఁడో- సః, వాఁడు- అయం, ఇతఁడే- యః, ఎవఁడు- తృతీయభువనేశ్వరదర్పహారీ, తృతీయభువనేశ్వర- ఇంద్రునియొక్క- దర్ప- గర్వమును, అపహారీ- అపహరింపసమర్థుఁడో, సః- అతఁడు, అయం- ఇతఁడే, యః - ఎవఁడు, మదీయహృదయామ్బురుహాపహారీ- మదీయ, నాసంబంధమయిన- హృదయ, ఎడయనియెడి, అమ్బురుహ- కమలమును, అపహారీ- అపహరింపసమర్థుఁడో, సః- వాఁడు, అయం- ఇతఁడే.

ఉ॥ చిక్కొరనాఁడు గోపికలచేలములెత్తినదొంగ శైలముల్। చెక్కులుసేయువానిమదజృంభము నాచినదొంగ భక్తిచే। నెక్కొనుమానికోటిమది నిల్పినపాపముబాపుదొంగనా। చొక్కపుచిత్తసారసముజారలుగాఁ గొనుదొంగ నేటికిన్॥

తా॥ ఎవఁడుసకలమునులమనంబుల బాధము తొలఁగించు గొల్లలాడె నెవ్వాఁడెల జవ్వనపు ప్రేతలచేలంబులంజారగొనె నెవ్వరుసంధించింద్రగర్వంబుపహరించెనెవఁడునా డెందపు తామరపూల గొనియెనో నిట్టి శ్రీకృష్ణుఁ డితఁడేయనుట.

శ్లో॥ సర్వజ్ఞత్వే చ మౌగ్ధ్యే చ సార్వభౌమమిదం మమ। నిర్విశన్నయనం తేజో నిర్వాణపదమశ్నుతే॥

టీక॥ సర్వజ్ఞత్వే చ - సర్వజ్ఞత్వమందు, మౌగ్ధ్యే చ - సౌందర్యంబునను, సార్వభౌమం - సర్వభూమీశ్వరాతిశాయియగు, ఇదం - ఈపురోవర్తియయిన, తేజః - తేజముగూర్చి, నిర్విశత్ - ప్రవేశించుచున్న, మమ - నాయొక్క, నయనం - నేత్రము, నిర్వాణపదం - మోక్షసుఖమును, అశ్నుతే - అనుభవించుచున్నది.

మ॥ వినుసర్వజ్ఞతయందుమౌగ్ధ్యమునను ర్వీసార్వభౌమంబునాఁ । జనుసీతేజముఁజూచినానయనము ల్సారూప్యముం జెందెఁ జేఁ డనియాలోకముఁ జేయఁగాభ్రమరకీటన్యాయముం గాంచుకా। దనజ్ఞానేంద్రియ రూఢకన్నులకు నేలాకల్గునూహింపఁగన్॥

తా॥ సర్వజ్ఞత్వంబున సౌందర్యంబున సర్వాతిశాయియై యీముందుగానబడుతేజంబుఁగూర్చి ప్రవేశించు నానయనంబు మోక్షసుఖంబు ననుభవించుచున్నదియనుట.

శ్లో॥ కృష్ణానమేతత్పునరుక్తశోభముష్ణేతరాంశోరుదయం ముఖేందోః। తృష్ణాంబురాశిం ద్విగుణీకరోతి కృష్ణాహ్వయం కించన జీవితం మే॥

టీక॥ మే - నాయొక్క, జీవితం - జీవనమయినదియు, కిఞ్చన - ఇట్టిదియని చెప్పనలవిగానిదియు, కృష్ణాహ్వయం - శ్రీకృష్ణాఖ్యమునగు, ఏతత్ - ఈపురోవర్తి - వస్తువు, ముఖేన్దోః - ముఖచంద్రునివలన, ఉష్ణేతరాంశోః - చంద్రునియొక్క, ఉదయం - ఆవిర్భావమును, పునరుక్తశోభం - పునరుక్త, ద్విగుణితమగు - శోభం, కాంతిగలదిగా - కృష్ణానం, చేయుచున్నదియై - తృష్ణామ్బురాశిం, ఆశాసముద్రమును - మే, నాయందు - ద్విగుణీకరోతి, రెండంతలుగా జేయుచునది.

మ॥ కనులోల్లాసకమైనిరంతరకళల్ గన్పట్టుశీతాంశుబిం। బముకంటెన్ ద్విగుణాభిరూప్యమునరమ్యంబైన నెమ్మోము। బున్నమజాబిల్లి వెలుంగుతో బొలయుకృష్ణాభిఖ్యమానాదుటీ। వముదృష్ణాబ్ధితరంగలక్ ద్విగుణమైవర్తిల్లఁ జేసెన్మదిన్॥

తా॥ నాజీవితంబనుచుం జెప్పనలవిగాని శ్రీకృష్ణాఖ్యంబగు నీముందు కానంబడువస్తువు నెమ్మొగంపుఁజందురునివలనఁ బూర్ణిమయందుఁ బొడముచందురునికి వన్నియం గల్పించునదియైన నాయందాశాసముద్రంబును పెగడఁజేయుచున్నదియనుట.

శ్లో॥ తదేతదాతామ్రవిలోచనశ్రీ సమ్భావితాశేష వినమ్రవర్గమ్। ముహుర్మురారేర్మధురాధరోష్ఠం ముఖామ్బుజం చు



మ్బతి మానసం మే॥

టీక॥ ఆతామ్రవిలోచనశ్రీసమ్భావితాశేషవినమ్రవర్గం - ఆతామ్ర, ఈషదరుణములయిన, విలోచన - నేత్రములయొక్క, శ్రీ - కాంతిచేత, సమ్భావిత - బహూకరింపబడిన, అశేష - సమస్తమయిన, వినమ్రవర్గం - నమ్రజనసమూహమునుగలదియును, మధురాధరోష్ఠం - మధుర, మనోజ్ఞమగు - అధరోష్ఠం, అధరముగలదియునునగు - మురారేః, శ్రీకృష్ణమూర్తియొక్క - యత్, ఏ - ముఖామ్బుజం - ముఖకమలములు, మే - నాయొక్క, మానసం - మనస్సు, చుమ్బతి - ధ్యానముచేయుచున్నదియో, తత్ - ఆప్రసిద్ధమైనముఖము. ఏతత్ - ఇది.

చ॥ కలశపయోధిశీకరనికాయము చేనను గెంపుమీఱు। కన్నులనతపాళికిం బ్రియముసూనజేయుచు దత్సభాకణం। బులుమధురాధరోష్ఠము నబూనినయాదినుదేవు మోముగా। వలేనదిగాకయున్నయెడ బల్మరునామదియానఁగోరునే॥

తా॥ ఈషదరుణంబులగు నయనంబులకాంతిచే సన్మానింపఁబడియెడి యశేషసేవకసమూహంబుగలిగి మనోజ్ఞంబగు నధరంబుచేఁ దేజరిల్లు నే శ్రీకృష్ణుని మోముదామరను నామనంబానఁగోరునో అట్టిముఖంబెయాయ్యగుపడెడుముఖంబనుట.

శ్లో॥ కరౌ శరదుదఞ్చితామ్బుజవిలాసశిక్షాగురూ పదౌ విబుధపాదపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ। దృశౌ దళితదుర్మదత్రిభువనోపమానశ్రియౌ విలోకయ విలోచనామృత మహో మహాశైశవమ్॥

టీక॥ హే విలోచన - ఓ నేత్రమా, అమృతమహః - అమృతే, అమృతమువలె - మహః, తేజనుగలిగిన - మహచ్ఛైశవం, మహత్ - శ్రీకృష్ణమూర్తియొక్క, శైశవం - బాల్యమును, విలోకయ - చూడుము, కరౌ - హస్తములు, శరదుదఞ్చితామ్బుజవిలాసశిక్షాగురూ - శరత్, శరత్కాలంబున - ఉదఞ్చిత, పుట్టిన - అమ్బుజ, కమలములయొక్క విలాస, కాంతివిశేషముయొక్క - శిక్షా, శిక్షించుటయందు - గురూ, నియామకములు - పదౌ, పాదములు - విబుధపాదపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ, విబుధపాదప - కల్పవృక్షములయొక్క, ప్రథమ - నూతనములయిన, పల్లవ - చిగుళ్ళను, ఉల్లఙ్ఘినౌ - అతిక్రమింపసమర్థములు, దృశౌ - నేత్రములు, దళితదుర్మదత్రిభువనోపమానశ్రియౌ - దళిత, విచారింపఁబడిన - దుర్మద, గర్విష్ఠములయిన - త్రిభువన, ముల్లోకంబులపదార్థంబులయొక్క - శ్రియౌ, కాంతులుగలవి.

ఉ॥ పాదములంటెమా విబుధపాదపనూతనపల్లవాళిం। దనంగన్న

త్, ఆశ్రీకృష్ణమూర్తియొక్క - ఏతత్ - ఈయగుపడుచున్న - వదనారవిందం, ముఖకమలము, చిత్రం, ఆశ్చర్యకరమయినది, హే అంబ - ఓతల్లి, పునః - వెండియు, తదేతత్ - అట్టిపాదారవిందాద్యవయవవిశిష్టమయిన శ్రీకృష్ణాఖ్యవస్తువు, చిత్రంచిత్రం మిక్కిలియాశ్చర్యమయినది.

ఉ॥ లోకము మోముబువిలోచనమ్ములు పదమ్ములు సహస్ర । సంఖ్యాకములంచు నెంచ శ్రుతులా పురుషోత్తముని వ్విధంబుగా । నీకనం దమ్మ నాయిచ్చెలువీముఖసారసమీపదాబ్జముల్ । చేకొనం జిత్రమంచునుతిచేయగ బల్మియునంబశక్యమే॥

తా॥ ఇట్టిదియని చెప్పశలవిగానియడుగుదామరలును గనుదంములును నెంమోము విరిదంమియునుంగల శ్రీకృష్ణునినుతింపగ నోయంబా మిక్కిలి చిత్రమనుట.

శ్లో॥ అఖిలభువనైకభూషణమధిభూషితజలధిదుహితృకుచకుమ్భ
మ్। వ్రజయువతిహారవల్లీమరకతనాయకమహామణింవన్దే॥

టీక॥ అఖిలభువనైకభూషణం - అఖిల, సమస్తమయిన - భువన, లోకములకు ఏకభూషణం ముఖ్యభూషణమయినట్టియు, అధిభూషితజలధిదుహితృకుచకుమ్భం - అధిభూషిత, అలంకరింపబడిన - జలధిదుహితృ, లక్ష్మియొక్క - కుచకుమ్భం, కలశములవంటి స్తనములుగలయట్టియు - వ్రజయువతిహారవల్లీ మరకతనాయకమహామణిం, వ్రజయువతి - గోపికలయొక్క, హారవల్లీ - తీవియలవంటి హారములయొక్క, మరకత - మరకతమణియనెడి, నాయకమహామణిం - స్థూలనాయకరత్నమయిన శ్రీకృష్ణమూర్తినిగూర్చి, వందే - నమస్కరించుచున్నాను.

చ॥ జలనిధికన్యకాఘనకుచస్థలిపచ్చలతాళిగోపికా । విలసితహారనీలమణివిశ్వజగద్వలయప్రకాశకో । జ్జ్వలమహనీయరత్నమునివారితకాళియభోగిభోగమం । డలగిరివజ్రమై వెలయునందతనూజుభజింతునామదిన్॥

తా॥ ఎల్లలోకంబులకు భూషణంబయిమహాలక్ష్మి స్తనమండలంబునకలంకారరత్నంబయిగోపస్త్రీహారమధ్యంబుల నింద్రనీలనాయకమణియై వెలయుశ్రీకృష్ణదేవునిగూర్చి మొక్కుదననుట.

శ్లో॥ కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీఖణ్డాఙ్గరాగరసరఞ్జితమఞ్జులశ్రీః । గణ్డస్థలీముకురమణ్డలఖేలమానఘర్మాఙ్కురం
కిమపిఖేలతికృష్ణతేజః॥

టీక॥ కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీఖండాఙ్గరాగరసరంజితమంజులశ్రీః - కాన్తా, ప్రియురాలియొక్క - కచగ్రహణ, కేశగ్రహణముయొక్క - విగ్రహ, కలహమందు - బద్ధ, గ్రహింపబడిన - లక్ష్మీ, రుక్మిణీదేవియొక్క - ఖండ, చిటిలిన - అంగరాగ - 



మెయిపూతచేత, రంజిత - అలంకరింపబడిన, మంజుల - మనోహరమయిన - శ్రీః, సంపదగలయట్టి - గణ్డస్థలీముకురమణ్డలఖేలమానఘర్మాఙ్కురం, గణ్డస్థలీముకురమండల - అద్దములవంటి చెక్కిళ్ళయందు, ఖేలమాన - నృత్యముచేయుచున్న, ఘర్మాంకురం, చిఱుచెమటగలయట్టి శ్రీకృష్ణతేజము - కిమపి, ఇట్టిదియని చెప్పశలవిగానిదయై - ఖేలతి, ప్రకాశించుచున్నది.

మ॥ తళుకున్నిద్దపు చెక్కుటద్దములపై ఘర్మాంకురంబూరగాఁ । గలికాభోగపయోధరాంతరలసత్కాశ్మీరసంబంధ । గంధిలవక్షస్థలుఁడై గృహీతఘనవేణీబంధుఁడై నెయ్యపుం । జెలియంజుంబన కేళిఁదేల్చు హరినాచిత్తంబునం జెంగెదన్॥

తా॥ కేశగ్రహణకలహంబునకుం దాల్చినరుక్మిణీదేవి స్తనమండలంబునంజిటిలినయంగరాగంబుచేనలంకరింపఁబడినదియై యద్దంబులంబోలుచెక్కిళ్ళలం జిఱుచెమటలుఅంజెలంగు శ్రీకృష్ణతేజంబు సెప్పవలవిగాక వెలుంగుచున్నదియనుట.

శ్లో॥ మధురంమధురంవపురస్య విభోర్మధురం మధురంవదనంమ
ధురం । మధుగన్ధిమృదుస్మితమేతదహో మధురం మధురంమధు
రంమధురమ్॥

టీక॥ అస్య - ఈముందటఁగుపడియెడి, విభోః - శ్రీకృష్ణమూర్తియొక్క, వపుః - శరీరము - మధురం మధురం, మిక్కిలి సుందరము - మధుగన్ధిమృదుస్మితం, మధు - మకరందమునలె, గన్ధి - పరిమళముగల, మృదు - కోమలమయిన, స్మితం - లేనగవుగల, అస్యవిభోః - ఈకృష్ణమూర్తియొక్క, మధురం - సుందరమయిన, వదనం - ముఖము, మధురంమధురం - మిక్కిలిసుందరము, ఏతత్ - ఈకానంబడుచున్న శ్రీకృష్ణతేజము. మధురంమధురంమధురంమధురం - మిక్కిలిమనోహరమయినది, అహో - ఆశ్చర్యము.

తా॥ చూడంజూడఁగమేనందానినుమడించు న్మాధురీసంపదల్ । చూడంజూడఁగ మోముగోముమది మెచ్చుల్గులుకుమ్మాటికిం । జూడంజూడమరంద బిందువులమించున్మందహాసంబునీ । జాడంబల్మియు మాధురింజెలఁగునా స్వామిన్విలోకించెదన్॥

తా॥ చూడంజూడ నెంమేనసోయగంబిను మడింమనుకరంద బిందువులందొగడుశేనగవు నెంమొగమునందు సుదడించునట్టి వికాసంబులంగలిగియీయాయగుపడు శ్రీకృష్ణతేజంబం దలిసౌందర్యంబత్యాశ్చర్యంబుఁబుట్టించుచున్నటియనుట.

శ్లో॥ శృంగారరససర్వస్వంశిఖిపిఞ్ఛవిభూషణమ్ । అఙ్గీకృతనరాకారమాశ్రయే భువనాశ్రయమ్॥

టీక॥ శృంగారరససర్వస్వం-శృంగారరసము యొక్క, సర్వస్వం-సర్వార్థరూపమయినవాడును, శిఖిపింఛవిభూషణం-శిఖిపింఛ్ఛనెమలిపురికభూషణం, అలంకారముగాగలవాడును- అంగీకృతనరాకారం, అంగీకృతం-స్వీకరింపబడిన, నరాకారం-మనుష్యశరీరముగలవాడును, భువనాశ్రయం - లోకాధారుడయిన శ్రీకృష్ణుని, ఆశ్రయే- సేవించుచున్నాను.

ఉ॥ చక్కనివాని ముద్దు వెదజల్లెడువాని దయారసంబుచే । నెక్కొనువాని మాళిలటి నించిన పింఛము వాని లోకముల్ । మ్రొక్కఁగనేలు వాని నతిమోహనమానుష వేషధారినై । యొకఁడ నేని నాని జగదాశ్రయు నెప్పుడు నాశ్రయించెదన్॥

తా॥ రాశిగాఁ జేయఁబడిన శృంగారరసంబు కరణిం దేజరిల్లుచు నెమలి పురియలంకారంబుగ ధరియించి మనుష్య దేహంబుచే వెలుఁగు లోకాశ్రయుండయిన శ్రీకృష్ణమూర్తి నాశ్రయించుచున్నాననుట.

శ్లో॥ నాద్యాపి పశ్యతి కదాచన దర్శనేన చిత్తేన చోపనిషదా సుదృశాం సహస్రం । సత్వం చిరం నయనయోరనయోః పదవ్యాం స్వామిన్ కదాను కృపయా మమ సన్నిధత్తే॥

టీక॥ సుదృశాం- విద్వాంసులయొక్క, సహస్రం - సహస్రసంఖ్యగల సమూహము, అద్యాపి- ఈ పెనపండైనను, కదాచన - వటి యుకకాలంబుననైనను, దర్శనేన- నేత్రముచేత, చిత్తేన- చేతస్సుచేత, ఉపనిషదాచ-వేదాంతశాస్త్రముచేతనైన, త్వాం- నిన్ను, చిరం- బహుకాలమునుండి, నపశ్యతి- చూడదు, హే స్వామిన్-ఓకృష్ణ, సత్వం- ఆనీవు, మమ- నాయొక్క, అనయోః- ఈప్రకృతిసంబంధములగు, నయనయోః- కన్నులయొక్క, పదవ్యాం- మార్గమునందు, కృపయా- దయచేత, కదాను- ఎప్పుడు, సన్నిధత్తే- సన్నిధానము చేయుచున్నావు.

ఉ॥ కొందఱు యోగదృష్టినొకకొందఱు వేదవిచారవాసనం । గందురు నిన్ను నెప్పుడొయొకానొకవేళ నఖిన్నులైననా । రందఱు నిట్టినీవు కరుణాంబుధి ప్రాకృతదృష్టి జెందునా । ముందటనిచ్చెదెన్నఁడు ప్రమోదమునర్థు నంద నందనా॥

తా॥ వేలసంఖ్యలంగల విద్వాంసులు గొందఱు యోగనిష్ఠంబగు మనంబుననయిన విజ్ఞానవంతంబగు చూపుననయిన వేదాంతశాస్త్రంబుననయిన నెంతకాలంబునకు నిన్నుం గాంచనోపరట్టియవాఙ్మనసగోచరుండవగు నీవు కేవల ప్రకృతిసంబంధంబుగల నా కన్నులకెన్నటికింగానంబడువాఁడవో కదాయనుట.



శ్లో॥ కేయం కాంతిః కేశవత్వన్ముఖేందోః కోయం వేషః కోపివాచామభూమిః । సేయం సేయం స్వాదుతా మంజులశ్రీ ర్భూయోభూయో భూయశస్త్వాం నమామి॥

టీక॥ హే కేశవ- ఓ శ్రీకృష్ణ, త్వన్ముఖేందోః - త్వత్, నీయొక్క- ముఖేందోః, ముఖచంద్రునియొక్క- ఇయంకాంతిః, ఈకాంతి- కా, ఎయ్యదియని చెప్పవచ్చును- అయం వేషః, ఈయలంకారము- కః, ఎట్టిదియనవచ్చును- సాసా, ఆయా ప్రసిద్ధంబగు- ఇయమియంస్వాదుతా, ఈయీలావణ్యము-మంజులశ్రీః, సౌందర్యలక్ష్మియును వాచామభూమిః- వాగగమ్యము, తత్- ఆకారణమువలన, భూయోభూయః- మాటిమాటికి, భూయశః- అధికముగ, త్వాం నిన్నుగూర్చి- నమామి, మ్రొక్కుచున్నాను.

ఉ॥ ఎక్కఁడి గోపరూపమది యెక్కఁడి ముద్దుమొగంబు సోయగం । బెక్కఁడనీకళావిభవమెక్కఁడ నేమనవచ్చునయ్య । న్మ్కఁయగోచరంబు భవదాకృతి పద్మభవాదిసూక్తికిన్ । మ్రొక్కెదసారెసారెకు సమోహరవేయని నందనందనా॥

తా॥ ఇట్టిదియని చెప్ప నలవిగాని నెం మొగంపుఁ జందురుని కాంతియు వాచామగోచరంబగు నలంకారమును మువనశక్యంబగు లావణ్యంబును మనోహరంబగు సౌందర్యసంపదయుంగల్గి యుండుఁగాన నిట్టి నినుం గూర్చి మ్రొక్కుచున్నాననుట.

శ్లో॥ వదనేందువినిర్జితశ్శశీ దశధా దేవపదం ప్రపద్యతే। అధికాం శ్రియమశ్నుతేతరాం తవ కారుణ్యవిజృంభితం కియత్॥

టీక॥ హే దేవ- ఓకృష్ణ, శశీ- చంద్రుఁడు, తవ- నీయొక్క, వదనేందువినిర్జితః- వదనేందు, ముఖచంద్రునిచే- వినిర్జితః, తిరస్కరింపఁబడినవాఁడై- దశధా, పది నఖములగుచు- పదం, పాదయుగళమును- ప్రపద్య, పొంది - అధికాం, అధికమయిన- శ్రియం- కాంతిని, అశ్నుతేతరాం- పొందుచున్నాఁడు, తవ - నీయొక్క, కారుణ్యవిజృంభితం- కారుణ్యాతిశయము, కియత్ - ఎంతనవచ్చును.

ఉ॥ ఆననకాంతితోడ నెదురాని శశాంకుడు నిల్వలేక నీ। మానితపాదపద్మముల నాటున జేరి నఖాంకురాకృతిం । బూని భజించి నంత నెసమున్న త్రిశ్రీలొంద గూర్చితౌరనీ। దీనదయాపరత్వము నుతింపగ శక్యమె నందనందనా॥

తా॥ చందురుండు నీ ముఖచంద్రునెదిరించి యోడి పది తెలంగులై పదంబుల నఖరూపంబున నాశ్రయించి యనంతనధికంబగు కాంతినొందె నిట్టినీ దయకెయ్యదియు సాటి లేదనుట.

శ్లో॥ తత్త్వస్సుఖం కథమివాబ్జసమానకత్యం వాఙ్మధురిబహుళప

ర్వకళాసమృద్ధం। తత్కింభవేదపరమ్భువనైకకాంతంయస్య
త్వదాననసమానుషమాసదాస్యాత్॥

టీక॥ వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధం- వాఙ్మాధురీ, వచోమాధుర్యమని యెడి- బహుళ, అధికమయిన- పర్వకళా, పూర్ణిమాకళలచే -సమృద్ధం, అతిశయించిన- తత్, ఆప్రసిద్ధమయిన- త్వన్ముఖం, త్వత్- నీయొక్క, ముఖం - నెమ్మొగము, అబ్జసమానకత్వం- అబ్జ, చంద్రకమలములతోడ, సమానకత్వం- సమానకోటిగలది, కథం- ఎటుల, భవేత్ - అయ్యెను, యస్య- ఏపదార్థమునకు, సదా- ఎప్పుడును, త్వదాననసమా- త్వదానన, నీముఖముతోడ- సమా, సమానమగు- సుషమా, ఉత్కృష్టకాంతి- స్యాత్, అయ్యెను- అపరం, మఱియొకటి- భువనైకకాంతం, భువన - లోకములయందు, ఏక- ముఖ్యమగు, కాంతం- సుందరము, స్యాత్- అయ్యెను, తత్ - అది, కిం- ఏది.

చ॥ సరసిజమంటిమాతగదుసాటికిశారదపూర్ణిమాసుధా। కరరుచి
యంటిమాసమముగాదికవేఱెజగంబునన్మనో। హరమగువస్తువొండొకటి
యారసిచూచునోకానొకప్పుడుం । బురుడుఘటిల్లునేభువనమోహన నీముఖ
కాన్తకాంతికిన్॥

తా॥ వచోమాధుర్యంబునుబూర్ణిమకళలచేసమృద్ధంబగు నీమోముతోడంజంద్రకమలంబులుసమంబులెటులగును నీమోముతోడ భువనంబులనెల్ల పదార్థంబులుసమంబులనుచుంజెప్ప నెయ్యదియుఁగానంబడమిసిద్ధ బుగానీసమానుండొక్కండును లేడనుట.

శ్లో॥ శుశ్రూషసేయదివచశ్శృణుమామకీనంపూర్వైరపూర్వకవి
భిర్నకటాక్షితంయత్।నీరాజనక్రమధురంభవదాననేందో
ర్వ్యాజమర్హతిచిరాయశశిప్రదీపః॥

టీక॥ హేకృష్ణ- ఓకృష్ణ, శుశ్రూషసేయది- విననిచ్ఛయించితేని - పూర్వైః, మొదటివారలయిన- అపూర్వకవిభిః, అపూర్వ- చమత్కారసంపాదకప్రబంధములనుజెప్పిన, కవిభిః- వాల్మీకాదిమహాకవులచేత, యత్- ఏవాక్యము, నకటాక్షితం- చెప్పబడలేదో, మామకీనం- నాసంబంధమయిన, వచః- వాక్యమును, శృణు - వినుము, శశిప్రదీపః- శశి, చంద్రరూపమయిన - ప్రదీపః, దీపము - భవదాననేందోః, భవత్ - నీయొక్క, ఆననేందోః- ముఖచంద్రునియొక్క, నీరాజనక్రమధురం - నీరాజన, నివాళియొక్క- క్రమ, విధియొక్క- ధురం, భారమునుగూర్చి - నిర్వ్యాజం, ఉపాధిలేనటుల- చిరాయ, బహుకాలము- అర్హతి, తగుచున్నది.



చ॥ తొలుతటివ్యాసముఖ్యకవిధుర్యులుపల్కనినాహసంబునే।వలికెద
వింటివేనివినుపంకజలోచననీదుమోముతో।గలువలఱేనిసాటియనగాదగదా
రతిపల్లెరంబులో।పలవిడిదివ్వెగానతనిబట్టినివాళియొనర్పగాదగున్॥

తా॥ ఓకృష్ణా నాపలుకొక్కటివింటివేని వినుముపూర్వులగువాల్మీకివ్యాసాదిమహాకవులచేఁజెప్పఁబడని సాహసంపుమాటనుడివెద నెట్లనినఁజంద్రుండనియెడిదీపంబునాకతిపళ్ళెరంబుననిడి నీనెమ్మోముజందురునికినివాళియొనర్ప దగుననుట.

శ్లో॥అఖండనిర్వాణరసప్రవాహైర్విఖండితాశేష రసాంతరాణి।
నియన్త్రితోద్వాంతసుధార్ణవాని జయంతిశీతానితవస్మితాని॥

టీక॥ అఖణ్డనిర్వాణరసప్రవాహైః- అఖండ, పరిపూర్ణమయిన- నిర్వాణ, సుఖమనియెడి- రస, ఉదకముయొక్క- ప్రవాహైః, ప్రవాహములచేత విఖణ్డితాశేషరసాన్తరాణి- విఖండిత, కొట్టఁబడిన- అశేష, సమస్తమయిన -రసాంతరాణి, ఇతరరసములుగలవియు- నియంత్రితోద్వాంతసుధార్ణవాని, నియన్త్రిత - యథేచ్ఛముగునటుల, ఉద్వాంత- బయలువెడలుచున్న, సుధార్ణవాని - అమృతసముద్రముగలవియు, శీతాని- చూచుజనులకు మనోహరమయినవియునగు, తవ- నీయొక్క, స్మితాని- లేనగవులు, జయంతి- సర్వోత్కర్షమునుగావహించుచున్నది.

మ॥ కలితానందమహానుభావమున వేడ్కంజెందియంతంతకుం। దలి
యంబొంగుసుధాతరంగితపయోధిన్ లీలగన్పించుచుం। దళితాశేషరసాంతరం
బులగుతేనవ్వుల్ మిటారింప।గోకులకాంతాజనభోగభాగ్యమహిమాం కూరం
బునెల్లొందెడిన్॥

తా॥ సంపూర్ణంబగుసుఖరసప్రవాహంబులచే నిరసింపంబడినయితరరసంబులుగలిగియథేచ్ఛమగునటులబయలువెడలునమృతసముద్రంబుగలిగిచూచు వారలకుసుఖంబొనర్చునీచిఱునగవులుసర్వోత్కర్షముగావహించుచున్నవియనుట.

శ్లో॥ కామంసంతుసహస్రశఃకతిపయేస్వారస్యధౌరేయకాః కా
మంవాకమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః। నైవైవం
వివదామహేనచవయందేవప్రియంబ్రూమహే యత్సత్యంర
మణీయతాపరిణతిస్త్వయ్యేవపారంగతా॥

టీక॥ కతిపయే- కొందఱు, స్వారస్యధౌరేయకాః- సౌందర్యవంతులు, కామం- యథేచ్ఛముగాను, సన్తు- ఉందురుగాక, కమనీయతా పరిమళస్వారాజ్యబద్ధవ్రతాః,క

మనీయతా- సౌందర్యమునయొక్క, పరిమళ- ఆధిక్యమనియెడి, స్వారాజ్య - స్వర్గరాజ్యమందు, బద్ధ- కూడుకొన్న, వ్రతాః- పుణ్యవిశేషములు , సహస్రశః - వేలసంఖ్యలు, కామం- యథేచ్ఛముగను, సంతు- ఉందురుగాక, హేదేవ- ఓకృష్ణ, తైః- ఆయధికసుందరులయినవారితోడ, వవివదామహే - వివాదమును జేయము, ఏవం - ఈప్రకారము, ప్రియంచ- ప్రియమును, నబ్రూమహే- నుడువము, యత్.- ఏకారణమున, రమణీయతాపరిణతిః- రమణీయతా, సౌందర్యముయొక్క- పరిణతిః, పరిపాకము- త్వయ్యేవ, నీయందే- పారంగతా, సంపూర్ణమగానుండును-సత్యం, యదార్థము.

ఉ॥ లోకములో పలరరసికలోకము నేతముగల్గుగాకయ। స్తోకమనోహరావయవశోభితులుందురు గాకవారితో। నేకలహింపనేలమొగమిచ్చక మేటికి సత్యమాడెదన్।నీకమనీయతామహిమనీకతగున్నటికానమెయ్యెడన్॥

తా॥ లోకంబునననేకరసికజనంబులుందురుగాకయధిక సౌందర్యసంపన్నులనేకులుందురుగాక వారితోడఁగలహంబును ప్రియంబునుంబలుకనేల యదార్థంబుగ నుడివెద సౌందర్యంబుతోడం బుగణింపనెట్టివారలుంజాలరనుట.

శ్లో॥ మందారమూలేవదనాభిరామంబిమ్బాధరాపూరితవేణునాదం।గోగోపగోపీజనమధ్యసంస్థంగోపంభజే గోకులపూర్ణచంద్రమ్।

టీక॥ మన్దారమూలే- మన్దార, కల్పవృక్షముయొక్క - మూలే, మొదటియందు- గోగోపగోపీజనమధ్యస్థ , గో - గోవులయొక్కయును, గోప - గోపాలకులయొక్కయును, గోపీ- గోపస్త్రీలయొక్కయును, జన- సమూహముయొక్క, మధ్య- నడుమ, సంస్థం- కూర్చున్నవాడును, బిమ్బాధరాపూరితవేణునాదం - బిమ్బ, దొండపండువంటి- అధర, అధరోష్ఠము చేత- ఆపూరిత- నిస్సగా బూరింపబడిన, వేణునాదం-వేణుధ్వనిగలవాడును, గోకులపూర్ణచంద్రం - గోకుల, గోసమూహమునకు - పూర్ణచంద్రం, రాకాశశాంకుడయినవాడును- మదనాభిరామం, మదన- మన్మథునికన్నను, అభిరామం-సుందరుఁడయినవాడునగు,గోపం-బాలగోపాలుని,భజే- భజించుచున్నాను

ఉ॥ గోపికలోపికల్పడలిగొల్వగగోపులుఁగోవులాడగా । గ్రేపులుమేపులానిపరికింపగ గెంజిగురాకు మోవినై। మోపిన వేణువగ్గలము మ్రోయగగల్పవనిన్వసించునా।గోపకుమారమన్మథునిగోకులవార్ధిశశింభజించెదన్॥

తా॥ కల్పవృక్షమూలంబునగోవులయు- గోపాలకులయుగోపికలయునడుమనుండి కెంమోవియందు మోపినవేణువుమ్రోయించుచు మన్మథునికన్నఁబుందరుఁడయిగోకులవార్ధి



పూర్ణచంద్రుండయివెలయు బాలగోపాలునిభజియించెదననుట.

శ్లో॥ గళద్వ్రీడాలోలామదనవనితాగోపవనితా మధుస్ఫీతంగీతంకిమపిమధురాచాపలధురాః।సముజ్జృమ్భా గుమ్భా మధురిమగిరాంమాదృశ గిరాంత్వయిస్థానే జాతేదధతి చపలంజన్మసఫలమ్॥

టీక॥ గళద్వ్రీడాః- నిర్లజ్జలయిన, గోపవనితాః - గోపస్త్రీలు, లోలాః - నీయందాసక్తలయి, మదనవనితాః- రతితుల్యలు, జాతాః- అయిరి, గీతం- నీసంబంధమయినగానము, మధుస్ఫీతం- మధు, తేనెయవలె- స్ఫీతం, స్ఫూర్తిగలదియై- కిమపి, చెప్పనలవిగానిది- జాతం, అయినది- చాపలధురాః, చాపల - నీసంబంధమయినచాపల్యముయొక్క, ధురాః- భారములు, మధురాః- మనోహరములు, జాతాః- అయినవి, మాదృశగిరాం- మాదృశ, నావంటియప్రతిజ్ఞునియొక్క- గిరాం, వాక్యములయొక్క - గుంభాః, గుంభనలు- మధురిమగిరాం, వాల్మీకిమొదలగువారలయొక్క వాక్యములవలె - సముజ్జృమ్భాః, అతిశయములు- జాతాః, అయినవి- త్వయి, నీవిషయము- జాతేసతి-।అగుచుండఁగా, చపలం- చపలమయిన, జన్మ- జన్మమును, సఫలం- ఫలసహితమగు నటుల దధతి- వహించుచున్నవి, స్థానే. యుక్తము.

ఉ॥ నానదొఅంగిత త్రపమునన్మరులెత్తినగోపకామినుల్। దేనియగుల్లుపాటలునుదివ్యాతిమాటలునీకతంబునం । బూనిఫలంబుఁజెందుక్రియమోదముతోడనుసన్నుతింపగా । నానుడువుల్ఫలించెజననంబుకృతార్థతఁజెందెనెంతయున్॥

తా॥ గోకులంబునంగ్రుష్ణురుటంజేసియరసికలయినిర్లజ్జలైనగోపస్త్రీల సౌందర్యంబులును గానంబులును జాపల్యంబులును నీయందవినియోగించుకతంబునస్వసమానాధికరహితంబులైనభంగి నప్రతిజ్ఞుండనగునావచనంబులసందర్భంబును వాల్మీకిమొదలగువారలవచోగరిమంబుకైవడిఁ బ్రసిద్ధంబగుచునీవలన వెలసెను నేఁగృతార్థుండనై తిననుట.

శ్లో॥ భువనంభవనంవిలాసినీశ్రీస్తనయాతామరసాసనస్మరౌచ।పరిచారపరమ్పరాసురేన్ద్రాస్తదపిత్వచ్చరితం విభోవిచిత్రమ్॥

టీక॥ హేవిభో- ఓకృష్ణా, భువనం- లోకములకు, భవనం-గృహము, శ్రీః-లక్ష్మీదేవి, విలాసినీ- పాణిగ్రహణభార్య, తామరసాసనస్మరౌచ- తామరసాసన, బ్రహ్మదేవుఁడును- స్మరౌచ, మన్మథుఁడును- తనయౌ, కుమారులు- సురేన్ద్రాః, దిక్పాలకాదులు-పరిచారపరమ్పరాః,పరిచార పరిచారకులయొక్క-పరమ్పరాః సమూహముతద

పి, అటులనైనను- త్వచ్చరితం, త్వత్- నీయొక్క, చరితం- చరిత్రము, విచిత్రం- మి క్కిలి యాశ్చర్యము.

మ॥ లలనారత్నము శ్రీవధూటి జగమెల్లం గేలికాసౌధసీమ జలజాతా సనశంబరారులు సుతుల్ శక్రాదిదిక్పాలవర్యులు భృత్యుల్ వివరింపనీమహిమలో హా యిట్టివైయుండగో । కులవాటంబున జారచోరకృతిలోకుల్ నవ్వ గాం తుంతురే॥

తా॥ ఇట్లు ముజ్జగంబు భార్యలోకైక మాతయగు సిరి- చతురాననుండును మన్మథుం డును కొమరులు- ఇట్టి నీవు గోకులంబున నుంటగడు చిత్రంబనుట.

శ్లో॥ దేవస్త్రిలోకీసౌభాగ్యకస్తూరీతిలకాఙ్కురః । జీయాద్వ్ర జాఙ్గనానఙ్గ కేళీలలితవిభ్రమః॥

టీక॥ త్రిలోకీసౌభాగ్యకస్తూరీతిలకాఙ్కురః- త్రిలోకీ, మూడులోకములయొ క్క- సౌభాగ్య, అవయవసౌష్ఠవమునకు- కస్తూరీతిలకాఙ్కురః, కస్తూరిబొట్టుంబలెను న్నవాడును- వ్రజాఙ్గనానఙ్గ కేళీలలితవిభ్రమః, వ్రజాఙ్గనా- గోపస్త్రీలయొక్క, అ నంగకేళీ- మన్మథక్రీడలయందు, లలిత- సరసమయిన, విభ్రమః- విలాసములుగలవాడు నునగు, దేవః- శ్రీకృష్ణమూర్తి, జీయాత్- సర్వోత్కర్షముగా వర్తించుగాక.

మ॥ కులుకం జెక్కులనిక్కు టిల్లు పులకాంకూరంబు తోరంబుగా । దళుకుం గస్తురిబొట్టు నెన్నొసట పై త్రైలోక్యభాగ్యాకృతిం । జెలగన్ గోపవితంబినీరతి కళాశృంగారభావోన్నతుల్ । దొలుకంగన్నులపండువైన విభుగాంతున్ భాగ్య సంసిద్ధికిన్॥

తా॥ ముల్లోకంబుల సౌష్ఠవావయవంబులకుం గస్తూరీతిలకంబయి గోపస్త్రీలతోన నంగక్రీడం జేయుట యందత్యంతవిలాసంబులుగల శ్రీకృష్ణదేవుండు సర్వోత్కర్షంబుగా వర్తించుననుట.

శ్లో॥ ప్రేమదంచ మే కామదంచ మే వేదనంచ మే వైభవంచ మే । జీవ దంచ మే జీవితంచ మే దైవతంచ మే దేవతాపరమ్॥

టీక॥ హేదేవ- ఓకృష్ణ, మే- నాయొక్క, ప్రేమదంచ- ప్రేమంబునిచ్చువ స్తువును- మే- నాయొక్క, కామదంచ- కోరికనిచ్చువస్తువును, మే- నాయొక్క, వేదనం చ, జ్ఞానమును- మే, నాయొక్క- వైభవంచ, ఐశ్వర్యమును- మే, నాయొక్క- జీవనం చ, ప్రాణమును- మే, నాయొక్క- జీవితంచ, జీవనహేతువస్తువును- మే, నాయొక్క-



దైవతంచ- దైవతమును, అపరం- మఱియొకటి, నాస్తి- లేదు.

ఉ॥ కోరికలిచ్చినన్నెనరుగూర్చిన జీవనజీవిదమ్ములే వానినొనర్చినం జెలివిడాల్చినదల్లియు దండ్రియుం బతె । స్నేరములోర్చినం దిరువసేర్పుగ దీప్పం గన్గొయిచ్చినన్ । భారము నీవె గాని బతి పంకజనాభ యెఱుంగనన్యులన్॥

తా॥ కోరికనిచ్చునంప్రియంబుం జేసిననీవ నాజ్ఞానంబునైశ్వర్యంబును జీవనంబును జీ వనహేతువగు వస్తువును నాదైవతంబును నీవకాని మఱియన్యానెఱుంగననుట.

శ్లో॥ మాధుర్యేణ విజృమ్భన్తాం వాచో నస్తవ వైభవే । చాపల్యేన వి వర్ధన్తాం చిన్తా నస్తవ శైశవే॥

టీక॥ నః- నాయొక్క, వాచః- వాక్యములు, తవ- నీయొక్క, వైభవే- గోవ ర్ధనోద్ధరణాదివైభవమందు, మాధుర్యేణ- శ్రావ్యమగుటచే, విజృమ్భన్తాం- మిక్కిలియ తిశయించుంగాక, నః- నాయొక్క, చిన్తాః- మనోవ్యాపారమును, తవ- నీయొక్క, శై శవే- బాల్యమందు, చాపల్యేన- చపలతచే, వివర్ధన్తాం- వృద్ధినొందుగాక.

ఉ॥ ఏను భవత్కథామణుల నెన్నెడు పట్ల మదీయసూక్తిసంతానము మాధురీగుణవితానముఁ జెందిపొసగుఁ గాతనా । మానసవృత్తి నీదు సుకు మారకిశోరవయోవిహారములు ల్లౌని పరించునట్టులతిలోలతఁ గాంచి మెలంగుఁ గావుతన్॥

తా॥ నావచనంబులు నీగోవర్ధనోద్ధరణాదివైభవంబుల నతిమాధుర్యంబుగ నతిశ యించుంగాక నామనోవ్యాపారంబులు నీబాల్యంబున నతిచాపల్యంబునంబొందుఁ గాక యనుట.

శ్లో॥ యాని త్వచ్చరితామృతాని రసనాలేహ్యాని ధన్యాత్మనాం । యే వా శైశవచాపలవ్యతికరా రాధాపరాధోన్ముఖాః । యా వా భా వితవేణుగీతిగతయో లీలాముఖామ్భోరుహే । ధారావాహిక యా వహన్తు హృదయే తాన్యేవ తాన్యేవ మే॥

టీక॥ ధన్యాత్మనాం- కృతార్థమనస్కులయొక్క, రసనాలేహ్యాని- రసనాజి హ్వలకు- లేహ్యాని, లేహ్యవిశేషములయిన- త్వచ్చరితామృతాని, త్వత్- నీయొక్క, చ రితామృతాని - అమృతమువంటిచరిత్రములు, యాని - ఏవిగలవో, రాధాపరాధోన్ము ఖాః- రాధా, రాధవిషయమయిన- అపరాధ, అపరాధములే- ఉన్ముఖాః, మొదలుగా గలవి- శైశవచాపలవ్యతికరాః, శైశవ- బాల్యమందలి, చాపల- చాపల్యముచేత, వ్య తికరాః- ఉద్వృత్తములు, యే వా- ఎన్నిగలవో, లీలాముఖామ్భోరుహే- లీలా, విలా సయుతమయిన- ముఖామ్భోరుహే, ముఖకమలమందు- భావితవేణుగీతిగతయః, భావి

త- పుట్టుచున్న, వేణుగీతి- వేణుగానము యొక్క, గతయః- భేదములు, యూవా - ఏవి గలవో, తాస్త్వేవతాస్త్వేవ- అవియే అవియే, మే- నాయొక్క, హృదయే-హృదయమందు ధారావాహికయా- ధారారూపముచేత, వహంతు- ప్రవహించుగాక.

మ॥ అలరుఙ్ధన్యుల కేకథామృతము జిహ్వఙ్ లేహ్యమే బాల్యచా । పల ముల్ రాధకు నెయ్యమౌంగినుక నాపాదించు నేయందము । ల్వేలయున్నోము న వేణుకానకలన స్వేమూఱు నా దివ్యచ । ర్యలెనా మానసవీథి వేడెదను ధారా శంబు గానిల్వఁగఙ్॥

తా॥ కృతార్థులనాలుకల లేహ్యంబుంబోలె నుండునీ చరితామృతంబులెవ్వియో రాధకు ప్రియంబున పరాధంబునుం జేయునీ చాపల్యోద్రేకము లెవ్వియో విలాసయుతంబగు నీ హాస్యామృంబా మరయందుంబొడమిన వేణుగాన ప్రభేదంబులెవ్వియో యవియవి నామనంబు ధారారూపంబుగఁ బ్రవహించుచుండుగాకయనుట.

శ్లో॥ భక్తిస్త్వయిస్థిరతరా భగవఙ్ యదిస్యాద్దైవేనసఃఫలితదివ్య కిశోరవేషే। ముక్తిస్స్వయంముకళితాంజలి సేవతేస్మాఙ్ ధర్మార్థకామగతయస్సమయప్రతీక్షాః॥

టీక॥ హేభగవఙ్- షడ్గుణైశ్వర్యసంపన్నుడవైన యో శ్రీకృష్ణా, నః - మాయొక్క, దైవేన- అదృష్టవిశేషముచేత, ఫలితదివ్యకిశోరవేషే- ఫలిత, స్వఫలముచే సంపాదింపబడిన- దివ్య, అసాధారణమైన- కిశోరవేషే, బాలవేషముగల- త్వయి, నీయందు భక్తిః, భక్తి- స్థిరతరా, మిక్కిలి దృఢమయినది- యదిస్యాత్, ఆయెనా- ముక్తిః, మోక్షము- ముకుళితాంజలిః, ముకుళిత- మోడ్చఁబడిన, అంజలిః- దోయిలిగలదియై, అస్మాఙ్- మమ్ము, సేవతే- సేవించుచున్నది, ధర్మార్థకామములయొక్క, గతయః - సంచారములు, సమయప్రతీక్షాః- సమయ, అవసరమును- ప్రతీక్షాః, కోరుచున్నవి.

ఉ॥ గోపకుమారవేషమునఁగూడిన నీయెడ భక్తి దైవసం। ప్రాపితమయి మదిఙ్ దృఢతరంబుగ నిల్చిన ముక్తికన్యనా। దాపునఁ గేలుమోడ్చి సతతంబును గొల్వఁగఁ వేళఁజూచు మమ్మేపున బిచ్చివిచ్చలుప సేచిన ధర్మమునర్థకామముఙ్॥

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుడవైన యో కృష్ణ నా భాగ్యంబున గోపాలవేషంబూనిన నీయందత్యంత భక్తి గలిగినట్లుల య్యేనేని ముక్తికాంత కేల్మోడ్పుతోడ నెవ్వడునన్ను సేవించుచునుండు ధర్మార్థ కామంబులు నాయవసరంబుఁ గాంక్షించుచునుండుగాన నీయందలి భక్తిగలిగిన సైద్ధియు నాకు దుర్లభంబు లేదనుట,

శ్లో॥ జయజయజయ దేవదేవదేవ త్రిభువనమంగళదివ్యనామధేయ।
జయజయజయ బాలకృష్ణదేవ శ్రవణమనోనయనామృతావతార॥



టీక॥ శ్రవణమనోనయనామృతావతార- శ్రవణ, కర్ణములకును- మనః, మనస్సునకును- నయన, నేత్రములకు- అమృత, అమృతమువలె, అవతార - ఆవిర్భావము, హేదేవ- ఓకృష్ణ, జయజయజయ- సర్వోత్కర్షముగావర్తింపుము, త్రిభువనమఙ్గళదివ్యనామధేయ- త్రిభువన, ముల్లోకములకు- మఙ్గళ, శుభప్రదమయిన- దివ్య, అనితరసాధారణమయిన- నామధేయ, నామములుగల- హేబాలకృష్ణ, ఓబాలకృష్ణుండ- జయజయజయ, సర్వోత్కర్షముగావర్తింపుము- దేవదేవ, దేవ- దేవతలకు, దేవ- దేవుడైన, హేదేవ, ఓకృష్ణ- జయజయ, సర్వోత్కర్షముగావర్తింపుము.

చ॥ జయజయ దేవకృష్ణ రిపుసైన్యమహాద్రితిభేదకృద్ఘనం। జయజయ కారణాభువనసన్నుతమంగళనామధేయసం। జయజయబోధసాధక వచశ్శ్రుతినేత్రమనోమనోహరా। జయజయ విశ్వజన్మలయశాసన గాఢతమో నిరాసనా॥

తా॥ శ్రోత్రంబులకు నేత్రంబులకు మనంబునకు నమృతంబువలె సుఖంబుఁ జేయునుద్భవంబుగలిగి ముల్లోకంబులకును శోభనకరంబులగు మనితరాసాధారణంబులగు దివ్యమంగళనామంబులుగలిగి దేవదేవుండవై వెలయుచున్న యోకృష్ణా సర్వోత్కృష్టుండవయి యుండుమనుట.

శ్లో॥ తుభ్యంనిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేన విభూషితేషుసుకృతాంభావేషునిర్భాసతే। శ్రీమద్గోకులమండనాయమహతేవాచాంవిదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయమహసేకస్మైచిదస్మైనమః॥

టీక॥ నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేన-నిర్భర, అతిశయమయిన- హర్షవర్ష, సంతోషవర్షముచేత- వివశావేశ, బాహ్యశూన్యతయందు, స్ఫుట- వ్యక్తమగునట్లుల, అవిర్భవత్- పొడముచున్న, చాపల్యేన- చపలతచేత, విభూషితేషు- అలంకరింపఁబడిన, సుకృతాం- ధన్యులయొక్క, భావేషు-మనోవ్యాపారములయందు- నిర్భాసతే, మిక్కిలి ప్రకాశించుచున్నవాఁడును- శ్రీమద్గోకులమండనాయ, శ్రీమత్- సంపత్కరమయిన, గోకుల- గోసమూహమునకు, మండనాయ - అలంకారమయినవాడును, మహతే- వ్యాపకుడైనవాడును, వాచాం- ఉపనిషత్తులకు, విదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయ- విదూర, మిక్కిలి దూరమయిన- స్ఫురత్, ప్రకాశించుచున్న- మాధుర్య, సౌందర్యమనియెడి. ఏక, ముఖ్యమయిన- రస, రసమునకు-అర్ణవాయ, సముద్రుఁడయినవాడును- కస్మైచిత్, చెప్పనలవిగాని- అస్మై, ఈయెదురనున్న- మహసే, తేజోరూపుఁడైనవాడునయిన- తుభ్యం, నీకొఱకు- నమః, నమస్కారము.

శా॥ ఆనందంబున బాహ్యముల్ మఱచియాత్మారామలీలారతిన్। ధ్యాను ల్గొల్వంగ ముంగలన్నిలిచి వాచాగోచరంబై యశో। దానందాంగణరత్నమయి మధురిమాధారార్ణవంబైన నేం। దేన బ్రోజ్వలమట్టి తేజమున కెంతే మ్రొక్కువన్ మ్రొక్కెదన్॥

తా॥ సంపూర్ణంబగు సంతోషవశంబుచే బాహ్యంబు మఱచి వ్యక్తంబగు నటు లంబాడమ బాహ్యంబునే నలంకరింపబడిన ధన్యులమనంబుల బ్రకాశించుచుం గోకులంబున నలంకరించుచు నుపనిషద్గమ్యంబయ్యు మధురంబగు సౌందర్యాది గుణసముదయంబనుర్థ సంబున కర్ణవుండయి యవాఙ్మనసగోచరుండయి యీ ముంగలం గానుపించు తేజోరూపుడవగు నీకో అను మ్రొక్కెదననుట.

శ్లో॥ ఈశానదేవచరణాభరణేన నీవి దామోదరస్థిరయశస్తబకో
ద్గమేన। లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ కర్ణామృతం వహతు క
ల్పశతాంతరేఽపి॥

టీక॥ దేవ- దేవుడవైన, హేకృష్ణ- ఓకృష్ణ, ఈశానదేవచరణాభరణేన, ఈ శానదేవ- శివునియొక్క, చరణ- పాదములే, ఆభరణేన- భూషణము గాంగలవాడును, నీవిదామోదరస్థిరయశస్తబకోద్గమేన- నీవి, మూలధనమైన- దామోదర, శ్రీకృష్ణమూ ర్తియొక్క- స్థిర, నిశ్చలమయిన- యశః, కీర్తియనియెడి- స్తబక, పువ్వులగుత్తియందు- ఉద్గమేన, ఉన్ముఖుడయిన- లీలాశుకేన, పోష్యశుకంబుబోని లీలాశుకునిచేత - రచితం, రచియింపబడిన శ్లోకసమూహము - కల్పశతాంతరేఽపి, ఎప్పుడును- తవ, నీకు- కర్ణామృతం- కర్ణ, చెవులకు- అమృతం, అమృతమై- వహతు, పొందుగాక.

మ॥ ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షుసంసేవయుం। గలలీలాశుకవాక్యముద్దెసుంగునన్ గర్ణామృతఖ్యాతిగా। నలరం జేసితి వెల్లప్రూ డిమణి పెద్దామాత్య వెంగన్ననే। నలరుందోయిలిమాడ్కిం గైకొనుము కృష్ణాక ల్పసంస్థాయిగన్॥

తా॥ ఓయి శ్రీకృష్ణ శివుని పాదంబులాభరణంబుగ ధరియించియనంగ శివుని యందలి ద్వేషంబు తనకు లేదనుట దామోదరుండైన నీ కీర్తియనియెడి యలరులగుత్తియందు ఫలాపేక్షచే బోష్యశుకంబుం బోలెవెలయు లీలాశుకుని చేరచియింపంబడిన శ్లోకసమూహంబు నీకర్ణంబులకమృతంబగుచుం గల్పశతంబుల పర్యంతంబను శాశ్వతంబుగ వహించుం గాతయనుట.



మాలిని॥ తనుజితజలవాహా దారితశ్వేతవాహా। జననకృతతమోహా శాంతదుర్దాంతమోహా। యనఘగుణసమూహా యాతభారస్సక్షమూహా। వినతవియగేహా వేంకటాహార్యగేహా॥

మ॥ ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపావీక్షాత్తసారస్వతా। భ్యుదయ శ్రీవిభవప్రసిద్ధచిదచిద్వ్యోభైకతత్త్వమాశాంతిస। త్పదయాభూషణవెల్లప్రూడి మణిపెద్దామాత్య వెంగాగ్రణీ। గదితాశ్వాసము పొల్పుం బ్రాథమికమై కర్ణామృత శ్రీకృతిన్॥ ... ... ... ... ... ※

శ్రీకృష్ణకర్ణామృతము- ప్రథమాశ్వాసము
ముగిసెను.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణకర్ణామృతము,—ద్వితీయాశ్వాసము.

శ్లో॥ అభినవనవనీతస్నిగ్ధమాపీతదుగ్ధం దధికణపరిదిగ్ధం ముగ్ధమం
గం మురారేః। దిశతు భువనకృఛ్రచ్ఛేది తాపింఛగుచ్ఛచ్ఛవి న
వశిఖిపింఛాలాంఛితం వాంఛితం నః॥

టీక॥ అభినవనవనీతస్నిగ్ధం- అభినవ, మిక్కిలి నూతనమైన- నవనీత, వెన్నచే స్నిగ్ధం, స్వచ్ఛమయినట్టిదియు- ఆపీత, పానముచేయంబడ్డ- దుగ్ధం, క్షీరముగలదియు- ద ధికణపరిదిగ్ధం- దధి, పెరుగుయొక్క- కణ, బిందువులచేత- పరిదిగ్ధం, అంతట బూయబ డినయదియు, తాపింఛగుచ్ఛచ్ఛవి- తాపింఛ, కానుగుచెట్టుయొక్క- గుచ్ఛ, పువ్వుల గుత్తుయొక్క- చవి, కాంతివంటికాంతిగలదియు- నవశిఖిపింఛాలాంఛితం, నవ- నూత నమైన, శిఖిపింఛ- నెమలిపురిచేత, ఆలాంఛితం- లెస్సగానలంకరింపబడినయదియు, భు వనకృఛ్రచ్ఛేది- భువన, లోకములయొక్క- కృఛ్ర, ఉపద్రవములను- ఛేది, పోనడు వసమర్థమునైన- మురారేః, శ్రీకృష్ణమూర్తియొక్క- ముగ్ధం, సుందరముయిన- అం గం, శరీరము- నః, మాయొక్క- వాంఛితం, అభీష్టార్థమును- దిశతు, ఇచ్చుగాక.

శా॥ తాపింఛచ్ఛవియై విసిలనవనీతస్నిగ్ధమై ముగ్ధమై। యాపీతామలదు

గ్ధమైదధికర్దమైకాదిగ్ధమైలోకకృ। త్పాపచ్ఛేదకమైవిశాలశిఖిపింఛాలాంఛితంబైన
శ్రీ।గోపాలప్రభుమూర్తివాంఛితమొసంగున్మాకున్శ్రాంతముక్॥

తా॥ క్రొత్తయగు వెన్నచేనచ్చంబగుచు బానంబుచేయబడినక్షీరంబుగలిగిదధికర్దమంబులచేతఁబూయఁబడినదియై లోకంబులయుపద్రవంబులఁబోనడువ సమర్థంబై కానుగుపువ్వులకాంతివంటి కాంతిగలదియై నెమలిపురిచేనలంకరింపబడినదియై సుందరంబయిన శ్రీకృష్ణుని శరీరంబుమాకఖిలాభీష్టంబుల నిచ్చుంగాకయనుట.

శ్లో॥ యాందృష్ట్వాయమునాంపిపాసురనిశంవ్యూహోగవాంగా
హతేవిద్యుత్వానితినీలకంఠనివహో యాంద్రష్టుముత్కంఠతే
ఉత్తంసాయతమాలపల్లవమితిచ్ఛిన్దన్తియాంగోపికాః కాన్తిః
కాళియశాసనస్యవపుషస్సాపావనీపాతునః॥

టీక॥ పిపాసుః-పానముచేయనిచ్ఛయించుచున్న, గవాం- గోవులయొక్క-వ్యూహః, సమూహము- యాం, ఏకాంతిని- యమునాం, యమునానదినిగా- దృష్ట్వా, చూచి- అనిశం, ఎప్పుడును- గాహతే, ప్రవేశించుచున్నదియో- నీలకణ్ఠనివహః, నీలకంఠ-నెమళులయొక్క, నివహః- సమూహము, యాం- ఏకాంతిని, విద్యుత్వానితి- మేఘమునుగా, ద్రష్టుం - చూచుకొఱకు, ఉత్కంఠతే- సంతోషమును జేయుచున్నదియో, గోపికాః- గోపికలు, యాం- ఏకాంతిని, తమాలపల్లవమితి- తమాల, నల్లకానుగుచెట్టుయొక్క- పల్లవమితి, చిగురునుగా- దృష్ట్వా, చూచి- ఉత్తంసాయ, శిరోభూషణముకొఱకు- ఛిన్దంతి, ఛేదింపఁదలంచుచున్నారో- కాళియశాసనస్య, శ్రీకృష్ణమూర్తియొక్క- వపుషః, శరీరముయొక్క- సా, ఆప్రసిద్ధమయిన- పావనీ, పావనమువయిన- కాంతిః- కాంతి- నః, మంమునం- పాతు, పరిపాలించుగాక

చ॥ అనిశము యామునాంబువిపియాసనెదమంచును గోగణంబు।లెల్లను జొరబచ్చి సబ్బుకలువలాహమచును వేడుకతోడ। గన్గొనఁగఁదమాలపల్లవముకోఁ గ్వరకౌననిగోపకామినుల్। చినుమగనొప్పుకృష్ణుని విశేషతనుద్యుతినన్ను బ్రోవుతన్॥

తా॥ గోసమూహంబునం నెమళులపిండును శ్వేతలునేకాంతింగనంగానియమునానదియనియు మొగుళులగుంపనియుం గానుగు చిగుళ్ళనియు మనంబులందలంచి త్రావ నుం జూడనుం జిదుమనుం గమకించునో యట్టి శ్రీకృష్ణుని నెంమేనిచాయ నన్నుం బ్రోచుగాకయనుట.



శ్లో॥ దేవఃపాయాత్పయసివిమలేయామునేమజ్జతీనాం యాచన్తీనా
మనులయపదైర్వఞ్చితాన్యంశుకాని। లజ్జాలోలైరలస విలసైరు
న్మిషత్పఞ్చబాణైర్గోపస్త్రీణాంనయనకుసుమైరర్చితఃకేశవోనః।

టీక॥ విమలే- నిర్మలమయిన, యామునే- యమునానదిసంబంధమయిన, పయసి- నీటునం, మజ్జతీనాం- స్నానముచేయుచున్నవారున్, వఞ్చితాని- దాచఁబడిన, అంశుకాని- వస్త్రములను, అనునయపదైః- వినయపుమాటలచేత, యాచంతీనాం - యాచించుచున్నవారునగు, గోపస్త్రీణాం- గోపికలయొక్క, అలసఃలసైః- అలస, సౌమ్యముగలుగుటచే- విలసైః, ప్రకాశించుచున్న- లజ్జాలోలైః, లజ్జా- సిగ్గుచేత, లోలైః- చంచలములయినవియు, ఉన్మిషత్పఞ్చబాణైః - ఉన్మిషత్, ఆవిర్భవించుచున్న - పంచబాణైః- మన్మథుఁడుగలవియును, నయనకుసుమైః- నయన, నేత్రములనియెడి- కుసుమైః, పువ్వులచేత- అర్చితః, పూజింపబడిన - కేశవః, శ్రీకృష్ణమూర్తి - నః, మంమునం- పాయాత్- రక్షించుగాక.

ఈశ్లోకముగోపాలకృష్ణమంత్రరాజమందలి వస్త్రాకర్షణ
ప్రయోగధ్యానమనిసనత్కుమారసంహితయందు జెప్పంబడియున్నది॥

శ్లో॥ కదమ్బవృక్షమారూఢంగోపీవస్త్రాపహారిణం।కృష్ణంధ్యాత్వా
ర్ధరాత్రేతుజపేమమన్త్రంసహస్రకం। దశరాత్రజపాదేవ
మాకర్షేన్నాగకన్యకాం।కన్యకాస్త్రీదశాదీనాంకింపునర్మర్త్య
యోషితః॥

మ॥ యమునావేణికయందుగోపికలునీరాడన్స్వకీయాంశుకౌ।ఘముఁలందాచగసిగ్గుచేమృదులవాక్యప్రౌఢితోవేడుకన్। సముదంచన్మదనాలసోల్లసనిరీక్షానీలనీరేజమా।ల్యములన్వారలుపూజచేయఁబడునయ్యబ్జాక్షునిన్బూచెదన్॥

తా॥ నిర్మలంబగుయమునోదకంబుననోలాడుచుదాచఁబడినచేలంబులనను నయవచనంబులచే వేడుకొను శ్వేతలయొక్క లజ్జయనియెడియుపాధివలనఁ జంచలంబులయి మన్మథోద్దీపకంబులయియలసంబులయివిలసిల్లుకన్నుదామరలచేనర్పింపఁబడుశ్రీకృష్ణుండు నన్నురక్షించుగాకయనుట.

శ్లో॥ మాతర్నాతఃపరమనుచితంయత్కలానామ్పృగస్తాదముదశ
ఖరాంజఠరపిటరీపూర్తయేనార్తితాసి।తత్త్వన్త్వంసహజసర
ళేవత్సలేవాణికుర్యాంప్రాయశ్చిత్తంగుణగణనయాగోపవేశస్య విష్ణోః॥

టీక॥ సహజసరళే- సహజ- స్వభావమయిన, సరళే- ఋజుహృదయముగలదియు

మాతః, తల్లి యైనదియు- వత్సలే, దయావతి యైనదియునగు- హేవాణి, ఓసరస్వతీ- జఠరపీఠరీపూర్తయే, జఠర- ఉదరమనియెడి, పీఠరీ- పనటియొక్క, పూర్తయే- పూరణముకొఱకు, ఖలానాం- దుర్జనులయొక్క, పురస్తాత్ - ముందరను, అస్తాశఙ్కం సందేహము లేనటుల - మయా, నాచేత - నతిర్నతాసీయత్, నతర్నమును బొందింపబడితి వనుచు దియే దికలదో- అతః, ఇంతకన్నను- పరం, అన్యము- అనుచితం. ఉచితము కానిది- నాస్తి, లేదు- తత్, అది- క్షంతవ్యం, సహింపదగినది - గోపవేషస్య, గోపాలవేషముగల- విష్ణోః, శ్రీకృష్ణమూర్తియొక్క- గుణగణనయా, గుణకీర్తనము చేత. ప్రాయశ్చిత్తం, నిష్కృతిని - కుర్యాం, చేయుచున్నాను,

ఉ॥ ఉదరము నించ గోరిఖలులుండెడె తావులు చేరి వారితో వైదుటనశంకనిన్ను నటియింపగ జేసిన పాతకంబులన్ । సదయత నోర్వఁగావలెఁ బ్రసన్నమతి న్ననుఁగన్న గల్లి, శా। రదయదువంశనాయకునిఁ బ్రస్తుతినిష్కృతి నేనొనర్చెదన్॥

తా॥ స్వభావసిద్ధంబగు బుభుక్షత్వంబు గలిగిన నిమిత్తంబున మదీయ ప్రార్థనంబు విఫలంబు చేయనోపకయుండి జగంబులకెల్ల దల్లి యైనకతంబున నాకుందలియై యత్యంత దయావతి యైమదీయ వాగ్రూపంబునంబరిణమించిన యో సరస్వతీ దుర్జనులయెదుటనిను నతర్నంబు చేయించిన పాతకంబు సహింపవలయు నింక శ్రీకృష్ణునిగుణకీర్తనంబునం దత్పాప ప్రాయశ్చిత్తంబుఁ జేయుచున్నాననుట.

శ్లో॥ అఙ్గుళ్యగ్రైరరుణకిరణైర్ముక్తసంరుద్ధరన్ధ్రం వారంవారం వదనమరుతా వేణుమాపూరయన్తమ్। వ్యత్యస్తాఙ్ఘ్రిం వికచకమలచ్ఛాయవిస్తారనేత్రం వన్దే బృన్దావనసుచరితం నన్దగోపాలసూనుమ్॥

టీక॥ అరుణకిరణైః-అరుణ- ఎఱ్ఱనైన, కిరణైః- మయూఖములుగల, అఙ్గుళ్యగ్రైః- వ్రేలికొనలచేత, ముక్తసంరుద్ధరన్ధ్రం- ముక్త, విడువబడినదియు- సంరుద్ధ, కప్పబడుచున్నదియునగు- రంధ్రం, వివరముగలిగినటుల- వేణుం, పిల్లనగ్రోవిని-వదనమరుతా, ముఖవాయువు చేత- వారంవారం, మాటిమాటికిని- పూరయన్తం- నిండింపజేయుచున్నవాడును, వ్యత్యస్తాఙ్ఘ్రిం- వ్యత్యస్త, వ్యత్యయములయిన- అఙ్ఘ్రిం, పాదములుగలవాడును- వికచకమలచ్ఛాయవిస్తారనేత్రం, వికచ- వికసించిన, కమల- తెల్లదామరతేకులయొక్క, ఛాయ- కాంతివంటి కాంతిగల, విస్తార- విశాలములయిన, నేత్రం - కన్నులుగలవాడును, బృన్దావనసుచరితం- బృన్దావన, బృన్దావనమందు- సుచరితం, శోభనసంచారముగల- నన్దగోపాలసూనుం, నన్దగోపాల - నందునియొక్క, సూనుం-కుమారుఁడైన శ్రీకృష్ణమూర్తిని గూర్చి- వన్దే, నమస్కరించుచున్నాను.



మ॥ అరుణశ్రీదళుకొత్తనంగుళులనొయ్యన్ గప్పుచున్విప్పుచున్ । స్ఫురళీరంధ్రములాస్యమారుతమునం బూరించునొయ్యారుఁడై । చరణద్వంద్వము మార్పడన్నిలుచుకం జాతాయతాలోకశోభా। సురబృందావనమందిరాంతరచరిష్ణుం గృష్ణుఁ గీర్తించెదన్॥

తా॥ కెంపుసొంపులం దేజరిల్లునంగుళాగ్రంబులవేణురంధ్రంబులంగప్పుచును విప్పుచును ముఖమారుతంబున సారెసారెకును వేణువుం బూరించుచు వామదక్షిణపాదంబుల దక్షిణవామభాగంబుల దనరం బృందావనంబున జరియించు గోపాలకృష్ణునిం గూర్చి మ్రొక్కుచున్నాననుట. ... ... ... ... *

శ్లో॥ మందం మందం మధురనినదైర్వేణుమాపూరయన్తం బృన్దం బృన్దావనభువి గవాం చారయన్తం చరన్తమ్। ఛన్దోభాగే శతమఖముఖధ్వంసినాం దానవానాం హన్తారం తం కథయ రసనే గోపకన్యాభుజఙ్గమ్॥ ౬

టీ॥ మధురనినదైః మధుర- మనోహరములయిన -నినదైః- ధ్వనుల చేత- మందం మందం మెల్ల మెల్లన- వేణుం- పిల్లనగ్రోవిని - ఆపూరయన్తం - నిండింపజేయుచున్నవాడును- బృన్దావనభువి- బృన్దావనప్రదేశమందు- గవాం- గోవులయొక్క- బృన్దం- సమూహమును- చారయన్తం- సంచరింపజేయుచున్నవాడును- ఛన్దోభాగే- వదైకదేశమయిన వేదాంతమందు- చరన్తం- సంచరించుచున్నవాడును- శతమఖముఖధ్వంసినాం- దేవేంద్రుడు మొదలగువారలనడచుచున్న- దానవానాం- దనుజులను- హన్తారం, నాశనము జేయుచున్నవాడును- తం- ఆప్రసిద్ధుఁడైన- గోపకన్యాభుజఙ్గం- గోపికావిటుండైన కృష్ణుని- హే రసనే- ఓనాలుకా, కథయ, కీర్తింపుము. ... ...

శా॥ బృందారణ్యతటప్రదేశముల గోబృందంబులన్ మేపుచున్ । స్పందంబౌ మధురధ్వనిన్ మురళిబల్మాఱున్ వినోదింపుచున్ । ఛందోవీథి జరించుచున్ విమతరక్షస్తోమవిధ్వంసనా । నందుండైన వ్రజాంగనావిటుం బ్రసజ్ఞా ప్రజ్ఞ గీర్తింపుమా॥ *

తా॥ మనోహరంబులగు నాదంబులచే మెల్ల మెల్లన వేణువు నిండింపజేయుచు బృందావనంబున గోగణంబులను మేపుచును వేదాంతవీథుల జరియించుచు నెల్ల దానవులం బోనడుచుచు లోకప్రసిద్ధుండై వెలయు గోపికావిటుని నో నాలుకా కీర్తింపుమనుట.

శ్లో॥ వేణీమూలే విరచితఘనశ్యామపింఛావచూడో విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధపీతామ్బరేణ। మామాలిఙ్గన్ మరకతమణిస్తమ్భగమ్భీరబాహుః స్వప్నే దృష్టస్తరుణతులసీభూషణో నీలమేఘః॥ ౭

టీ॥ శేణిమూలే, వేణీ, కేశబంధవిశేషముయొక్క, మూలే- మొదటను- విరచితఘనశ్యామపింఛావచూడః- విరచిత- ఉంచఁబడిన దియు, ఘన, మేఘమువలె- శ్యామ-నల్లనైన-పింఛ- నెమలిపుర్రి, అవచూడః- శిరోభూషణముగగలవాడును- స్నిగ్ధపీతాంబరేణ- స్నిగ్ధ- స్వచ్ఛమయిన-పీతాంబరేణ-పీతాంబరము చేత, విద్యుల్లేఖావలయితః-విద్యుత్, మెఱుపులయొక్క- లేఖా, పంక్తిచేత, వలయితః, చుట్టుకొనబడిన-నీలమేఘఇవ- నీలమేఘము వలెనున్నవాడును- మరకతమణి స్తంభగంభీరబాహుః, మరకతమణి- ఇంద్రనీలమణివికారమైన- స్తంభ- స్తంభమువలె-గంభీర-గంభీరములయిన- బాహుః- బాహువులుగలవాడును. తరుణతులసీభూషణః, తరుణ- లేతయగు-తులసీ, తులసీమాలిక-భూషణః- అలంకారముగాగలిగినవాడునైన శ్రీకృష్ణమూర్తిః- మాం, రుక్మిణీదేవిని- ఆలింగన్- కౌగలించినవాడగుచు, స్వప్నే, స్వప్నమందు- మయా- నాచేత-దృష్టః- చూడఁబడెను. ❋

ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణషోడశాక్షరమంత్రధ్యానంబని
సనత్కుమారసంహితయందు జెప్పంబడియున్నది.

శ్లో॥ వామాంకస్థితయా వామపాణిపద్మస్థపద్మయా పద్మావతా
రయాశ్లిష్టం రుక్మిణ్యా కనకాభయా। హారం తాపిఞ్ఛయమాసీ
నాం కాంచనాంబుజే। ఆశ్లిష్యంతం ప్రియం దేవ్యా ఘలోద్యద్వా
మపాణినా। సౌవర్ణవేత్రవిరసద్దక్షపాణితలం స్మరేత్। పీతా
మ్బరధరం దివ్యం భూషామాలావిభూషణం॥ ❋

చ॥ అలరు మెఱుంగురంగుగల హాటకశాటిక మాళిపాళిభా। సి
లునవపింఛకంబు తులసీదళదామము గల్గినట్టి మేఘలలితమూర్తి
మానిక పుగంబనుబోని భుజద్వయంబుచే। నలమిర మావధూ
టి జెలువందగలన్ననుపించె నింపుగన్॥ ❋

తా॥ తొలుకాఱు మెఱుంగు రంగులందెగడు బంగరువలెవాటును మాళితలంబునంగనుపట్టు నెమలిపురియును తులసీదామంబునుం గలిగినీల మేఘంబుబోలిన శ్రీకృష్ణమూర్తి నీలంపుకంబంబులం దెగడు బాహుయుగళంబుచే రుక్మిణి గౌగిలించుకొనినా స్వప్నంబునం గానంబడియె. ❋

శ్లో॥ కృష్ణే హృత్వా నిచయనిచయం కూలకుంజాధిరూఢే ముగ్ధా
కాచిన్ముహురనునయైః కిన్త్వితి వ్యాహరంతీ। సభ్రూభంగం సద
రహసితం సత్రపం సానురాగం ఛాయాశౌరేః కరతలగతాన్య
మ్బరాణ్యాచకర్ష॥ ౭

టీ॥ నిచయనిచయం- నిచయము, వస్త్రములయొక్క- నిచయం- సమూహమును, హృత్వా-



హరించి, కృష్ణే- శ్రీకృష్ణమూర్తి- కూలకుంజాధిరూఢే- కూల- యమునాతటమందలి, కుంజ పొదయందు- అధిరూఢేసతి- ఎక్కినవాడగుచుండగా, కాచిత్- ఒకానొకతయైన, ముగ్ధా- ముగ్ధ, ముహుః, మాటిమాటికిని, అనునయైః- ప్రియవచనములచేత- కిన్త్వితి- ఏమి ప్రయోజనమని, వ్యాహరంతీ- చెప్పుచున్నది, సభ్రూభంగం- భ్రూముడితోగూడి నటులను- సదరహసితం- చిరునగవుతోగూడినటులను, సత్రపం- సిగ్గుతోడగూడినటులను. సానురాగం, అనురాగములోగూడినటులను- ఛాయాశౌరేః- శ్రీకృష్ణఛాయయొక్క- కరతలగతాన్ని కేలనున్న, అంబరాణి, వస్త్రములను- ఆచకర్ష- లాగెను, ౭

ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణమంత్రరాజవస్త్రాకర్షణప్రయోగ
ధ్యానమని గోపాలకల్పమందు జెప్పంబడియున్నది.

శ్లో॥ కదంబవృక్షమారూఢం గోపీవస్త్రాపహారిణం। కృష్ణం ధ్యాత్వార్ధ
రాత్రే తు జపేన్మంత్రం సహస్రకం। దశరాత్రజపాదేవ మాకర్షేన్నా
కకన్యకాః। కన్యకాః స్త్రీదశాదీనాం కిం పునర్మర్త్యయోషితః॥ ౮

ఉ॥ కోకలు మ్రుచ్చిలించి తటకుంజగృహంబున నిల్వ సిగ్గునన్
భ్రూకుటి యొక్కదరస్మితనిరూఢయు ప్రేమము దోపగట్టుకన్।
రాక యిదేమి రాతగదురా యని ముగ్ధవధూటి నీటిలో జేకొన
బూనె నీడయగు చిన్నిముకుందుని చేతి చేలముల్॥ ❋

తా॥ వస్త్రసమూహంబుల నపహరించి శ్రీకృష్ణుండు యమునాతటంబునందున్న వృక్షముననధిరోహింపనొకముగ్ధ యమున గోపికప్రియవచనంబులనిదియేమి ప్రయోజనంబనినుడువుచు బొమముడియును చిఱునగవును సిగ్గును రాగంబునుం దెలుపుచు నీడయగు కృష్ణుని కరతలంబులందుండిన చేలంబుల నాకర్షించెనట. ❋

శ్లో॥ అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యో భవేయం తటభువి యము
నాయాస్తాదృశో వంశనాళః। అనుభవతి య ఏషః శ్రీమదాభీర
సూనోరధరమణిసమీపన్యాసధన్యామవస్థాం॥ ౯

టీ॥ పరస్మిన్, ఇతరమైన- జనుషి- జన్మమందు, ఆత్తపుణ్యః- ఆత్త- పొందబడిన- పుణ్యః- పుణ్యముగలవాడగుచు- యమునాయాః, యమునానదియొక్క- తటభువి- తీరదేశమందు- తాదృశః, శ్రీకృష్ణాధరమును బొంద యోగ్యమైన- వంశనాళః, వేణువు, భవేయమపి- అయిన బ్బటికిని- యఏషః, ఏయమునాతీరమందుబుట్టినయీ వేణువు- శ్రీమదాభీరసూనోః, శ్రీమత్, సంపత్కరుడైన- ఆభీరసూనోః- శ్రీకృష్ణమూర్తియొక్క, అధరమణిసమీపన్యాసధన్యాం, అధరమణి, మణిసంటి యధరముయొక్క, సమీప- ప్రాంతమందు- న్యాస- ఉంచుటచేత- ధన్యాం- కృతార్థమైన- అవస్థాం- దశను, అనుభవతి అనుభవించుచున్నది. ౯

ఉ॥ నందతనూజు మోవిరతనంబు సమీపము చేరి ధన్యతం। బొందె
గళిందజాతటము పొంత వసించిన వంశనాళమా। యెందము
గాంచు నా కొరు జనవాంతరమందియ శేషసత్క్రియా। బృంద
ము వెంటనంటిఫలమియ్యగ గోరుచు లపంటపండగన్॥ ✱

తా॥ శ్రీకృష్ణుని కెంమోవి రతనంబు పొంత జేరి యమునాతటంబునం బొడమిన వంశనాళంబు పవిత్రంబయ్యె నెనట్టుల జన్మాంతరంబున నైనయ శేషసత్కర్మఫలంబులచే నైనం బాదృశవంశనాళంబు పోల్కి కృతార్థత్వంబు నొందుదునా కో యని యొక ప్రేత మనంబునం దలంచెననుట. ✱

శ్లో॥ అయి పతరిచిను చేతః ప్రాతరంభోజనేత్రం కబరకలితచంచత్పింఛదామాభిరామమ్। వలభిదుపలనీలం వల్లవీభాగధేయం
నిఖిలనిగమవల్లీమూలకందం ముకుందమ్॥ ౧౦

టీ॥ ఏ చేతః, ఓ చిత్తమా - ప్రాతరంభోజనేత్రం - ప్రాతరంభోజ - ప్రాతఃకాలకమలము లనంటి - నేత్రం - కన్నులుగలవాడును - కబరకలితచంచత్పింఛదామాభిరామమ్ - కబర, సిగ యందు - కలిత - చుట్టబడి, చంచత్ - ఒప్పుచున్న - పిఞ్ఛదామ - నెమలిపురిదండచేత - అభిరామం, సుందరుడైనవాడును - వలభిదుపలనీలం, వలభిదుపల - ఇంద్రనీలమణివలె - నీలం - నీలవర్ణుడైనవాడును - వల్లవీభాగధేయం - వల్లవీ, గోపస్త్రీలయొక్క - భాగధేయం - భాగ్యస్వరూపుడైనవాడును - నిఖిలనిగమవల్లీమూలకందం - నిఖిల - సమస్తమైన - నిగమ - వేదములనియెడి - వల్లీ - తీవియలయొక్క - మూల - మొదటిదియగు - కందం - గడ్డయైనవాడును - ముకుందం - శ్రీకృష్ణమూర్తిని గూర్చి - పరిచిను - పరిచయము చేయుము. ౧౧

మ॥ లలితాంభోరుహనేత్రు గోపరమణీలావణ్యపాత్రున్ సము।
జ్జ్వలపౌరందరనీలగాత్రు గబరాంచత్పింఛలీలున్ వని।
శ్చలవేదావ్రతతాలవాలు మురళీసంగీతలోలుం డయా। నిలయున్నట్టి
మీరగోరి మనమా నిత్యంబు సేవింపుమా॥ ✱

తా॥ ఓ మనంబా దినముఖంబున బాలుచ్చు విరిదమ్మిరేకులం బోలికన్నుగవచె దేజరిల్లి సిగ యందునలంకరింపబడిన నెమలిపురిదండచె నభిరాముడగుచు నింద్రనీలరత్నంబులవలె నీలకాంతి గలిగి గోపస్త్రీభాగ్యరూపండై యెల్ల వేదంబులకు నాది కారణుండై వెలయు శ్రీకృష్ణమూర్తిం గూర్చి మిక్కిలి యుంబరిచయంబు జేయుమనుట. ✱

శ్లో॥ అయి మురళి ముకుందస్మేరవక్త్రారవిందశ్వసనమధురస
జ్ఞే త్వాం ప్రణమ్యాద్య యాచే। అధరమణి సమీపం ప్రాప్తవ
త్యాం భవత్యాం కథయ రహసి కర్ణే మద్దశాం నందసూనోః॥



టీ॥ ముకుందస్మేరవక్త్రారవిందశ్వసనమధురసజ్ఞే - ముకుంద, శ్రీకృష్ణమూర్తియొక్క - స్మేరవక్త్ర - నగుమొగమనియెడి - అరవింద, కమలముయొక్క - శ్వసన - నిశ్వాసమనియెడి - మధు - మకరందముయొక్క - రసజ్ఞే - రసము నెరింగిన - అయి మురళీ - ఓ వంశనాళమా - త్వాం - నిన్ను గూర్చి - అద్య, ఇప్పుడు - ప్రణమ్య - నమస్కరించి - యాచే, యాచించుచున్నాను - భవత్యాం - నీవు - అధరమణిసమీపం - అధరమణి - మణివంటి యధరమ్ముయొక్క - సమీపం - సమీపమును - ప్రాప్తవత్యాం - పొందుచుండగా, నందసూనోః - శ్రీకృష్ణమూర్తియొక్క, కర్ణే - చెవియందు - రహసి, ఏకాంతమున, మద్దశాం - నాయవస్థను - కథయ - చెప్పుమా. ౧౨

చ॥ హరియధరాంతికస్థలవిహారము నక్ స్మితపూర్ణవక్త్ర
తామరససమీరసీధుగసమ్మాధురి జెందిన నిన్నువేడెదన్। మురళి
రో నందసూను మదీయ లోహనగా జెవిదండనుండియో। వ్వరు
వినకుండ నాదు వలవంత సమస్తము దెల్పు మొక్కెదన్॥ ✱

తా॥ శ్రీకృష్ణుని నగుమొగంబు దామర బోడము నిట్టూర్పు తేనియ చవిసెరింగిన యో పిల్లనగ్రోవి నిను గూర్చి మ్రొక్కి వేడెద నీవు రతనంబు బోని యధరంబు సమీపంబున చేరిన యెడ శ్రీకృష్ణుని చెవియందేకాంతంబున నాయవస్థం జెప్పుమనుట. ✱

శ్లో॥ సజలజలదనీలం వల్లవీకేళిలోలం శ్రితసురతరుమూలం వి
ద్యుదుల్లాసి చేలం। నతసురమునిజాలం సన్మనోబింబలీలం సురరి
పుకులకాలం నౌమి గోపాలబాలం॥ ౧౩

టీ॥ సజలజలదనీలం, సజల - నీటితో గూడిన - జలద, మేఘమువలె - నీలం - నల్లనైనవాడును - వల్లవీకేళిలోలం, వల్లవీ - గోపస్త్రీలయొక్క, కేళి, సల్లాపాదులయందు, లోల - ఆసతో గూడినవాడును, శ్రితసురతరుమూలం - శ్రిత - ఆశ్రయింపబడిన - సురతరు - కల్పవృక్షముయొక్క, మూల, మొదలుగలవాడును, విద్యుదుల్లాసిచేలం, విద్యుత్ - మెఱుపువలె ఉల్లాసి, ప్రకాశించుచున్న, చేలం, వస్త్రములుగలవాడును, నతసురమునిజాలం - నత, నమ్రులైన - సుర, దేవతలయొక్కయు - ముని, మునులయొక్కయు, జాలం, సమూహముగలవాడును - సన్మనోబింబలీలం - సత్ - సత్పురుషులయొక్క - మనః, మనస్సులయందు - బింబ, ప్రతిబింబాకారముతో, లీలం, విలాసముగలవాడును - సురరిపుకులకాలం, సురరిపు - రాక్షసులయొక్క, కుల - వంశములకు - కాలం, యమప్రాయుడైనవాడును, గోపాలబాలం, గోపాలబాలుడునైన (కృష్ణుని) నౌమి, నుతించుచున్నాను.

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణ ద్వాదశాక్షరిమంత్ర
ధ్యానమని సనత్కుమారసంహితయందు జెప్పంబడియున్నది

శ్లో॥ ధ్యాయేత్తమల్పథురమాధం తాస్మణిపీఠాబ్జగం శుభమ్। కృష్ణపీతాంబరధరం శంఖచక్రకరాంబుజం। సించమానం సుధాకుంభైశ్శైరావణకరావృతైః। శక్రేణ శాంతదర్పేణ సన్నుతం తపసాత్తరాస్తూయమానం సురగణైః పుష్పవృష్టికరైర్దివి। సేవ్యమానంచ మునిభిస్సిద్ధసాధ్యైర్మహాత్మభిర్మహర్షిభిః॥ ౧౨

మ॥ సజలాంభోధర జాలనీలు విలసత్సౌదామినీ చేలునిన్। వ్రజ భామానస కేళిలోలుని సుపర్వద్వేషకృత్కాలునిన్। ద్విజరాడ్జ్యానసబింబలీలుని శ్రితాదిత్యద్రుమాపాలునిన్। భజియింతున్ మది గోపబాలు నత నానావ దేతాజాలునిన్॥ *

తా॥ నీరంబుతోడం గూడిన మొగులుం బోలెనల్లనయి గోపికలసల్లాపాది క్రీడలయందాసించుచు గల్పవృక్షమూలంబుననుండి మెఱుఁగుంబోని చేలంబు మఱ సర్వదానవవంశనాశకుండయిన దేవతలు మునులు భజియింప సత్పురుషుల యెదుట సాక్షాత్కరించుచు వెలుంగు గోపాలబాలుని నుతించుచున్నాననుట. *

శ్లో॥ అధరబింబవిడంబితవిద్రుమం మధురవేణువినాదవినోదినం। కమలకోమలకమ్రముఖాంబుజం కమపి గోపకుమారముపాస్మహే॥ ౧౩

టీ॥ అధరబింబవిడంబితవిద్రుమం, అధరబింబ-దొండపండువంటి యధరముచేత - విడంబిత- అపహసింపబడిన- విద్రుమం- పగడముగలవాడును, మధురవేణునినాదవినోదినం-మధుర- శ్రావ్యమైన, వేణునినాదః వేణునాదముచేత, వినోదినం-కాలము గడుపుచున్నవాడును, కమలకోమలకమ్రముఖాంబుజం, కమల-కమలమువలె-కోమల- మృదువైనదియు- కమ్ర,సుందరమైనదియునగు- ముఖాంబుజం-ముఖకమలముగలవాడును,కమపి- ఇట్టిదని చెప్పనలవిగానివాడునునగు-గోపకుమారం, శ్రీకృష్ణమూర్తిని-ఉపాస్మహే-ఉపాసించుచున్నాను. ౧౩

మ॥ మురళీనాదమధూళికాకలిత సంమోదున్ సుధాసారమేదురబింబాధరధూతవిద్రుమవినోదున్ రాధికాంఘ్రిద్వయా। వరలాక్షాలసమానఫాలతలు శ్రీవత్సాంకవక్షస్థలున్। సరసీజాతమనోహరాననుమదింజక్రాయుధుం గొల్చెదన్॥ *

తా॥ దొండపండువంటి కెంమోవి పవడంబును పహసింప శ్రావ్యంబగు వేణుగానంబున-గాలంబుగడుపుచు, గమలంబువలె మృదులంబును సుందరంబునయిన నెమ్మొగంబు మఱనిట్టివాడని చెప్పనలవిగాక వెలుఁగు గోపాలకృష్ణుని పాసించుచున్నాననుట. *



శ్లో॥ అధరేవినివేశ్య వంశనాళం వివరాణ్యస్య సలీలమంగుళీభిః। ముహురంతరయన్ ముహుర్వివృణ్వన్ మధురం గాయతి మాధవో వనాంతే॥ *

టీ॥ మాధవః-శ్రీకృష్ణమూర్తి- అధరే, కెంమోవియందు, వంశనాళం, వేణువు- నివేశ్య-ఉంచి-అస్య- ఈ వేణువుయొక్క- వివరాణి,రంధ్రములను-సలీలం, విలాసముతోడం గూడినటుల-ముహుః- పలుమఱు,అంగుళీభిః, వ్రేళ్ళచేత- అంతరయన్-కప్పుచు, వివృణ్వన్- విప్పుచును,వనాంతే-బృందావనమందు,మధురం-శ్రావ్యముగను,గాయతి- గానముచేయుచున్నాడు. ౧౪

ఉ॥ నెమ్మది యామునాంతర వనిన్ వసియించుచు గాపిమోవి సందమ్ముగ వంశిగీలొల్పిలిపి తద్వివరమ్ముల నంగుళీతతిం। గ్రమ్ముచు జిమ్ముచున్ ప్రీతిసుఖమ్ముగ గానముదాన మానముల్ దమ్ముని మ్రోయ జేయు రసికుం గను గొంటిరె కంటికింపుగన్॥

తా॥ అధరంబున వంశనాళంబునిలిపి రంధ్రంబుల వ్రేళ్ళచేమాటిమాటికిం గప్పుచు విప్పుచుం బృందావనంబున శ్రీకృష్ణమూర్తి వినసొంపగునటుల గానముం జేయుచున్నాడనుట.

శ్లో॥ వదనే నవనీతగంధవాహం వచనే తస్కరచాతురీధురీణమ్। నయనే కుహనాశ్రుమాశ్రయే థాశ్చరణే కోమలతాండవం కుమారమ్॥ ౧౫

టీ॥ వదనే, ముఖమందు-నవనీతగంధవాహం, నవనీత- వెన్నయొక్క-గంధ- పరిమళమును, వాహం- వహించుచున్నవాడును- వచనే- వాక్యమందు, తస్కరచాతురీధురీణం, తస్కర-దొంగయొక్క-చాతురి,చాతుర్యములయొక్క- ధురీణం, భారవహుండైనవాడును-నయనే-కన్నవయందు, కుహనాశ్రుం, కుహనా-అబద్ధమైన, అశ్రుం, కన్నీరుగలవాడును చరణే, పాదమందు, కోమలతాండవం, కోమల, మనోహరమయిన, తాండవం-నృత్యమునుగలవాడును- కుమారం- కుమారుడునైన కృష్ణుని, ఆశ్రయే,థా-సేవించుచున్నాను. ౧౫

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణైకదశాక్షరీమంత్ర ధ్యానమనసనత్కుమారసంహితయందు జెప్పఁబడియున్నది.

శ్లో॥ హరంతం నవనీతాదిచౌర్యేణ వ్రజయోషితామ్। గోపబాలైర్వృతం కృష్ణం ధ్యాయన్మంత్రమిమం జపేత్॥ ౧౬

ఉ॥ కమ్మని వెన్నవాసనముఖమ్మున ఘుమ్మనిసోడు ముట్టవాక్యమ్ము లచౌర్యనైపుణులు గన్పడ గన్నుగవన్ మృపాశ్రువుల్ గ్రిన్నరు గోపబాలకు ముకుందుని నామది నాశ్రయించెదన్॥ *

తా॥ నెమ్మొగంబున నవనీతగంధంబు వెలయమాటలయందు దొంగతనంపు చదురులు తోఁగఁగ కన్నుంగవమిథ్యాశ్రులొలుక నడుగుజాడల నాట్యంబు విహరిల్ల ద్రిమ్మరు గోపాలబాలుని నామనంబాయాశ్రయింపుమనుట. *

శ్లో॥ అమునాకిలగోపగోపనార్థం యమునారోధసినందనందనేన।
దమునావనసంభవః ప్లుషేనః కిమునాశౌశరణార్థినాం శరణ్యః॥

టీ॥ అమునా, ఈయగుపడుచున్న, నందనందనేన, శ్రీకృష్ణమూర్తిచేత, యమునారోధసి యమునాతటమందు, గోపగోపనార్థం, గోప, గోపాలకులయొక్క, గోపనార్థం, రక్షించుటకొఱకు, వనసంభవః వనమందుబొడమిన, దమునాః- పహనుడు, ప్లుషేకిల - పానముచేయబడియెనుగదా- అసౌ, శ్రీకృష్ణమూర్తి - శరణార్థినాం- శరణమునుబ్రార్థించుచున్న, నః- మాకు, శరణ్యః- రక్షకుడు, నకిము, కాడాయేమి. ౧

ద్విపాసమత్తేభము॥ యమునాతీరవనాంతసంజనితదావాగ్నిస్ఫు
టార్చిర్నికా।యమునానాజనభీకరంబగుచుడాయఁగ్రేలవేగాచు
నె। య్యాముఁనాయంబనిదానినానెసిటు నిత్యంబునఁగ్ హరిఁగ్ గుప్త
సం।యమునారాధనచేయువాకిఁభుడభీష్టావాప్తికాఁడండునే॥ ❋

తా॥ ఈకానంబడుచున్న శ్రీకృష్ణమూర్తిచేయమునాతటవనంబునగోపాలరక్షణంబుకొఱకు దావానలంబుపానంబుచేయంబడియెంగదా అట్టి ఈకృష్ణమూర్తిశరణాగతులమగుమమ్మింగావనేటులసమర్థుఁడుగాకపోవునసుట. ❋

శ్లో॥ జగదాదరణీయజారభావం జలజాపత్యవచోవిచారగ
మ్యం। తనుతాంతనుతాం శివేతరాణాం సురనాథోపలసుంద
రం మహోనః॥ ౧౪

టీ॥ జగదాదరణీయజారభావం, జగత్- లోకములచేత-ఆదరణీయ, అంగీకరింపదగిన-జారభావం, జారత్వములుగలదియు- జలజాపత్యవచోవిచారగమ్యం- జలజాపత్య-వతుర్ముఖునియొక్క, వచః- వాక్యములైనవేదాంతములయొక్క, విచార, సంచారములగలయుత్తరమీమాంసచేత-గమ్యం- తెలియదగినయదియూ- సురనాథోపలసుందరం, సురనాథోపల- ఇంద్రనీలమణివలె, సుందరం- సుందరమైనదియునైన, మహః- తేజము- నః, మాయొక్క, శివేతరాణాం- అశుభములయొక్క, తనుతాం, కార్శ్యమును, తనుతాం- చేయుగాక. ౧౪

చ॥ సరసిజసంభవప్రముఖసర్వసుపర్వవచోవిచారగో। చరమ
గుదివ్యతేజమనిశంబుజగంబులుమెచ్చ జారుడై। మరకతనూ
త్నరత్నసుషమం జెలువందగుమారమూర్తియై। పరగిదయా
ర్ద్రదృష్టివశుభంబులడంచిశుభంబులీవ్రతఁ॥ ❋

తా॥ వేదాంతవాక్యంబులవిచారంబుగలయుత్తరమీమాంసచేదెలియందగియును జగంబులచేసాదరింపబడిన జారత్వంబుగలిగి ఇంద్రనీలరత్నంబుంబోలెనుందరంబయి వెలుగుతేజంబు నాయశుభంబులనడంచిశుభంబులనొసందుతయునుట.



శ్లో॥ సాకాపిసర్వజగతామభిరామసీమా కామాయనోభవతు
గోపకిశోరమూర్తిః। యాశేఖరే శ్రుతిగిరాం హృదయోగభా
జాం పాదాంబుజేచసులభా వ్రజసుందరీణామ్॥ ౧౫

టీ॥ సా, అప్రసిద్ధమైనయదియు, కాపి, ఇట్టిదియనిచెప్పనలవిగానిదియును, సర్వజగతాం, ఎల్లలోకములయొక్క-అభిరామసీమా, అభిరామ్య, సౌందర్యముయొక్క- సీమా- ఉత్తరావధియునైన, గోపకిశోరమూర్తిః, గోపకిశోర- గోపాబాలునియొక్క- మూర్తిః, శరీరమును, నః- మాయొక్క- కామాయ- శ్రేయస్సుకొఱకు- భవతు- అగుగాక- యా- ఏమూర్తి- శ్రుతిగిరాం- వేదవాక్యములయొక్క. శేఖరే, అంతమందు, యోగభాజాం- బ్రహ్మనిష్ఠులయొక్క- హృది- హృదయములయందును- వ్రజసుందరీణాం- గోపస్త్రీలయొక్క- పాదాంబుజేచ- పాదకమలంబునను - సులభా, సులభముగా ప్రవర్తించుచున్నదియో- సా కామాయభవతు. అనియన్వయము. ౧౫

ఉ॥ ఎల్లజగంబులుఁగ్ రహింపహించసుభాస్పదసీమయోగిహృ
త్ఫుల్లసరోజపాళిబదముల్లలకింపద్రయావధూటికా। హల్ల
కసీమలంబొలుచునద్భుతగోపకిశోరమూర్తియై। వల్లవకా
మినీచరణవారిజసేవకులెస్సజికెగా॥ ❋

తా॥ ఎద్దియేనియు వేదాంతంబున బ్రహ్మనిష్ఠులహృదయంబులంబ్రకాశించునదియయ్యు గోపవధూచరణాంబుజసేవకుబాల్పడియెనో అట్టిప్రసిద్ధంబయినదియు నెల్లలోకంబులసౌందర్యంబునకు నెల్లయునైనగోపాలకృష్ణమూర్తి మాశ్రేయస్సుకొఱకగుంగాకయనుట. ❋

శ్లో॥ అత్యంతబాలమతసీకుసుమప్రకాశం దిగ్వాససంకనకభూ
షణభూషితాంగం। విస్రస్తకేశమరుణాధరమాయతాక్షం కృ
ష్ణం నవామిమనసా వసుదేవసూనుమ్॥ ౧౬

టీ॥ అత్యంతబాలం, మిక్కిలిబాలుడైనవాడును- దిగ్వాసనం, దిగంబరుండైనవాడును- విస్రస్తకేశం- విస్రస్త-ముడివీడియున్న, కేశం- వెండ్రుకలుగలవాడును, అతసీకుసుమప్రకాశం- అతసీకుసుమ - నల్లవిశపువ్వుయొక్క - ప్రకాశం - ప్రకాశమువంటిప్రకాశముగలవాడును, కనకభూషణభూషితాంగం- కనక- బంగారువికారమైన- భూషణ, ఆభరణములచేత- భూషిత, అలంకరింపబడిన-అంగం, శరీరముగలవాడును- అరుణాధరం, అరుణ- ఎఱ్ఱనైన-అధరం-అధరముగలవాడును-ఆయతాక్షం- ఆయత, దీర్ఘములైన, అక్షం- కన్నులుగలవాడునైన, వసుదేవసూనం- శ్రీకృష్ణమూర్తిని, మనసా- మనసుచేత- నమామి, నమస్కరించుచున్నాను.

ఉ॥ కోమలసుందరాకృతియు గొప్పకనుంగవ కెంపు మోవియు।
న్మోమున వ్రేలుముంగురులు నూత్న విభూషణ భూషితాంగము।
ద్దామదిగంబరాకృతియు దాల్చిన వెన్నునిజిన్ని బాలకున్। శ్రీమె
ఱయు న్భజింతు నతసీసుమభాసుని నందసూనునిన్॥ *

తా॥ మిక్కిలి బాలుండును నల్లవిశ పూవుం బోని నెమ్మేని చాయచేఁ దేజరిల్లువాడును దిగంబరుండును గనకాభరణంబులచే నలంకరింపఁబడిన శరీరంబు గలవాడును ముడువని వెండ్రుకలుగలవాడును విడలుపగు కనుంగవగలవాడును గెంపు వంపుగణియించని యధరంబుగలవాడును వసుదేవసూనుండును నగు శ్రీకృష్ణమూర్తింగూర్చి శిరంబుచే నమస్కరించుచున్నాననుట. *

శ్లో॥ హస్తాంఘ్రినిక్వణితకంకణకింకిణీకం మధ్యే నితంబ మవలం
బితహేమసూత్రం। ముక్తాకలాపముకుళీకృత కాకపక్షం వం
దామహే వ్రజచరం వసుదేవభాగ్యమ్॥ ౨౦

టీ॥ హస్తాంఘ్రినిక్వణితకంకణకింకిణీకం, హస్తాంఘ్రిం-కరచరణకమలములయందు, నిక్వణిత, మ్రోయుచున్న- కంకణ-మంజీరములయొక్క- కింకిణికం, చిఱుగంటలుగలవాడును- మధ్యేనితంబం, నితంబమధ్యమందు, అవలంబిత హేమసూత్రం- అవలంబిత, ఆశ్రయింపబడిన- హేమసూత్రం- బంగరు మొలనూలుగలవాడును ముక్తాకలాపముకుళీకృతకాకపక్షం, ముక్తాకలాప-ముక్తావళిచేత, ముకుళీకృత- ముడ్వంబడిన - కాకపక్షం - చిప్పకూకటిగలవాడును, వ్రజచరం, వ్రజ - వ్రేపల్లెయందు - చరం-సంచరించుచున్నవాడునునగు- వసుదేవభాగ్యం, శ్రీకృష్ణమూర్తినిగూర్చి. వందామహే, నమస్కరించుచున్నాము. *

ఈశ్లోకార్థంబు శ్రీకృష్ణాష్టాక్షరీ ధ్యానంబని సనత్కుమార
సంహితయందు జెప్పంబడియున్నది.

శ్లో॥ పంచవర్షమతిమీశానం ధావమానం వ్రజాంగణే। కింకిణీ
నూపురగ్రీవకర్ణభూషోజ్జ్వలం స్మరేత్॥ *

చ॥ సరసనితంబమధ్యమున జాఱెడు పెన్మొలనూలు చిన్నముం
గురులు ఖుదళంబుగా గమిచి కూర్చిన ముత్తెపు రావిరేకయుం। గ
రచరణాగ్రనిక్వణితకంకణకింకిణులొప్ప నందమం। దిరమున
సంచరించు వసుదేవత పఃఫలము న్భజించెదన్॥ *

తా॥ హస్తంబులు పాదంబులను గంకణమంజీరములయొక్క- చిఱుగంటలు మ్రోయ



చుండఁగటి పశ్చాద్భాగమధ్యంబునం బంగరు మొలనూలు వేలుచుండ సొడ్డంబడిన చిక్కు కూకంటియందు రావిరేక మెఱయ వ్రేపల్లెయందు గ్రుమ్మరు శ్రీకృష్ణమూర్తిం గూర్చి మ్రొక్కెదననుట. *

శ్లో॥ బృందావనద్రుమతలేషు గవాంగణేషు వేదావసానసమ
యేషు చ దృశ్యతే యత్। తద్వేణునాదనపరం శిఖిపింఛచూడం
బ్రహ్మ స్మరామి కమలేక్షణమభ్రనీలం॥ ౨౧

టీ॥ బృందావనద్రుమతలేషు, బృందావన-బృందావనమండలి, ద్రుమ- వృక్షములయొక్క, తలేషు, ప్రదేశములయందు-గవాం- గోవులయొక్క- గణేషు- సమూహములయందు- వేదావసానసమయేషు- వేదావసాన- వేదాంతములయొక్క- సమయేషు- సిద్ధాంతములయందు, యత్ - ఏబ్రహ్మము- దృశ్యతే. చూడంబడుచున్నదియో- తత్ - ఆప్రసిద్ధమైనట్టి- వేణునాదనపరం- వేణు- పిల్లఁగ్రోవియొక్క- నాదన, వాయించుటయందు- పరం- ఆసక్తమయినదియు- శిఖిపింఛ - నెమలిపురి. చూడం- శిరోభూషణము గాఁగలదియు - కమలేక్షణం- కమల- తామరరేకులవంటి- ఈక్షణం- నేత్రముగలదియు- అభ్రనీలం- అభ్ర- మేఘమువలె- నీలం- నల్లనైనదియునగు- బ్రహ్మ, శ్రీకృష్ణాఖ్యపరబ్రహ్మమును- స్మరామి- స్మరించుచున్నాను. ౨౧

శా॥ బృందారణ్యతరుప్రదేశములగో బృందాంగణశ్రేణులన్।
ఛందోవీథులఁ గానుపించు పరమస్వచ్ఛందమౌ తేజమౌ। నంద
బ్రహ్మము వంశనీయమురళీనాదానుమోదంబునా। యందున్నె
త్రైదబించ చూడము పయోజాక్షుంబు మేఘాభమున్॥ *

తా॥ బృందావనంబున తరువుల నీడలను గోసమూహములయందును వేదాంతవీథుల యందునే బ్రహ్మంబుగాఁ గాన్పడుచున్నదియో యట్టి ప్రసిద్ధంబయి వేణునాదానందంబందు నాసక్తంబై నెమలిపురి శిరోభూషణంబుగ ధరియించి తామరరేకులవంటి కన్నుంగవగలిగి మేఘంబుబోలెఁ నల్లనై వెలుంగు శ్రీకృష్ణాఖ్యబ్రహ్మంబును స్మరించుచున్నాననుట.

శ్లో॥ వ్యత్యస్తపాదమవతంసితబర్హిబర్హం సాచీకృతానన
నివేశితవేణురంధ్రం। తేజఃపరం పరమకారుణికం పురస్తా
త్ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్॥ ౨౨

టీ॥ వ్యత్యస్తపాదం- వ్యత్యస్త- వ్యత్యస్తములైన- పాదం, చరణములుగలదియు- అవతంసితబర్హిబర్హం- అవతంసిత, శిరోభూషణముగ జేయంబడిన- బర్హిబర్హం- నెమలిప్పురిగలదియు- సాచీకృతానననివేశితవేణురంధ్రం - సాచీకృత- అందముగాఁ జేయఁబ

దిప-ఆనన-ముఖమందు-నివేశిత-ఉంచబడిన-వేణు-పిల్లనగ్రోవియొక్క-రంధ్రం-బిలము గలయదియు- పరమకారుణికం, అత్యంతదయాళువైనయదియు, పరం, ఉత్కృష్టమైనయదియునగు- తేజః-తేజము, మమ- నాయొక్క, ప్రాణప్రయాణసమయే- ప్రాణప్రయాణ,మరణముయొక్క- సమయే-కాలమందు-పురస్తాత్-ఎదుట, సన్నిధత్తాం- సమీపమగుఁగాక. ౨౨

చ॥ మొగమొకయోరఁ జేసుకొని మోవిని వేణువుఁ జేర్చి తిర్యగం
ఘ్రికవిలసిల్ల మౌళితటిఁ గేకికలాపకలాపముంచి రీ। విగగనుప
ట్టుసౌఖ్యపదవింగను వేళ మదీయసన్నిధిన్ । నిగమనివాస తేజ
ము వినిర్మలసత్కరుణాధురీణమై॥ *

తా॥ వామదక్షిణభాగంబు దక్షిణవామపదంబులనునిచి శిరోభూషణంబుగ నెమలిపురి ధరియించి యోరఁగా జేయబడిన నెంమొగంబున వేణురంధ్రంబుల జేర్చి యత్యంతదయాళువై యుత్కృష్టంబగుచు వెలుఁగు తేజంబు ప్రాణావసానకాలంబున నాయెదుటం దోఁచు-గావుతయనుట. *

శ్లో॥ ఘోషప్రఘోషశమనాయ మథోగుణేన మధ్యేబబంధ జన
నీ నవనీతచోరమ్। తద్బంధనం త్రిజగతాముదరాశ్రయాణా
మాక్రోశకారణమహో నితరాం బభూవ॥ ౨౩

టీ॥ ఘోషప్రఘోషశమనాయ, ఘోష-గొల్లపల్లియొక్క- ప్రఘోష-ఆక్రోశముయొక్క-శమనాయ, శాంతికొఱకు-జననీ-తల్లియైనయశోద- నవనీతచోరం- వెన్నదొంగయైనకృష్ణుని-మధ్యే-నడుమునందు, మథః-కవ్వముయొక్క- గుణేన- త్రాణిచేత, బబంధ-కట్టివైచెను-తద్బంధనం- ఆబంధనము-ఉదరాశ్రయాణాం-ఉదర- శ్రీకృష్ణోదరమును-ఆశ్రయాణాం-ఆశ్రయించిన-త్రిజగతాం-ముల్లోకములకును-ఆక్రోశకారణం- ఆక్రోశ-అత్యంతఘోషమునకు-కారణం,బీజము-నితరాం-మిక్కిలియు-బభూవ-ఆయెను.

శా॥ పాలున్వెన్నయుఁ గ్రుచ్చిలించెనని గోపాలాంగనల్ వ్యు
డన్ గ్రాలిం జెందుచు దల్లిమట్టుపెఱుపంజేర్చించి యాబాలకున్।
రోలం గవ్వపుద్రాటఁ గట్టెనట యాక్రోశించె దత్కుక్షిలో। త్రై
లోక్యంబును దన్మహామహిమ ముగ్ధల్గాంచగా నేతురే॥ *

తా॥ పాలువెన్నలు గ్రుచ్చిలించెనని వ్రజంబునందుండెడి గోపాంగనలు సెప్పఁగా నమాటలాలించి యాయాంగతనంబుడు పండలంచి యశోద నవనీతచోరుండగు కృష్ణుని గవ్వపుత్రాటనులూఖలంబున గట్టినఁ దదుదరంబునసున్న ముల్లోకంబులును దద్బంధనంబు



నసగు వేదనావశంబున నాక్రోశింపఁదొడఁగెనల్లయైన యాయశోద గోపికాక్రోశంబుడు పండలంచి చేయుబాధన యెల్లలోకంబులకును ప్రద్రవకరంబయ్యెననుట. *

శ్లో॥ శైవా వయం నఖలు తత్ర విచారణీయం పంచాక్షరీజపప
రా నితరాం తథాపి। చేతో మదీయమతసీకుసుమావభాసం స్మే
రాననం స్మరతి గోపవధూకిశోరమ్॥ ౨౪

టీ॥ పంచాక్షరీజపపరాః, పంచాక్షరీ-పంచాక్షరీమంత్రములయొక్క- జప- జపమందు-పరాః-ఆసక్తులమైన, వయం- మేము, శైవాః- శివసంబంధులము-తత్ర- అవిషయమందు, విచారణీయం-నఖలు-విచారింపగూడదుగదా, తథాపి-ఐనప్పటికిని-మదీయం, నా సంబంధమైన, చేతః- చిత్తము- అతసీకుసుమావభాసం, అతసీకుసుమ - నల్లవిసెపువ్వుయొక్క- అవభాసం, కాంతివంటికాంతిగలవాడును, స్మేరాననం - నగుమొగముగలవాడునగు, గోపవధూకిశోరం,గోపవధూ-యశోదయొక్క- కిశోరం -శిశువగుకృష్ణుని. నితరాం-మిక్కిలియు-స్మరతి-స్మరించుచున్నది. ౨౪

మ॥ అనుమానింపగ నేము శైవులము మేమత్యంత పంచాక్షరీ। మ
ను పారణులమాదుమైన నెవ్వధు మన్మందస్మితభ్రాజితా। నసచం
ద్రుంగపిలాతసీసుమసమానద్యోతనిస్తంద్రుగృ। ష్ణుని గోపా
లకబాలునెంచ నెతలంచు జిత్తమాసక్తితోన్॥ *

తా॥ పంచాక్షరీమంత్రంబు జపియించు మేము శివసంబంధము గలవారల మనుటయందు సమానంబు లేదైనను నల్లవిసెపువ్వుకాంతివంటి కాంతిగలనెంమేనుగలిగిన నగుమొగంబునం దేజరిల్లు యశోదాసుతుండైన కృష్ణుని నామనంబు గోరుచుండుననుట. *

శ్లో॥ రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా మంథానమాక
లయతీ దధిరిక్తపాత్రే తస్యాః స్తనస్తబకచంచలలోలదృష్టి ర్దే
వో౽పి దోహనధియా వృషభం నిరుంధన్॥ ౨౫

టీ॥ అచ్యుతదత్తచిత్తా- అచ్యుత-శ్రీకృష్ణునియందు-దత్త-ఉంచబడిన,చిత్తా - మనస్సు గలదియై- దధిరిక్తపాత్రే, దధి, పెరుగుచేత-రిక్త-శూన్యమైన-పాత్రే-ఘటమందు, మంథానం-కవ్వమును, ఆకలయతీ-త్రిప్పుచున్న-రాధా-రాధయనుగోపిక-జగత్-భువనమును-పునాతు-పవిత్రమునుగాజేయుగాక- తస్యాః- ఆరాధయొక్క, స్తనస్తబకచంచలలోలదృష్టిః- స్తనస్తబక-పూవుగుత్తులవంటి పాలిండ్లయందు, చంచల- సారెసారెకు ప్రవర్తించుచున్నయదియు-లోల-ఆసక్తిగూడుకొన్నయదియునగు-దృష్టిః-చూపుగలవాడయి-దోహనధీ-యా దోహనబుద్ధిచేత- వృషభం,వృషభమును-నిరుంధన్- కట్టుచున్న-దేవోపి-శ్రీకృష్ణుఁడును-జగత్-లోకమును-పునాతు పవిత్రముగాజేయుగాక. ౨౫

ఉ॥ భ్రామసిహారిందలంచిదధిభాండముదండవసించురిక్తభాం।
డమమథియించురాధయు మనంబునదక్కుచకుంభికుంభవి।
భ్రమముదలంచియొకకృవృషభంబును దోహనబుద్ధిగట్టున।
కక్కమలదళాక్షుడుంగరుణగాతురుగాతజగద్వితానముల్॥

తా॥ శ్రీకృష్ణమూర్తియింపు మనంబిడినదియగుటచే దధిభాండముపొంతనుండిన పెరుగులేనికుండయందుఁ గవ్వంబునిడితరువంగ దలంచురాధయునారాధకుచ కుంభంబుల మాటిమాటికిం జంచలించుమనంబుగలవాఁడగుటంజేసిభ్రాంతిచే వృషభంబుఁబిదుకనను కట్టుశ్రీకృష్ణుండునులోకంబు బవిత్రంబుగా జేయుదురుగాకయనుట. ❋

శ్లో॥ గోధూళిధూసరితకోమలకుంతలాగ్రం గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసం। గోపీజనస్య కుచకుంకుమ ముద్రితాంగం గోవిందమిందువదనంశరణంభజామః॥ ౨౮

టీ॥ గోధూళిధూసరితకోమలకుంతలాగ్రం, గోధూళి - గోసమ్మర్దనమువలనబుట్టినరేణువులచేత-ధూసరిత, ధూసరవర్ణముగలదిగాజేయబడిన-కోమలమృదువులయిన-కుంతలాగ్రం- కేశాగ్రములుగలవాడును-గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసం-గోవర్ధన-గోవర్ధనపర్వతముయొక్క-ఉద్ధరణ-యెత్తుటయనియెడి- కేళి-విహారమందు-కృత- చేయబడిన- ప్రయాసం - ప్రయాసముగలవాడును- గోపీజనస్య - గోపికా సమూహముయొక్క-కుచకుంకుమముద్రితాంగం- కుచ- స్తనములయందలి-కుంకుమ- అంగరాగవిశేషముచేత-ముద్రిత-చిహ్నితములైన, అంగం-వక్షము మొదలగునవయవములుగలవాడును- ఇందువదనం-ఇందుః-చంద్రునివంటి-వదనం-ముఖముగలవాడును- శరణం-రక్షకుండునైన, గోవిందం-శ్రీకృష్ణమూర్తిని-భజామః-సేవించుచున్నాము. ౨౮

ఉ॥ గోపవధూళిధూసరితకోమలకుంతలుగోపికాకుచ। స్థాపితకుంకుమాంకిత విశాలభుజాంతరు బాణిపంకజా। రోపితభూమిభృద్వరనిరూఢసుఖాస్పదనందగోకులుల్। గోపకుమారునిందువదనున్మదనుగ్రహవాంఛగొల్చెదన్॥ ❋

తా॥ గోపదసమర్దబునంబాడమిన పరాగంబుచేధూసరంబగు కేశాగ్రంబులుగలిగి గోవర్ధనోద్ధరణంబునువిహారంబుచేజేయబడిన శ్రమంబుగలిగిగోపికా కుచకుంకుమంబున లాంఛితంబగునురంబుచేదేజరిల్లుచు జంద్రునిబోలునెమ్మొగంబుననమరినాకురక్షకుడైతనరువిందునిసేగొలిచుచున్నాననుట. ❋



శ్లో॥ యద్రోమరంధ్రపరిపూర్తివిధావదక్షా వారాహజన్మని బభూవురమీసముద్రాః। తంనామనాథమరవిందదృశంయశోదాపాణిద్వయాంతరజలైస్స్నపయాంబభూవ॥ ౨౯

టీ॥ వారాహజన్మని- వరాహావతారమందు-అమీసముద్రాః- ఈసముద్రములు - యద్రోమరంధ్రపరిపూర్తివిధావదక్షా-యత్-ఏకృష్ణమూర్తియొక్క-రోమ- వెంట్రుకలయొక్క-రంధ్ర,బిలముయొక్క-పరిపూర్తి-పూర్ణముయొక్క-విధౌ,చేయుటయందు-అదక్షాః,అసమర్థములు-బభూవుః-ఐనవియో-తం,ఆ-అరవిందదృశం, పుండరీకాక్షుడైన-నాథం-శ్రీకృష్ణమూర్తిని-యశోదా,నందునిభార్య-పాణిద్వయాంతరజలైః- పాణిద్వయ-దోయిలియొక్క-అంతర,మధ్యమందలి-జలైః. ఉదకములచేత - స్నపయాంబభూవనామ-స్నానముచేయించెగదా. ౨౯

ఉ॥ ఏయధికుండుక్రోడతవహించినసాతసిరోమరంధ్రముల్। దోయధులెల్లనింపుడవలన్నెరకయుండెనట్టినా। రాయణుఁడర్భకాకృతినిరాగిలినందవధూటిదోయిటన్। దోయముజల్లఁగాదనిసితోఁగుచునుండెనిదేమిచిత్రమో॥ ❋

తా॥ వరాహజన్మంబుననీసముద్రంబులే శ్రీకృష్ణునిరోమరంధ్రింబుబూరింపసమర్థంబులుగాకపోయినవియోయట్టిప్రసిద్ధుండును బుండరీకాక్షుండునగు శ్రీకృష్ణమూర్తినియశోదాదేవిదోయిలిలోనినీటిచేస్నానముచేయించెనిదియెట్టివిచిత్రంబోయనుట,

శ్లో॥ పరమిమముపదేశమాద్రియధ్వంనిగమవనేషు నితాంతచారఖిన్నాః। విచినుతభవనేషువల్లవీనాముపనిషదర్థములూఖలేనిబద్ధం॥

టీ॥ నిగమవనేషు-నిగమ-వేదములనియెడి-వనేషు - వనములయందు - నితాంతచారఖిన్నాః-నితాంత, మిక్కిలియు- చార- పరిశీలనముచేత- ఖిన్నాః,బడలిన - హేసుకృతినః-ఓవిద్వాంసులారా, పరం-ఉత్కృష్టముయిన - ఇమముపదేశం, ఈయుపదేశమును-ఆదియధ్వం-ఆదరింపుఁడు- వల్లవీనాం- గోపస్త్రీలయొక్క- భవనేషు, గృహములయందు-ఉలూఖలే-రోటియందు-నిబద్ధం- కట్టుబడిన, ఉపనిషదర్థం-ఉపనిషత్, వేదాంతములయొక్క-అర్థం,లక్ష్యమైనకృష్ణుని, విచినుత వెదకుండు. ౩౦

చ॥ నిగమమహావనాంతములనేవెదకన్వలెనంచుఖిన్నులై। వగవగనేలయేనొక యుపాయముజెప్పెద బోయిచూడుఁడీ। యగణితవల్లవీమణిగృహాంగణ భూమినులూఖలంబుదో। డగునిబద్ధమైశ్రుతులడాగినభావముగాననయ్యెడున్॥ ❋

వేణునాద-వేణుగానముయొక్క-రసికం- సారగ్రాహియైనకృష్ణుని, భజామహే-సేవించుచున్నాను. ౩౨

చ॥నిరతమునంఘ్రిమార్పఁడగ నిల్పియొయారపుటోరచూపుతో । దరళనిలోచనంబులు ముదంబలరన్ దరహాస చంద్రికల్
మురువగుముద్దుమోవినర మోడ్ప జెలంగగరాంగుళీతతి। న్స్వర
శినటింపజేయునతిమోహన గానధురీణుగొల్చెదన్॥ *

తా॥ఓరగా జేయబడినకన్నులు చలించుచుండనర మోడ్చిన కోమలాధరంబు వెలయ వేగంబునీ వేణురంధ్రంబునగప్పుచువిప్పుచుం జెలంగు వేణు నాదగస గ్రాహియైన శ్రీకృష్ణమూర్తిని సేవించుచున్నాననుట. *

శ్లో॥స్యందనే గరుడమణ్డితధ్వజే కుణ్డినేశతనయాధిరోపితా। కేనచిన్నవతమాలపల్లవశ్యామలేనపురుషేణనీయతే॥ ౩౩

టీ॥కుండినేశతనయా, కుండిన-కుండినపట్టణమునకు, ఈశ- ప్రభుడైనభీమునియొక్క, తనయా, కూతురయినరుక్మిణీదేవి, గరుడమండితధ్వజే,గరుడ - గరుడుని చేత-మండిత, ప్రకాశించుచున్న-ధ్వజే, టెక్కెముగలిగిన- స్యందనే,రథమందు- నవతమాలపల్లవశ్యామలేన-నవ-నూతనమైన-తమాలపల్లవ,నల్లకానుగచిగురువలె, శ్యామలేన, నీలవర్ణుడైన-కేనచిత్పురుషేన-ఒకానొకపురుషుని చేత,ననగా-కృష్ణుని చేత,అధిరోపిత- అధిరోహింపబడినదియై,నియతే-తీసుకొనిపోబడుచున్నది. ౩౩

మ॥కదనోర్విన్ శిశుపాలమాగధవిపక్షక్ష్మాతలాధీశదో। మదాహనిర్భేదవినోదమొప్పగగరుత్మత్కేతుభాస్వద్రథా । స్పదమీరింబునరుక్మిణీరమణి నిశ్శంక స్థితందెచ్చెనే। విడతుండట్టితమాలనీలపురుషున్విశ్వంభరుంగొల్చెదన్॥ *

తా॥కానుగు చిగురుంబోలె శ్యామలవర్ణంబగు శరీరంబుగలయొకానొకండైనపురుషుండనగా,శ్రీకృష్ణుడుగరుడధ్వజంబుచే ప్రకాశించురథంబునరుక్మిణిదేవినెక్కించికొంపోవుచున్నాడనుట. *

శ్లో॥ మాయాతపాంధాః పథిభీమరథ్యాదిగంబరఃకోపితమాలనీలః। విన్యస్తహస్తోపినితంబబింబే ధూర్తస్సమాకర్షతి చిత్తవిత్తమ్॥

టీ॥హేపాంధాః-ఓపథికులారా-భీమరథ్యాః-భీమరథియనునదియొక్క- పథి- మార్గమందు- మాయాత, రాకుండుడు, తమాలనీలః- తమాల - నల్లకానుగువలె- నీలః, నల్లనైనవాడును- దిగంబరః,దిగంబరుడైనవాడును-కోపి,ఒకానొకడైన-ధూర్తః- ధు



ర్జనుడు-నితంబబింబే, కటిప్రదేశవిశేషమందు,విన్యస్తహస్తోపి - విన్యస్త-ఉంచబడిన-హస్తోపి-హస్తముగలవాడయినను-చిత్తవిత్తం-చిత్త-మనసనెడి, విత్తం - ధనమును సమాకర్షతి-లెస్సగాగ్రహించుచున్నాడు. ౩౪

చ॥పథికులుబోకుఁడచ్చోటికిఁబల్మఱుఁభీమరథీపథంబునం। బృథులతమాలమేచకశరీరుఁడొకండుదిగంబరాకృతిం। బ్రధితకటీతటీఘటితపాణితలుండై భ్రోన్మిషన్మనో। రథుఁడయిచిత్తవిత్తమునిరంతమున్హరియించుధూర్తుఁడై॥ *

తా ॥ ఓపథికులారాభీమరథీనదిమార్గంబున రాకుండుండేమనిన. దిగంబరుండును తమాలనీలుండునునగు పురుషుండు నితంబ ప్రదేశంబునగరంబులునిచ్చికొనియుండియు నుధూర్తుండయిచిత్తవిత్తంబున పరిహరించుంగాన దత్ప్రదేశంబునకు రాకుండుడనుట.

—* రాసక్రీడాష్టకము *—

శ్లో॥అంగనామంగనా మంతరే మాధవో మాధవంమాధవం చాంతరేణాంగనా। ఇత్థమాకల్పితే మండలే మధ్యగస్సంజగౌ వేణునా దేవకీనందనః॥ ౩౫

టీ॥అంగనామంగనాం,అంగనలయొక్క- అంతరే, మధ్యమందు- మాధవః - శ్రీకృష్ణమూర్తియును- మాధవంమాధవం- పుండరీకాక్షుపుండరీకాక్షులయొక్క-అంతరేణ మధ్యమున-అంగనాచ- స్త్రీయును-ఇత్థం- ఈప్రకారముగా- ఆకల్పితే, కల్పింపబడిన-మండలె-సమూహమందు- దేవకీనందనః,శ్రీకృష్ణమూర్తి-మధ్యగః,మధ్యస్థానినిబొందినవాడగుచు- వేణునా,పిల్లనగ్రోవిచేత-సంజగౌ, లెస్సగాగానము జేసెను. ౩౫

గ్రంథకర్త యీపద్యము మొదట లెనిమిదిపద్యముల వఱకు
శ్రీకృష్ణుని రాసక్రీడలను వర్ణించిచెప్పుచున్నాడు॥

చ॥ఇరుదెసఁదానునిల్చితనకెంతులు పార్శ్వములన్వసింపగా। గరములుగంతపాళిఁజెలగన్చల భిన్నణివిద్రుమంబులన్। సర
మొనరించినట్లుసరసస్థితిమండలమధ్యవర్తియై। మురళిరవంబునం జెలఁగుమోహనమూర్తిమురారిగొల్చెదన్॥ *

తా॥ఇరుదెసలందానునుదనకిరుగడలనింతులు నిల్వనీ లెఱింగునఁగల్పింపబడిన మండలంబున కృష్ణుండుమధ్యమునియేడిధ్వనివిశేషము నాశ్రయించిపిల్లనగ్రోవిచే మిక్కిలియు గానంబుచేసెననుట. *

శ్లో॥ కేకికేకాదృతానేకపంకేరుహాలీనహంసావళీహృద్యతాహృద్య
తా। కంసవంశాటవీదాహదావానలస్సంజగౌ వేణునా దేవకీనన్దనః॥

టీ॥ కేకికేకాదృతానేకపంకేరుహాలీనహంసావళీహృద్యతాహృద్యతా, కేకి-నెమళ్ల యొక్క, కేకా-ధ్వనివిశేషములయొక్క-ఆదృత, ఆదరించుటచేత, అనేక, అనేకములయిన-పంకేరుహ, కమలములనుండి, ఆలీన-లేచుచున్న, హంస, అంచలయొక్క - అవళి- పంక్తులకు-హృద్యతా, సంతోషమును-ఆహృద్యతా, సంపాదించుచున్న- వేణునా - పిల్లనగ్రోవిచేత- కంసవంశాటవీదాహదావానలః, కంసవంశ - కంసకులమనియెడి; అటవీ అడవియొక్క, దాహ, కాల్చుటయందు- దావానలః- వనవహ్నియైన, దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి- సంజగౌ, లెస్సగా గానముచేసెను॥ ౨౯

మ॥ తనుకాంతుల్ జలదంబటంచు శిఖిసంతానంబుఁ గేకాస్వ
నం। బునుమీరన్విలయించపిండులలితాంభోజాళిలో నుండిచ।
య్యనలేవన్ భ్రమమాన్పిసంతసము చేయంజాలువంశీమృదు।
స్వనముం గాంచి కంసవంశదహనజ్వాలిన్ హరిం గొల్చెదన్॥

తా॥ నెంమేనిచాయం దలకించి మొగులనుచుఁ జెలంగు నెమళుల కేకా రావంబుల వినిన యంతన వానతటి దొరకొనియెనని తలంపునఁ దామరపిండుననుండి లేవనుంకించు నంచలకది మేఘంబుగాదు కృష్ణుఁడని తెలియంజేసి సంతసంబు నాపాదించు పిల్లనఁగ్రోవిచేఁ గంసునికులంబను నడవికిం గార్చిచ్చగు శ్రీకృష్ణమూర్తి గానంబుచేసెననుట. *

శ్లో॥ క్వాపివీణాభిరారావిణా కమ్పితః క్వాపివీణాభిరాకింకిణీ
నర్తితః। క్వాపివీణాభిరామాంతరంగాపితస్సంజగౌ వేణునా
దేవకీనందనః॥ ౩౦

టీ॥ దేవకీనందనః, శ్రీకృష్ణమూర్తి - క్వాపి - ఒకచోటను, వీణాభిః - వీణలచేత, ఆరావిణా, గానవంతుడయినవానిచే, కంపితః, నాట్యమునొందింపఁబడిన వాఁడగుచు- వేణునా- పిల్లనగ్రోవిచే, సంజగౌ - గానముచేసెను. క్వాపి, ఒకచోట- వీణాభిరాకింకిణీనర్తితః- వీణాభిరా- వీణానుగుణ్యధ్వని జేయుచున్న - కింకిణీ, చిఱుగంటలలోడ. నర్తితః. నర్తనము బొందింపఁబడినవాఁడగుచు - సంజగౌ- గానముచేసెను- క్వాపి - ఒకచోట, వీణాభిరామాంతరం, వీణా, వీణయొక్క - అభిరామ, మనోహరములయిన, అంతరం - గానవిశేషములు గలుగునట్లుగా- గాపితః- గానము బొందింపబడినవాఁడగుచు- సంజగౌ- గానముచేసెను. ౩౦

మ॥ ఒకచో గాణలుమీటువీణియలతోన్ యుక్తంబుగా నాడు
నే। ఒకచో వీణెకు వియ్యమై యొనరఁ జేయుం గింకిణీనాద
ము౦। ఒకచో వీణియతోఁడ బాడు జత గానుత్సాహియై యు
ట్టినం। దకువరారాగ్రణీ వేణునాగ మొనరన్ స్ఫూర్తిల్లె యుల్లాసియై॥

తా॥ ఒకచోట గానవంతులు మీటు వీణియల రవంబులకుఁ దగునటుల నాడుచు వేఱొకచోట వీణారవంబుగలసి మెలయునటుల జిఱుగంటలు మ్రోయించుచు నొకచోట వీణాధ్వని విశేషంబులకుం దోడుగఁ బాడుచు దేవకీసుతుండగు శ్రీకృష్ణమూర్తి వేణువుచే గానంబు చేసెననుట. *

శ్లో॥ చారుచంద్రావళీలోచనైశ్చుమ్బితో గోపగోబృందగో
పాలికావల్లభః। వల్లవీబృందబృందారకః కాముకస్సంజగౌ
వేణునా దేవకీనందనః॥

టీ॥ చారుచంద్రావళీలోచనైః, చారుచంద్రా, సుందరములయిన భూషణములుగల గోపికలయొక్క, ఆవళీ - పంక్తులయొక్క, లోచనైః, నేత్రములచేత, చుంబితః, చూడఁబడుచున్నవాఁడును, గోపగోబృందగోపాలికావల్లభః- గోప- గోపాలకులయు, గోః- గోవులయు, బృంద- సమూహమునకును, గోపాలికా- ప్రేతలకును, వల్లభః, ప్రభుడైనవాఁడును, వల్లవీబృందబృందారకః, వల్లవీబృంద, గోపికాసమూహములకు - బృందారకః - దైవతమైనవాఁడును- కాముకః- గోపికాకాముకుఁడునైన, దేవకీనందనః కృష్ణమూర్తి- వేణునా- పిల్లనగ్రోవిచే, సంజగౌ- గానముచేసెను ౩౧

ఉ॥ క్రేపులు గోపదంతులు గేవలభక్తి భజింపనస్సరో। ధూపముగ
ల్గు ప్రేతలుమరులొందసి క్రీడయొనర్పసంభృతా। ష్టాపదభూధరాంచెలు
లు సౌధములందిలకించి చూడగా। గోపకువరారుడొప్పె రసగుంభిత వే
ణుని నాదలోలుడై॥ *

తా॥ సుందరంబులగు భూషణంబులు ధరించిన గోపస్త్రీల నేత్రంబులచే జూడంబడుచు గోపికాసమూహంబులకు దైవతంబై గోపస్త్రీకాముకుండై గోపాలగోపికాగోసమూహంబులకు నాథుండయి వెలయు గోపాలదేవుండు వేణువుచె గానంబు చేసెననుట. *

శ్లో॥ మౌళిమాలామిళన్మత్తభృంగీలతాభీతభీత ప్రియావిభ్రమాలిం
గితః। స్రస్తగోపీకుచాభోగసంమేళితస్సంజగౌ వేణునా దేవకీనందనః॥

టీ॥ దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి, మౌళిమాలామిళన్మత్తభృంగీలతా భీతభీత ప్రియావిభ్రమాలింగితః- మౌళి- సిగయందుండిన, మాలా- పుష్పమాలికయందు- మిళిత-

కూడుకొన్న- మత్తభృంగిలతా - తీవియలవంటియలజేటి బోటులవలన, భీతభీత - భీతపద్మశలయిన, ప్రియా-ప్రియురాండ్రచే - విభ్రమ-విలాసముతోగూడుకొన్నటుల- ఆలింగితః, కౌగిలింపబడినవాడగుచు, స్రస్తగోపికుచాభోగసంమేళితః, స్రస్త- జారుచున్న వస్త్రములుగలిగిన, గోపీ గోపికలయొక్క- కుచ, స్తనములయొక్క- ఆభోగ- పరిపూర్ణతచే, సంమేళితః - ఆలింగనముచేయబడినవాడగుచు, వేణునా, పిల్లనగ్రోవిచేత, సంజగౌ, గానముచేసెను. ౩౯

ఉ॥ మాళితటిన్ ఘటించిన సుమంబుల వెంబడివచ్చు భృంగిరా।
జీలవితధ్వనిం గలగి చేలములూడగ గౌగలించు గో। పాలకభీరు
కోటికుచభారము రంమున నాను రాసలీ। లాలసమానస విలా
సుని వేణువినోదు గాంచెదన్॥ ✻

తా॥ సిగలయందలంకరింపంబడినయలరులసరంబులపైమూసరు తేంటి మ్రోతల కళికిచేలంబులూడగముతై కౌగిలించుగొల్లమెఱుంగు బోండ్లపాలిండ్లరాయిడి గడుసుమీటినసద్దుంపు పెడచెవిజెలువొందుచు వేణుగానంబు చేయుగోపాలదేవునిం గాంచెదనుటు. ✻

శ్లో॥ చారుచామీకరాభాసభామావిభుర్వైజయంతీలతావా
సితోరస్థ్సలః। నందబృందావనేవాసితామధ్యగస్సంజగౌవే
ణునా దేవకీనందనః॥ ౪౦

టీ॥ చారుచామీకరాభాసభామావిభుః- చారు-సుందరమయిన-చామీకర- బంగారుయొక్క-ఆభాస- కాంతివంటికాంతిగలిగిన, మా-లక్ష్మీదేవికి, విభుః- ప్రభుడయినవాడును, వైజయంతీలతావాసితోరస్థ్సలః, వైజయంతీలతా-తీవియవంటి వైజయంతీయనువనమాలికచేత - వాసిత, పరిమళించుచున్న- ఉరస్థ్సలః-వక్షస్థ్సలముగల, దేవకీనందనః శ్రీకృష్ణమూర్తి-నందబృందావనేవాసితామధ్యగః, నంద- నందునియొక్క - బృందావనే బృందావనమనువనమందు- వాసితా-నివసించెడిగోపికలయొక్క, మధ్యగః- మధ్యదేశమును బొందినవాడగుచు- వేణునా-పిల్లనగ్రోవిచేత - సంజగౌ గానముచేసెను.

మ॥ జతలై బంగరుతీగెజాలునదలించంజాలు బృందావనాం।
చితబింబోకవతుల్విలాసగలన్ సేవించి రాసక్రియా। చతుర
త్వంబున వైజయంతినటియుంచన్వేణుగానస్వనా। మృతరా
ధాపటిమం జెలంగు హరి నెమ్మిం బ్రోచుమమ్మెప్పుడున్॥ ✻

తా॥ కుటపాకశోభితంబగు సువర్ణనిభ బగుశరీరకాంతిచే దేజరిల్లునిందిరకు విభుండును వైజయంతీయనిరెమెడువనమాలికచేం బరిమళించునెడగలుగువాడునగు శ్రీకృష్ణమూర్తి బృందావననివాసినులగు గోపికలమధ్యంబునం జేరి వేణుచే గానంబుచేసెననుటు.



శ్లో॥ బాలికాతాళికాతాలలీలాలయాసంగసందర్శితభ్రూలతావిభ్ర
మః। గోపికాగీతదత్తావధానస్స్వయంసంజగౌ వేణునా దేవకీనందనః॥

టీ॥ బాలికాతాళికాతాలలీలాలయాసంగసందర్శితభ్రూలతావిభ్రమః- బాలికా- గోపాలబాలికలనియెడి- తాళికా- తాళకర్తియలయొక్క- తాలలీలా- తాళక్రియయొక్క- లయ, న్యూనాధికరాహిత్యముయొక్క- ఆసంగ- ఉద్యోగమందు- సందర్శిత, చూపబడిన- భ్రూలతా- తీగెవంటికనుబొమలయొక్క- విభ్రమః, విలాసములుగల, దేవకీనందనః - శ్రీకృష్ణమూర్తి, స్వయం- తాను, గోపికాగీతదత్తావధానః, గోపికా, గోపికలయొక్క, గీత, గానమందు, దత్త, ఉంచబడిన - అవధానః, తత్పరత్వము గలవాడగుచు- వేణునా- వేణువుచేత- సంజగౌ, గానముచేసెను. ౪౧

ఉ॥ తాళములుగ్గడించు వనితాకరతాళలయానుభావిత। భ్రూల
తసొంపువల్లవసరోజముఖీమృదుగానవైఖరిన్। దాలిమినె
చ్చరించు నవధానము మీఱంగ వేణుపాణియై। లాలితగానవైభ
వకళానిపుణుండగు శౌరిం గొల్చెదన్॥ ✻

తా॥ తాళంబులనుగ్గడించు గోపబాలికాకరతాళంబులం గనుబొమలీలచే మెచ్చుచు గోపికలసంగీతంబున దత్పరంబగుమనంబు గలిగి గోపాలదేవుండు వేణువుచేం గానంబుం జేసెననుటు. ✻

శ్లో॥ పారిజాతం సముద్ధృత్య రాధావయోరూపయామాస
భాసాగుణైరంగణే। శీతశీతేవటే యామునీయే తటే సంజగౌ
వేణునా దేవకీనందనః॥ ౪౨

టీ॥ దేవకీనందనః, శ్రీకృష్ణమూర్తి - రాధావయోరూపయా-రాధాదేవియవయ యవశౌష్ఠవమువంటి- యువయవశౌష్ఠవముగలిగిన గుణ్త్రైః- గుణైః- సౌందర్యాదిగుణములచేత- మాసభాసా-మా, లక్ష్మీదేవికి- సభాసా- సమానురాలయిన యొకానొక యువతియొక్క- అంగణే- ముంగిలియందు, పారిజాతం- పారిజాతతరువును- సముద్ధృత్య- స్థాపించి- యామునీయే, యమునాసంబంధమయిన, తటే, గట్టునందు - శీత శీతే- శీతస్పర్శమయిన- వటే, భాండీరమనియెడి పేరుగల న్యగ్రోధవృక్షమందు- వేణునా- వేణువుచేత- సంజగౌ- గానముచేసెను. ౪౩

మ॥ రమతోడన్ సమమైనకాంతిగుణముల్ రాధావయోరూప
విభ్రమముల్ గల్గినభామ ముంగిటను గల్పద్రుమమున్నిల్పియ।
య్యమునాసైకతమధ్యశీతలతలన్యగ్రోధపీఠిన్ ముదంబమర
న్వేణువినోదనాదరతుండౌ నబ్జాక్షునీక్షించెదన్॥ ✻

తా॥ నిరుపమానకాంతిగుణంబుచేఁబదార్థస్త్రప్రాయంబుచే దేజరిల్లునిందిరాదేవి యుంబోని యొకానొకయువత ముంగిటంబారిజాతంబు నెలవుకొల్పియమునా తటంబు నందుడు భాండీరవటతరువునీడయందు శ్రీకృష్ణమూర్తి వేణుచేగానంబులుచేసెననుట.

శ్లో॥ అగ్రేదీర్ఘతరోయమర్జునతరుస్తస్యాగ్రతోవర్త్మనీ
సాఘోషంసముపైతితత్పరిసరేదేశేకళిందాత్మజా। తస్యా
స్తీరతమాలకాననతలేచక్రంగవాంచారయన్గోపఃక్రీడతిదర్శ
యిష్యతిసఖేపంథ్యానమవ్యాహతం॥ ౪౩

టీ॥ ఈశ్లోకంబునకర్థంబులు రెండుగాననీక్రిందవివరింపబడుచున్నవి - హేసఖే,ఓయిసఖుండా, అగ్రే,యెదుట-ఆయం, ఈకాన్పించుచున్న - దీర్ఘతరః, మిక్కిలిపొడవయిన, అర్జునతరుః - కదంబవృక్షము - తస్య,ఆకదంబ-తరువుయొక్క,అగ్రతః - ముందరను-వర్త్మని-కాలిత్రోవ-సా-ఆకాలిత్రోవ-ఘోషం-గొల్లపల్లియను-సముపైతి-పొందుచున్నది- తత్పరిసరే,తత్- ఆపల్లెయొక్క, పరిసరే-సమీపదేశమందు, కళిందాత్మజా, యమునానది-తస్యాః,అయమునానదియొక్క, తీరతమాలకాననతలే- తీర-గట్టునందు-తమాల-నల్లకానుగుచెట్లయొక్క, కానన-వనముయొక్క,తలే-ప్రదేశమందు-గవాం-గోవులయొక్క,చక్రం-సమూహమును- చారయన్- సంచరింపజేయుచు-గోపః, గోపాలుఁడు,క్రీడతి-విహరించుచున్నాఁడు- సః, ఆగోపాలుఁడు- అవ్యాహతం, అక్షతమైన, పంథానం, మార్గమును - త్వాం నినుఁగూర్చి- దర్శయిష్యతీ - చూపించుచున్నాఁడు (రెండవయర్థము) హేసఖే- ఓమిత్రుఁడా- అగ్రే- రథాగ్రమందు - దీర్ఘతరః- మహాన్నతుఁడయినవాఁడును-అయం- ఈప్రసిద్ధుడయిన-అర్జునతరుః,తరువంటి యర్జునుఁడు-తస్య-ఆయర్జునునియొక్క-అగ్రతః,ముందర-వర్త్మని- ఉపదేశమార్గము-సా-ఆమార్గము-ఘోషం-ఉపనిషత్తును-సముపైతి-పొందుచున్నది-తత్పరిసరే- తత్- ఆయుపనిషత్తుయొక్క- పరిసరే, సమీపమందు-కళిందాత్మజా-యమునానది- తస్యాః, ఆనదియొక్క- తీరతమాలకాననతలే, తీర-గట్టునందుండు- తమాలకానన- కానుగయడవియొక్క-తలే, ప్రదేశమందు,గవాం- ఉపనిషద్వాక్యములయొక్క - చక్రం- సమూహమును,చారయన్, అధ్యయనముచేయించు- గోపః- శ్రీకృష్ణమూర్తి-క్రీడతి,విహరించుచున్నాఁడు-సః-ఆకృష్ణుఁడు,త్వాం-నినుఁగూర్చి-అవ్యాహతం- అక్షతమైన-పంథానం, మార్గమును-దర్శయిష్యతి-చూపించుచున్నాఁడు. ౪౩

ఈశ్లోకార్థమునందు గోపాలకృష్ణసర్వకర్తైకాత్మరీమంత్ర ధ్యానమనిసనత్కుమారసంహితయందుజెప్పంబడియున్నది.



శ్లో॥ పార్థాయాదిశంతంగీతార్థంధ్యానముద్రాలసత్కరం। రథ
స్థంభావయేజ్జప్త్వాదశలక్షమిమంమనుం। నోదితాల్లభతే
జ్ఞానంపరమైశ్వర్యదాయకమ్॥ ౪౩

మ॥ అవిగోముంగలపెద్దమద్దియటపోషాచెంతత్రోవపల్లెయున్న
దియాదండగళిందజాతటమునందాపింఛభూజాళినాకదుపు
ల్మేపుచుగోపబాలకుఁడునికరంబొప్పఁగాఁజెల్వునన్ త్రోవవిం
బొమ్మసఖాసుఖాస్పదముగాభావంబురంజిల్లెడున్॥ ౪౩

తా॥ ఓయిమిత్రుఁడా!వినుము ముందరనొక మహోన్నతంబగునర్జునతరువుగలదుదానికిముందొకకాలిత్రోవయున్నది యాత్రోవ పల్లెయుంగూర్చిపొందుచున్నది యప్పల్లియపొంత యమునానదీతీరంబునంబొడవగు కానుగయడవిలోపలనాలగుంపులమేపుచునొకగోపాలుఁడున్నాఁడతండ వ్యాహతంబగుమార్గంబుజూపుననుట. ఈయర్థంబుగాకమతియొక తాత్పర్యవిషయాభూతంబగునర్థంబుగలదదియెట్లనిన నొకండు సంసారార్ణవంబునఁబడి పుణ్యపాపంబులచే సంపాదింపబడినమార్గవిశేషంబులచే బోయిపోయి పరిభ్రమించుచువెండియుసంసారగహనంబున బ్రవేశించి యతిదుఃఖంబగుజీవితంబుఁగూర్చివేగడు నొకనికిఁజెప్పనల్లవిగానిసన్మార్గంబునుపదేశించువానిం జూపుచున్నాఁడు. ఓయిమిత్రుఁడా ముందరరథాగ్రంబునఁ బ్రసిద్ధుండైమహోన్నతుండైబంధువుల...పోవుకతంబున బోడమిన దుఃఖంబున దరువువలెజడుండైన యర్జునుండున్నాఁడతనికిముందటనుపదేశమార్గంబున్నది యయ్యుపదేశమార్గంబుశబ్దప్రధానంబగునుపనిషత్తుంబొందుచున్నది. యప్పట్టున యమునాతీరంబునంబుట్టినతమాలకాంతానంబులోనికాంతిపుంజంబుండు నత్తలంబుననుపనిషద్వాక్యంబులం జెప్పుచు శ్రీకృష్ణదేవుండు విహరించుచున్నాఁడతఁడవ్యాహతంబగుమార్గంబుఁజూపించుననుట. *

శ్లో॥ గోధూళిధూసరితకోమలగోపవేషంగోపాలబాలకశతై
రనుగమ్యమానం। సాయంతనేప్రతిగృహంపశుబంధనార్థం
గచ్ఛంతమచ్యుతశిశుంప్రణతోస్మినిత్యమ్॥ ౪౪

టీ॥ గోధూళిధూసరితకోమలగోపవేషం - గోధూళి,గోసమ్మర్దమువలనబుట్టినపరాగముచే- ధూసరిత- దూరసరవర్ణముగలదిగాజేయబడిన, కోమల - మృదువైన,గోపవేషం, గోపాలవేషముగలవాఁడును,గోపాలబాలకశతైః - అనేకులగుగోపాలబాలురచే - అనుగమ్యమానం, అనుసరింపఁబడుచున్నవాఁడును, సాయంతనే, సాయంకాలమందు, పశుబంధనార్థం, పశు-ఆవులయొక్క, బంధనార్థం,కట్టివేయుటకొఱకు,

ప్రతిగృహం-యింటింటికి-గచ్ఛంతం- పోవుచున్న-అస్మత్కశిశుం,అచ్యుత . నారాయణు డనియెడి- శిశుం-బాలునిగూర్చి-ప్రణతః,నమ్రుడను- అస్మి, అయితిని॥

ఉ॥గోపకధూళిధూసరితకోమలవేషముతోడసందెలం। గోప
కశాబకాళితనకుంగయితోడుగనింటనింటనుం । గ్రొవ్వులగ్రిట్ట
గాదిరుగుకృష్ణునిదామకరాభిశోభితుఁ। గోపకుమారునిందు
వదనున్మదనుంగనినయ్యగొల్చెదఁ॥ ❋

తా॥ గోవులసమ్మర్దంబునం బొడమినధూళిచేధూసరవర్ణంబగుగోపాలవేషంబు గలిగి గోపాలబాలక సమూహంబులు వెంటనంటిరా బ్రేపల్లియం బ్రతి గృహంబునకుందిరుగు గోపాలకృష్ణునిం గూర్చి ప్రణతుండనైతిననుట. ❋

శ్లో॥ నిధింలావణ్యానాంనిఖిలజగదాశ్చర్యనిలయంనిజావాసంభాసాం
నిరవధికనిశ్రేయసరసం। సుధాధారాసారంసుకృతపరిపాకం మృగ
దృశాంప్రపద్యేమాంగల్యంప్రథమమధిదైవంకృతధియామ్॥ ౪౫

టీ॥ లావణ్యానాం, కాంతివిశేషములకు, నిధిం, ఆకరమయినవాడును, నిఖిలజగదాశ్చర్యనిలయం, నిఖిల, సమ సమయిన- జగత్, లోకములయొక్క- ఆశ్చర్య- అచ్చెరువులకు- నిలయం-ఇల్లయినవాడును- భాసాం, కాంతులకు- నిజావాసం,నిజ- స్వకీయమైన-ఆవాసం, గృహమైనవాడును - సుధాధారాసారం, సుధా- అమృతము యొక్క- ధారాసారం- జడియైనవాడును-మృగదృశాం యువతులకు - సుకృతపరిపాకం - సుకృత-అదృష్టముయొక్క- పరిపాకం-ఫలస్వరూపమైనవాడును - కృతధియాం-విద్వాంసులయొక్క- మాంగల్యం- శుభమయినవాడును- అధిదైవం- దైవమయినవాడును-నిరవధికనిశ్రేయసరసం - అనవధరసస్వరూపుడైనవాడును - ప్రథమం.జగత్కారణుండైనకృష్ణుని- ప్రపద్యే- సేవించుచున్నాను.

ఉ॥చక్కదనంబుప్రోవురుచిసంతతిబొల్చినతావులోకమ। మ్మ
క్కజమునుంచుమదంటవికచాంబుజనేత్రజనోత్సవపంటపెంపుగ। నొప్పకై
దువము క్తిధామమమునీశులకాధిమధామమూర్యస। వ్యక్తమ్మా
తసౌధవపక్షమజమూమక మ్మైనమురారిగొల్చెదఁ॥ ❋

తా॥ కాంతివిశేషంబులకు నాకరంబై యెల్లలోకంబుల యచ్చెరువులకు నిల్లయినవాడును కాంతులకు బుట్టినిల్లయి నిరవధికానందరసస్వరూపంబై యమృతంబుజడియై బాల్లయువతుల యదృష్టఫలస్వరూపంబై జ్ఞానవంతులకధిష్ఠానదైవతమై సర్వ శుభంబులనిచ్చునదియై యాద్య గుడుమపెలయు శ్రీకృష్ణపరబ్రహ్మంబు సేవించుచున్నాననుట. ❋



శ్లో॥ఆతామ్రపాణికమలప్రణయప్రతోదమాలోలహారమణి
కుండలహేమసూత్రం।ఆవిశ్శ్రమాంబుకణమంబుదనీలమ
వ్యాదాద్యంధనంజయరథాభరణంమహోనః॥ ౪౬

టీ॥ ఆతామ్రపాణికమల ప్రణయప్రతోదం- ఆతామ్ర-అంతట నెఱ్ఱనైన- పాణికమల- హస్తకమలంబున-ప్రణయ- ప్రేమగలిగిన- ప్రతోదం, కశావిశేషముగలయదియు- ఆలోలహారమణికుండల హేమసూత్రం - ఆలోల- చలించుచున్న-హార- హారములును- మణి- మణివికారమయిన, కుండల-కుండలములును-హేమసూత్రం,బంగరుమొలనూలుగలిగినయదియు- ఆవిశ్శ్రమాంబుకణం- ఆవిః, ప్రకాశించుచున్న- శ్రమాంబుకణం - శ్రమోదకబిందువులుగలదియును, అంబుదనీలం- అంబుద, మేఘమువలె-నీలం- నల్లనైనయదియు- ధనంజయరథాభరణం, ధనంజయ- అర్జునునియొక్క-రథ,రథమునకు, ఆభరణం - భూషణమయిన,మహః- తేజము-నః, మమ్ము-అవ్యాత్-రక్షించుగావుత.

ఉ॥ కెంజగురాకుకేలగులకించుప్రతోదముచేతనాజిధా। నంజ
యవాజిరాజిగమనక్రియమేర్పడుపన్నాగంబునం। గ్రొంజెమ
టూజుహారమణికుండలముల్చలియింపనొప్పవ। య్యంజననీల
తేజమురథాభరణంబన యుంబుఁబ్రోవుతఁ॥ ❋

తా॥ ంకెంజిరురుంబోనికరంబునఁబ్రతోదంబుమెఱయహారంబులుకుండలంబులు మొలనూలునుంజలియింపనెంమగంబునం గ్రొంజెమటలూఱనీలమేఘంబుబోలె ధనంజయుని యరదంబున వెలుంగుతేజంబునన్నుంబ్రోచుగావుతయనుట. ❋

శ్లో॥నఖనియమితకండూన్పాండవస్యందనాశ్వానను దినమభిషిఞ్చ
న్నంజలిస్థైఃపయోభిః । అవతువితతగాత్రస్తోత్రనిష్యూత
మౌళిర్దశనవిధృతరశ్మిర్దేవకీపుణ్యరాశిః।

టీ॥దశనవిధృతరశ్మిః- దశన-దంతములచేత, విధృత-ధరియింపబడిన, రశ్మిః - పగ్గములుగలవాడును-తోత్రనిష్యూతమౌళిః. తోత్ర- ముసికోలతోడ, నిష్యూత, కూర్పబడిన- మౌళిః-శిరములుగలవాడును-వితతగాత్రః-వితత-విస్తరింపజేయబడిన- గాత్రః, శరీరముగలవాడును- నఖనియమితకండూన్- నఖ, గోళ్ళచేత - నియమిత-నివురబడినకండూన్, దురదగల- పాండవస్యందనాశ్వాన్- పాండవ- అర్జునునియొక్క- స్యందన-రథముయొక్క, అశ్వాన్- గుఱ్ఱములను- అంజలిస్థైః- దోయిటనున్న - పయోభిః, ఉదకములచేత-అనుదినం- ప్రతిదినమును - అభిషించన్ - స్నానముచేయించుచు

అంకిత - ముద్రింపబడిన, సర్వ - సమస్తమయిన, గాత్రం, శరీరముగలదియు, పవిత్రం- విమలమైన- ఆమ్నాయగిరాం, వేదాంతవాక్యములకు - అగమ్యం, పొందనలవిగానిదియు,నవనీతచోరం- నవనీత- వెన్నను, చోరం, దొంగిలించుచున్న- బ్రహ్మం - పరబ్రహ్మమును, ప్రపద్యే-భజించుచున్నాను.

మ॥ నవలావణ్యవిలాసినీనికరనానాబంధసంబంధస । ద్భవద
ర్థాంకశరీరువిశ్వపరమామ్నాయాంతవాచోవిధే।యవిహారు
న్నవనీతచోరుని బవిత్రాకారసుచారుని । న్భవసాధారుని
శాంతసారునిమంబూజింతు నెల్లప్పుడున్॥

తా॥ సౌందర్యవంతులగుగోపాలస్త్రీలయొక్క సంభోగచిహ్నంబులచేనంకితంబగు శరీరంబుగలిగి నిత్యశుద్ధంబయి వేదంబులచే దెలియనగమ్యంబయ్యును నవనీతచోరంబై వెలయు బ్రహ్మంబు భజించుచున్నాననుట.

శ్లో॥ అన్తర్గృహే కృష్ణమవేక్ష్య చోరం బధ్వా కవాటం జననీం గతైకా। ఉలూఖలే దామనిబద్ధమేనం తత్రాపి దృష్ట్వా స్తిమితా బభూవ॥

టీ॥ ఏకా-ఒకగోపిక, అంతర్గృహే-లోపలియింటను, చోరం- నవనీతాదిచోరకుడైన, కృష్ణం- శ్రీకృష్ణుని, అవేక్ష్య-చూచి - కవాటం-తలుపును, బధ్వా - బంధించి, జననీం- తల్లినిగూర్చి-గతాసతి, పోయి దగుదను-ఉలూఖలే-రోటియందు, దామనిబద్ధం, దామ, త్రాటిచేత,నిబద్ధం- కట్టుబడిన, ఏనం- ఈశ్రీకృష్ణుని-తత్రాపి,అక్కడను,దృష్ట్వా-చూచి- స్తిమితా, నిశ్చేష్టురాలు- బభూవ,ఆయెను.

చ॥ నిలయములోనాకర్తునవనీతహారున్ హరిగాంచిగట్టిగా।ద
లుపుబిగించియకొం-డుకుతల్లికిదెల్పగబోయియందులూ।ఖల
గుణబద్ధుడౌనతనిగన్గొనియాఅచ్చివచ్చిరిత్తఛా।నలుగనిసారె
కేకలిడవర్తిలునాబలుదంటగొల్చెదన్॥

తా॥ శ్రీపల్లెయందొకగోపికలోపలియింట వెన్నదొంగలించుచున్న శ్రీకృష్ణదేవునింగాంచి యయ్యింటితలుపుమూసి యశోదాదేవికింజెప్పరానక్కడరోలంగట్టబడియుండు శ్రీకృష్ణునింగాంచి యూరడిల్లియుంటికిమగుడనేతెంచి వెన్నలేనికుండనుంజూచి శ్రీకృష్ణునికృత్యంబునకువెఱగుపడియెననుట.

శ్లో॥ రత్నస్థలే జానుచరః కుమారస్సంక్రాన్తమాత్మీయముఖారవిన్దమ్। ఆదాతుకామస్తదలాభఖేదాద్విలోక్య ధాత్రీవదనం రురోద॥



టీ॥ జానుచరః - జానూ, మోకాళ్ళచేత-చరః,సంచరించుచున్న - కుమారః, శ్రీకృష్ణమూర్తి, రత్నస్థలే, రత్నమయప్రదేశమందు- సంక్రాంతం- ప్రతిబింబించిన -. ఆత్మీయముఖారవిందం- ఆత్మీయ, తనసంబంధమయిన, ముఖారవిందం-ముఖకమలమును- ఆదాతుకామః, గ్రహింపనిచ్ఛయించినవాడగుచు - తదలాభఖేదాత్, తత్- ఆ, ముఖకమలముయొక్క, అలాభ,అప్రాప్తివలననైన-ఖేదాత్- క్లేశమువలన, ధాత్రీవదనం- ధాత్రీ-దాదియొక్క -వదనం-ముఖమును-విలోక్య,చూచి-రురోద,ఏడిచెను.

మ॥ ఘనరత్నస్థగితావనిన్నిజముఖాకారంబుపద్మాకృతిం।గను
పట్టంగనినవ్వితద్గ్రహణకాంక్షం జిన్నికేల్సాచి చే।రనిఖేదంబు
నజానుయానముదకీర్పక దాదినీక్షించికా । వనుచుంబోరిడు
నందనందనునిమాయాడింభకుంగొల్చెదన్॥

తా॥జానువులచేసంచరించు శ్రీకృష్ణమూర్తి మణివికారంబగు పుడమిపై గ్రీడించుచునక్కడప్రతిబింబించిన తనమొగంబుకమలంబని గ్రహింపంబోయి రాకుండిన దేశంబున దాదిముఖంబుజూచిపోరిడెననుట.

శ్లో॥ ఆనన్దేన యశోదయా సమదనం గోపాఙ్గనాభిశ్చిరం సాశఙ్కం బలవిద్విషా సకుసుమైస్సిద్ధైః పృథివ్యాకులం। సేర్ష్యం గోపకుమారకైస్సకరుణం పౌరైర్జనైస్సస్మితం యో దృష్టస్స పునాతు నో మురరిపుః ప్రోత్క్షిప్తగోవర్ధనః॥

టీ॥ యశోదయా, యశోదాదేవిచేత - ఆనన్దేన - సంతోషముతోడను - గోపాంగనాభిః- గోపస్త్రీలచేతను- సమదనం- మన్మథునితోగూడుకొన్నట్టుల - బలవిద్విషా, దేవేంద్రునిచేత-చిరం-తడవుగా- సాశంకం, శంకతోగూడుకొన్నయట్టుల- సిద్ధైః, సిద్ధులచేతను- సకుసుమైః-పుష్పములతోడ, పృథివ్యా, భూమిచేత-ఆకులం, వ్యాకులమగునట్టుల, గోపకుమారైః-గోపాలకుమారులచేత, సేర్ష్యం, ఈసుతోగూడుకొన్నట్టుల- సకరుణైః, దయతోగూడినయట్టియు- పౌరైః, పురసంబంధులైన, జనైః. జనులచేత- సస్మితం - చిఱునగవుతోగూడుకొన్నట్టుల,యః, ఎవడు - దృష్టః, చూడబడియెనో- ప్రోత్క్షిప్తగోవర్ధనః- ప్రోత్క్షిప్త-ఎత్తబడిన- గోవర్ధనః, గోవర్ధనపర్వతముగలిగిన, సః-ఆప్రసిద్ధుడయిన-మురరిపుః,శ్రీకృష్ణమూర్తి-నః,మమ్ము,పునాతు-పవిత్రునిజేయుగావుత.

చ॥ముదమునసందగోపికలు మోహమునన్ జనపాళిసవ్వునం।ద్రి
దశవిభుండుసాధ్వసమునన్ సిద్ధులు వానగలన్ ద్రవత్సంగవుల్ । పొదలిన

యాతులత్వమునభూమియగోపకుమారులేక నన్ । సదయ
తబాతులుగ్నగపరసాథల మ త్తినచక్రిప్రోవుతన్॥

తా॥ యశోదచే నానందంబునను గోపస్త్రీలచేమన్మథోద్రేకంబుననింద్రునిచే సంతోషంబునను సిద్ధులచే నలరువానలంగరుణావంతులగు పౌరజనంబులచేనవ్వునం బుడమిచె నాతులంబున గోపకుమారులచేనీసునంజూడంబడుచునెవ్వండుగోవర్ధనంబెత్తెనో యట్టిశ్రీకృష్ణమూర్తి నన్నుబవిత్రునిగా జేయుగాతయనుట.

శ్లో॥ ఉపాసతామాత్మవిదః పురాణాః పరంపరస్తాన్నిహితంగుహాయ్యాం। వయంయశోదాశిశుబాలలీలాకథాసుధాసింధుషు లీలయామః॥

టీ॥ పురాణాః - పూర్వులయిన, ఆత్మవిదః, జ్ఞానులు-గుహాయ్యాం-గుహాయనుహృదయమందు- నిహితం; ఉంచబడిన- పరస్తాత్-పరమునకన్నను-పరం, పరమయినతత్త్వమును-ఉపాసతాం, ఉపాసింపని-వయం, మేము-యశోదాశిశుబాలలీలాకథాసుధాసింధుషు-యశోదా. యశోదాదేవియొక్క, శిశు-బిడ్డయయిన- శ్రీకృష్ణమూర్తియొక్క- బాలలీలా-బాలక్రీడాసంబంధములగు- కథా, కథలనియెడి- సుధాసింధుషు- అమృతనదులయందు-లీలయామః; విహరించుచున్నాము.

మ॥ దహరాకాశనివాసమౌపరమునాత్మజ్ఞానులీక్షించి ర । త్యహముంగాంతురుగాననేలయశోదాబాలలీలాసుధా। లహరీవీచిపరంపరంగదిసికొల్లల్గాగ్రిడించుస । న్మహానప్రౌఢి జెలంగుడెందమున సానందంబుసంధించెదన్॥

తా॥ పురాతనులగునాత్మవిదులుహృదాకాశంబునందుబరతత్త్వంబునిలిపియుపాసింతురు గాననే మల్లయశోదాశిశుండగుశ్రీకృష్ణుని బాలక్రీడలకథలనియెడియమృతమునదులయందువిహరించియానందము నొందుచున్నామనుట.

శ్లో॥ విక్రేతుకామాకిలగోపకన్యా మురారిపాదార్పితచిత్తవృత్తిః। దధ్యాదికం మోహవశాదవోచ ద్గోవింద దామోదర మాధవేతి॥

టీ॥ దధ్యాదికం, పెరుగుమొదలగువాని - విక్రేతుకామా - విక్రయింపవలయుననునిచ్ఛగలిగిన- గోపకన్యా, గోపకన్యక-మురారిపాదార్పితచిత్తవృత్తి, మురారి- శ్రీకృష్ణమూర్తియొక్క, పాద, పాదములయందు, అర్పిత, సమర్పింపంబడిన - చిత్తవృత్తిః-



త్తవ్యాపారముగలిగినదియై, మోహవశాత్, మోహవశమువలన, గోవిందదామోదరమాధవేతి, గోవింద-గోవిందాయనియు- దామోదర - దామోదరాయనియు, మాధవేతి, మాధవాయనియు-అవోచత్, పలికెనుగదా.

మ॥ నవలావణ్యవిలాసినీతిలకమానందంబునన్నందసం । భవపాదార్పితచిత్తవృత్తిమరలింపన్నేరకస్వేటిలో। నవనీతాదికమంముచోమఱపుజెందంబౌరులంగాంచిమా । ధవగోవిందముకుందకృష్ణయను సుద్యన్మోహవిభ్రాంతితోన్॥

తా॥ వ్రేపల్లియయందొక్క గోపయువతి పెరుగుమొదలగువాని నంమబోయిశ్రీకృష్ణుని పాదంబులయందుచిక్కినమనంబును రతింపనేరకయత్యంత మోహంబునందగిలి పెరుగుమొదలగువానినంమ్మటిచిగోవిందా- దామోదరా, మాధవాయని యీడునామంబులనుగ్గడించుచుండిరిగదనుట.

శ్లో॥ ఉలూఖలంవాయమినాంమనోవాగోపాంగనానాంకుచకుట్మలంవా । మురారినామ్నః కలభస్యనూనమాలానమాసీత్త్రయమేవభూమౌ॥

టీ॥ మురారినామ్నః, మురారి-శ్రీకృష్ణుడనియెడి- నామ్నః, పేరుగలిగిన. కలభస్య గున్నయేనుగునకు-ఉలూఖలంవా- రోలైనను, యమినాం, మునులయొక్క - మనోహమనమయినను-గోపాంగనానాం, గోపస్త్రీలయొక్క- కుచకుట్మలంవా- కుచకుట్మలమయిన-భూమౌ, భూమియందు- త్రయమేవ-నూడే-ఆలానం, కట్టుకంబము-ఆసీత్- ఆయెను- నూనం, నిశ్చయము.

చ। మునిజనమానసాంబుజహముంబశుపాలకబాలికామణీ। స్తనవనజాతకోరకవితానమలూఖలమున్మురారిమో । హనకలభంబునిల్పుటకునైవిలసిల్లినకట్టుకంబముల్ । దనరెడునోండు రెండునివి దకరూధరాస్థలిగల్గనేర్చునే॥

తా॥ మునిజనంబులమానసంబును గోపస్త్రీలముగ్గలవంటిచన్నులపిండును రోలునునిప్పుడమియందు శ్రీకృష్ణుండనుముప్పదియేండ్లప్రాయంబుగలగజంబునకు నింమూడుం గట్టుకంబంబులయ్యె నాండొక్కటిలేదయ్యెనిదినిక్కంబనుట.

శ్లో॥ కరారవిందేనపదారవిందం ముఖారవిందేవినివేశయంతం। వటస్యపత్రస్యపుటేశయానం బాలంముకుందంమనసాస్మరామి॥

టీ॥ కరారవిందేన- హస్తకమలములచేత- పదారవిందం, పాదకమలమును-ముఖార

వంటే,ముఖకమలమందు - వినివేశయంతం, ఉంచుచున్నవాడును-వటస్య- వటవృక్షముయొక్క- పత్రస్య, పర్ణముయొక్క-పుటే-పుటమందు-శయానం,పవళించిన-బాలం- బాలుడైన-ముకుందం-శ్రీకృష్ణుని,మనసా,మనస్సుచేత-స్మరామిస్మరించుచున్నాను.

శా॥ కేలందామరచేబదాబ్జమెలమింగీలించినెంమోముపై
బాళిన్గ్రోల్చివటప్రవాళమృదుశయ్యంబోల్చునబ్బాలునిన్। లీలా
లోల విశాలలోచనునిలాలింబెట్టిలాలించుచున్ । జోలల్పాడు
యశోదభాగ్యమునకేజోహారుగావించెదన్॥ ❋

తా॥ కరకమలంబునం బాదకమలంబుముఖకమలంబుపైనిడికొని వటపత్రంబునంబవ్వళించిబాలుడై వెలుగుముకుంధుని మనంబునస్మరించుచున్నాననుట.

శ్లో॥ శమ్భోస్వాగతమాస్యతామితయితోవామేనపద్మాసన
క్రౌఞ్చారేకుశలంసుఖంసురపతేవిత్తేశనోదృశ్యసే। ఇత్థంస్వ
ప్నగతస్యకైటభజితశ్శ్రుత్వాయశోదాగిరః కిం కింబాలకజ
ల్పసీతిరచితన్ధూధూకృతంపాతునః। ❋

టీ॥ హేశంభో-ఓయిశివుడా,స్వాగతం-కుశలమా యేమి,హేపద్మాసన-ఓయిపితామహుడా-వామేన, వామమార్గముచేత - ఆగచ్ఛ, రమ్ము-ఇతఇతః,ఈపార్శ్వమున ఆస్యతాం- కూర్చుండదగినది - హేక్రౌంచారే, ఓయికుమారుడా - కుశలం, కుశలమా యేమి- హేసురపతే, ఓయియింద్రుడాసుఖం-సుఖమాయేమి. హేవిత్తేశ- ఓయికుబేరుడా- నోదృశ్యసే, చూడబడవేమి-ఇత్థం- ఈప్రకారముగా - స్వప్నగతస్య - కల కలగనుచున్న-కైటభజితః-శ్రీకృష్ణమూర్తియొక్క- గిరః,వాక్యములను- యశోదా,యశోదాదేవి - శ్రుత్వా,విని-హేబాలక, ఓయిశ్రీకృష్ణా, కింకంజల్పసి, యేమేమిమాటలాడితివి-ఇతి,ఇట్లని-రచితం,చేయబడిన-ధూధూకృతం - ధూధూకారము- నః- మమ్ము పాతు-రక్షించుగాత.

మ॥ హర రారమ్ముశుభంబెడాపలను భాషాధీశకూర్చుండుమా
పరిణామంబెకుమారయింద్రసుఖమేపౌలస్త్యపేక్షింపవే। స
రణిన్స్వప్ననగాయశోదపని వత్సాయేమియేమంచుని। ద్దురమ
బ్బాలికకృష్ణుపైనిడినధూధూకారముల్ప్రోవుతన్॥ ❋

తా॥ ఓయిశివుడానీకుకుశలంబెయోపితామహుడాయిటువచ్చిడాపలం గూర్చుండుమో కుమారస్వామీనీకుభద్రంబెయోయింద్రానీకుసుఖంబెయో కుబేరుడానీవు చూడఁబడవేమియని యీరీతింగలలోననుడువు శ్రీకృష్ణుని యాలాపంబులవినియశోదయేమే



మిరాబాలకా యివ్విధంబునంబలికెదవనుచుం జేయుధూధూకారంబు మముంబ్రోచుగావుత.

శ్లో॥ మాతఃకింయదునాథదేహిచషకంకింతేన పాతుంపయ
స్తన్నాస్త్యద్యకదాస్తివానిశినిశాకావాంధకారోదయే।ఆమీ
ల్యాక్షియుగంనిశాప్యుపగతా దేహీతిమాతుర్ముహుర్వక్షో
జాంశుకకర్షణోద్యతకరఃకృష్ణస్సపుష్ణాతునః॥ ❋

టీ॥ హేమాత - ఓతల్లీ, హేయదునాథ, ఓశ్రీకృష్ణా, కిం- ఏమి-చషకమ్, పానపాత్రమును- దేహి- ఇమ్ము- తేన- ఆపానపాత్రముచే-కిం, ఏమి, పయః,పాలను - పాతుం- పానముచేయుటకొఱకు, తత్, ఆక్షీరము,అద్య- ఇప్పుడు- నాస్తి- లేదు, కదావా- ఎప్పుడు- అస్తి, కలదు,నిశి,రాత్రియందు-నిశా-రాత్రి, కావా-ఏది, అంధకారోదయే- అంధకార-చీకటియొక్క, ఉదయే, ఉత్పత్తియందు, అక్షియుగం - కనుదోయిని- ఆమీల్య- మూసుకొని,నిశాపిరాత్రియును-ఆగతా, వచ్చినది, చషకం - పానపాత్రమును- దేహి,ఇమ్మని-ముహుః- సారెకును-మాతుః, తల్లియైనయశోదయొక్క, వక్షోజాంశుక- పయ్యెదయొక్క- కర్షణ,లాగుటయందు- ఉద్యతకరః, ఉద్యత- ఉద్యుక్తమైన-కరః, హస్తముగల, సః - ఆప్రసిద్ధుడైన - కృష్ణ, శ్రీకృష్ణమూర్తి, నః, మమ్ము, పుష్ణాతు పోషించుగావుత.

ఉ॥ అమ్మయిదేమిరాయదుకులాగ్రణిగిన్నెయొసంగుమేలపా
లిమ్ముగ్రావలేదిపుడదెప్పుడురేయదియెట్టిదంధకా। రమ
గునన్నకన్మొగిచిరాతిరివచ్చెనువేగబాలుతే । తెమ్మనితల్లిపై
టపడిదియ్యుముకుంధుడునన్నుబ్రోవుతన్॥ ❋

తా॥ ఓతల్లీ యోయదుకులనాథా యేమిరాయనిన పానపాత్రమునిమ్మనిన దానిచే నేమనిన పాలుద్రావననిన పాలిప్పుడులేవనిన నింకెప్పుడనిన రాత్రి కనిననారాత్రి యెప్పుడనిన నంధకారోదయమందనిన కన్నులుమొగిచి రాత్రివచ్చెనింకందెమ్మనితల్లిపయ్యెదచెఱగునాకర్షింపనుద్యుక్తంబగుకరంబుగల గోపాలదేవుండునన్ను బోషించుగాతయనుట.

శ్లో॥ కాళిందీపులినోదరేషుముసలీయావద్గతఃఖేలితుంతావత్క
ర్పూరికంపయఃపిబహరేవర్ధిష్యతేతేశిఖా। ఇత్థంబాలతయాప్ర

దారణపరశ్శ్రుత్వాయశోదాగిరః పాయాన్నస్స్వశిఖాంస్పృ
శన్ సముదితః క్షీరేర్ధపీతే హరిః॥ *

టీ॥ ముసలీ- బలరామస్వామి- కాళిందీపులినోదరేషు- కాళీ-దీ- యమునానదియొక్క- పులిన- ఇసుకదిన్నెలయొక్క- ఉదరేషు, మధ్యప్రదేశములయందు - ఖేలితుం విహరించుటకొఱకు- యావత్ - ఎంతపర్యంతము- గతః- పోవునో, తావత్, అంతలోపలను- హేహరే-ఓశ్రీకృష్ణ-కర్బరికం-బంగరుగిన్నెయ యుండిన- పయః- క్షీరమును-పిబ-పానముచేయుము-తే,నీయొక్క,శిఖా- సిగ-వర్థిష్యతే - వృద్ధిబొందుచున్నది,ఇత్థం - ఈరీతిని- బాలతయా- బాలుడౌటచేత- ప్రతారణపరః, ప్రతారణ, వంచనయందు-అనగా శిఖావర్ధనమందు-పరః.ఆసక్తుడగుచు-యశోదాగిరః- యశోదావాక్యములను శ్రుత్వా- విని- ప్రమోదితః- సంతోషించినవాడగుచు-క్షీరే-క్షీరము-అర్ధపీతేసతి-సగముపానముచేయబడుచుండగా,స్వశిఖాం- స్వ- స్వకీయమైన శిఖాం - సిగను- స్పృశన్ - స్పృశించుచున్న-హరిః-శ్రీకృష్ణమూర్తి-నః,మమ్ము-పాయాత్-రక్షించుగాత.

ఉ॥ హేళితనూభవా పులినహేలజరించుబలుండు రాకమున్
బాలక పైడిగిన్నెగలపాల్వెసనానుము గొప్ప వెంట్రుకల్గా వెలు
నటన్ననందసతిలాలనమాటలకుబ్బిసాము పాల్గ్రోలుచు జుం
చు జూచుకొను గోపకుమారుడు నన్నుబ్రోవుతన్॥ *

తా॥ ఓయిశ్రీకృష్ణ బలరాముండు యమునానదియిసుకదిన్నెలయందు క్రీడింపం బోయెనందు రాకమున్నె బంగరుగిన్నెయందలి పాలద్రావుము సిగ పెరుగునని న యశోద మాటలువిని బాల్యంబుగాన సిగ పెరుగుటయందు ఆసక్తుండగుచు సగంబు ద్రావి పెరిగినదో లేదో యని సిగ చూచుకొను శ్రీకృష్ణమూర్తి నన్నుబ్రోచుగాతయనుట,

శ్లో॥ కైలాసో నవనీతతి క్షితిరియం ప్రాగ్జగ్ధమృల్లోష్టతి। క్షీరోదోపి నిపీతదుగ్ధతి లసత్స్మేరే ప్రఫుల్లే ముఖే।మాత్రాజీర్ణధియా
దృఢం చకితయా నష్టాస్మి దృష్టః కయా।ధూధూవత్సక జీవజీవచి
రమిత్యుక్తోవతాన్నో హరిః॥ *

టీ॥ లసత్స్మేరే-లసత్-ప్రకాశించుచున్న- స్మేరే,చిఱునగవుగలిగిన- ముఖే,శ్రీకృష్ణముఖము- ప్రఫుల్లె-వికసించినదియగుచుండగా - కైలాసః,కైలాసపర్వతము-నవనీతతి-వెన్నవలెనాచరించుచుండగా-ఇయం, ఈ-క్షితిః-భూమి- ప్రాగ్జగ్ధమృల్లోష్టతి- ప్రాగ్జగ్ధ-పూర్వమందుభక్షింపబడిన- మృల్లోష్టతి,బుఱియుండవలెనాచరించుచుండగా-క్షీరోదోపి- పాలకడలియును- నిపీతదుగ్ధతి-నిపీత- పానముచేయబడిన,దుగ్ధతి- పాలవలెనాచరించుచుండగా, అజీర్ణధియా - అజీర్ణబుద్ధిచేత- దృఢం, దృఢముగాను, చకితయా - భయపడినయట్టి-మాత్రా-తల్లియైనయశోదచేత- కయా, ఎవ్వరిచేతను- దృష్టః, చూడబడితినో-నష్టాస్మి- నష్టురాలనయితిని- హేవత్సక- ఓయికృష్ణ - ధూధూ, ధూధూకారము,చిరం-చిరకాలము- జీవజీవ-జీవించుచూ.ఇతి-ఈప్రకారము-ఉక్తః - చెప్పబడినహరిః-శ్రీకృష్ణమూర్తి-నః-మమ్ము-అవతాత్-రక్షించుగావుత.



చ॥ ననిచిననవ్వునెంమొగమునన్ ధరభక్షితమృత్తుగాబరయో।
వనధిని పీతదుగ్ధసమవస్థితిగా రజతాద్రివెన్నగా। గనిభ్రమజెల్ల
నే చెలువగాంచెనో దృష్టిగనంచునంబదీ । వనలును ధూతరా
తల్లినిను ప్రవర్తిలు పాపని ప్రాపుగాంచెదన్॥ *

తా॥ ఒకనాడు యశోద కృష్ణుని నోరచూచి యందు కైలాసాదులు గనుపడవాని నవనీతాదులుగా నెంచి తన కుమారుడు మ్రింగినయవి యన్నియు జీర్ణము గాలేదు ఎవ్వతె చూచినందున దృష్టి తాకెనో నేనేమిసేతును చెడిపోతునని దుఃఖించి ధూధూకారపూర్వకముగా నో బాలుడా చిరకాలము నీవు జీవింతువు గాక యని దీవించ వెలుంగు కృష్ణుడు మమ్ము బ్రోచుగాక యనుట.

శ్లో॥ కించిత్కుంచితలోచనస్య పిబతః పర్యాయపీతం స్తనం స
ద్యః ప్రస్నుతదుగ్ధబిన్దుమపరం హస్తేన సమ్మార్జతః। మాత్రైకా
ఙ్గులిలాలితస్య చుబుకే స్మేరాననస్యాధరే శౌరేః క్షీరకణాన్వి
తానిపతితా దన్తద్యుతిః పాతునః॥ *

టీ॥ పర్యాయపీతం- పర్యాయ, వరుసగా- పీతం యథాతథా, త్రావబడినట్లుగా, స్తనం- ఒక స్తనమును, పిబతః- పానముచేయునట్టినిన్ని, కించిత్కుంచితలోచనస్య, కించిత్- కొంచెము, కుంచిత,వంచబడిన, లోచనస్య, నేత్రముగలయట్టినిన్ని- సద్యః- ప్రస్నుతదుగ్ధబిందుం-సద్యః,అప్పుడు-ప్రస్నుత.కారుచునట్టి-దుగ్ధబిందుం- పాలబిందువుగలిగిన, అపరం-మఱియొక స్తనమును, హస్తేన-చేతతో, సంమార్జతః-స్పృశించుచున్నట్టినిన్ని- మాత్రా,తల్లిచేత, చుబుకే - గడ్డమునందు- ఏకాంగులిలాలితస్య- ఏకాంగులి- ఒకవ్రేలిచేత, లాలితస్య- లాలింపబడినట్టినిన్ని,స్మేరాననస్య - చిఱునవ్వుతోగూడిన ముఖము గలయట్టి-శౌరేః-కృష్ణునియొక్క-అధరే- మోవియందు-నిపతితా-పడియున్నట్టి, క్షీరకణాన్వితా- పాలబిందువులతోకూడినట్టి- దంతద్యుతిః - దంతకాంతి,నః- మమ్ము - పాతు-రక్షించుగాక.

చ॥ ఒకకుచమూని పాల్గురియనొకట కుచంబొక కేలబూని యా
ముకుళితనేత్రుఁడై జననిముద్దునకుం జుబుకన్ప్రవేలజిట్టక ముగ
నంటమోసి బ్రకటంబగు లేనగవొప్పు శౌరిదుగ్ధకణసమేతదరం
తరుచితత్పరతన్ననుఁ బ్రోచుగావుతన్॥ *

తా॥ యింకొకచన్ను ద్రాగి తరువాత మఱియొకచన్ను ద్రాగునపుడు కన్నులనుగొంచెము వంచుకొని యొకచేతితో వాత్సల్యమువలన బాలుగారుచున్నట్టి యొకచన్ను స్పృశించుచునుండగా నపుడు తల్లి యొక్క వ్రేలిచే గడ్డముపట్టి లాలింపగా నవ్వుచున్నట్టి చిన్నికృష్ణునియొక్క మోవియందు పాలబిందువులతో దగనుపడుచున్న చిఱునవ్వు నన్ను రక్షింపవలయుననుట.

శ్లో॥ ఉత్తుఙ్గస్తనమణ్డలోపరిలసత్ప్రాలమ్బముక్తామణేరన్తర్బి
మ్బితమిన్ద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతిః। లజ్జావ్యాజముపే
త్యనమ్రవదనా స్పష్టం మురారేర్వపుః పశ్యన్తీ ముదితా ముదేస్తు
భవతాం లక్ష్మీర్వివాహోత్సవే॥ *

టీ॥ వివాహోత్సవే - వివాహరూపమయినయుత్సవకాలమందు, లజ్జావ్యాజం-సిగ్గనువ్యాజమును- ఉపేత్య-పొంది-నమ్రవదనా-నమ్ర, వంగియున్న, వదనా-ముఖముగలదియై, ఉత్తుంగస్తనమండలోపరిలసత్ప్రాలంబముక్తామణేః - ఉత్తుంగ, ఉన్నతములయిన స్తన, చన్నులయొక్క, ఉపరి-పైన, లసత్- ప్రకాశించుచున్న- ప్రాలంబ, హారముయొక్క- ముక్తామణేః, ముత్యములయొక్క, అంతః, నడుమ-బింబితం, ప్రతిఫలించుచున్న, ఇంద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతి- ఇంద్రనీల,ఇంద్రనీలమణుల యొక్క, నికర - సమూహముయొక్క, ఛాయా, కాంతిని-అనుకారి, అనుకరించుచున్న - ద్యుతిః, కాంతిగల- మురారేః- కృష్ణునియొక్క-వపుః, దేహమును-స్పష్టం, స్వచ్ఛముగా - పశ్యంతి చూచుచున్నదియు, ముదితా-సంతోషముపొందినదియునైన-లక్ష్మీః, రుక్మిణీరూపియైన లక్ష్మీదేవి, భవతాం-మీకు-ముదే-సంతోషముకొరకు-అస్తు-అగుగాక.

మ॥ హరినీలచ్ఛవిగేరుశౌరిమృదుదేహచ్ఛాయవక్షోరుహో।
పరిముక్తామణియందుగన్పడత్రపావ్యాజంబునంబెండ్లికూ।తు
రుహాగావున మోమువాంచికొనిసంతోషస్థితింజెందునిం।దిర
మాకీవుతనిష్టసంపదదయాదృష్టిన్విలోకించుచున్॥ *

తా॥ రుక్మిణీదేవివివాహకాలమందు కృష్ణునిజూడవలయుననునభిప్రాయము గలదియై లజ్జాతిశయమునవలన ముఖంబును వంచుకొనునపుడు తనకంఠమందు విలసిల్లు హారపు ముత్యములయందు ప్రతిబింబరూపముగాగనుపడు నాకృష్ణుని నీలమణిచ్ఛాయమెఱయు దివ్యమూర్తిఁ గనుగొని మనోరథసిద్ధిబొందెను అట్టి రుక్మిణీదేవి మీకు సంతోషంబు లొసంగుగాకయనుట.



శ్లో॥ కృష్ణేనామ్బ గతేన రన్తుమధునా మృద్భక్షితా స్వేచ్ఛయా
తథ్యం కృష్ణ క ఏవమాహ ముసలీ మిథ్యామ్బ పశ్యాననమ్। వ్యా
దేహీతి విదారితే శిశుముఖే దృష్ట్వా సమస్తం జగన్మాతా యస్య జ
గామ విస్మయపదం పాయాత్స నః కేశవః॥ *

టీ॥ హే అంబ, ఓయమ్మ-రంతుం, ఆటలాడుటకు, గతేన, పోయినట్టి- కృష్ణేన- కృష్ణునిచేత, స్వేచ్ఛయా, తనయిచ్ఛచేత,మృత్, మన్ను,భక్షితా, భక్షింపఁబడినది, (అని బలభద్రుఁడు చెప్పగావిని) హే కృష్ణ, ఓయికృష్ణ, తథ్యం యథార్థమా (అనియశోద చెప్పగావిని) ఏవం,ఇట్లు,కః,యెవ్వఁడు, ఆహ,చెప్పెను- (అనికృష్ణుండు పలుకగా నందుకు) ముసలీ,బలరాముఁడు, (అనియశోదయుత్తరము సెప్పవిని) మిథ్యా,అబద్ధము- ఆననం- నోటిని, పశ్య,చూడుము. (అనికృష్ణుఁడు పలుకగావిని) వ్యాదేహి, తెఱవుము,ఇతి,అని, (యశోదపలుకుటవిని) విదారితే- తెఱవఁబడిన-శిశుముఖే- బాలరూపుడైనకృష్ణునినోటియందు- సమస్తం- సకలమైన, జగత్, లోకమును,దృష్ట్వా-చూచి-యస్య యెవ్వనియొక్క- మాతా,తల్లియైనయశోద, విస్మయపదం,ఆశ్చర్యస్థానమును,జగామ పొందెనో,సః,అట్టివాఁడైన,కేశవః, శ్రీకృష్ణుఁడు- నః,మమ్ము- పాయాత్-రక్షించుగాక.

మ॥ మనుభక్షించితెకృష్ణయెవ్వరనిరం మీయన్నయన్నాడె
క। న్గొనునా మోముదికల్ల చూపుమనుచున్నోరెత్తవిశ్వంబులె
ల్లనుగన్పించిననింత పెళ్ళసినసిలాగవ్యాశ్చర్యమం।దునువీ
క్షించుయశోదఁగాంచినగుకృష్ణుగాంతునశ్రాంతమున్॥ *

తా॥ ఓయికృష్ణ మన్నారగించితివా యని యశోదయడుగ కృష్ణుండు మాయెవ్వరెట్లు చెప్పిరనియె- బలరాముడు చెప్పెనని తల్లి చెప్పినది కల్ల నోటుజూడుమని చెప్పి సకలజగంబులకును నికె పట్టగుతన వక్త్రంబు చూపి నిజమాతయగు యశోదకు నచ్చెరువు కలుగంజేయు కేశవుండు మము బ్రోచుగాకయనుట.

శ్లో॥ స్వాతీసపత్నీకిల తారకాణాం ముక్తాఫలానాం జననీతిరో
షాత్। సా రోహిణీ నీలమసూత రత్నం కృతాస్పదం గోపవధూ
కుచేషు॥ *

టీ॥ తారకాణాం, నక్షత్రంబులకు - సపత్నీ, సవతియైనట్టి, స్వాతీ- స్వాతీనక్షత్రంబు, ముక్తాఫలానామ్, ముత్యంబులకు, జననీ, ఉత్పాదకంబు, ఇతి- అని, రోషాత్, రోషంబువలన, సా రోహిణీ- ఆ రోహిణీనక్షత్రంబు, గోపవధూకుచేషు, గోపవధూ, గోపస్త్రీలయొక్క, కుచేషు, గుబ్బలయందు, కృతాస్పదం, కృత, చేయఁబడిన, ఆస్పదం, స్థానంబు గలిగినట్టి, నీలవర్ణమయిన, రత్నం, రత్నంబును- అభూత- కనెన్.

ఉ॥ తారల కెల్లను౯ సవతి దానగు స్వాతి విశుద్ధమౌక్తికో। దా
రమణుల్గనంగ నిని జాత్మ ససూయ వహించి రోహిణీ। తారక
గాన్పె గోపవనితా కుచ కోరక హారసంగతి౯। జేరిన కృష్ణనా
యకమణిక్రరవికోటిఘృణిస్ఫురదంబున౯॥ ❋

తా॥ శ్రీకృష్ణమూర్తి రోహిణీనక్షత్రమందవతరించెను దానిను త్ప్రేక్షించుచున్నాడు, ఎట్లనగా, స్వాతి ముత్యంబున త్పాదించి ప్రసిద్ధిఁ బొందెనుగదా దానికి సమానమైననేను దానికధికమయిన ప్రసిద్ధిఁబొందవలయునని తలంచి రోహిణీనక్షత్రంబు శ్రీకృష్ణుఁడను నీలరత్నంబును గనెనని తోచుచున్నది, రత్నంబు స్త్రీలకుచంబులపై విలసిల్లును అట్టి వనీలరత్నంబును గోపికలకుచంబులయందు ప్రకాశించుచున్నది - ఇందువలన ముత్యంబులకంటె రత్నంబు విశేషంబుగావున స్వాతికంటె రోహిణీయాధిక్యంబును బెందెను స్వాతి ముత్యంబులను గనుట స్వాతీప్రవేశమందు గురియు వానబిందువులు ముత్యంబులౌనని ప్రతిపాదించుట రత్నశాస్త్రంబువలన స్పష్టంబు ఇదియనుగాక, స్వాతిముక్తముక్తిపొందినవారలకు నఫలఫలంబు కానివారలను గనుచున్నది, ఈ రోహిణీయోముక్తులకు ఫలరూపమయినట్టి నీలమణిని గనుచున్నది యనియు నొక తాత్పర్యంబు ధ్వనించుచున్నది.

శ్లో॥ నృత్యంతమత్యంతవిలోకనీయం కృష్ణం మణిస్తంభగతం
మృగాక్షీ। నిరీక్ష్య సాక్షాదివ కృష్ణమగ్రే ద్విధా వితేనే నవనీతమ
కమ్॥ ❋

టీ॥ నృత్యం, నర్తనంబు చేయుచున్నవాడును, అత్యంతవిలోకనీయం, అత్యంత, మిక్కిలి, విలోకనీయం, చూడదగినవాడును, మణిస్తంభగతం మణిస్తంభ, రత్నస్తంభమును, గతం, (ప్రతిబింబరూపముగ) పొందినవాడును నగు, కృష్ణుః, కృష్ణుని, మృగాక్షీ, యశోద, అగ్రే, యెదుట, సాక్షాత్, యథార్థమయిన, కృష్ణమివ, కృష్ణునివలె నిరీక్ష్య, చూచి, ఏకం, ఒకటియైన, నవనీతం, వెన్నను, ద్విధా, రెండుఖండములుగాను వితేనే, చేసెను.



మ॥ ప్రకటానందవిచిత్రనాట్యపరుఁడౌ బాలున్ విలోకించుచుం।
జకితాలోకకురంగలోచన మణిస్తంభంబులో నీకరూపై। నకు
మారున్ వేఱెదోచునీడ చెలువొందం గాంచి భాగించెనా। తత్కరాంభోజమునందునున్న నవనీతంబ వ్వేడ౯ రెండుగ౯॥ ❋

తా॥ యశోద కృష్ణుడాడుచుండగా వాని ప్రతిబింబంబును రత్నస్తంభంబునందు జూచియదారమైన కృష్ణుండనితలంచి వెన్నముద్దను రెండుముద్దలుగా బంచెననుట.

శ్లో॥ వత్సజాగృహి విభాతమాగతం జీవ కృష్ణ శరదాం శతం
శతమ్। ఇత్యుదీర్య సుచిరం యశోదయా దృశ్యమాన వదనం భ
జామహే॥ ❋

టీ॥ హేవత్స- ఓబిడ్డా, విభాతం- ప్రాతఃకాలము, ఆగతం- వచ్చెను, జాగృహి- మేల్కొనుము- హేకృష్ణ, ఓకృష్ణ- శతం, అనేకమయిన- శరదాం, సంవత్సరములయొక్క, శతం- నూటియందు, జీవ- జీవింతువుగాక, ఇతి- ఈలాగున, ఉదీర్య- చెప్పి, సుచిరం- బహుకాలము, యశోదయా- యశోదచేత, దృశ్యమాన వదనం- దృశ్యమాన, చూడబడిన- వదనం, ముఖముగలిగిన, కృష్ణం- కృష్ణుని- భజామహే, భజించుచున్నాము. ❋

ఉ॥ వెన్నయుబాలుద్రాగుదువు వేగమెలెమ్ము కుమార తెల్లవా।
రెన్నను గన్నతండ్రి నిదురింపకు లేపది వేలయేండ్లునీ। కున్నెఁ
యాయువయ్యెడు ముకుందయటన్న యశోద జూచు నవ్వెన్నని
ముద్దునెమ్మొగము వేడుక మీర భజింతు మెప్పుడు౯॥ ❋

తా॥ యశోదాదేవి పవ్వళించియున్న కృష్ణుని గృష్ణా తెల్లవారెను మేలుకొనుమని లేపి చిరంజీవియని దీవించి వాని ముఖము జూచి సంతోషపడెను అట్టి కృష్ణుని ధ్యానించుచున్నాననుట.

శ్లో॥ ఓష్ఠం జిఘ్రన్ శిశురితి ధియా చుంబితో వల్లవీభిః కంఠం గృ
ష్ణన్ సాఽరుణితపదం గాఢమాలింగితాంగః। దోష్ణా౯ లజ్జాపదమ
భిమృశన్నంకమారోపితాత్మా ధూర్తస్వామీ హరతు దురితం
దూరతో బాలకృష్ణః॥ ❋

టీ॥ శిశురితి- బిడ్డండను, ధియా- బుద్ధిచేత, వల్లవీభిః- గోపస్త్రీలచేత, చుంబితస్సన్- చుంబనము చేయబడినవాడై, అరుణితపదం- అరుణిత, ఎఱ్ఱగా జేయబడిన- పదం, ప్రదేశముగలుగునట్లుగా, ఓష్ఠం- అధరమును, జిఘ్రన్- సీత్కారపూర్వకముగా గ్రహించుచు

ను, గాఢం- దృఢముగా, ఆలింగితాంగస్సన్- ఆలింగిత-కౌగలింపబడిన,అంగస్సన్-దేహముకలవాఁడై- కంఠం,కంఠమును- గృహ్ణాన్, ఆలింగనము చేయుచును- అంకం-ఒడిని,ఆరోపితాత్మ-ఆరోపిత, ఎక్కింపబడిన-ఆత్మాసన్, దేహముగలవాఁడై-లజ్జాపదం, లజ్జాస్థానమును- దోష్ణా, చేతితో-అభిమృశన్, స్పృశించుచున్నవాఁడును- ధూర్తస్వామి, ధూర్త- విటులకు,స్వామి- అధిపతియైనవాఁడునగు, బాలకృష్ణః - బాలకృష్ణుఁడు, దురితం-పాపమును, మానతః, దూరమున-హరతు, హరించుగాక. ※

ఉ॥ బాలుఁడటంచు ముద్దులిడ బాలలఁబట్టుక మోవినొక్కెఁ గెం
గేలఁదెమల్చి చన్మొనలు కేతనమంకముమీఁదనుంపఁ జా
ల్చాలనటంచు నెత్తికొనఁ జన్గవఁబట్టుక కౌఁగిలించు గో
పాలకధూర్తశేఖరుఁడు పాపము బాపి కృతార్థుఁ జేయుతన్॥ ※

తా॥ గోపికలు చిన్నబిడ్డఁడని తలచి ముద్దిడఁగా మహావిటుని వలె వారల మోవియెత్తి గాఁబండి గురుతుగలుగునట్లు జుంబనము సేయుచు బిడ్డఁడని యాలింగనము సేయువారల నాలింగనము సేయుచు నొడియందెత్తిపెట్టుకొనఁగా లజ్జాస్థానమగు మదనగృహమును గేల స్పృశించుచు-విటోపకారియైన బాలకృష్ణుఁడు పాపములను బోగొట్టుంగాకయనుట. ※

శ్లో॥ ఏతేలక్ష్మణ జానకీవిరహితం మాం ఖేదయన్త్యమ్బుదా
మర్మాణీవ చ ఘట్టయన్త్యలమమీ క్రూరాః కదమ్బానిలాః। ఇత్థం
వ్యాహృతపూర్వజన్మచరితం యో రాధయా వీక్షిత
స్సేర్ష్యాశంకితయా స నస్సుఖయతు స్వప్నాయమానో హరిః॥ ※

టీ॥ హేలక్ష్మణ-ఓలక్ష్మణ, ఏతే- ఈ, అంబుదాః- మేఘములు,జానకీవిరహితం- జానకీ, సీతచేత- విరహితం, శూన్యుఁడైన-మాంప్రతి, నన్నుగూర్చి- ఖేదయంతి. దుఃఖింపఁజేయుచున్నవి-క్రూరాః-క్రూరములైన, అమీః- ఈ- కదంబానిలాః-కడిమిపువ్వులవాయువులు-మర్మాణి, మర్మస్థానములను- అలం,మిక్కిలి- ఘట్టయంతి వచ్, ప్రహరించుచున్నవి- ఇత్థం-ఈలాగున,వ్యాహృతపూర్వజన్మచరితం యథాతథా- వ్యాహృత, చెప్పబడిన-పూర్వజన్మ-పూర్వజననముయొక్క- చరితం - యథాతథా,చరిత్రములుగల్గునట్టులుగా-స్వప్నాయమానః- స్వప్నమున ననుభవించుచున్నవాఁడును, సేర్ష్యా-అసూయతోఁగూడినట్టులు, ఆశంకితయా- సందేహపడుచున్న, రాధయా- రాధచేత, వీక్షితః-చూడఁబడిన వాఁడునగు,హరిః-కృష్ణుఁడు,నః- మమ్ము, సుఖయతు-సుఖవంతులుగాఁ జేయుగాక. ※

శా॥ అన్నా లక్ష్మణ జానకీరహితుఁ నన్నంభోధరశ్రేణియీ। స
న్నంపున్ వలిగాలిసుమర్మములనొంచఁజొచ్చెనంచుం బురా।



ఖిన్నత్వంబున వింపనీసు నెఱప్రంగీల్లో నున్న చిత్తంబుతో । ద
న్నున్ రాధిక గాంచఁగాఁ గలవరింతం గూరుఁ వాఁ డేలుతన్॥ ※

తా॥ కృష్ణుఁడొకనాఁడు కలలో లక్ష్మణుని జూచి తనకు సీతావిరహకాలమందు మేఘములును జల్లని గాలియు మిక్కిలి బాధకంబులయియున్నవి యని తన రామావతార చరిత్రము చెప్పుచుండ రాధాదేవి పేరువనితయందు తనకెంత ప్రీతియధికముగనున్నదియని యీర్ష్యలేని తనముతోఁ గృష్ణుని చూచెను అటు చూడఁబడిన కృష్ణుఁడు మాకు సుఖము గలుగఁ జేయుఁ గాక యనుట. ※

శ్లో॥ ఓష్ఠం ముఞ్చ హరే బిభేమి భవతా పానైర్హతా పూతనా
కణ్ఠాశ్లేషమముం జహీహి దళితా వా ర్జునేనార్జునా। మా దేహీ
చ్ఛురితం హిరణ్యకశిపుర్నీతో నఖైః పఞ్చతా మిత్థం వారితరాత్రి
కేళిరవతాల్లక్ష్మ్యాపహాసాద్ధరిః॥ ※

టీ॥ హేహరే-ఓయికృష్ణా, ఓష్ఠం-అధరమును, ముంచ-విడువుము- బిభేమి-భయపడుచున్నాను, భవతా-నీచేతను, పానైః- పానములచేత, పూతనా- పూతనయనురక్కసి, హతా-చంపబడెను, అముంకంఠాశ్లేషం- ఈకంఠాలింగమునను, జహీహి-విడువుము, బిభేమి- భయపడుచున్నాను, ఆలింగనేన-కౌఁగిలింతచేత, అర్జునా-మద్దిచెట్టు, దళితౌ-కొట్టఁబడినవి, ఛురితం-నఖక్షతమును, మాదేహి-చేయకుము, బిభేమి-భయపడుచున్నాను, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుఁడు, నఖైః-గోళ్ళచేత, పంచతాం - మృతిని, నీతః-పొందింపఁబడెను, ఇత్థం, ఈప్రకారముగా-లక్ష్మ్యా, రుక్మిణీదేవిచేత- అపహాసాత్, అపహాసమును హేతువువలన-వారితరాత్రికేళిః-వారిత, నివారింపబడిన-రాత్రికేళిః,నిశాక్రీడగల-హరిః, శ్రీకృష్ణమూర్తి- అస్మాన్-మమ్మును, అవతాత్-రక్షించుగాకుత.

ఉ॥ అమ్మకచెల్ల మోవిచవియానకు పూతనసోలెఁ గ్రోలఁగా । క్ర
మ్మకు రొమ్ముఁబల్మిని ధరంబడె మద్దులు కానఁగోటిచే। జిమ్మకు మీ
హిరణ్యకథ చేసెదిభీతి నెనంచుఁ దచ్చనల్। బమ్ముచు కేళిమాపురము
బైకొనికూడినశౌరిఁ గొల్చెదన్॥ ※

తా॥ ఓకృష్ణా యోష్ఠంబు విడువుము నీవు చుంబనంబు చేసిన పూతనపడిసెనాలింగనంబు చేయకుము నీయాలింగనంబున మద్దికవగూలె నఖక్షతంబు జేయకుము హిరణ్యకశిపుండు నీ నఖంబులఁ జేటుబడినీలిగె గావున భయంబగుచున్నదియనుచు నపహాసంబుగా బలుకు లక్ష్మీదేవిం బయికొని క్రీడించు నారాయణుండు మనను బ్రోచుంగాతయనుట.

శ్లో॥ రామో నామ బభూవ హుం తదబలా సీతేతి హుం తౌ పితు
ర్వాచా పంచవటీవనే విహరతస్తామాహరద్రావణః । నిద్రా
ర్థం జననీకథామితి హరేర్హుంకారతశ్శృణ్వతస్సౌమిత్రే క్వధ
నుర్ధనుర్ధనురితి వ్యగ్రాగిరః పాంతు నః॥ ❋

టీ॥ హే కృష్ణ-ఓకృష్ణుడా, రామో నామ-రాముడనియెడు రాజు, బభూవ-ఆయెను (అని యశోదకథ జెప్పగా) హుం-హుంకారధ్వనిచే నంగీకరించెను, తదబలా-తత్, ఆశ్రీరామునియొక్క-అబలా, భార్య-సీతేతి, సీతయను పెలది-బభూవ, ఆయెను-హుం-హుంకరించెను, తౌ పితుః-తత్, ఆశ్రీరాములయొక్క-పితుః, తండ్రియైన దశరథునియొక్క-వాచా, వాక్యముచేత-పంచవటీవనే, పంచవటీవనమందు-విహరతః, విహరించుచున్న-తాం, ఆ శ్రీరామునియొక్క భార్యయైన సీతను-రావణః, రావణాసురుడు-అహరత్, హరించెను-ఇతి. ఈ ప్రకారముగా-నిద్రార్థం, నిద్రవచ్చుటకొఱకు-జననీకథాం, జననీతల్లి చెప్పబడియెడు-కథాం, కథను-హుంకారతః-హుంకారమువలన, శృణ్వతః-వినుచున్న, హరేః-శ్రీకృష్ణమూర్తియొక్క, సౌమిత్రే-ఓలక్ష్మణా, ధనుర్ధనుర్ధనుః ధనస్సు ధనస్సు, క్వ-ఇతి-ఎక్కడ ననియెడు, వ్యగ్రాః త్వరతో నుచ్చరితములయిన, గిరః-వాక్యములు, నః-మమ్ము, పాతు-రక్షించుగావుత.

మ॥ ఇలలో రాఘవుడొప్పువానిసతియయ్యెన్ సీతవారిన్వనం।బు
లకుం బంచెగురుండటంచు నిదురం బొందించునయ్యంబపలుకు
లు దానూకొని రావణుండు మహిజం గొంపోయె నానంతటన్ వి।
లు సౌమిత్రి! యెక్కడంచు బలుకుహరి యుక్త్యోక్తులెన్ బ్రోవు
తన్॥ ❋

తా॥ ఒకనాడు యశోద కొమరుని నిద్రవచ్చుటకయి కథ జెప్పం బూని రాముండను నా
కరాజు గలడతనికి సీతయను నొక యువతి గలదు రాఘవుడు తండ్రిపనుపున నరణ్యంగ సంగూ
డి పంచవటీ ప్రదేశంబున గ్రుమ్మరంగ నిరావణుండను వాడు సీతనపహరించెనన నూకొను
చు సంభ్రమంబున నో లక్ష్మణా విల్లు విల్లు తెమ్మని పలికెనట ద్రుతోచ్చరితంబులగు శ్రీకృష్ణవ
చనంబులు నన్ను బ్రోచుగాతయనుట.

శ్లో॥ బాలోఽపి శైలోద్ధరణాగ్రపాణిర్నీలోఽపి నీరంధ్రతమఃప్రదీపః । ధీ
రోఽపి రాధానయనావబద్ధో జారోఽపి సంసారహరః కుతస్త్వమ్॥ ❋

టీ॥ హే కృష్ణ, ఓకృష్ణుడా, త్వం-నీవు, కుతః-ఎందువలన, బాలోఽపి-బాలుడవైనప్ప



టికిని, శైలోద్ధరణాగ్రపాణిః-శైల, గోవర్ధనాచలముయొక్క-ఉద్ధరణ, ఎత్తుటయందు-అగ్ర, వ్యగ్రమయిన-పాణిః, హస్తముగలవాడవైతివి-నీలోఽపి, నల్లనివాడవైనను-నీరంధ్రతమఃప్రదీపః, నీరంధ్ర-దట్టమయిన, తమః-అంధకారమునకు, ప్రదీపః-దీపమైనవాడవయితివి, జారోఽపి-జారుడవైనప్పటికిని, సంసారహరః-సంసారమును హరించుచున్నవాడవయితివి, ధీరోఽపి-ధైర్యవంతుడవయినప్పటికిని, రాధానయనావబద్ధః-రాధా, రాధికయొక్క-నయన, నేత్రములకొఱకు-అవబద్ధః, వశుడవయినవాడవు, అసి, అయితివి.

ఉ॥ బాలుడవయ్యు శైలమొక పాణితలంబున దాల్చినిల్పగా।జా
లుట పాపపుంజము బజారుడవయ్యు హరించుటన్నహో । నీలత
నుండవయ్యు నతినిర్భరగాఢతమఃప్రదీపమై।ప్రాలుట ధైర్యశా
లివయి రాధకు జిక్కుటవింత గాహరీ॥ ❋

తా॥ బాలుండవయ్యు గోవర్ధనంబు గరాగ్రంబున బాల్చుటయు నల్లని మేనుగల
వాడవయ్యు గాఢాంధకారంబునకు దీపంబు బోలియుండుటయు జారుండవయ్యు సంసార
దుఃఖంబుల బోనడంచుటయు నిది యెంతయు వింతయగుచున్నదియనుట.

శ్లో॥ బాలాయ నీలవపుషే నవకింకిణీకజాలాభిరామజఘనాయ దిగంబరాయ । శార్దూలదివ్యనఖభూషణభూషితాయ నందాత్మజాయ నవనీతముషే నమస్తే॥ ❋

టీ॥ నీలవపుషే-నీల, నల్లనైన-వపుషే, శరీరముగలవాడును-నవకింకిణీకజాలాభిరామజఘనాయ, నవ-నూతనములైన, కింకిణీక-చిఱుగంటలయొక్క, జాల-సమూహముచేత, అభిరామ-సుందరమైన, జఘనాయ-కటిప్రదేశభాగముగలవాడును, దిగంబరాయ-దిగంబరుడైనవాడును, శార్దూలదివ్యనఖభూషణభూషితాయ-శార్దూల, పులియొక్క-దివ్య, శ్రేష్ఠమైన-నఖ, చిటికెనవ్రేలిగోరనియెడి-భూషణ, సొమ్ముచేత-భూషితాయ, అలంకరింపబడినవాడును-నవనీతముషే, వెన్నదొంగిలించుచున్నవాడును-నందాత్మజాయ, నందునికొమరుడైనవాడును-బాలాయ, బాలుడైనవాడవైన-తే, నీకొఱకు-నమః, నమస్కారము.

చ॥ అలరు పసిండి కంకణములందెలు మువ్వలు రావిరేకసం।
కులపులిగోరు దామెతులు కుప్పెడవుల్లలనూలు మద్దికా।
యలుగల నందనందను దిగంబరు జాగుకటీతటోజ్జ్వలు। న్వలసి
తనీల దేహు నవనీతహరుండగు బాలుగొల్చెదన్॥ ❋

తా॥ నల్లనైన నెమ్మేనును జిఱుగంటలు తుటుము చెసోయగంబగు గొప్పపిఱుందులుం గలిగి దిగంబరుండై పులిగోరుహారమునం జెలంగ వెలుంగుచు వెన్నెల నపహరించుచుండు బాలుండగు నందసుతున కేను మ్రొక్కెదననుట.

శ్లో॥ పాణౌ పాయసభక్తమాహితరసం బిభ్రన్ముదా దక్షిణే।
సవ్యే శారదచంద్రమండలనిభం హయ్యంగవీనం దధత్। కణ్ఠేక
ల్పితపుండరీకనఖముద్దామదీప్తిం వహన్। దేవో దివ్యదిగంబ
రో దిశతు నస్సౌఖ్యం యశోదాశిశుః॥

టీ॥ సవ్యే-డాపలి, పాణౌ-హస్తమునందు, ఆహితరసం-ఆహితః-ఉంచబడిన-రసః, మధురసముగల-పాయసభక్తం, పరమాన్నమును- ముదా, సంతోషముచేత- బిభ్రత్, ధరించుచున్నవాడును-దక్షిణే, వలపలి- పాణౌ, కరమునందు- శారదచంద్రమండలనిభం, శారద-శరత్కాలసంబంధమైన, చంద్రమండల- చంద్రమండలముతోడ, నిభం-సమానమైన, హయ్యంగవీనం-సద్యోఘృతమును, దధత్- వహించుచున్నవాడును, కంఠే- గళమందు, ఉద్దామదీప్తిం-ఉద్దామ, అతిశయమైన-దీప్తిం, కాంతిగల-కల్పిత-కల్పింపబడిన- పుండరీకనఖమపి-పులిగోరును, వహన్-వహించుచున్నవాడును, దివ్యదిగంబరః-దివ్యదిగంబరుడైనవాడును, యశోదాశిశుః- యశోదబిడ్డడునైన, దేవః-శ్రీకృష్ణమూర్తి, నః- మాకు, సౌఖ్యం-సుఖమును, దిశతు-ఇచ్చుగాక.

మ॥ అండాకేల శరన్మృగాంకనిభ హయ్యంగవీనంబున।
వ్వాలికేలన్ రసయుక్తపాయసము గ్రీవాబద్ధచామీకరో।జ్జ్వ
ల శార్దూలనఖంబు నంబరకటీచక్రంబు బెంపొందని। చ్చలు గ్రీ
డించు యశోదపట్టి కరుణన్ సౌఖ్యంబు మాకీవుతన్॥

తా॥ డాకేల మధురరసప్రధానంబగు పరమాన్నంబును వలకేలం గ్రొత్తయగు నేతిముద్ద ధరియించి పులిగోరు గళంబున వెలుంగగ దిగంబరుడై వెలయు గోపాలదేవుండెల్ల సౌఖ్యంబుల నొసంగుంగాతయనుట.

శ్లో॥ కింకిణికిణికిణిరభసైరంగణభువి రింగత్తైస్సదాటంతం। కుం
కుణుకుణుపదయుగళం కంకణకరభూషణం హరిం వందే॥

టీ॥ కింకిణికిణికిణిరభసైః-కింకిణి, చిఱుగంటలయొక్క, కిణికిణి- కిణికిణియనునెడి, రభసైః-ధ్వనులుగల, రింగత్తైః-స్ఖలనములచేత, అంగణభువి- ముంగిలియను ప్రదేశమందు, సదా-ఎప్పుడును-అటంతం, సంచరించుచున్నవాడును-కుంకుణుకుణుపదయుగళం, కుంకుణుకుణు-కుణుకుణుయనియెడి ధ్వనితో గూడి, పదయుగళం, పాదద్వంద్వముగలవాడును-



కంకణకరభూషణం, కంకణ-కణకణయనియెడి, కరభూషణం-కంకణములుగలవాడునునగు, హరిం-శ్రీకృష్ణమూర్తిం గూర్చి-వందే, నమస్కరించుచున్నాము.

చ॥ గణనకు నెక్కుడైన కరకంకణనిక్వణనంబు మీఱగుం। కు
ణుకుణు నాదపాదములకుందగు హేమమణీనిబద్ధకిం। కిణికిణి
నాదసంభ్రమము గీడ్పడ చాటుచునందు మందిరాం। గణమున
సంచరించునయగారవు ముద్దుబాలు గొల్చెదన్॥

తా॥ కిణికిణీయనెడు నాదంబులచే జిరుగంటలు మ్రోయ గుంకుణుకుణుని యెడి రావంబుల గాలియందియలు మ్రోయుచుండ గణకణయని యెడి నినదంబునం గడియంబులు రవళి యొనర్ప నందుని ముంగిటియందు గ్రుమ్మరు హరిం గూర్చి మ్రొక్కెదననుట.

శ్లో॥ సంబాధే సురభీణామంబామాయాసయంతమనుయాం
తీమ్। లంబాలకమవలంబే తం బాలం తనువిలగ్నజంబాలమ్॥

టీ॥ సురభీణాం-గోవులయొక్క, సంబాధే-సంమర్దమందు, అనుయాంతీం-వెంబడిగావచ్చుచున్న, అంబాం-తల్లిని, ఆయాసయంతం - ఆయాసము నొందించుచున్నవాడును, లంబాలకం-లంబ, వ్రేలుచున్న-అలకం, చూర్ణకుంతలములుగలవాడును- తనువిలగ్నజంబాలం, తను-శరీరమునందు, విలగ్న-కూడుకొన్న, జంబాలం-బురదగలవాడును, తం-అప్రసిద్ధుడైన, బాలం-బాలకృష్ణమూర్తిని, అవలంబే-ఆశ్రయించుచున్నాను.

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణ సంపత్కృష్టాక్షరీమంత్ర
ధ్యానమని సనత్కుమార సంహితయందుం
జెప్పంబడియున్నది.

శ్లో॥ పశ్చాద్యశోదయా సమీశౌ సంధావమానం వ్రజాంగణే। కింకిణీ
నూపురగ్రైవకణభూషోజ్జ్వలం స్మరేత్॥

ఉ॥ బాలక కేళి నాలగుమి బల్మొఱు నాడగ నంబ వెంబడిం। దాలి
మిలేక రాగ నగు నంబరు వెత్తుటలాటభాగలం। బాలకు జక్రవా
తశకటాదివిఘాలకు నిన్నంగలగ్నజం। బాలకు బాలకుందలతు
బాలితదిక్తటలోకపాలకున్॥

తా॥ నెంమొగంబున నెఱిముంగురులు వ్రేలగా మేనంబురదకలయం బెరసియుండ దన తల్లి వెంటనే తేరగు నగు నంబరు విడు బాలకృష్ణమూర్తి నాశ్రయించుచున్నాననుట.

శ్లో॥ అఞ్చితపిఞ్ఛాచూడం సంచితసౌజన్యవల్లవీవలయమ్। అధ
రమణినిహితవేణుం బాలగోపాలమనిశమవలంబే॥

టీ॥ అంచితపింఛాచూడం- అంచిత, ఒప్పుచున్న- పింఛా, నెమలిపురితోఁగూడిన చూడం, సిగగలవాడును- సంచితసౌజన్యవల్లవీవలయం, సంచిత- సంగ్రహింపబడిన- సౌజన్య, సుజనభావముగల-వల్లవీవలయం, గోపస్త్రీసమూహ - గలవాడును- అధరమణీనిహితవేణుం, అధరమణి-మణివంటియధరోష్ఠమందు, నిహిత-ఉంచబడిన, వేణుం-పిల్లనగ్రోవిగలవాడును-గోపాలం, గోపరిపాలకుఁడైన-బాలం,బాలకృష్ణమూర్తిని- అవలంబే,ఆశ్రయించుచున్నాను.

మ॥ విలసత్పింఛవతంసుఁడై చిగురుమోవి న్వేణువుంజేర్చి కం।
దళితాలాపసుధాపరంపరలచేతంజేత నాచేతన। మ్ములకు
న్నిశ్చలతాచలత్వములపెంపల్లూర్పు గోపికా। లలితాంగీ
సుజనత్వవంచకుని గోల్వంగాంత గోపాలకన్॥

తా॥ సిగయందలంకరింపబడిన నెమలిపురి మెఱయునధరమణి యందుంచిన వేణువుపెలుంగ గోపస్త్రీసుజనభావంబు గ్రహించుచు గోపరిపాలకుండయి వెలయుబాలకృష్ణునాశ్రయించుచున్నాననుట.

శ్లో॥ ప్రహ్లాదభాగధేయంనిగమమహాగుహాంతరాధేయం। నరహరిపదాభిధేయంవిబుధవిధేయంమమానుసంధేయం॥

టీ॥ ప్రహ్లాదభాగధేయం- ప్రహ్లాద, ప్రహ్లాదునియొక్క-భాగధేయం,భాగ్యభూతమైనయదియు-నిగమమహాగుహాంతరాధేయం, నిగమ- వేదములనియెడి,మహాగుహా-గొప్పగుహయొక్క, అంతః- లోపలను, ఆధేయం- ప్రతిపాదింపదగినయదియు, నరహరిపదాభిధేయం-నరహరి, నృసింహుండనియెడి-పద, అభిధానమునకు- అభిధేయం, చెప్పదగినదియు-విబుధవిధేయం, విబుధ-దేవతలకు, విధేయ-స్వాధీనమైనయదియు, మమ- నాకు,అనుసంధేయం-అనుసంధానముచేయదగినదియు. గు, వస్తు-వస్తువును, విచారయామి-భావించుచున్నాను, ఈశ్లోకము ప్రక్షిప్తమనివ్యాఖ్యాతచేనుడువబడియెనని తెలియునది.

మ॥ యమిసంభావితరూపధేయముసు బ్రహ్లాదోల్లసద్భాగ
ధే।యమునామ్నాయమహాగుహాంతర నిశాంతాధేయముం
బ్రోల్లస। త్సుమనశ్శ్రేణివిధేయమున్నరమృగాస్తోకాభిధా
నాభిధే। యముగోల్తుంగమలావనకమలని త్యాధేయమున్
వేడుకన్॥

తా॥ ప్రహ్లాదునికి భాగ్యభూతంబై నిగమగుహయందుఁ బ్రతిపాదింపదగినదియై నరసింహుండనియెడు శబ్దంబునకభిధేయంబై దైవతంబులకువిధేయంబై నాచేనను సంధింపబడినదియై వెలయువస్తువుందలంచెదననుట.



శ్లో॥ సంసారేకింసారంకంసారేశ్చరణకమలపరిభజనమ్। జ్యోతిఃకిమంధకారేయదంధకారేరనుస్మరణమ్॥

టీ॥ సంసారే-సంసారమందు, సారం- ఉత్కృష్టము, కిం-ఏమి, అంధకారే- అజ్ఞానమునందు, జ్యోతిః- తేజము, కిం-ఏది, ఇది ప్రశ్నము-ఇక ప్రశ్నము, ఇకవుత్తరము-కంసారేః, శ్రీకృష్ణమూర్తియొక్క-చరణకమలపరిభజనం, చరణకమల- పాదపంకజములయొక్క, పరిభజనం- ధ్యానమును అంధకారేః శివునియొక్క- అనుస్మరణం, స్మరణమును-యత్,ఏదియో-తత్,అది-వరం,శ్రేష్ఠము.

ఉ॥ సారముగంసవైరిపదసారససారుతరార్చనంబు సం। సారమునందు నిందుధరసన్నుతిగాఢతమాంధకారని। స్తారమువీనికిందగినసద్గురుసేవయకారణంబుగా। కారయనింతకంటె నుశుభావహమైనవిశేషమున్నదే॥

తా॥ సంసారంబునందుఁ శ్రేష్ఠంబెద్దియనఁగంసాంతకుండగు శ్రీకృష్ణునిపదకమలధ్యానంబు ఇదితక్కదొంటెద్దియులేదు- అజ్ఞానాంధకారంబునవవతరంబుదొలఁగం ద్రోయునితేజంబగునదిన నంధకారారాతియగు ముక్కంటిసంస్మరణంబు- ఇదితక్క నొండుపాయంబులేదనుట.

శ్లో॥ కలశనవనీతచోరేకమలాదృక్కుముదచంద్రికాపూరే। విహరతునందకుమారేచేతోమమగోపసుందరీజారే॥ ౮౦

టీ॥ కలశనవనీతచోరే-కలశ, కుండలయందలి-నవనీత, వెన్నను- చోరే, దొంగలించుచున్నవాఁడును-కమలాదృక్కుముదచంద్రికాపూరే,కమలా-రుక్మిణీదేవియొక్క,దృక్కుముద-కన్నులనుగలువలకు, చంద్రికా పూరే, చంద్రికా-ప్రవాహమైనవాఁడును గోపసుందరీజారే, గోపికావిటుఁడయిన-నందకుమారే,శ్రీకృష్ణమూర్తియందు-మమ, నాయొక్క- చేతః, చిత్తము-విహరతు, విహరించుగాత. ౮౦

ఉ॥ శ్రీరమణీమణీవికచదృక్కుముదస్మితసాంద్రచంద్రికా। సారుప్రజాంగనానివహజారుజ్జగజనతామనోహరా। కారువిశుద్ధహాలిహృదగారుబయోనవనీతచోరునా। ధీరకుమారునాహృదయపీఠికయందువసింపఁజేసెదన్॥ *

తా॥ కలశంబులందలినవనీతంబుల నపహరించుచు రుక్మిణీదేవికన్నులనియెడి కలువలకుఁజాలునగదయెడిపెన్నెలయొక్క ప్రవాహమునుగలుగంజేయుచు గోపికావిటుండయి వెలయునందకుమారునందునాచిత్తంబుసంచరించుగాకయనుట. *

శ్లో॥ కస్త్వంబాలబలానుజఃకిమిహతేమన్మందిరాశంకయా
యుక్తంతన్నవనీతపాత్రవివరేహస్తంకిమర్థంన్యసేః। మా
తఃకంచనవత్సకం మృగయితుంమాగా విషాదంక్షణాదిత్యే
వంవరవల్లవీప్రతివచఃకృష్ణస్సపుష్ణాతునః॥

అవతరణిక,=కవియీశ్లోకంబున వెన్నదొంగిలించు శ్రీకృష్ణుని యొక్కయు నొక గోపికయొక్కయును ఉక్తి ప్రత్యుక్తిరూపమగు సంభాషణమును జెప్పుచున్నాడు॥ ౭౧

టీ॥ హేబాల-ఓయిబాలుఁడా, త్వం-నీవు, కః-ఎవ్వఁడవు, (ఇది గోపికవచనము) బలానుజ-బల, బలరామునియొక్క- అనుజః, తమ్ముఁడను (ఇది కృష్ణవచనము) తే, నీకు ఇహ, ఈ-నాఇంటను, కిం-ఏమిప్రయోజనము ( ఇదిగోపికవచనము) మన్మందిరాశంకయా, మత్-నాయొక్క, మందిర-ఇల్లనియెడి, శంకయా-సందేహముచేతను ( ఇదికృష్ణవచనము) తత్-అది, యుక్తం- యుక్తము, నవనీతపాత్రవివరే- నవనీతపాత్రవిశేషమందు, కిమర్థం-ఏమినిమిత్తము, హస్తం-కరమును, న్యసేః-ఉంచినవాఁడవైతివి, ( ఇది గోపికవచనము) హేమాతః- ఓతల్లీ, కంచన- ఒకటియైన, వత్సకం-దూడను- మృగయితుం, వెదుకుటకొఱకు-క్షణాత్, క్షణకాలమాత్రము-విషాదం, ఖేదమును-మాగాః, పొందకుము-ఇత్యేవం, అని ఈప్రకారము, కృష్ణస్య-కృష్ణునియొక్క, వరవల్లవీప్రతివచః-వర, శ్రేష్ఠమైన-వల్లవీ, గోపికయొక్క-ప్రతివచః, ప్రత్యుత్తరము-నః, మమ్ము-పుష్ణాతు, రక్షించుగాతు. ౭౧

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణదశాక్షరీమంత్రధ్యానము
ని సనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియె॥

శ్లో॥ హరంతంనవనీతాదీన్ చౌర్యేణవ్రజయోషితామ్, సగో
బాలైస్సృతంకృష్ణంధ్యానేనమ్ప్రంజపేదిదమ్॥ ౭౨

ఉ॥ చిన్నికుమారనెవ్వడవుసీరికిఁదమ్ముడనేలవచ్చితిరా।మ
న్నిలయంబటంచునిదిమంచిదె కేలటుసాచెదేటికి। న్వెన్నపనం
టిలోనజనసీయొకదూడనుజూడవచ్చితిన్। విన్నదనంబుమా
నుమనివ్రేతకుబల్కుమురారిగోపురన్॥

తా॥ ఓకృష్ణానీవెవ్వఁడవనిన నే బలరామునితమ్ముడననిక్కడనేమిపనియనిఇది నా ఇల్లనుబుద్ధిచేవచ్చితిననియె నిదియుక్తంబకానివెన్నపనంటిలోఁ గేలుంచెదవేమనినదూడను వెదకుచున్నాననీవుమఱియేమియునెంచకుమీ యనిఇవ్విధంబున గోపికతోడం బలుకు శ్రీకృష్ణునివచనంబులున్నుం బ్రోచుగాతమనుట. ※



శ్లో॥ గోపాలాజిరకర్దమేవిహరసేవిప్రాధ్వరేలజ్జసేబ్రూషే
గోకులహుంకృతైస్తుతిశతైర్మౌనంవిధత్సేవిదామ్। దాస్యం
గోకులపుంశ్చలీషుకురుషేస్వామ్యంనదాన్తాత్మసుజ్ఞాతంకృష్ణ
తవాంఘ్రిపఙ్కజయుగప్రేమాచలంమఞ్జులమ్॥

టీ॥ హేకృష్ణ-ఓయికృష్ణుడా, గోపాలాజిరకర్దమే-గోపాల, గోపాలకునియొక్క-అజిర, ఇంటిముంగిళ్ళయందలి-కర్దమే, పంకమందు- విహరసే, విహరింతువు-విప్రాధ్వరే, బ్రాహ్మణయజ్ఞమునందు-లజ్జసే, సిగ్గునొందుదువు- గోకులహుంకృతైః, గోకుల- పశుసమూహములయొక్క,హుంకృతైః-హుంకారధ్వనులతోటి, బ్రూషే పలుకుచున్నావు-విదాం, జ్ఞానులకు-స్తుతిశతైః, అనేకస్తోత్రములచేత,మౌనం-మూకతను, విధత్సే- చేయుచున్నావు, గోకులపుంశ్చలీషు-గోకులనందవ్రజమునందలి,పుంశ్చలీషు-స్వైరిణులవిషయమై దాస్యం-దాసభావమును,కురుషే-చేయుదువు, దాంతాత్మసు-దాంతవిషయములవలననివృత్తమైన, ఆత్మసు-మనస్సుగలవారలవిషయమై, స్వామ్యం-స్వామిత్వమును, నకురుషే-చేయవు, అతః-ఈహేతువువలన, మంజులం-సుందరమైన, తవ- నీయొక్క, అంఘ్రిపంకజయుగం-పాదకమలద్వంద్వము, ప్రేమా-ప్రేమ,రూపమయా-దానిచేత, అచలం- స్థిరముగా, జ్ఞాతం తెలియబడినది. ౭౨

మ॥ క్రతుభూమిం జొరఁబోవు గోపగృహపంకంబన్నమెట్టే
వుగా। తతిహుంకారమువిన్నబల్కెదవు విద్వద్గోష్ఠికింబల్కవా।
నతిగావింతువుగోపజారలకుదాంతశ్రేణికైకొవుయో।
గ్యతయేహేతువుప్రేమకారణముగాదాదేవనీచవ్యతున్॥ ※

తా॥ ఓకృష్ణాగోపాల గృహంబులముంగిళ్ళ బురదయందుబారలుదువు బ్రాహ్మణయజ్ఞంబులకుంబోవసిగ్గుపడియెదవు ఆలగుంపులహుంకారంబులకుమారుపల్కెదు విజ్ఞానులతోడంబలుకకుండుదువు గోపకాంతలకుదాస్యంబుసేయుదువుఆత్మవిదులకుప్రభుత్వంబునైన చేయనొల్లవని రీతంబుసూడనిద్దియు గారణంబులేదుప్రేమయొక్కటియకారణంబనుట. ※

శ్లో॥ నమస్తస్మైః యశోదాయాదాయాదాయాస్తుతేజసే యద్రాధాముఖాంభోజంభోజంవ్యవర్ధత॥ ౭౪

టీ॥ యత్-ఏతేజము, రాధాముఖాంభోజం-రాధా,రాధయొక్క ముఖాంభోజం-ముఖకమలమును, భోజంభోజం-భుజించిభుజించి, వ్యవర్ధత-వృద్ధినొందెనో, తస్మై-ఆప్రసిద్ధమైనట్టిన్ని-యశోదాయాః, యశోదయొక్క-దాయా, పుత్రుడై- తేజసే, తేజముకొఱకు-నమః, నమస్కారము-అస్తు, అగుగాత. ౭౪

కేళిలోలం-కామినీ, కామవతులయిన స్త్రీలయొక్క-కేళి, క్రీడలయందు-లోలం, ఆసతో గూడికొనినవాడును-కలితలలితమాలం, కలిత-కూడుకొనినయదియు, లలిత-కోమలము నై నదియునైన, మాలం-వనమాలికగలవాడును,గోపాలబాలం- గోపాలకృష్ణుని,నౌమి-నుతించుచున్నాను. ౭౮

మ॥ మురళీనాదవిశాలునీలమణి జీమూతాతసీనీలుని।రరుహా
క్షీరతి లోలుహ స్త జలజాగ్రన్య స్తశైలుంసదా। దరశీలు
వ్రజలోకపాలుగరుణోదారైకలీలాభుజాం। తరరాజద్వ
నమాలుగొల్చెదసముద్యద్గోపరాలుంస్మరిన్॥ *

తా॥ ఉదకంబుతోగూడినమేఘంబుబోలెనల్లనగుచుజాపంబడినగంభీరంబులగుపూ తనాహరణాదిక్రీడలుగలిగి కేలంగిలించినగోవర్ధనాచలంబుగలిగివేణునాదంబున నైన యాహ్లాదంబులోడంగూడి నందవ్రజంబునందున్నవారలం బ్రోచుచుకామవతులయినయు వతులకోరికలందీర్చుచువయిజయంతి యనుపేరం దేజరిల్లువనమాలికయురంబున కలంటు మెఱయవెలుంగుగోపాలదేవునినుతినుతియించుచున్నాననుట. *

శ్లో॥స్మితలలితకపోలంస్నిగ్ధ సంగీతలోలం లలితచికురజాలం
చౌర్యచాతుర్యలీలమ్। శతమఖరిపుకాలంశాతకుంభాభచే
లంకువలయదళనీలంనౌమిగోపాలబాలమ్॥ ౭౯

టీ॥ స్మితలలితకపోలం-స్మిత, చిఱునగవనియెడిహేతువుచేత- లలిత, సుందరమైన-క పోలం,చెక్కిళ్లుగలవాడును-స్నిగ్ధసంగీతలోలం, స్నిగ్ధపరిశుద్ధహృదయులయినవారదాదు లయొక్క-సంగీత, గానమందు- లోలం, ఆసజేయుచున్నవాడును- లలిత, సుందరము లయిన-చికురముంగురులయొక్క, జాలం-సమూహముగలవాడును,చౌర్యచాతుర్యలీలం- చౌర్య, చోరకర్మమందు-చాతుర్య, చాతుర్యముతోగూడిన,లీలం-క్రియగలవాడును, శతమఖరిపుకాలం-శతమఖ, ఇంద్రునికి-రిపు, శత్రువులయినరక్కసులకు-కాలం, యము డయినవాడును-శాతకుంభాభచేలం, శాతకుంభబంగారుయొక్క-ఆభ, కాంతివంటి కాంతిగల-చేలం,వస్త్రముగలవాడును-కువలయదళనీలం,కువలయదళ-నల్లకలువరేకుల వలె, నీలం-నల్లనైన, గోపాలబాలం-గోపాలకృష్ణుని, నౌమి-నుతించుచున్నాను॥ ౭౯

మ॥ సరసస్మేరకపోలుఁ గొల్తుమురళీసంగీతలోలుం శుభా
కలచామీకరచేల నీలమణిరంగత్తుంతలశ్రీవిశా। లురమాపా
లలివితాంతచౌర్యగుణశీలుందానవప్రాణహృ। త్కరవాలుం
గపిలాదనీకు వలయోద్యన్నీలు గోపాలునిన్॥ *



తా॥ చిఱునగవుచేసుందరంబులగు చెక్కిళ్లుగలిగినారదాదులసంగీతంబునందాసక్తుం డయి లలిత ముంగురులచె దేజరిల్లుచుదొంగతనంబునందలిచాతుర్యంబుగలిగియెల్ల రక్కసులకునంతకుండై బంగరుచేలంబుచె నలంకృతుడై కువలయదళంబుంబోనిమేని ఛాయచె వెలయుగోపాలకృష్ణునినుతించుచున్నాననుట. *

శ్లో॥ మురళినినదలోలంముగ్ధమాయూరచూడందళితదనుజజాలంధ
న్యసౌజన్యలీలం। పరహితనవహేలం పద్మపద్మానుకూలంనవజలధ
రనీలంనౌమి గోపాలబాలమ్॥ ౮౦

టీ॥ మురళినినదలోలం-మురళినినద, వేణునాదమందు- లోలం, ఆసచేయుచున్నవా డును-ముగ్ధమాయూరచూడం, ముగ్ధ-సుందరమైన, మాయూరచూడం- నెమలిపురిగల వాడును, దళితదనుజజాలం-దళిత, భేదింపబడిన-దనుజ, రక్కసులయొక్క-జాలం, స మూహముగలవాడును-ధన్యసౌజన్యలీలం, ధన్య-కృతార్థులవిషయమయిన, సౌజన్య- సుజనత్వముతోగూడిన, లీలంవిలాసములుగలవాడును-పరహితనవహేలం, పర-అన్యు లకు, హిత-హితకరములయినవియు, నవ-నూతనములయినవియునగు, హేలం- విలాస ములుగలవాడును, (మరియొకపక్షమున) పర-శత్రువులకు, హిత-హితకరములకు, నవ నూతనములయిన-హేలం, వధాది-విలాసములుగలవాడును, అనగాశ్రీకృష్ణునిచె జేయం బడువధాదికృత్యములైనను ముక్తిసంపాదకములగుననిభావము (పద్మాపద్మ-బ్రహ్మకు అనుకూలం- అనుకూలుడైనవాడును,పక్షాంతరమున) పద్మాపద్మ, లక్ష్మీదేవికి- అనుకూ లం, అనుకూలనాయకుడైనవాడును- నవజలధరనీలం-నవజలధర, క్రొత్తమొగులువలె- నీలం,నల్లనైనవాడునైన గోపాలబాలం,గోపాలకృష్ణుని-నౌమి, స్తుతియించుచున్నాను॥

చ॥ మురళినినాదలోలు నతిముగ్ధశిఖావళపింఛచూళినిం। బర
హితశీలు రాత్రిచరపాళిపిఫాలుగృతార్థలోలుబం। కరుహా
గృహానుపాలుప్రజకంజ మంఖీహిత హేలు నవ్యవు। మరంథ
రనీలుగొల్తుశుభకాంచన చేలుని గోపబాలునిన్॥ *

తా॥ వేణునాదంబునందాసక్తుండై సిగయందు నెమలిపురియలంకరించి యెల్ల రక్కసులంజ క్కడంచుచుధన్యులకొఱకుసౌజన్యంబునెఱుపుచుశత్రువులకువధాదికృత్యంబులచె మోక్షం బొసంగజాలిసిరికనుకూలుండయినీలమేఘసిభశరీరుండయివెలయుగోపాలబాలునినుతిం చుచున్నాననుట. *

శ్లో॥ సరగుణనికాయంసచ్చిదానందకాయంశమితసకలమాయంస
త్యలక్ష్మీసహాయమ్। శమదమసముదాయంశాంతసర్వాంతరాయం
సుహృదయజనదాయం నౌమిగోపాలరాయమ్॥ *

మయిన, స్మృగమదతిలకం-కస్తురిబొట్టున్నదో, కర్ణద్వంద్వే- కర్ణా, చెవులయొక్క- ద్వంద్వే, రెండియందు- అతిమృదులం, మిక్కిలిమృదువైన- తాళిదళంచ తాళపత్త్రంబును నున్నదో, నాసికాయాం-ముక్కునందు, మౌక్తికం-ముత్యంబున్నదో, కౌస్తుభస్య కౌస్తుభమణియొక్క-ఉపకంఠే, సమీపమందు- మందారమాలాపరిమళభరితః, మందారమాలా-మందారపుష్పదండయొక్క, పరిమళ-వాసనచేత, భరితః- సంపూర్ణమైన, హారః-హారంబును, పాణౌ-చేతియందు, వేణుశ్చ-పిల్లనగ్రోవియునున్నదో, సః-అట్టి, వ్రజయువతియుతః-వ్రజయువతి, గోపస్త్రీలతోడ-యుతః, కూడుకొనియున్న- పీతాంబరః, పీతాంబరధరుడయినశ్రీకృష్ణుడు-నః, మమ్ము-పాతు, రక్షించుగాక. ౯౪

మ॥ నుదుటం గస్తురిబొట్టు నాసికతుదన్ ముత్యంబు కర్ణద్వయిన్
మృదుతాళీదళయుగ్మమున్ మురళి పాణిన్ మాళిబింఛంబు పే
రెద పై గౌస్తుభహారకల్యసుమనోహేమాంబరాడంబరం బా
దవ గోపికలెల్లగొల్వ హరి తా దయన్ మమ్ము నెల్లప్పుడున్॥

తా॥ సిగయందు నెమలిపురియు ఫాలంబున గస్తూరిబొట్టును శ్రవణయుగ్మంబున వేత యగు తాళదళంబును ముక్కుకొనయందు ముత్తియంబును గౌస్తుభమణి చెంగట మందార కుసుమవాసితవ్యూహారంబును గరంబున బిల్లనగ్రోవియు జెన్నుగ జెన్నారు బీతాంబరధారియై గోపికాసమేతుండగు చిన్నకృష్ణుండు మమ్ము నెంగాపాడు గావుతయనుట. ❋

శ్లో॥ మురారిణా వారివిహారకాలే మృగేక్షణానాం ముషితాం సుఖానాం। కరద్వయం వా కచసంహతిర్వా ప్రమీలనం వా పరిధానమాసీత్॥

టీక॥ వారివిహారకాలే, జలక్రీడాసమయంబున-మురారిణా, కృష్ణునిచేతముషితాం శుకానాం - ముషిత, అపహరింపబడిన - అంశుకానాం, వస్త్రములుగలయట్టి - మృగేక్షణానాం, స్త్రీలకు- కరద్వయం వా, కర, చేతులయొక్క- ద్వయంవా, రెండును-కచసంహతిర్వా, కచ- వెండ్రుకలయొక్క - సంహతిర్వా, సమూహంబును - నిమీలనంవా కన్నులుమూసుకొనుటయును- పరిధానం, వస్త్రంబుగా-ఆసీత్, అయెన్. ౯౫

ఉ॥ వారివిహారకాలమున వారిరుహాక్షుడు చీరలెత్తగా। వారి
జపత్త్రపంక్తి కచభారముకన్నుల మోడ్పు చేతులు। వార్వగమా
టుత్రై యొసగ వారి రాచతుసులకెల్ల వారయ। న్వారికి మాటకేటికి
నవాంచిత మోహాతమంబు గ్రమ్మగన్॥ ❋

తా॥ జలక్రీడసలుపుచునుండెడిగోపికలుతమకోకలను కృష్ణుండపహరింపవారిలో కొందరుచేతులతో నున్నకొందరు వెండ్రుకలతోనున్న గుహ్యావయవములను మూసుకొనిరి కొందరు సిగ్గులుతమకన్నులను మూసుకొనగా తమగుహ్యంబులితరులకు దెలియవనియెంచుకొనిరనుట.



శ్లో॥ యాసాంగోపాంగనానాం లసదసితతరాలోలలీలాకటాక్షాః। యన్నాసాచారుముక్తామణిరుచినికరవ్యోమగంగాప్రవాహే। మీనాయంతేపియాసామతిరభసచలచ్చారునీలాలకాన్తా। భృంగాయన్తే యదంఘ్రిద్వయసరసిరుహే పాతు పీతాంబరో నః॥ ౯౬

టీక॥ యాసాంగోపాంగనానాం, ఏగోపస్త్రీలయొక్క- లసదసితతరాలోలలీలాకటాక్షాః, లసత్, ప్రకాశించుచున్నట్టి- అసితతర, అత్యంతనీలమైనట్టి - ఆలోల, చంచలించుచున్నట్టి- లీలా,విలాసముతోనైన-కటాక్షాః, కడగంటిచూపులు, యన్నాసాచారముక్తామణిరుచినికరవ్యోమగంగాప్రవాహే- యత్, యెవ్వనియొక్క- నాసా ముక్కుయొక్క, చారుసుందరమైన - ముక్తామణి, ముత్యముయొక్క - రుచి, కాంతులయొక్క- నికర, సమూహమనెడివే - వ్యోమగంగా - ఆకాశగంగయొక్క, ప్రవాహే, ప్రవాహమందు- మీనాయంతే, మత్స్యములవలె నాచరించుచున్నవో - యాసాం ఏగోపికలయొక్క, అతిరభసచలచ్చారునీలాలకాంతాః-అతిరభస,అతివేగముచేత-చలత్ చలించుచున్నట్టివన్ని-చారు, మనోహరంబయినట్టి-నీల-నీలవర్ణంబయిన, అలకముంగురులయొక్క-అంతాః,కొనలు-యదంఘ్రిద్వయసరసీరుహే- యత్ - యెవ్వనియొక్క, అంఘ్రి-పాదములయొక్క, ద్వయ-రెండును,సరసీరుహే- తామరపువ్వుయందు- భృంగాయంతే తుమ్మెదలవలెనాచరించుచున్నవో- తాసాం, అట్టిగోపికలయొక్క సంబంధమైనట్టి-సః, అటువంటి-పీతాంబరః, కృష్ణుడు-నః, మమ్ము-పాతు,రక్షించుచుగాక. ౯౭

మ॥సరసన్ మీనములయ్యె నెవ్విభుని నాసామౌక్తికోద్యత్ప్రభా।
మరగంగన్ వ్రజభామినీచటులశంపాలోలదృక్పాళులె। హరి
పాదాంబురుహంబునందు నళులై వ్యాపించె గోపాంగనా।తర
ళాగాళవినీలకుంతళములా ధన్యుండు సన్ బ్రోవుతన్॥ ❋

తా॥ కృష్ణుని ముక్కరముత్యపుకాంతి గంగాప్రవాహామువలే ప్రసరించగా నావేడుకచూచుటవలన గోపికలచూపులందులో మత్స్యంబువలె కనబడుచున్నవి అట్టిచూపులుగలగోపికలుఆనగా - మందహాసవిశేషంబోయనునట్టి ముత్యపుకాంతి వెలుగుచుండుకృష్ణునిమొగముజూచి కామప్రేమపరవశులైన గోపికలు మూకోరికలనెరవేర్చిమమ్ము కావవలయుననివాని పాదారవిందంబులయందు ముంగురులు వ్రేలాడు ట్లు నమస్కారంబులనొనర్చదరనుట. ❋

శ్లో॥ యద్వేణుశ్రేణి రూపస్థితసుషిరముఖోద్గీర్ణనాదప్రభిన్నాపేనాశ్చ్యాస్తత్క్షణేన త్రుటితనిజపతిప్రేమబన్ధా బభూవుః। అస్తవ్యస్తాలకాన్తాస్ఫురదధరకుచద్వన్ద్వనాభిప్రదేశాః కామావేశప్రకల్ప్యాప్రకటితపులకాః పాతు పీతాంబరో నః॥ ❋

లయందు- గండూషపూత్కారకృత్, గండూష- నోటిపాలయొక్క, పూత్కార-పుమి యుటను-కృత్, చేసినటి- సఃగోపాలకః ఆశ్రీకృష్ణుడు పాయాత్, రక్షించుగాక. ౯౮

ఉ॥ తోరపు బెద్దగద్దియలు దొంతరగా నిడి బాలు నాపయి న్జేరిచి వాని మూపున వసించుచు నుట్టిపనంటి వంనుఘం। టారుతి సిల్పి పాల్కరమునందలయూచు నానివచ్చు నా । భీరిక కన్నులందు ముసి పెట్టుక దూట్టిన జూటుఁ గొల్చెదన్॥ ❋

తా॥ ఒకగోపాంగనయొక్క గృహమందు బూరి రొయిపపిట పైమఱియొక పిటనునిచి దానిపైనొక బాలుని గూర్చుండ జేసి వాని భుజములయందు నిలుచుకొని యచ్చట గట్టియున్న యుట్టియం దుండెడి పాలకడవ నుంచి యాయుట్టి యందు శబ్దించునట్టి గంటనాక చేతితో బట్టుకొని మఱియొక చేతిని నోటగిని వ లెనునిచి యాకుండనుండి కారుచున్న పాలు ద్రాగుచు నుండునపుడా గోపిక రాగా జూచి దానికన్నులయందు దననోటిపాలు నుమిసి సంభ్రమింప జేసిన విలాసియైన బాలకృష్ణుఁడు మంము బ్రోచుగాకయనుట. ❋

శ్లో॥ యజ్ఞైరీజిమహేఽథ నందద మహేపాత్రేషు నూనం వయం వృద్ధాన్ భేజిమ హే తపశ్చ కృమి హే జన్మాంతరే దుశ్చరమ్। యేనాస్మాకమభూ దనన్యసులభా భక్తిర్భవద్వేషిణీ చాణూరద్విషి భక్తకల్మషముషి శ్రేయఃపుషి శ్రీజుషి॥ ❋

టీక॥ వయం, మేము-జన్మాంతరే,జన్మాంతరమందు-యజ్ఞైః, యాగముచేత- ఈజిమహే, పూజించినవారము, పాత్రేషు-సత్పాత్రములయందు, ధనం-ధనంబును-దదమహే ఇచ్చినవారము- వృద్ధాన్, జ్ఞానవృద్ధులను- భేజిమహే- సేవించినవారము- దుశ్చరం, కఠినమైన- తపః, తపస్సును-చక్రుమహే-చేసినవారము- నూనం, నిశ్చయము-యేన, ఎంకారణముచేత- అస్మాకం, మాకు- భక్తకల్మషముషి- భక్త, భక్తులయొక్క-కల్మష, పాపములను- ముషి,అపహరించుచున్నవాడును- శ్రేయఃపుషి, శ్రేయస్సులును- పుషిపోషించుచున్నవాడును- చాణూరద్విషి, చాణూర-చాణూరుడనునసురునికి, ద్వేషి- ద్వేషియైనవాడును- శ్రీజుషి, లక్ష్మీపతియైనకృష్ణునియందు - భవద్వేషిణీ,భవ-సంసారమునకు,ద్వేషిణీ - ద్వేషియైనటి, అనన్యసులభా - అన్యులకుసుఖముగానొందగూడనటువంటి- భక్తిః,భక్తి- అభూత్,కలిగెను. ౯౯

మ॥ మును జన్మాంతరవేళ దుష్కరతపంబుల్ పాత్రదానంబు స। జ్జనసంసేవయు నధ్వరంబులొనరించన్ గంటిగాకున్నఁ గల్గునె లోకోత్తర భక్తినాదు మది నాలోకింపఁ బాదావనే। జనకృత్తోష ణుఁ దుష్టభీషణుఁ బుషఃశ్చాణూరవిద్వేషణున్॥ ❋



తా॥ వేదాంతములు చెప్పినట్టు లీజన్మమందు జేయక పోయినను బూర్వజన్మంబున జ్ఞయములచేత భగవత్స్వరూపయినటి దేవతలను బూజించియుండుము సత్పాత్రమందు ద్రవ్యము వినియోగపఱచియుండుము వృద్ధసేవ సేసియుండుము కృచ్ఛ్రచాంద్రాయణాదుల ననుష్ఠించియుండుము అట్లు చెయకుండుమేని యిపుడు దుష్టుల నిగ్రహించి భక్తుల పాపములనెల్ల పోగొట్టి ధర్మార్థాదిసకల పురుషార్థంబుల నొసఁగునట్టి లక్ష్మీపతియైన శ్రీకృష్ణునియందు సంసారబంధంబును దెగగొట్టునట్టి యసాధారణభక్తి గలుగ నేరదనుట.

ఇచట లక్ష్మీపతియనునది యాశ్రితరక్షణాదులయందును సర్వోత్కర్షణమందును గారణమనునభిప్రాయముచేత బ్రయోగింపంబడియెనని తెలియునది.

శ్లో॥ త్వయి ప్రసన్నే మమ కిం గుణేన త్వయ్యప్రసన్నే మమ కిం గుణేన। రక్తే విరక్తే చ వరే వధూనాం నిరర్థకః కుంకుమపత్రభంగః॥ ౧౦౧

టీక॥ హేకృష్ణ- ఓకృష్ణ, త్వయి-నీవు, ప్రసన్నే సతి- నాయందు దయజేయుచునుండగా- మమ, నాయొక్క- గుణేన, గుణముచేత- కిమ్,ఏమి ప్రయోజనము-త్వయి, నీవు అప్రసన్నే సతి, దయచెయుచుండగా- మమ, నాయొక్క - గుణేన, గుణముచేత- కిం, ఏమిప్రయోజనము- వరే, నాయకుడు- రక్తే సతి, ఆశగలవాడైయుండినను- విరక్తేన, ఆశలేనివాడైయుండినను- వధూనాం, నాయికలయొక్క - కుంకుమపత్రభంగః, కుంకుమ, కుంకుమచేత జేసినట్టి- పత్ర, మకరికాపత్రములయొక్క- భంగః, రచన - నిరర్థకః, వ్యర్థము. ౧౦౦

ఉ॥ నీవు ప్రసన్నుడైన నెడ నేరుపు లేటికి నప్రసన్నత। న్నీవు పరాకు చేసినను నేరుపు లేమిటి కెంచి చూడఁ గృష్ణా విభుఁ డాదరించు సమయంబున నొల్లమి సేయు వేళలన్। గావలెనే లతాంగులకు గైపగు కుంకుమపత్రభంగముల్॥ ❋

తా॥ వరుఁడు నాయికలపై నాసగలిగియుండినను నాసలేకయుండినను గుంకుమలిప్తమకరికాపత్రములయొక్క వ్రాత నిరర్థకమగునట్టుల భగవంతుడు తానే రక్షింపవలయుగాని మనయొక్క గుణదుర్గుణముల వలన వానికి దయపుట్టదనుట.

శ్లో॥ గాయన్తి క్షణదావసానసమయే సానందమిందుప్రభారుంధత్యో నిజదంతకాంతినివహైర్గోపాంగనా గోకులే। మధ్నత్యో దధిపాణికంకణఝణత్కారానుకారం జవాద్వ్యాలోలద్వసనా ఇహాలాయ వని శంపీతాంబరో వ్యాత్సనః॥ ౧౦౨

టీక॥ నిజదంతకాంతినివహైః- నిజ, తమయొక్క- దంతకాంతి, దంతకాంతులయొక్క- నివహైః, సమూహములచేత - ఇందుప్రభాః, చంద్రకాంతులను - రుంధత్యః, అర

స్ఫురించుచున్నట్టిన్ని - జవాత్, వేగముచలన - వ్యావల్గద్వసనాంచలాః - వ్యావల్గత్, విశేషముగాఁ జలించుచున్న- వసన, కోకలయొక్క - అంచలాః, కొనలుగలయట్టిన్ని- పాణికంకణఝణాత్కారాను కారం యథాతథా - పాణికంకణ, చేతికడియములయొక్క- ఝణాత్కార, ఝణఝణయను శబ్దంబుఁను - అకారంయథాతథా, అనుకరింపగల్గునట్లులుగా- రథి, పెరుగును- మధ్నత్యః, చిలుకుచున్నటి గోపాంగనాః-గోపస్త్రీలు- గోకులే, గోకులమందు- క్షణదావసానసమయే- ప్రాతఃకాలమందు- సానందం, ఆనందముతోడ-యుల, ఎవ్వని- అనిశ , ఎల్లప్పుడును- గాయంతి, పాడుచున్నారో, సః- అటివీతాంబరః- శ్రీకృష్ణుడు- నః, మమ్ము-అవ్యాత్, రక్షించుగాక. ౧౦౧

ఉ॥ ప్రాతటకంకణారవముభాసిల్లపైఁడెద కొంగుదూఁగగా।
వేకువమోదమొప్పనరపంద ముఖుల్పెరుగుల్మథించుచుం।గోక
విగోపికింగళలుగూర్చురథద్యుతినీలుసేహరిః। గోపలవాటి
బాడుదురుకోరికలాహరియిచ్చుగావుతః॥

తా॥ ప్రేపత్యేయమున గోపికలు చంద్రకాంతికి నతిశయించినదంతకాంతులు ప్రసరింపగా గోకలకొనలసియాడుచుండగ కంకణములశబ్దంబున కనుసరిపడునట్లు పెరుగు చిలుకుచు సంతోషముతోడనే కృష్ణుండు బాడుదురో ఆకృష్ణుండు మమ్ము రక్షించువలయుననుట.

శ్లో॥ అంసాలంబితవామకుండలభరం మందోన్నతభ్రూలతం కించిత్కుఞ్చితకోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్। ఆలోలాఙ్గులిపల్లవైర్మురళికామాపూరయన్తం ముదా మూలే కల్పతరోస్త్రిభఙ్గిలలితం ధ్యాయే జగన్మోహనమ్॥ ౧౦౨

టీక॥ అంసాలంబిత వామకుండలభరం- అంస, మూపును- ఆలంబిత - ఆశ్రయించినటి- వామ, ఎడమ ప్రక్కదైన - కుండలభరం, కుండలభారము గలిగినవాడును- మందోన్నతభ్రూలతం మంద- వంగినదియును- ఉన్నత, పొడవు గలదియునైన- భ్రూలతం తీగెవంటిబొమలుకలవాడును - కించిత్కుంచితకోమలాధరపుటం- కించిత్, కొంచెము- కుంచిత, వంపబడిన - కోమలమ్మృదువయిన - అధర, మోవియొక్క- పుటం, పుటము గలిగినవాడును - సాచిప్రసారేక్షణం - సాచి, అడ్డముగా - ప్రసార, చూపుగలం ఈక్షణం, నేత్రముగలవాడును - ఆలోలాఙ్గుళిపల్లవైః, ఆలోల - చలించుచున్న- అంగుళి, పల్లవైః- చిగుళ్ళవంటి వ్రేళ్ళచేత, మురళికాం - వేణువును, ముదా - సంతోషముతోడ, అపూరయంతం- పూరించుచున్నవాడును, త్రిభంగిలలితం - త్రిభంగిమూడువంపులచేత, లలితం - సుందరమైనటి, జగన్మోహనం - జగత్, లోకంబులను - మోహనం, మోహింపజేయునటికృష్ణుని - కల్పతరోః, కల్పవృక్షముయొక్క - మూలే, క్రింది ప్రదేశమందు- ధ్యాయే, ధ్యానించుచున్నాను. ౧౦౨



ఉ॥ మూపునవామకుండలము మోపియొకించుక మోడ్పునందమ
ముం। బూపెదునోరచూపుసొగసుంబొమనొక్కటనిక్కఁగ
న్పడం।గ్రేవులుసొకఁగల్పకముక్రిందత్రిభంగిగనిల్పియంగుళి।
వ్యాపితవంశపూర్తియయువతిఁలు మోహనమూర్తిఁగొల్చె
దః॥ *

తా॥ గానకాలమున డెడమప్రక్కయందు దలవంగి యుండుటవలన వామకుండలము మూపునదగులగా నాకబొమవంగియొక బొమపొడవై యుండ మోవియరమోడ్పన వెలుంగగా జాన్పులడ్డముగా ప్రసరింపగ జిగురుటాకులవంటి వ్రేళ్ళచెబూరించి వేణుగానము సేయుచుడద్వాశంబున మూడువంకలతో గనంబడునట్టి మేనితో గల్పవృక్షము క్రింద జగన్మోహనాకారుండై విలసిల్లుకృష్ణుదలంచుచున్నాననుట. *

శ్లో॥ మల్లైశ్శైలేంద్రకల్పశ్శిశురితరజనైః పుష్పచాపోఽఙ్గనాభిర్గోపైస్తు ప్రాకృతాత్మా దివి కులిశభృతా విశ్వకాయోఽప్రమేయః। క్రుద్ధః కంసేన కాలో భయచకితదృశా యోగిభిర్ధ్యేయమూర్తిర్దృష్టో రంగావతారే హరిరమరగణానందకృత్పాతు యుష్మాన్॥ ౧౦౩

టీ॥ రంగావతారే=రంగ-కంసకృతమల్లరంగమునందు, అవతారే-ఆడమనమందు, యః హరిః-ఏ శ్రీకృష్ణమూర్తి, మల్లైః- చాణూరాదిమల్లులచేత, శైలేంద్రకల్పః- శైలేంద్ర-హిమవత్పర్వతముతోడ, కల్పః-సమానుండగుచు, దృష్టః-చూడంబడియెనో, ఇతరజనైః-తదితర-జనులచేత, శిశుః-బాలుండగుచు, దృష్టః-చూడబడియెనో, అంగనాభిః-యువతులచేత, పుష్పచాపః-మన్మథుడగుచు, దృష్టః-చూడబడియెనో, గోపైస్తు-గోపాలకులచేత, ప్రాకృతాత్మా-ప్రాకృతుడగుచు, దృష్టః-చూడబడియెనో, దివి-అంతరిక్షమందు, కులిశభృతా-ఇంద్రునిచేత, విశ్వకాయః=విశ్వ ప్రపంచమయిన, కాయః-శరీరముగల, అప్రమేయః-పరిమాణవిషయుండు కానివాడగుచు, దృష్టః-చూడబడియెనో, భయచకితదృశా=భయ-భయముచేత, చకిత-సంచలించుచున్న, దృశా-దృష్టిగల, కంసేన-కంసునిచేత, క్రుద్ధః-కోపవంతుడయిన, కాలః-యముడగుచు, దృష్టః-చూడబడియెనో, యోగిభిః-యోగులచేత, ధ్యేయమూర్తిః=ధ్యేయ-ధ్యానముజేయదగిన, మూర్తిః-స్వరూపముగలవాడగుచు, దృష్టః-చూడబడియెనో, సః-అప్రసిద్ధుడయిన, అమరగణానందకృత్=అమరగణ-దేవసమూహములకు, ఆనందకృత్ - సంతసముజేయుచున్నకృష్ణుడు, యుష్మాన్-మిమ్ము, పాతు-రక్షించుగావుత॥

చ॥ నగమని కెట్లు మోపఁడని నాగరికుల్ మఱుఁడంచు గాంతల ।
భ్రగపతి విశ్వరూపుఁడని ప్రాకృతుఁడంచును గోపబాలురు ॥ గగ
తిఁడనమ్ము మృత్యువసికంసుఁడు యోగులు స్వామిగా గనం । దగి
సురలు బ్బరంగమున దారొరఁను దేవుఁడు మిమ్ము బ్రోవుతన్ ॥

తా॥ మల్లరంగంబునం గంసు పురోభాగంబున నిలిచిన ప్పుడే హరి బాణూరాదిమల్లులచే బర్వతసమానుండగుచు నితరులచే బాలుఁడగుచు దరుణులచే మరుండగుచు గోపాలకులచేఁ దండమబోటి ప్రాకృతుండగుచు నాకాశంబున నింద్రునిచే విశ్వమయుండగుచు భయభ్రాంతుండగు కంసుచే గాలుండగుచు యోగులచే ధ్యానాహఁడగుచు నెహరి చూడంబడి యెవ్వఁడో యట్టి సర్వదేవతానందకరుండగు శ్రీకృష్ణమూర్తి మిమ్ము బ్రోచుగాతయనుట ॥

*

శ్లో॥ సంవిష్టో మణివిష్టరే జరతలమధ్యాసీనలక్ష్మీముఖే కస్తూరీ
తిలకం ముదా విరచయన్ హర్షాత్ కుచౌ సంస్పృశన్ । అన్యోన్య
స్మితచంద్రికాకిసలయైరారాధయన్మన్మథం గోపీగోపపరీవృ
తో యదుపతిః పాయాజ్జగన్మోహనః ॥

టీ॥ మణివిష్టరే- మణి, మరకతమణివికారమయిన- విష్టరే, ఆసనమందు- సంవిష్టః, కూర్చున్నవాఁడును - అంకతలమధ్యాసీనలక్ష్మీముఖే, అంకతల - తొడమీఁదను, అధ్యాసీన- కూర్చున్న, లక్ష్మీ- లక్ష్మీదేవియొక్క, ముఖే- మోముగమునందు, కస్తూరితిలకం- కస్తూరి, కస్తూరితిలకమయినయున, తిలకం- బొట్టును, ముదా- సంతోషముచేత, విరచయన్- దిద్దుచున్నవాఁడును, హర్షాత్ - సంతోషమువలన, కుచౌ - స్తనములను- సంస్పృశన్, స్పృశించుచున్నవాఁడును- అన్యోన్యస్మితచంద్రికాకిసలయైః, అన్యోన్య పరస్పరమును- స్మిత, చిఱునగవనియెడి- చంద్రికా, వెన్నెలయొక్క- కిసలయైః, చిగుళ్ళచేత, మన్మథం- మన్మథుని, ఆరాధయన్- ఆరాధించుచున్నవాఁడును, గోపీగోపపరీవృతః- గోపీ, గోపస్త్రీలచేతను- గోప, గోపకులచేతను- పరీవృతః, పరివేష్టింపబడినవాఁడును- జగన్మోహనః, జగన్మోహనుఁడగు - యదుపతిః, శ్రీకృష్ణమూర్తి - వః, మమ్ము, పాయాత్- రక్షించుగాక ॥ ౧౯

చ॥ చెలువగు రత్నపీఠమున శ్రీసతి నంకముఁ జేర్చి కస్తురిం । దిలక
ముదిద్ది దిద్దితమిందీరక వెంటన గుబ్బలంటమో । ములదలుకొత్త
నవ్వు విరిముత్తములన్మరుఁ బూజసేయు ని । చ్చెలువయు వల్లవప్ర
కరసేవిత మోహనమూర్తి మిమ్ము బ్రోవుతన్ ॥



తా॥ మరకతమణివికారంబగు నాసనంబునం గూర్చుండి తొడపైనిడుకొని రుక్మిణిచే మోముగంబునం గస్తురిబొట్టు దిద్దినదనతమిందీరక చన్నుంగవ నంటు చుంబరస్పరంబు చిఱునగవు వెన్నెలచిగుళ్ళచే మారు నారాధించుచుం గోపగోపీ పరివృతుండయి జగన్మోహనుండయి యాగ యాదవశ్రేష్ఠుఁడగు కృష్ణదేవుండు మిమ్ము బ్రోచుగాతయనుట ॥

శ్లో॥ ఆకృష్టే వసనాంచలే కువలయశ్యామా త్రపాధఃకృతా దృ
ష్టిస్సంవలితా రుచా కుచయుగే స్వర్ణప్రభే శ్రీమతీ । బాలః కశ్చ
న చూతపల్లవ ఇతి ప్రాంతస్మితాస్య శ్రియం శ్లిష్యం స్తామథ రుక్మి
ణీం నతముఖీం కృష్ణస్సపుష్ణాతు నః ॥

*

టీ॥ యస్యాః, ఏ రుక్మిణీదేవియొక్క- వసనాంచలే, పయ్యెదచెఱఁగు- ఆకృష్టే, ఆకర్షింపబడుచుసుండగా- అథ, అనంతరము- త్రపాధఃకృతా, త్రపా- సిగ్గుచేత, అధఃకృతా- క్రిందుగా చేయబడిన, కువలయశ్యామా- కువలయ, నల్లకల్వలవలె- శ్యామా, నల్లనయిన, దృష్టిః- చూపు, రుచా- కాంతిచేత, స్వర్ణప్రభే, స్వర్ణ- బంగారువంటి కాంతిగలదియగు- శ్రీమతి, సౌందర్యయుక్తమైన- కుచయుగే, చన్నులయందు- సంవలితా, లగ్నమయినదియో- తాం- ఆలజ్జాయుక్తురాలయినదియును- నతముఖీం, నత- నమ్రమయిన, ముఖీం- ముఖముగలదియు, బాలః- లేతయయిన - కశ్చన- ఒకానొకటియయిన, చూత - పల్లవ ఇతి, మావిచిగురను, హేతువువలన - ప్రాంతస్మితాస్యశ్రియం, ప్రాంత- సమీపమున- స్మిత, చిఱునగవుగల - అస్యశ్రియం, ముఖకాంతిగల- రుక్మిణీం, రుక్మిణీదేవిని- శ్లిష్యన్, ఆలింగనము చేయుచున్న- సః, ఆ ప్రసిద్ధుడైన- కృష్ణః, శ్రీకృష్ణమూర్తి- నః, మమ్ము- పుష్ణాతు, పోషించుగాక ॥ ౨౦

మ॥ అలరుం బయ్యెదకొంగు దియ్య దపనీయ శ్రీవిడంబించు గు । బ్బ
లపై సిబ్బితిగబ్బి చూపు నెలకొల్పం దద్ద్యుతి న్మాన్యత చూ । తపు
వల్లవరీతిగాంచి స్మితవక్త్ర శ్రీపొలుపు యారుక్మిణీ । లలనం గౌగిట
గారవించు హరి కళ్యాణంబు మాకీవుతన్ ॥

*

తా॥ పైటచెఱంగు దొలంగ జేయ బంగరు జిగి నాలుకొను సిబ్బెంపు గబ్బిగుబ్బలపై సిబ్బితిచే నధోముఖియై చూపు నెలకొల్పనచ్చూపును జంపోయిపై మెఱయు బంగరుజిగియు నుంగలయంజేయమావి చిగురుంబోని యుక్కాంతింజూచి యేలమావి ఇగురేలతో నా చన్నుంగవపైనున్నది యని భ్రాంతిం జెందిన రుక్మిణిం గౌగిటం జేర్చి సుఖయించు కృష్ణుండు మిమ్ము బ్రోచుగాతయనుట ॥

*

ఈశ్లోకము రుక్మిణీకృష్ణసంవాదముగఁ గవి సెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉర్వ్యాంకో౽పిమహీధరోలఘుతరోదోర్భ్యాంధృతో లీ
లయాతేనత్వందివిభూతలేచసతతంగోవర్ధనోగీయసే ।
త్వాంత్రైలోక్యధరంవహామికుచయోరగ్రేనతద్గణ్యతేకింవా
కేశవభాషణేనబహునాపుణ్యైర్యశోలభ్యతే॥ *

టీక॥ హేకేశవ, ఓకృష్ణా-ఉర్వ్యాం, భూమియందు-కో౽పి, ఒకానొకటియైన-లఘుతరః, మిక్కిలియల్పమైన- మహీధరః, గోవర్ధనపర్వతము- దోర్భ్యాం, హస్తములచేత- లీలయా, విలాసముగా- ధృతః, ధరియింపబడినది- తేన, ఆహేతువుచేత- త్వం, నీవు- దివిస్వర్గమందును, భూతలేచ - భూతలమందును, సతతం - ఎల్లప్పుడును- గోవర్ధనః, గోవర్ధనపర్వతము ధరియించినవాడవనుచు-గీయసే, చెప్పబడుచున్నావు- త్రైలోక్యధరం, త్రిలోకధురంధరుడవయిన- త్వాం, నిన్ను- కుచయోః, స్తనములయొక్క - అగ్రే-తుదను - వహామి,వహించుచున్నాను - తత్, ఆవహనము, నగణ్యతే- లెక్కింపబడలేదు, బహునా- అనేకవిధమైన, భాషణేన- పలుకుచేత, కిం- ఏమిప్రయోజనము, పుణ్యైః- పుణ్యములచేత, యశః- కీర్తి, లభ్యతే-పొందబడుచున్నది॥ ౧౦౬

మ॥ ధరణింజేతులనొక్కచిన్నగిరియెత్తన్నన్నుగోవర్ధనో
ద్ధరుఁడంచునుతించెనీదశదిశల్ త్రైలోక్యధారేయనిన్ ।ను
రువక్షోజములన్ భరింపనను బేరొక్కరెవ్వరుంబుణ్యవిస్ఫు
రణంగీర్తి చెలంగుఁబెక్కువచనంబుల్గృష్ణయింకేటికిన్॥ *

తా॥ ఓకృష్ణాఇప్పుడమియందునతిసులభంబగు నొకచిన్న కొండంజేతులతోనీవెత్తినందుకైగోవర్ధనోద్ధరుడనియెల్లదెసలంబొగడ్తంగాంచితివిముల్లోకంబులధరించుచుని నుజగన్మోహనం ధరించిననాకట్టిపొగడ్తలేవయ్యె నేరికెంబుణ్యవిశేషంబులచేతందక్కనితరకర్మంబులచేతంగీర్తిగాంచనేవిగాదనుట॥ *

శ్లో॥సంధ్యావందన భద్రమస్తుభవతేభోస్నానతుభ్యంనమో
భోదేవాఃపితరశ్చతర్పణవిధౌనాహంక్షమఃక్షమ్యతాం।యత్ర
క్వాపినిషిద్యయాదవకులోత్తంసస్యకంసద్విషస్స్మారంస్మా
రమఘంహరామితదలంమన్యేకిమన్యేనమే॥ *

టీక॥ హేసంధ్యావందన, ఓసంధ్యావందనమా-భవతే, నీకొఱకు - భద్రమంగళము - అస్తు, అగుగాత- భోస్నాన, ఒస్నానమా- తుభ్యం, నీకొఱకు - నమః, నమస్కారము- భోదేవాః, ఓదేవతలారా- భోపితరః, ఒపితరులారా- తర్పణవిధౌ-తర్పణము, తృప్తియొక్క- విధౌ, చేయుటయందు- నక్షమః, అశక్తుడను - క్షమ్యతాం, క్షమింపదగినది- యత్రక్వాపి, ఎక్కడనైనను- నిషీద్య, కూర్చుండి- యాదవకులోత్తంసస్య, యాదవకుల- యదువంశమునకు- ఉత్తంసస్య, శేఖరుండగు - కంసద్విషః, కృష్ణమూర్తిని-స్మారంస్మారం, స్మరించిస్మరించి - అఘం, పాపమును - హరామి, పోవనడుచుచున్నాను- తత్- ఆకంసవైరిధ్యస్మరణము, అలం-పాపనివృత్తికిఁజాలునని - మన్యే- తలంచుచున్నాను, అన్యేన- ఇతరముచేత, కిం- ఏమిప్రయోజనము॥ ౧౦౭

చ॥ సతతముసంధ్యకున్ శుభముస్నానజపాదివిశేషసత్క్రి
యా । తతికెనిమ్రొక్కుదేవపితృతర్పణచర్యకశక్తయుక్తుడ।
న్మతిగఁణింపడొక్కనియమస్థితిగంసరిపున్ యదూద్వహున్
స్తుతియొనరించికల్మషవిదూరుడనౌదునన్యకర్మతన్॥ *

తా॥ సంధ్యావందనంబునకు శుభంబగు స్నానంబునకు మ్రొక్కెదను దేవపితరులారామీకుదర్పణంబుచేయంజాలక్షమియింపుడు నేనుకంసరిపుండగుశ్రీకృష్ణునిస్మరించిపాపంబులడంచెదనిదియ నాకుజాలునింక నన్యంబుచె నేమిప్రయోజనంబనుట॥ *

శ్లో॥ హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ। హే
రామానుజ హేజగత్త్రయగురో హేపుణ్డరీకాక్ష మాంహే
గోపీజననాథ పాలయపరంజానామినత్వాంవినా॥ *

టీక॥ హేకృపాజలనిధే, ఒదయాసముద్రుడా- హేసింధుకన్యాపతే,ఒలక్ష్మీపతీ-హేగజేంద్రకరుణాపారీణ, గజేంద్ర- గజశ్రేష్ఠునివిషయమైన,కరుణా- కరుణకు, పారీణ-పారంగతుడయినవాడా- హేమాధవ, ఒయిమాధవుడా, హేరామానుజ-రామ-రామస్వామివారికి - అనుజ, తమ్ముడవయిన వాడా - హెపుండరీకాక్షా, వోయిపుండరీకాక్షుడా- హేగోపీజననాథ, గోపీజన- గోపికాసమూహమునకు, నాథ- ప్రభుడవయినవాడ- హేగోపాలక, వోయిగోపాలకృష్ణా-మామ్, నన్ను-పాలయ, రక్షింపుము- త్వాంవినా, నిన్నుదక్క- పరం, అన్యదైవమును- నజానామి, ఎఱుంగను॥ *

శా॥ ఓకారుణ్యసముద్రయోకరటిరక్షోదీర్ణయోమాధవా।
యోకంసాంతకయోరమాసహచరాయోవల్లవీకింకరాయో
కంజేక్షణయోజగద్గురుమణీయోరామహేరామానుజా। మీకన్న
న్యతినన్యునేనెఱుగజుమ్మీనన్నురక్షింపుమీ॥ *

తా॥ దయాసముద్రుడవై లక్ష్మీపతివయ్యును కంసధ్వంసకుండవై గజేంద్రుని విపత్తును బాపినవాడవై శార్ఙ్గపాణివై బలరామునికి తమ్ముడవై లోకత్రయంబునకును గురుండవై గోపికాసమూహంబులకు ప్రభుండవై పుండరీకాక్షుండవై నయో శ్రీకృష్ణా నీకన్ననితరుని వెలుంగనసుం బ్రోవుమయనుట॥ *

శ్లో॥ కస్తూరీతిలకంలలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం నాసాగ్రే
నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్। సర్వాంగే హరిచం
దనం చ కలయన్ కంఠే చ ముక్తావళిం గోపస్త్రీపరివేష్టితో విజ
యతే గోపాలచూడామణిః॥ *

టీక॥ లలాటఫలకే, లలాటప్రదేశమందు- కస్తూరీతిలకం, కస్తురిబొట్టును- వక్షఃస్థలే, రొమ్మునందు- కౌస్తుభం, కౌస్తుభమణియు- నాసాగ్రే, ముక్కుతుదయందు- నవమౌక్తికం, క్రొత్తముత్తియమును- కరతలే, హస్తప్రదేశమునందు- వేణుం, పిల్లనగ్రోవియు- కరే, హస్తమునందు- కంకణం, కడియమును- కంఠే, గళమందు - ముక్తావళిం- ముత్తియంపుసరమును, సర్వాంగే - స్వశరీరమందును, హరిచందనం - శ్రీచందనమును- కలయన్, యథాయోగ్యముగా వహించుచున్నవాడును - గోపస్త్రీపరివేష్టితః- గోపస్త్రీః గోపికలచేత- పరివేష్టితః, పరివేష్టింపబడినవాడునగు - గోపాలచూడామణిః గోపాల, గోపాలకులలో పల- చూడామణిః, శిరోరత్నమగు శ్రీకృష్ణమూర్తి - విజయతే- సర్వోత్కృష్టుడగుంగాక॥ *

మ॥ నుదుటం గస్తురిబొట్టు నాసికతుదన్ ముత్తెంబు శ్రీగంధసం। ప
దనెమ్మేన గరంబులం గటకముల్ వంశంబు హస్తాగ్రమందెదపైని
స్తులకౌస్తుభంబు చెలువున్। శృంగారహారంబునిం। పొదవం గృ
ష్ణుండు గోపికావృతుండు సర్వోత్కృష్టుడై వర్తిలున్॥ *

తా॥ నుదుటం గస్తురిబొట్టును ముక్కుతుదం గ్రొత్తముత్తియంబును మేనం జందనంబును గరంబులం గడియంబులును హస్తాగ్రంబున వేణువును వక్షంబున గౌస్తుభంబును గళంబున ముత్తియపు లహారంబును మెఱయ గోపికాపరివృతుడైన కృష్ణుడు సర్వోత్కృష్టుండై వెలయుంగాతయనుట॥ *

శ్లో॥ లోకానున్మదయన్ శ్రుతీర్ముఖరయన్ క్షోణీరుహాన్ హ
ర్షయన్ శైలాన్విద్రవయన్మృగాన్వివశయన్గోబృందమానం
దయన్। గోపాన్సంభ్రమయన్మునీన్ముకుళయన్ సప్తస్వరాన్
జృంభయన్నోంకారార్థముదీరయన్విజయతే వంశీనినాద
శ్శిశోః॥ *



టీక॥ లోకాన్- లోకములను, ఉన్మదయన్- మదింపజేయుచున్నవాడును, శ్రుతీః- వేదములను, ముఖరయన్- ధ్వనింప జేయుచున్నవాడును, క్షోణీరుహాన్- వృక్షములను- హర్షయన్, చిగురింపజేయుచున్నవాడును- శైలాన్, పర్వతములను- విద్రవయన్ కరగ జేయుచున్నవాడును- మృగాన్, మృగములను- వివశయన్, పరవశం జేయుచున్నవాడును- గోబృందం, గోసమూహమును- ఆనందయన్, సంతోషింపజేయుచున్నవాడును- గోపాన్, గోపాలకులను- సంభ్రమయన్, భ్రమియింపజేయుచున్నవాడును- మునీన్, మునులను - ముకుళయన్, మోడ్పుగేలు గలవారలగా జేయుచున్నవాడును సప్తస్వరాన్, సరిగమపదనిసలను స్వరములను - జృంభయన్, ప్రకాశింపజేయుచున్నవాడును- ఓంకారార్థం, ప్రణవార్థమును- ఉదీరయన్, ప్రతిపాదించుచున్న వాడునగు- శిశోః, శ్రీకృష్ణమూర్తియొక్క - వంశీనినాదః, వేణునాదము, విజయతే, సర్వోత్కృష్టమయి యుండుగాక॥ *

మ॥ మృగములు సోక్కి ద్రుమతతి గిరింపంగ శైలు కరంగ బ్రహ్మో
దయంగా। నిగమములార్భటులుబ్బంగను నివ్వటప్రమానవ్వ గోవులాడ
గా। జగము సెలంగ నోంకృతియు సంగంగ సప్తవిధస్వరాంగు
ళుల్ చిగురించంగ డంగె బాలమురళీనినదంబు ముదంబు సంగంగన్॥

తా॥ మృగంబులు సోక్కుటాలుగ తరుతతులు చిగురింపగ శైలంబులు ద్రవియగా గోవులు సంతసంబునొంద మునీంద్రులు ముకుళితకరులై నివ్వగా గోపకులు సంభ్రమించ లోకంబులు సెలంగ బ్రణవార్థంబగు పరబ్రహ్మంబు వెలుంగ సప్తస్వరంబులు ప్రకాశింప శ్రీకృష్ణుని వేణుధ్వని సర్వోత్కృష్టమయి వర్తిల్లెననుట॥ *

మాలినివృత్తము॥ సతతవినుతభీమా సచ్చిదానందసీమా। శత
మఖనుతనామా సాధుమానిప్రణామా। దితిజకులవిరామా దే
వతాసార్వభౌమా। వితతతపనధామా వేంకటాహార్యధా
మా॥ *

మ॥ ఇది కృష్ణాశ్రయయోగివుంగవకృపాపాత్తామ్నాతసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధకుమారాన్విత సత్యదయా
భరావణవెల్లపూడిమణిపెద్దామాత్యవెంగాగ్రణీగదితాశ్వా
సము పొల్చు రెండవది మైకర్ణామృతశ్రీకృతిన్॥ *

శ్రీకృష్ణకర్ణామృతము - ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.

---

## శ్రీకృష్ణకర్ణామృతము-తృతీయాశ్వాసము.

---

శ్లో॥ అస్తిస్వస్త్యయనం సమస్తజగతామభ్యస్త లక్ష్మీస్త
నంధ్వస్తధ్వస్తరజస్తమోభిరనిశంన్యస్తంపురస్తాదివ। హస్తో
దస్తగిరీంద్రమస్తకతరుప్రస్తారవిస్తారితప్రస్తస్వస్తరుసూ
నసంస్తరలసత్ప్రస్తావిరాధాస్తుతమ్॥ ౧

టీక॥ సమస్తజగతాం- నిఖిలలోకములకు- స్వస్త్యయనం-రక్షకమయిన యదియు- అభ్యస్తలక్ష్మీస్తనః;అభ్యస్త-బహువారసంబంధములైన లక్ష్మీరమాదేవియొక్క- స్తనం కుచములుగలదియు-ధ్వస్తరజస్తమోభిః;ధ్వస్త-నష్టములయిన- రజస్తమోభిః- రజస్తమోగుణములచేత- అనిశం-ఎప్పుడును-పురస్తాత్-ఎదుట- న్యస్తమివ- ఉంచినదానివలెనున్నయదియు- హస్తోదస్తగిరీంద్రమస్తకతరుప్రస్తారవిస్తారితప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తావిరాధాస్తుతః; హస్త-హస్తములచేత-ఉదస్త-ఎత్తంబడిన-గిరీంద్ర-గోవర్ధనపర్వతము యొక్క-మస్తక- శిఖరములయందలి-తరు-వృక్షములయొక్క-ప్రస్తార-సమూహములయందు-విస్తారిత-వికసించినయదియు- ప్రస్త-జారుచున్నయదియునగు- స్వస్తరు-కల్పవృక్షములయొక్క- సూన- పుష్పములయొక్క- సంస్తర- సమూహములచేత- లసత్- ప్రకాశించుచున్నదియును-ప్రస్తార నుతియుంచుచున్న- రాధా- రాధచేత-స్తుతం- స్తోత్రముజేయంబడుచున్నయదియునగు-వస్తు శ్రీకృష్ణాఖ్యవస్తువు-అస్తి కలదు॥

శా॥ హస్తోదస్తగిరీంద్రమస్తకతరువ్యస్తవిస్తారిత। ప్రస్తస్వ
స్తరుసూనసంస్తరలసత్ప్రస్తారమభ్యస్తప। ద్మాప్రాక్స్తనమ
స్తకల్మషపురోన్యస్తంబునుద్యజ్జగత్స్వస్తిశ్రీధమురాధికాస్తు
తముజంచద్వస్తువెంతేతగున్॥ ❋

తా॥ ఎల్లలోకంబులవారలకురక్షకంబై మాటిమాటికిసిరిచన్నులంటుచున్నదియైశుద్ధసత్వగుణంబునకునెలవై యెల్లపుడునుగరతలామలకంబుగనెదుటదోచుచున్నదియైకరంబుననెత్తబడినగోవర్ధనంబందలి తరులనుండిజారుచున్నపువ్వులచేతను గల్పతరుప్రసూనంబులచేతనుం దేజరిల్లుచు రాధికచేనుతియింపంబడియున్నవస్తువొకండుకలదు॥ ౨



శ్లో॥ రాధారాధితవిభ్రమాద్భుతరసం లాలిత్యరత్నాకరం సా
ధారణ్యపదవ్యతీతసహజస్మేరాననాంభోరుహం। ఆలంబే
హరినీలగర్వగురుతాం సర్వస్వనిర్వాపణం బాలంవైణవికం
విముగ్ధమధురంమూర్ధాభిషిక్తంమహః॥

టీ॥ రాధారాధితవిభ్రమాద్భుతరసం- రాధా, రాధచేత- ఆరాధిత,బహూకరింపంబడుచున్న- విభ్రమ, విలాసముచేత- అద్భుత-ఆశ్చర్యసంపాదకములైన- రసం, శృంగారరసము మొదలగు రసములుగలయదియు - సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననాంభోరుహం, సాధారణ్యపద - సామ్యమార్గమును - వ్యతీత, అతిక్రమించినదియు, సహజ- స్వభావసిద్ధమైన- స్మేర, చిరునగవుతో గూడిన-ఆననాంభోరుహం-ముఖకమలముగలదియు- హరినీలగర్వగురుతాం- హరినీల, ఇంద్రనీల మణులయొక్క- గర్వగురుతాం, అహంకారాంకురములయొక్క- సర్వస్వనిర్వాపణం - సర్వస్వ, సమస్తపదార్థములయొక్క - నిర్వాపణం, నాశకమైనదియు - లాలిత్యరత్నాకరం - లాలిత్యసౌందర్యమునకు- రత్నాకరం, సముద్రమైనదియు- వైణవికం- వేణునాద సక్తమైనదియు-విముగ్ధమధురం- విముగ్ధ, మిక్కిలిసుందరముగలవారిలోపల - మధురం-సుందరమైనదియు- మూర్ధాభిషిక్తం- శ్రేష్ఠమయినదియు- బాలం, లేతయైనదియునగు - మహః- తేజమును- ఆలంబే- ఆశ్రయించుచున్నాను॥ ౧౧౨

శా॥ సాధారణ్యసరణ్యతీతదరహాసశ్రీముఖాంభోజుండై। మాధు
ర్యైకనిధానుడై మకరతాన్మప్రౌఢిగర్వార్భటీ। వైధుర్యా
వహతేజుడైసరసనిర్వ్యాజాంగశృంగారుడై। రాధారాధి
తుడైనవైణవికమూర్ధన్యున్మదింగొల్చెదన్॥

తా॥ రాధికచేతబహూకరింపబడినవిలాసంబులచేనాశ్చర్యంబుసంపాదించుచున్నశృంగారాదిరసంబులకు దానకంబగుచుసౌందర్యంబనురత్నంబునకుఖనియైనిరుపమానంబై స్వభావసిద్ధంబగుమందహాసంబుతోడంగూడినవామోమువామరగలిగి ఇంద్రనీలంబులగర్వంబునపహసించునదియైసుందరంబుగలవారలలో నసుందరంబై శ్రేష్ఠంబగుచువెలయుతేజంబునాశ్రయించుచున్నాననుట॥ ❋

శ్లో॥ కరిణాముల జఘ్న్యగతిస్త్రైభవంభజేకరుణావలమ్బితకిశోరవిగ్ర
హం। యమినామనారతవిహారిమానసేయమునావనాన్త
రసికంపరంమహః॥

టీ॥ కరిణాం, ఏనుగులచేత, అలంఘ్యగతివైభవం, అలంఘ్య- అతిక్రమింపనశక్యమైన- గతివైభవం గమనసంపదగలయదియు, కరుణావలంబితకిశోరవిగ్రహం- కరుణా- దయచేత- ఆవలంబిత- స్వీకరింపబడిన- కిశోరవిగ్రహం- బాలకశరీరముగలదియు, మునీనాం ఋషులయొక్క - మానసే, మనములయందు- అనారతవిహారి, అనారతం, ఎల్లప్పుడుకిను, విహారి, విహరించుచున్నదియు, యమునావనాంతరసికం- యమునా- యమునానదియందలి- వనాంత- వనమధ్యమునందు- రసికం, సరససంచారయుతమయినయటియును- పరం- ఉత్కృష్టమైనదియునగు- మహః- తేజమును- భజే సేవించుచున్నాను, ౩

ఉ॥ అల్లనమందయానముగజావలిగేరగమానిమానసో। త్ఫుల్ల
సరోజపాళిబదమైలగక్ యమునాతరంగిణీ। సల్లలితాం
బుపూరములుసారవయస్యలమీదజిమ్ముచుం । ఝల్లనిచూపు
లంగరుణజల్లెడునల్లనిబాలుగొల్చెదన్॥

తా॥ మదవుటేనుగులచేతంగొంటదగినమందయానంబుగలిగినసుజేహాదులయందలి కరుణచే బాలస్వరూపంబు౦ జెలువొందినదయుల్లమునుల మనంబులం దేవరిల్లుచుయమునయందలి యుదకింబులంబల్లు పోరాడసరసమైన తేజంబును సేవించుచున్నాననుట॥

శ్లో॥ నియన్త్రితస్సకలజగద్వ్రజాంగనానియన్త్రితం విపులవిలో
చనాజ్ఞాయా। నిరన్తరం మమహృదయే విజృమ్భతాం సమస్త
తస్సరసతరం పరం మహః॥

టీ॥ యత్, ఏతేజము। సకలజగత్. సమస్తలోకమును- నియన్త్రి- నియమించుచున్నదియో- విపులవిలోచనాజ్ఞయా- విపుల- విశాలములయిన- విలోచన- నేత్రములయొక్క- ఆజ్ఞయా- ఆజ్ఞచేత- వ్రజాంగనానియన్త్రితం. వ్రజాంగనా- గోపస్త్రీలచేత - నియన్త్రితం- నియమింపబడినదియో సమస్తతః - అంతటను - సరసతరం- మిక్కిలిసరసమయినయదియో- పరం- ఉత్కృష్టమయినదియో - తత్, ఆప్రసిద్ధమయిన- మహః, తేజము- మమ, నాయొక్క- హృదయే, హృదయమందు- నిరంతరం. ఎల్లప్పుడును- విజృంభతాం, ప్రకాశించుగావుత॥ ౪

ఉ॥ లోకములన్నియుందనకులోకువగాగొనియేలుమేటియై। స్తో
కమనోహరావయవశోభితుడెంతటివింతగోపికా । లోకన
లీలనెల్ల పనులుందను దాసయొనర్చువారిదే। కాకప్రభావమట్టి
త్రిజగత్సులభున్మదినాశ్రయించెదన్॥

తా॥ లోకంబులనెల్లదనవశంబుగాజేసికొనియేలుజగత్పతిగోపికల కన్నుసన్నలనెల్లపనులుంజేయుచు నంతటసరసంబగుచునధికంబైన తేజంబునాహృదయంబున బ్రకాశించుగాకయనుట॥



శ్లో॥ కందర్పప్రతిమల్లకాన్తివిభవం కాదంబినీబాంధవం బృన్దా
రణ్యవిలాసినీవ్యసనినం వేషేణ భూషామయం। మందస్మేర
ముఖాంబుజం మధురిమవ్యామృష్టబింబాధరం వందే కందళి
తార్ద్రయౌవనవనం కైశోరకం శార్ఙ్గిణః॥

టీ॥ కందర్పప్రతిమల్లకాన్తివిభవం- కందర్ప- మన్మధునికి. ప్రతిమల్ల- ప్రతిభటమైన- కాంతి- కాంతియొక్క- విభవం- సంపదగలయదియు- కాదంబినీబాంధవం। కాదంబినీ- మేఘపంక్తికి- బాంధవం- బంధువైనయదియు- బృందారణ్యవిలాసినీవ్యసనినం- బృందారణ్య- బృందావనమందలి- విలాసినీ- గోపికలవిషయమయిన- వ్యసనినం- ఆసక్తిగలదియు- వేషేణ- అలంకారముచేత, భూషామయం- భూషణస్వరూపమయినయదియు- మందస్మేర[illegible]ంబుజం- మందస్మేర। మందహాసముతోగూడిన- ముఖాంబుజం- ముఖకమలముగలయదియు- మధురిమవ్యామృష్టబింబాధరం- మధురిమ- సౌందర్యముచేత- వ్యామృష్ట, మిక్కిలియొప్పగ్రహింపబడిన- బింబాధరం- దొండపండువంటి యధరముగలయదియునైన- శార్ఙ్గిణః- శ్రీకృష్ణునియొక్క- కైశోరకం - బాల్యసంబంధమయిన- ఇదం, ఈ ప్రసిద్ధమైన- కందళితార్ద్రయౌవనం- కందళిత- మొలకలెత్తిన- ఆర్ద్రయౌవనం- క్రొత్తజవ్వనమునుగూర్చి- వందే- నమస్కరించుచున్నాను. ౫

శా॥ కందర్పప్రతిమల్లధామునవమేఘశ్యాముబృందావనా
న్తారణ్యావధూరతున్మధురిమామృష్టాధరోష్ఠాన్వితు । న్మంద
స్మేరకపోలువేషకృతనానాభూషణోద్వేల్లనసల్వాటిదంగా
న్నైదబాల్యయౌవనవిలాసాలంకృతున్శ్రీయుతున్॥

తా॥ మన్మధునకు ప్రతిభటంబైన కాంతియును నీలమేఘపంక్తికొదంబాత్మను బృందావనమునందలి విలాసినుల విషయికంబగు నాసక్తియు నఖిలభూషణమయంబగు వేషంబును మందహాసముచేమెరయు మోము దామరయు సౌందర్యయుక్తంబగునధర బింబంబునుంగలిగిన శార్ఙ్గధరుడగు శ్రీకృష్ణమూర్తియొక్క బాల్యంబుతోడంగూడినయౌవనంబునకు మ్రొక్కుచున్నాననుట॥ ౬

శ్లో॥ ఆముక్తమానుషమముక్తనిజానుభావమారూఢవిగ్రహము
గూఢవిదగ్ధలీలమ్ । ఆస్పృష్టయౌవనమనష్టకిశోరభావమా
ద్యం మహః కిమపి మాద్యతి మానసే మే॥

టీ॥ ఆముక్తమానుషం- ఆముక్త- కొంచెముగా విడువబడిన- మానుషం- మనుష్యభావముగలదిగనుక. ఆముక్తనిజానుభావం- ఆముక్త- విడువబడని- నిజ - స్వతేయమయిన- అనుభావం - అనుభవముగలయదియు. ఆరూఢవిగ్రహం. ఆరూఢ- స్వీకరింపబడిన,

విగ్రహం - శరీరముగలయదియు, అగాధవిదగ్ధలీలం - అగాధ - ప్రకాశించుచున్న-విదగ్ధ- ప్రౌఢములయిన- లీలం-విలాసములుగలయదియు- అవ్యుష్టయౌవనం-అవ్యుష్ట-యౌవద్విలాసయుతమయిన- యౌవనం-జవ్వనముగలయదియు, అనష్టకిశోరభావం-అనష్ట- నశింపని-కిశోరభావం- బాల్యముగలయదియు-కిమపి- వాచామగోచరమైన యదియు-అద్యం, జగత్కారణమైనదియునైన-మహః- తేజము- మమ- నాయొక్క-మానసేమానసమునందు-మాద్యతి-ప్రకాశించుచున్నది. *

ఉ॥ మానవలీలయున్నిరుపమానమహామహిమానుభావము। న్నే
నిపరిగ్రహంబుమితిమీఁజీనప్రౌఢియుబాల్యచాపలా। మాన
విలాసమున్న వమనోహరయౌవనముం జెలంగనెం। తేనియు
హర్షవిస్మయములిచ్చఁజెలంగ వెలుఁగునామదిన్॥

తా॥ మనుష్యభావంబును బూతనాసంహారాదినిజానుభావంబును శరీరపరిగ్రహంబును మితిమీరినమహాప్రౌఢియును బాల్యంబును యౌవనంబును విలసిల్ల వెలంగు తేజంబు నామది బ్రకాశించుచున్నదియనుట॥

శ్లో॥ తేతేభావాస్సకలజగతీలోభనీయప్రభావా నానాతృష్ణాసు
హృదిహృదిమేకామ మావిర్భవంతు వీణావేణుక్వణితలసిత
స్మేరవక్త్రారవిందాన్నాహంజానేమధురమధురం నంద
పుణ్యాంబురాశేః॥

టీక॥ సకలజగతీలోభనీయప్రభావాః- సకల- సమస్తమయిన, జగతీ-లోకములను, లోభనీయ - కోరుచున్న, ప్రభావాః- సామర్థ్యములు, తేతే-ఆయాప్రసిద్ధములయిన, భావాః-భావములు, నానాతృష్ణాసుహృది - నానా-పుత్రవిత్తాదివిషయకములైన, తృష్ణా-ఆసలకు, సుహృది మిత్రమైన, మే-నాయొక్క, హృది-మానసమునందు, కామం మిక్కిలియును, ఆవిర్భవంతు-ప్రకాశించుగావుత, వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిందాత్- వీణా-వీణవలెనున్న, వేణు-పిల్లనగ్రోవియొక్క, క్వణిత-ధ్వనిచే, లసిత-ప్రకాశించుచున్న, స్మేర-చిఱునగవుతోఁగూడిన, వక్త్రారవిందాత్- ముఖకమలముగల, నన్దపుణ్యాంబురాశేః- నంద-నందునియొక్క, పుణ్య-పుణ్యమనియెడి, అంబురాశేః-సముద్రమునికన్నను, మధురం-హృద్యమైన, అపరం- మఱియొకవస్తువును, అహం-నేను, నజానే-ఎఱుంగను.

మ॥ అమితాశావశమామదిన్నిఖిల లోకాశాస్యమాపెక్కుభా।
వములెన్నేనియునిల్చుగాకవిలసద్వంశీనినాదానుమో। దము



మందస్మితసుందరంబగుయశోదానందపుణ్యాంబుపూ। రము
కన్న న్మధురంబులేదొకటిచర్చల్సేయనింకేటికిన్॥

తా॥ నిఖిలలోకంబులంగోరు భావంబులెల్లనుం బుత్రమిత్ర విత్తాదులగు నాసలకు మిత్రంబగునాయెద నిల్చుంగాక నిల్చిననేమి వీణయుంబోలె మ్రోయుచున్న వేణువుచే సుందరంబగుచు జిఱునగవుతోడంగూడిన మోముదామరగలయశోదానందులపుణ్యాంబనుప్రవాహంబుంబోని శ్రీకృష్ణునికన్న నన్యంబెఱుంగహృద్యంబు గాదనుట.

శ్లో॥ సుకృతిభిరాదృతే సరసవేణునినాద సుధారసలహరీ విహార
నిరవగ్రహాకర్ణపుటే। వ్రజవరసుందరీముఖ సరోరుహాస
న్మధుపేమహసికదానుమజ్జతిమదీయమిదంహృదయమ్॥

టీ॥ సుకృతిభిః-పుణ్యులచేత-ఆదృతే-ఉపలాలింపబడినయదియు-సరసవేణునినాదసుధారసలహరీ విహారనిరవగ్రహాకర్ణపుటే- సరస- రసయుక్తమయిన-వేణునినాద-వేణుధ్వనియనియెడి, సుధారస- అమృతరసముయొక్క-లహరీ- ప్రవాహమందు-విహార- విహరించుటయందు, నిరవగ్రహ, అప్రతిబంధకమయిన- కర్ణపుటే- శ్రోత్రప్రదేశముగలయదియు. వ్రజవరసుందరీ ముఖసరోరుహాసన్మధుపే- వ్రజ - వ్రేపల్లెయందున్న- వర- శ్రేష్ఠులైనసుందరీ- గోపస్త్రీలయొక్క- ముఖసరోరుహ - ముఖకమలములకు। సన్మధుపే- శ్రేష్ఠచంచరీకమయిన- మహసి, తేజమునందు, మదీయం-నాసంబంధమయిన- ఇదం- ఈ- హృదయం, మానసము, కదాను- ఎప్పుడు, నిమజ్జతి - మునుంగుచున్నది.

చ॥ విమలతపోధనామృతము వేణురవామృతసారపూరవి। శ్రమ
పదకర్ణగోళముప్రజప్రమదాముఖపద్మచంచరీ। కముకమనీ
యనాకము సకామజనావనమైనదివ్యతే। జమునమునుంగు
చెన్నఁడొకొచల్లగనుల్లముపల్లవింపగన్॥

తా॥ పుణ్యులచేతనుపలాలింపఁబడుచున్నదియై వేణునాదంబనునమృతప్రవాహంబునందడ్డంబులేకయోలలాడు శ్రోత్రప్రదేశంబుగలిగి(అనఁగా వేణునాదమునందాసక్తంబైనది యనుట) ఇట్టి తేజంబుననానేమ్మనంబెప్పుడు మునుంగునోయనుట.

శ్లో॥ తృష్ణాతురేచేతసిజృమ్భమాణంముష్ణన్ముహుర్మోహమహాంధకారం। పుష్ణాతునఃపుణ్యదమైకసింధోఃకృష్ణస్యకారుణ్యకటాక్షకేళిః॥

టీ॥ కృపాజలనిధేః-దయాసముద్రుండైన-కృష్ణస్య-శ్రీకృష్ణస్వామియొక్క-కారుణ్యకటాక్షకేళిః, కారుణ్యకటాక్ష- దయాప్రధానదృష్టియొక్క - కేళిః - విహారము- తృష్ణాతురే, తృష్ణా, ఆసచేత, ఆతురే- ఆతురమగమయిన; మమ-నాయొక్క-చేతసి, చిత్తమునందు, ముహుః, సారెకు - జృంభమాణం- వృద్ధినొందుచున్న - మోహమహాంధకారం, మోహ- మోహమనియెడి- మహాంధకారం - కటికిచీకటిని; ముష్ణాతు-హరించుచు-సః, మందము, పుష్ణాతు-పోషించుఁగావుత॥ ౧౮

మ॥ అమితాశావశమైననామదికవశ్యంబైన మోహాంధకా । ర
ముగారుణ్యకటాక్షవీక్షణవిభారాశిన్వపాళించినె । య్యామ
నంబ్రోచుదయాపయోధిఘనబృదారణ్యకమణిండిబ్బం । దమ
నాలోచనసాధుసేవధిప్రమోదంబొప్పనెల్ల ప్పుడున్॥

తా॥ దయాసముద్రుండగు శ్రీకృష్ణదేవునిదయాదృష్టివిహారము తృష్ణాతురంబగునామనంబునవతిశయిల్లు మోహాంధకారంబుఁబోవనడంచుచునన్నుఁబ్రోచుగాతయనుట.

శ్లో॥ నిఖిలనిగమమౌళిలాలితం పదకమలం పరమరహస్యస్య తేజ
సః। వ్రజభువిబహుమన్మహేతరాంసరసకరీషవిశేషరూషితమ్॥

టీ॥ నిఖిలనిగమమౌళిలాలితం, నిఖిల-సమస్తములయిన, నిగమ- వేదములయొక్క- మౌళి- శిరములచేత- లాలితం- లాలింపఁబడినయదియు, వ్రజభువి, వ్రజ-వ్రేపల్లియయొక్క- భువి- భూమియందు, సరసకరీషవిశేష రూషితం సరస-రసయుక్తమైన- కరీష, విశేష రేణువుచేత- రూషితం- పూయబడిన-పరమరహస్యస్య-అతిరహస్యమైన-తేజసః- తేజముయొక్క, పదకమలం పాదకమలములను; బహుమన్మహేతరాం - మిక్కిలియు బహూకరించుచున్నాను. ౧౮

మ॥ సిరికేల్దమ్ములనొత్తఁగాశ్రుతివధూసీమంతసింధూరసుం । దర
మైయొప్పెసారయందముగమందన్నందగోపాలమం । దిర
శాలాంతకరీషరూషితరసోద్భీజాంబులౌపాదము । ల్పరమా
నందముఁజేయునామదికినల్లాసంబుగల్పించుచున్॥

తా॥ వేదాంతంబుచే లాలింపంబడుచు నందవ్రజంబునరేణంబునఁబూయంబడినవియై వెలయు తేజముగలశ్రీకృష్ణుని పాదకమలంబుల బహూకరించుచున్నానుట.

శ్లో॥ ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం ముదా ముహూ
రుదీర్ణయా మునిమనోమ్బుజామ్రేడితం । మదాలసవిలోచన



వ్రజవధూముదాస్వాదితం కదాను కమలేక్షణం కమపిబాల
మాలోకయే॥

టీ॥ ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం, ఉదార-గంభీరములయిన-మృదులస్మిత- మందహాసములయొక్క, వ్యతికర-సమూహముచేత-అభిరామ- సుందరమయిన ఆననం-ముఖముగలవాఁడును, ముహుః- సారెకును, ఉదీర్ణయా-ప్రోద్బుద్ధమైన- ముదా- సంతోషముచేత - మునిమనోంబుజామ్రేడితం-ముని- మునులయొక్క-మనోంబుజములు- కమలములచేత- ఆమ్రేడితం మాటిమాటికిని విచారింపబడుచున్న వాఁడును, మదాలసవిలోచనవ్రజవధూముదాస్వాదితం- మద-మదముచేత- అలస- మందములయిన విలోచన-నేత్రములుగల- వ్రజవధూ-గోపస్త్రీలచేత-ముద- మదముచేత- ఆస్వాదితం-అనుభవింపఁబడుచున్నవాఁడును, కమలేక్షణం-కమల, తామరరేకులవంటి- ఈక్షణం నయనములుగలవాఁడును, కమపి- వాచామగోచరుండైన, బాలం- బాలుని, కదాను, ఎప్పుడు-ఆలోకయే-చూచుచున్నాను. ౧౯

ఉ॥ కన్నులకొద్దిమీఁచివ్రజకాంతలువేడుకముద్దులాడఁగా సన్న
పునవ్వువెన్నెలలుచల్లఁగఁజల్లగనెల్లమౌనులున్ । సన్నుతమా
నసాబ్జములసారెకుసారెవహింపమించునే । కన్నులపండు
వైనముఖకంజమురంజిలుబాలుగాంచెదన్॥

తా॥ గంభీరంబులయిన మందహాసంబులచే సుందరంబగుముఖంబుగలిగి సారెసారెకును బొడమెడుసంతోషంబునమౌనులచేత ధ్యానంబు చేయబడుచున్నవాఁడై మదంబుచే నలసంబులగు గోపికలచే ముదంబుననుభవింపబడుచున్నవాఁడై పుండరీకాక్షుండైవాచామగోచరుండై వెలయుబాలునెన్నటికిం గాంచెదనోయనుట॥

శ్లో॥ వ్రజజనమదయోషిల్లోచనోచ్ఛిష్టశేషీకృతమతిచపలాభ్యాం
లోచనాభ్యాముభాభ్యామ్। సకృదపిపరిపాతుం తేవయం పా
రయామః కువలయదళనీలం కాంతిపూరం కదాను॥

టీ॥ వ్రజజనమదయోషిల్లోచనోచ్ఛిష్టశేషీకృతం, వ్రజజన-గోపాలకులయొక్క-మదయోషిత్-మదముతోఁగూడిన స్త్రీలయొక్క, లోచన- నేత్రములచేత, ఉచ్ఛిష్ట-ఉచ్ఛిష్టమాత్రము. శేషీకృతం - మిగిలినదిగాచేయఁబడిన, కువలయదళనీలం- కువలయ- నల్లకలువలయొక్క- దళ-రేకులవలె- నీలం, నల్లనైన, కాంతిపూరం- కాంతిప్రవాహమును, తే-ఆప్రసిద్ధులమయిన- వయం- మేము- అతిచపలాభ్యాం-మిక్కిలిచంచలములయిన- ఉభాభ్యాం-రెండైన-లోచనాభ్యాం- నేత్రములచేత, సకృదపి- ఒకానొకప్పుడైనను - పా

తం-పానము చేయుటకో అకు- కదాను- ఎప్పుడును - పారయామః - సమర్థులమగు చున్నాము. ౧౨

మ॥ కోమరుం బ్రాయపు మబ్బు గుబ్బతిలఁ గోరుల్ జొబ్బిలన్వల్లవ।
ప్రమదల్ గన్నులనానియానిదిగు పారక్ శేషమై పొల్చునా। ర
మణీయోత్పలకాంతిపూరమెదురై రానోకరా సారై నఁబాం।
కము గానీకను దోయి నానఁగల భాగ్యం బెన్నఁ డొకో కలైడుక్ ॥

తా॥ మదించిన గోపస్త్రీలు చూడఁ జూడ మిగిలియున్న నల్లకలువ రేకుల క్రొమ్మెఱుంగుఁ దెగడు కాంతి ప్రవాహరూపుండగు బాలకృష్ణమూర్తి నిజంచలంబులగు నీ రెండు కన్నుల చేనొకపరి తైనన జూచు భాగ్యం బెన్నఁటికిఁ బ్బునో కో యనుట॥

శ్లో॥ ఘోషయోషిదనుగీతయౌవనం కోమలస్తనితవేణునిఃస్వనమ్।
సారభూతమభిరామసమ్పదాం ధామ తామరసలోచనం భజే॥

టీక॥ ఘోషయోషిదనుగీతయౌవనం-ఘోష- వ్రేపల్లియందున్న-యోషిత్-యువతులచేత- అనుగీత- అనుసరించి గానము చేయఁబడుచున్న-యౌవనం, జవ్వనము గలదియు, కోమలస్తనితవేణునిస్వనం, కోమల- లేతయైన, స్తనిత- ఉరుమువంటి - వేణునిస్వనం-వేణునాదము గలయదియు- అభిరామసంపదాం- సౌందర్యసంపదలకు, సారభూతం- శ్రేష్ఠభూతమయినయదియు, తామరసలోచనం- తామరస- కమలములవంటి-లోచన-నేత్రములు గలయదియునైన- ధామ, తేజమును; భజే-సేవించుచున్నాను.

ఉ॥ వ్రేజవరాంగ్రద జవ్వనపు విన్నను వుంగొనియాడఁ గాముఖాం।
భోజమునందు లేయురుముఁ బోని రవంబున వేణువాప్పరా ।
రాజిత కాంతిసంపదల రాశి యనన్వేలఁ గొందు శారదాం ।
భోజదళాక్షు దైవతవిభుం ద్రిజగత్పతి నాశ్రయించెదన్॥

తా॥ వ్రేపల్లియందుండిన గోపికలచే గానంబు చేయంబడుచున్న జవ్వనంబుగలిగి లేఁత యురుముం బలెనున్న వేణునాదంబు సెలంగ సౌందర్యంబులకెల్ల నధికంబై పుండరీకలోచనంబగు వెలయు తేజంబును సేవించెదననుట.

శ్లో॥ లీలయా లలితయా వలమ్బితం మూలగేహమివ మూర్తిసమ్పదామ్। నీలనీరదవికాసవిభ్రమం బాలమేవ వయమాద్రియామహే॥ ❊

టీ॥ లలితయా- సుందరమయిన-లీలయా- విలాసముచేత-అవలంబితం-ఆశ్రయింపబడినవాడును- మూర్తిసంపదాం- శరీరసంపదలకు, మూలగేహమివ- ప్రధానగృహ



ముపలెనున్నవాడును, నీలనీరదవికాసవిభ్రమం-నీలనీరద - నీలమేఘము యొక్క - వికాస-ప్రకాశము యొక్క- విభ్రమం-విలాసములవంటి విలాసములు గలవాడునైన- బాలమేవ-బాలకృష్ణుని-అయం- మేము, ఆద్రియామహే-ఆదరించుచున్నాము. ౧౪

శా॥ బాలున్ మోహనవేషలీలు ముఁదళీ పొందెన్యశోభుక్ దయా। లో
లుక్ సాంద్రఘనాఘనావళి నీలుం గోపకన్యావృత। శ్రీలావ
ణ్యావయోవిలసు నవనీరేజాయతాక్షిప్రభా। జాలుక్ సర్వ
కళాలవాలు నతివాంఛన్ గొల్తునానెమ్మనిక్॥

తా॥ సుందరంబగు విలాసంబులచే నాశ్రయింపబడి శరీరసంపదలకు ప్రధానగృహంబై నీలమేఘంబు విలాసంబులు గలిగి వెలుంగు బాలునాశ్రయించెదననుట.

శ్లో॥ వందే మురారేశ్చరణారవిందద్వన్ద్వం దయాదర్శితశైశవస్య।
వందారుబృందారకబృందమౌళిమందారమాలావినిమర్దభీరు॥

టీక॥ దయాదర్శితశైశవస్య-దయా-దయచేత, దర్శిత-చూపంబడిన, శైశవస్య- బాల్యము గలిగిన - మురారేః- శ్రీకృష్ణమూర్తి యొక్క - వందారు బృందారక బృంద మౌళి మందారమాలావినిమర్దభీరు, వందారు - నమస్కరించుచున్న, బృందారక-దేవతలయొక్క- బృంద-సమూహములయొక్క, మౌళి- శిరములయందున్న-మందారమాలా కల్పతరు ప్రసూనమాలికలయొక్క- వినిమర్ద-సమ్మర్దము వలన, భీరు - భయపడుచున్న చరణారవిందద్వంద్వం- అడుగుదామరజోయినిగూర్చి - వందే, నమస్కరించుచున్నాను. ౧౫

మ॥ దితిజానీకముఁ ద్రుంపమానిత తివ త్రింపక్ యశోదాదయో। ది
తశైశోరకళావిలాసుఁ డగు నాదేవాది దేవోత్తము। న్నతబృం
దారకబృందమౌళివిలసన్మందారమాలాతరం। గితధారాళ
మరందఁబిందు మృదులాంఘ్రిద్వంద్వు సేవించెదన్॥

తా॥ దయచే బాల్యంబు నొందిన శ్రీకృష్ణమూర్తి యొక్క దేవతాసమూహంబుల శిరంబులందెలువారెడు కల్పతరుప్రసూనమాలికల సమ్మర్దంబువలన భయపడు పాదకమలద్వంద్వంబుగూర్చి నమస్కరించుచున్నాననుట.

శ్లో॥ యస్మిన్నృత్యతి యస్య శేఖరభరైః క్రోశచ్ఛివిషశ్చన్ద్రకీయస్మిన్నృత్యతి యస్య ఘోషసురభింజిఘ్రస్య పయోధూజటేః। యస్మిన్ సజ్జతి యస్య విభ్రమగతిం వాఞ్ఛన్ హరే స్సిన్ధుర స్తద్వృన్దావనకల్ప ప్రసూనవనం తం వాక్ కిశోరం భజే॥

టీ॥ క్రౌంచద్విషః-కుమారస్వామియొక్క-చంద్రకీ-నెమలి-యస్య-ఏశ్రీకృష్ణుని యొక్క, శేఖరభరైః - శేఖర - సిగయందుఁజుట్టిన నెమలిపురిదండలయొక్క, భరైః- సమృద్ధులచేత, యస్మిన్, ఏవనమందు, నృత్యతి-నటించుచున్నదియో- ధూర్జటేః- శివునియొక్క, వృషః- వృషభము, యస్య - ఏశ్రీకృష్ణమూర్తియొక్క - ఘోష,ప్రవేశిల్లియయున్న-సురభిం-కామధేనువును- జిఘ్రతి- యోనిదేశమునాఘ్రాణించుచున్నదియై, యస్మిన్ - ఏవనమునందు- దృప్యతి, గర్వించుచున్నదియో, హరేః- ఇంద్రుని యొక్క- సింధురః, ఐరావతము, యస్య- ఏకృష్ణునియొక్క - విభ్రమగతిం-విలాసగమనమును, వాంఛతి- ఇచ్ఛయించివదదుచు- యస్మిన్, ఏవనమునందు- సజ్జతి- ఆసక్తి గలదియగుచున్నదియో- తద్బృందావనకల్పకద్రుమవన -తత్- ఆప్రసిద్ధమయిన, బృందావన-బృందావనమునను- కల్పకద్రుమ- కల్పవృక్షములయొక్క।వనం- వనమునైనను- తం-ఆప్రసిద్ధుడై - కిశోరంవా-బాలకృష్ణమూర్తినైనను, భజే- సేవించుచున్నాను.

శా॥ ఎందే నెవ్వనమౌళిఁ గాంచిఁ గుహవాజీంద్రంబు నర్తించుఁదా।
నెందే నెవ్వనియానరీతిహరిమత్తేభంబుఁ గాంక్షించుఁదా। నెం
దే నెవ్వనిమందమూరోరుసుచుభూతేశాశ్వముం బొంగునా।
బృందారణ్యసురద్రుసాంద్రవని నాకృష్ణున్స్మరింగొల్చెదన్॥

తా॥ సకలజగత్పతియగు శ్రీకృష్ణమూర్తిని సేవించుకొఱకుఁగుమారస్వామియునుహరుండునింద్రుండునుగామధేనువు నేతెంచినయెడ నేవనంబుననే కృష్ణునియొక్క సిగయందునలంకరింపఁబడిన నెమలిపురిదండలఁజూచికుమారునిమయూరంబునృత్యంబుఁజేయునో యేవనంబునందు నే శ్రీకృష్ణునిగమనవిలాసంబు నెఱింగికొన నింద్రునియైరావతంబు గాంక్షించియుండునో యేవనఁబుననే కృష్ణునిమందకడ గామధేనువుయోనిదేశంబు నాఘ్రాణించుచు శివునివాహనంబగువృషభంబు గర్వించియుండునో యట్టిబృందావనంబున గల్పకతరువనంబునునాశ్రీకృష్ణుని సేవించుచున్నాననుట.

శ్లో॥ అరుణాధరామృతవిశేషితస్మితం వరుణాలయానుగతవర్ణవైభవం। తరుణారవిందదళదీర్ఘలోచనం కరుణామయం కమపిబాలమాశ్రయే॥

టీ॥ అరుణాధరామృత విశేషితస్మితం- అరుణ-ఎఱ్ఱనైన; అధరామృత-అమృతము వంటియధరముచేత-, విశేషిత- అతిశయింపబడిన, స్మితం- చిఱునవ్వుగలవాడును- వరుణాలయానుగత వర్ణవైభవం- వరుణాలయ - సముద్రముతోడను,అనుగత- అనుకరింపబడుచున్న- వర్ణవైభవం - కాంతిసంపదగలవాడును, కరుణామయం- కరుణాస్వరూపుడయినవాడును, కమపి- వాచామగోచరుడయినవాని నైన, బాలం బాలకృష్ణుని- ఆశ్రయే, ఆశ్రయించుచున్నాను. ౧౪



ఉ॥ చల్లనివానినవ్వువెదఁజల్లెడువానిదయారసంబుజో। బ్బిల్లెడు
వానిఁ గెంపుఁజిగిఁ బెంపుఁజెలంగెడుమోవివానిసం। ఫుల్లస
రోజనేత్రములఁబోల్చినవానిబయోధివీచికా। వేల్లితనీలనీరద
నవీనతనుద్యుతివానిఁ గాంచెదన్॥

తా॥ అమృతంబుబోలెమధురంబగుచు నెఱ్ఱనైనమోవిపై నెగడు చిఱునగవుచే దేజరిల్లుచు సముద్రంబుననుకరించుకాంతిసంపదగలిగి విరిసినలేఁదామరలంబోలుకన్నులుగలిగి దయాస్వరూపుడై వాచామగోచరుండై వెలయుబాలకృష్ణునాశ్రయించుచున్నాననుట.

శ్లో॥ లావణ్యవీచిరచితాంగభూషాం భూషాపదారోపితపుణ్యబర్హామ్। కారుణ్యధారాళకటాక్షమాలాం బాలాంభజే వల్లవవంశలక్ష్మీమ్॥

టీ॥ లావణ్యవీచిరచితాంగభూషామ్-లావణ్య-కాంతివిశేషముయొక్క- వీచి,అలలచేత, రచిత- చేయబడిన, అంగభూషాం- అవయవభూషణములు గలయదియు-భూషాపదారోపిత పుణ్యబర్హాం, భూషాపద-అలంకారప్రదేశమందు.ఆరోపిత- ఉంచబడిన-పుణ్య-పవిత్రమయిన-బర్హం- నెమలిపురి గలయదియు, కారుణ్యధారాళ కటాక్షమాలాం, కారుణ్యధారాళ- దయాసారముతోగూడిన- కటాక్ష - కడకంటిచూపులయొక్క, మాలాం- సమూహముగలయదియు-బాలాం- లేతప్రాయము గలయదియగు-వల్లవవంశలక్ష్మీ- వల్లవవంశ-గోపవంశముయొక్క-లక్ష్మీం-సకలసౌభాగ్యసంపాదకమైనలక్ష్మిని, భజే-భజించెదను. ౧౫

చ॥ మెఱుగులకేమిచక్కదనమే పదిలక్షలు సేయునాయురే। సు
రుచిరపింఛధామక మేసొమ్ములలో వెలలేనిసొమ్ముగుంబరమ
కృపాకటాక్షసుమమాలికబాపునెనందమందిరేం। దిరిమురి
పెంపుశైశవమునీటులమీఱెనయారెకంటిరే॥

తా॥ కాంతివిశేషంబులచేనవయవంబుల భూషణంబులకువన్నియఁగల్పించుభూషణప్రదేశంబునందలంకరింపఁబడిన నెమలిపురిగలిగి దయాప్రవాహంబు గ్రుమ్మరించుకడకంటిచూపులుగలిగి బాలస్వరూపంబై వెలయుగోపాలవంశలక్ష్మినిభజియించుచున్నాననుట.

శ్లో॥ మధురైకరసం వపుర్విభోర్మధురావీథిచరం భజామహే। నగ
రీమృగశాబలోచనానయనేందీవరవర్షవర్షితమ్॥

టీ॥ మధురావీథిచరం, మధురా- మధురాపట్టణముయొక్క- వీథి-వీథులయందు-
చరం- సంచరించుచున్నయదియు, మధురైకరసం-మధుర- సౌందర్యముయొక్క - ఏక
రసం - ముఖ్యరసమైనయదియు, నగరీమృగశాబలోచనానయనేందీవరవర్షవర్షి
తం- నగరీ, పురమునందలి, మృగశాబ- లేడిపిల్లయొక్క - లోచనా - కన్నులవంటికన్నులుగల స్త్రీలయొక్క-నయన, నేత్రములనియెడి, ఇందీవర - కలువలయొక్క- వర్ష
వృష్టిచేత-వర్షితం, వర్షింపబడుచున్న- విభోః- శ్రీకృష్ణమూర్తియొక్క- వపుః-శ
రీరమును భజామహే- సేవించుచున్నాము. ౧౯

మ॥ అమరన్ సాహిణులెల్ల నల్లపిలగానారట్టకంఖాణముం। దు
మికించందిశలందుఁ గ్రోల్లులుకు మాధుర్యైక కాంతుల్ ఘన।
భ్రమచేయన్మధురావధూచపలనేత్రవ్రాతనీలాబ్జవర్షము
పైఁ గ్రమ్మంగఁ జిత్రమై చెలఁగు కృష్ణస్వామినీక్షించెదన్॥

తా॥ ఘనీభూతంబగుసౌందర్యంబుకరణి తేజరిల్లుచుమధురావీధులయందు
జరించుచు నక్కడనుండెడి యువతులచపలనేత్రంబులను కలువలవానచేఁ ముం
పంబడి వెలుంగు శ్రీకృష్ణుని యొక్క విగ్రహంబును మేము సేవించుచున్నామనుట.

శ్లో॥ పర్యాకులేన నయనాంతవిజృంభితేన వక్త్రేణ కోమలమదస్మిత
విభ్రమేణ। మందేన మంజులతరేణ చ జల్పితేన నందస్య హంత
తనయో హృదయం ధినోతి॥

టీ॥ పర్యాకులే. చంచలమైయున్న, నయనాంత విజృంభితేన- నయనాంత-కడక
న్నులయొక్క- విజృంభితేన- అతిశయముచేతను, మందేన- మందమయిన- మంజులతరే
ణ-మిక్కిలిహృద్యమయిన- జల్పితేనచ- మాటచేతను- కోమలమదస్మితవిభ్రమేణ-కోమ
ల- మృదువైన, మద- మదయుక్తమైన- స్మిత- మందహాసముయొక్క- విభ్రమేణ-విలా
సముచేతను, నందస్య - నందునియొక్క, తనయః - కుమారుఁడైన శ్రీకృష్ణుని యందు-
హృదయం- చిత్తము ధినోతి-ప్రేమముగలదిగాఁ జేయుచున్నది, హంత-సంతోషము॥ ౨౦

మ॥ బెళుకుంగన్నులుమోముచుట్టు దిరుగ స్నిగ్ధాధరోష్ఠంబుపై।
దళుకున్నవ్వెన్నెలలీను లేనగవు పింతల్మాధుర్యం బెందగం। దళి తా
లాపసుధామదుచ్చ్వికినానందంబు గానందుమందల నానంద
ము జిందు బాలునియశోదానందనుం గాంచెదన్॥



తా॥ చంచలంబులగు కడకంటిచూపులును గోమలంబులగుచిఱునగవు వె
న్నెలలంగ్రుమ్మరించు నెమ్మొగంబును హృద్యంబగువచనంబును గలనందసుతుం
డగు శ్రీకృష్ణునియందు నాహృదయంబానందంబుఁ జెందుచున్నదియనుట.

శ్లో॥ కందర్పకండూలకటాక్షబందీరిందీవరాక్షీరభిలష్యమాణాన్
మందస్మితాధారముఖారవిందాన్వందామహే వల్లవధూర్త
పాదాన్॥

టీ॥ కందర్పకండూలకటాక్ష బందీః, కందర్ప- మన్మథునియొక్క-కండూల- దు
స్సహములైన-కటాక్ష - కడకన్నులచేత-బందీః, బంధింపఁబడిన, ఇందీవరాక్షీః- యు
వతులను, అభిలష్యమాణాన్- కామించుచున్న యువియు. మందస్మితాధారముఖారవిం
దాన్, మందస్మిత-మందహాసమునకు, ఆధార - ఆశ్రయములయిన, ముఖారవిందాన్-
ముఖకమలములుగలయువియునగు- వల్లవధూర్తపాదాన్ - యాదవధూర్తశ్రేష్ఠుల
పాదములగూర్చి- వందామహే- నమస్కరించుచున్నాను, పూజాయాం బహువచనం
మను న్యాయంబున- వల్లవధూర్తపాదాన్ అనియెడిచోట యాదవధూర్తశ్రేష్ఠుఁడయి
నకృష్ణుఁడని గ్రంథకర్తయొక్క భావము. ౨౧

మ॥ సరసాపాంగతరంగరంగితవిలాసప్రౌఢిచేతసగ్గమై। మరు
ధారిన్వ్రాళిగుబ్బలుబ్బి పులకింపంగ్రొమ్ముడు ల్వీడఁద। త్తరపున్
మేల్పివమొత్తిమత్తిలినకాంతాపాళిలాలించుచు। త్తరపున్న
వ్వుమొగంబుగలధూర్తస్వామిగీర్తించెదన్॥ *

తా॥ సరసంబులగుకటాక్షంబులచేబంధింపఁబడినకామినులం గామిం
చుచిఱునగవులకాశ్రయంబై నెమ్మొగంబుగలిగ వెలయుధూర్తశ్రేష్ఠుఁడగు
శ్రీకృష్ణమూర్తినిం గూర్చినమస్కరించుచున్నాననుట॥ *

శ్లో॥ లీలాటోపకటాక్షనిర్భరపరిష్వంగప్రసంగాధికప్రీతే గీతివి
భంగసంగతలసద్వేణుప్రణాదామృతే। రాధాలోచనలాలిత
స్యలలితస్మేరే మురారేర్ముదా మాధుర్యైకరసే ముఖేందుకమ
లే మగ్నం మదీయం మనః॥ *

టీ॥ లీలాటోపకటాక్షనిర్భరపరిష్వంగప్రసంగాధికప్రీతే, లీలా-విలాసములచేత-
ఆటోప-గంభీరములయిన, కటాక్ష-కడకన్నులయొక్క, నిర్భర-సాంద్రమైన, పరిష్వం
గ-ఆలింగనముయొక్క- ప్రసంగ- ప్రసక్తివలన, అధికప్రీతే. మిక్కిలిసంతుష్టమయిన
యదియును-గీతివిభంగసంగతలసద్వేణుప్రణాదామృతే, గీతి- గానభేదములయొక్క, వి
భంగ-వచనములయొక్క- సంగత- స్వస్థానప్రయుక్తకలహముచేత, లసత్- మనో

ఙ్ఞమైన, వేణుప్రణాదామృతే - అమృతమువంటి వేణు నాదముగలయదియును, లలితస్మేరే, లలిత- మనోహరమయిన-స్మేరే- మందహాసముగలయదియును, మాధుర్యైకరస్వే. మాధుర్య- సౌందర్యమనియెడి- ఏకరసే, ముఖ్యరసముగలయదియును, రాధాలోచనలాలితస్య-రాధా, రాధయొక్క-లోచన, కన్నులచేత- లాలితస్య- ఉపలాలింపఁబడిన- మురారేః, శ్రీకృష్ణమూర్తియొక్క, ముఖేందుకమలే, చంద్రకమలములవంటి ముఖమునందు, మదీయం-నాసంబంధమైన, మనః- మనస్సు-మగ్నం-మునిగెను. ౨౨

మ॥ లలితాలోకతరంగసంగతములీలామందహాసప్రభా।వులినం
బున్మరళీరవామృతరసంబుల్ రాధికాలోచనో। త్పలసంభా
వితమాధురీగుణమునై భాసిల్లుశ్రీకృష్ణుని । ర్మలవక్త్రాంబురు
హాకరంబునరమింపంగోరెదన్నామదిన్॥ ❋

తా॥ విలాసంబులచేఁగంభీరంబులగునపాంగదృష్టులచేవశలయితమం లటనావచ్చిగోపికలయాలింగనప్రసంగంబుచే సంతుష్టంబగుచుగానభేదంబుల వచనంబులపరస్పరస్వసౌష్ఠవకలహంబునమనోజ్ఞంబగునమృతంబులోనివేణు రవంబుగలిగిసౌందర్యరసంబునకాధారంబై మనోహరంబగుమందహాసంబునకు నేలవై మెఱయుశ్రీకృష్ణునినెమ్మోగంబుననామనంబులగ్నంబయ్యెననుట॥

శ్లో॥ శరణాగతవజ్రపంజరేశరశార్ఙ్గధరస్యవైభవే। కృపయా
ధృతగోపవిగ్రహేకియదన్యన్మృగయామహేవయమ్॥

టీ॥శరణాగతవజ్రపంజరే, శరణాగత, శరణుపొందినవారలకు. వజ్ర-అభేద్యాతి లావిశేషనిర్మితమయిన, పంజరే, యంత్రవిశేష్యమయినవాఁడును, కృపయా-దయ చేత, ధృతగోపవిగ్రహే-ధృత, ధరియింపఁబడిన, గోపవిగ్రహే - గోపాలశరీరముగలవాఁడునునగు, శార్ఙ్గధరస్య- శ్రీకృష్ణమూర్తియొక్క- వైభవే-వైభవము- శరణే, రక్షకముగుచునుండ- అన్యత్।ఇతరమయిన, కియత్- ఏపదార్థమును- వయం. మేము- మృగయామహే- వెదుకుచున్నాము. ౨౩

ఉ॥ ఇవ్వలనవ్వలన్వెదకనేటికినన్యులమాటిమాటికిం।దవ్వులనుం
డిమైనగరుణావరుణాలయగోపమూర్తియై । నవ్వుచుడా
యవచ్చియదనన్శరణాగతవజ్రపంజరుం । డవ్వనజాతనే
త్రుఁడనయంబునయంబునెలంగబ్రోవగన్॥ ❋

తా॥ శరణంబునొందినవారలంబ్రోవవజ్రపంజరుండై యుండుంగా నకృపగోపాలశరీరంబుఁ దాల్చిరక్షకుఁడయుశార్ఙ్గధరుడైనశ్రీకృష్ణమూర్తి మెఱయుచుండఁనితరులవెదుకఁగా మేమిచ్చగింపమనుట॥ ❋



శ్లో॥ జగత్త్రయైకాంతమనోజ్ఞభూమిచేతస్యజస్రంమమసన్నిధ
త్తామ్। రమాసమాస్వాదితసౌకుమార్యంరాధాస్తనాభో
గరసజ్ఞమోజః॥

టీ॥జగత్త్రయైకాంతమనోజ్ఞభూమి,జగత్త్రయ-లోకత్రయమునందును,ఏకాంత- మిక్కిలియైన-మనోజ్ఞ- సౌందర్యమునకు- భూమి - ప్రదేశమయినయదియు. రమాసమాస్వాదిత సౌకుమార్యం-రమా-రుక్మిణీదేవిచేత- సమాస్వాదిత- అనుభవింపఁబడిన- సౌకుమార్యం- సౌందర్యముగలయదియు. రాధాస్తనాభోగరసజ్ఞం - రాధా- రాధయొక్క- స్తనాభోగ, కుచపరిపూర్తియొక్క, రసజ్ఞం- రసమునెఱింగినయదియునగు- ఓజః, తేజము. మమ. నాయొక్క- చేతసి-చిత్తమునందు- అజస్రం-ఎల్లప్పుడును సన్నిధత్తాం, సన్నిధానముచేయుగావుత॥ ౨౪

ఉ॥ నామదినానతింతుభువనత్రయమోహనరూపధేయురా ।
ధామదిరేక్షణాపరిణతస్తనభారవిధేయుభోజక।న్యామహా
యవిభ్రమరసాస్పదవిగ్రహసౌకుమార్యలీ।లామధురాధర
నీస్మితకలాపుగళాగురువర్యునెప్పుడున్॥

తా॥ముల్లోకంబులంగలసౌందర్యంబునకునాధారప్రదేశంబైలక్ష్మ్యంశసంభూతురాలగురుక్మిణీదేవిచేననుభవింపంబడిన సౌందర్యరసంబు గలిగి రాధాస్తనంబులవిస్తారంబునెఱింగియుండెడితేజంబు నామదినెపుడునుసన్నిధానముఁజేయుంగాతయనుట॥

శ్లో॥ వయమేతేవిశ్వసిమఃకరుణాకరమూర్తేః కింవదంత్యాంగే।
అపిచవిభోతవలలితేచపలతరామతిరియంబాల్యే॥

టీ॥హేవిభో-వ్యాపకుడవైనయోకృష్ణా-అంగే-రూపవంతుడవైననీయందు,కరుణాకరమూర్తేః, కరుణ-దయకు, ఆకర - గనియనియెడి, మూర్తేః, మూర్తియొక్క- కింవదంత్యా- లోకప్రవాదచేత-ఏతే, ఈసంసారనిమగ్నులమైన- వయం- మేము,విశ్వసిమః- విశ్వాసముజేయుచున్నాము-అపిచ-మఱియును,తవ- నీయొక్క-లలితే- కోరదగిన-బాల్యే, బాల్యమందు,ఇయంమతిః,ఈబుద్ధి-చపలతరా-మిక్కిలియుచపలమైయున్నది.

చ॥ అనిశములోకమెల్లగరుణాకరమూర్తివటంచుదెల్పగా।జనని
పరంపరల్గడచిసౌఖ్యమునొందుదుమంచుకృష్ణనా। మనమున
నమ్మినాడనను మాత్రమకాదుభవత్కిశోరతా । జనితకథా
సుధారసముసారెకుగ్రోలగదత్తరంచెదన్॥

తా॥ సర్వవ్యాపకుండవైనయోకృష్ణాశ్రీకృష్ణుండు దయాకరుండనిచె

ప్పెడులోకులప్రవాదంబువినినీయందువిశ్వాసంబు చేయుచుందుమింతియకాదునీయతిమనోహరంబగు బాల్యంబునబుద్ధియతిచపల బయ్యెం గావుననాయందుగరుణించుటకార్యంబనుట॥

శ్లో॥ వత్సపాలచరఃకోపివత్సశ్శ్రీవత్సలాంఛనః।ఉత్సవాయకదా
భావీత్యుత్సుకేమమలోచనే॥

టీ॥వత్సపాలచరః,వత్స-దూడలను-పాల-పరిపాలించుచున్నవారలలో-చరః-సంచరించుచున్నయట్టియు- ఇచ్చట-వత్సవాటచరః- అనిపాఠాంతరముగలదు- కలిగినప్పుడు-వత్సవాట-దూడలనిమిత్తముగ యేర్పరుపంబడినగృహములయందు, చరః- సంచరించుచున్నయనియర్థము- శ్రీవత్సలాంఛనః- శ్రీవత్స, శ్రీవత్సమనియెడి- లాంఛనః-చిహ్నముగలవాడనునగు, కోపి-చెప్పశక్యముకాని-వత్సః-బాలుడు, ఉత్సవాయ- సంతోషముకొఱకు- కదా,ఎప్పుడు-భావి-అయ్యెని- ఇతి-ఈప్రకారము-మమ-నాయొక్క,లోచనే, నేత్రములు- ఉత్సుకే-ఉత్సుక్తములైయున్నవి॥ ౨౮

శా॥శ్రీవత్సాంకితవక్షుడల్లసితనీరేజాక్షుడంభోధిక। న్యాకుచో
రుహకుంభికుంభయుగళాఢ్యుండుబ్రహ్మాదిసా। ధ్యావి
ర్భావవిధానదక్షుడగువాడానందపుత్రాకృతిన్। గోవత్సం
బులమేపగన్గొనుచుచక్షుః ప్రీతివాటించెదన్॥

తా॥ గోపాలబాలురంగలసిగోవత్సంబులమేపు శ్రీవత్సలాంఛనుండగుబాలకృష్ణమూర్తి నెప్పుడుగాంచెదనోయనిచూచుచుండెదననుట॥

శ్లో॥ మధురిమభరితేమనోభిరామేమృదులతరస్మితముద్రితాననేందౌ। త్రిభువననయనైకలోభనీయేమహసివయంవ్రజభాజి
లాలసాస్మః॥

టీ॥మధురిమభరితే-మధురిమ,సౌందర్యములయొక్క,భరితే-సంజాతాతిశయముగలదియు, మనోభిరామే; హృదయాభిరామమైనయదియు, మృదులతరస్మితముద్రితాననేందౌ-మృదులతర-మిక్కిలియుమృదువైన- స్మిత-చిఱునగవుచేత,ముద్రిత-చిహ్నముగలదిగా చేయబడిన, ఆననేందౌ- చంద్రునివంటిముఖముగలయదియు- త్రిభువననయగలదిగా చేయబడిన, ఆననేందౌ- చంద్రునివంటిముఖముగలయదియు- త్రిభువననయనైకలోభనీయే-త్రిభువన-ముల్లోకములయొక్క-నయన- నేత్రములచేత- ఏక- ముఖ్యముగా-లోభనీయే ఆసజేయదగినదియు, వ్రజభాజి-వ్రజ, నందవ్రజమును - భాజి-పొందినయదియునగు- మహసి- తేజమునందు-వయం. మేము-లాలసాః-ఆసక్తులము-స్మః-అయితిమి. ౨౯



మ॥ రమణీయస్మితమాధురీకలితముద్రాంచితంబై సుధా। సమసల్లాపకలాపమై త్రిజగతీసంమోహనాకారమై। కమరానేత్రమనోభిరామరుచిమైకన్పట్టువక్త్రేందుబిం। బమునన్మించువెలుంగుగోష్ఠగృహసౌభాగ్యంబునేగోరెదన్॥ *

తా॥ అతిశయంబగు సౌందర్యసంపదకాకరంబై హృదయాభిరామంబై యత్యంత మృదువంబగు దరహాసముచేచిహ్నితంబగు చంద్రునివంటిసెంమొగంబుగలిగి లోకంబులచే నాశింపబడుచున్నదియై నందవ్రజంబు బొందియున్న తేజంబునందాసక్తులమగుచున్నామనుట

శ్లో॥ ముఖారవిందేమకరందబిందునిష్యందలీలామురళీనినాదే।
వ్రజాంగనాపాంగతరంగ భృంగసంగ్రామభూమౌతవలా
లసాస్స్మః॥

టీ॥ మకరందబిందునిష్యందలీలామురళీనినాదే, మకరంద-పుష్పరసముయొక్క-బిందు-ప్రవాహమువలె- లీలా- విలాసాధారమయిన, మురళీనినాదే - వేణుగానముగలయదియు-వ్రజాంగనాపాంగ-తరంగ,భృంగసంగ్రామభూమౌ-వ్రజ- శ్రీపల్లియందలి,అంగనా,స్త్రీలయొక్క-అపాంగ,కటాక్షములయొక్క-తరంగ-అలలనియెడి-భృంగ-తుమ్మెదలయొక్క-సంగ్రామ- యుద్ధమునైతె-భూమౌ- అధికరణభూమియైనదియునగు, తవ,నీయొక్క-ముఖారవిందే- ముఖకమలమునందు, లాలసాః- ఆసక్తులము-స్మః, అయితిమి. ౩౦

మ॥ మురళీగానమరందబిందుకృతసంమోదభ్రమద్వల్లవీ।సరసాపాంగతరంగభృంగపటలీసంగ్రామరంగస్థలీ।సరణిన్నెల్వగునీముఖాంబుజమునం జంచన్మనఃపంకజా। కరమధ్యంబునబాదుకొల్పుటకునాకాంక్షింతునెల్లప్పుడున్॥ *

తా॥ మకరందప్రవాహంబుబోలి విసార్థంబయిన వేణునాదంబునొప్పుచు గోపాంగనలకడకన్నుల చూపులనియెడి తుమ్మెదల గుంపులకలహంబులకు నధికరణప్రదేశంబగు నీముఖకమలంబునందు నెల్లప్పుడునులాలసులమైతిమనుట.

శ్లో॥ ఆతామ్రాయతలోచనాంశులహరీలీలాసుధాప్యాయితై
ర్గీతామ్రేడితదివ్యకేళిభరితైస్స్నిగ్ధైర్వ్రజస్త్రీజనైః। స్వైదా
మ్భఃకణభూషితేనకిమపిస్మేరేణవక్త్రేందునా పాదాంభో
జమృదుప్రచారసుభగంపశ్యామిదృశ్యంమహః॥

సీ॥ గొల్లమిటారిపూపచనుగుత్తులహత్తివవింతలాగుతో । జల్లని
చూపుతోవదలిసారెకుజాఱుతపీఁదడఁడతో । నల్లపరాకుచె
ల్వొటకునయివిలసిల్లి వపల్లగ్రామితో । నల్లనిబాలుడొక్కఁడుమది
నాపయఁవంబువనిల్చుచుంగలఁడు॥ *

తా॥ నేనులోకాంతరంబునకు బోవసమకట్టినప్పుడు గోపికలచన్నులరా యిడినలంగిన శరీరంబుగల వాఁచామగోచరుండగు బాలుండు మెల్లమెల్లన వేణుగానంబు నాచెవులనించుచు నాముందటవిలాసయుతంబగు వేషంబుజేని ల్చుంగావుతయనుట॥

శ్లో॥ అతిభూమిమభూమిమేవ వాచసాం వాసితవల్లవీస్తనమ్।మ
నసామపరం సాయనం మధురాద్వైతముపాస్మహే మహః।

టీ॥ వచసాం- వచనములకును- మనసాం- మనస్సులకును- అతిభూమిం- మిక్కిలి యవిషయమయినయదియు- అభూమిం- అవిషయమయినయదియు- సగుణత్వముచే నవిషయమనియు- నిర్గుణత్వమున- నవిషయమనియుచెప్పఁగ్యము- అపరం- ప్రసిద్ధమయినయదియు- సగుణత్వమున విషయమనియు- నిర్గుణత్వమున, నవిషయమనియును- చెప్పఁగ్యము- అపరం- ప్రసిద్ధమయినయదియు - రసాయనం- రసాయనస్వరూపమయినయదియు మధురాద్వైతం- మధుర- సౌందర్యముచేత- అద్వైతం- అద్వితీయమైనయదియు- వాసితవల్లవీస్తనం- వాసిత, నివాసముగ జేయబడిన- వల్లవీస్తనం - గోపికాస్తనములుగలయదియునగు, మహఏవ- తేజస్సునే- ఉపాస్మహే- సేవించుచున్నాము,

॥ పలుకఁగొలంది గానియనుభావముగాంచియు నద్వితీయమై।
పొలుపువహించి నెమ్మదికపూర్వరసాయనమైన మహోన్నతిం।
దొలికె దివ్యతేజము ఘనోహరపల్లవపల్లవాధరీ । లలితప
యోధరాంతరవిలాసనివాసము గాంచెగంటిరే॥ *

తా॥ పలుకందరంబుగాని యనుభావంబుచే నద్వితీయంబయి మనంబున కురసాయనంబయి నెగడు దివ్యతేజంబు గోపికలచన్నులపై నివాసంబుజేసె నిట్టితేజంబు నెడపక యుపాసించుచున్నాననుట॥

శ్లో॥ జననాంతరేపి జగదేకమండనే కమనీయధామ్ని కమలాయతేక్షణే । వ్రజసున్దరీజనవిలోచనామృతే చలాని సన్తు సకలేంద్రియాణి మే॥ ౩౯



టీ॥ జగదేకమండనే, జగత్- లోకములకు, ఏక- ముఖ్యమైన, మండనే- అలంకారమైనవాడును, కమనీయధామ్ని, కమనీయ- కోరదగిన, ధామ్ని- తేజముగలవాడును, కమలాయతేక్షణే, కమల- తామరరేకులవలె, ఆయత- విశాలములయిన, ఈక్షణే- నేత్రములుగలవాడును, వ్రజసుందరీజనవిలోచనామృతే, వ్రజ, వ్రేపల్లెయందున్న- సుందరీజన, స్త్రీజనములయొక్క - విలోచన, నేత్రములకు, అమృతే - అమృతప్రాయుడైనవాడునైన శ్రీకృష్ణమూర్తియందు- జననాంతరేపి- జన్మాంతరమునందు, మే- నాయొక్క- సకలేంద్రియాణి, చక్షురాదులగునెల్లయింద్రియములు, చలాని- ఆసక్తములు, సంతు, అగుంగాక,

మ॥ శతపత్త్రోజ్వలపత్త్రనేత్రువ్రజకంజాతాననాలోకనా । మ
తధారాధరచారుగాత్రుభువనోన్మేషైకభూషాసము।న్నత
చారిత్రుబవిత్రుంగొల్చియనుజన్మంబున్వెలోలేంద్రియ। ప్రతతు
ల్సౌఖ్యమునొందుగాతనిజచాపల్యంబులీడేరగ॥ *

తా॥ జగములకు ముఖ్యముగనలంకారభూతుండును గోరందగిన మహనీయతేజంబున కాశ్రయుండును బుండరీకాక్షుండును గోపికల నేత్రంబులకమృతంబుబోలె సుఖంబుజేయువాడునగు శ్రీకృష్ణదేవునందు బ్రతిజన్మంబునను నాసకలేంద్రియంబులాసక్తంబులయి సుఖంబునొందుంగాతయనుట॥

శ్లో॥ మునిశ్రేణీవన్ద్యం మదభరలసద్వల్లవవధూస్తనశ్రేణీబిమ్బ
స్తిమితనయనాంభోజసుభగమ్। పునశ్శ్లాఘాభూమిం పులకి
తగిరాం నైగమగిరాం ఘనశ్యామం వన్దే కిమపి మహనీయాకృతి
మహః॥ ౪౦

టీక॥ మునిశ్రేణీవంద్యం- ముని, మునీశ్వరులయొక్క, శ్రేణి- పంక్తులచేత- వంద్యం, నమస్కారము చేయబడుచున్నయదియు, మదభరలసద్వల్లవవధూస్తనశ్రోణీబింబస్తిమితనయనాంభోజసుభగం, మదభర- మదభారముచేత, లసత్- ప్రకాశించుచున్న, వల్లవవధూ, ఆభీరస్త్రీలయొక్క- స్తన స్తనములయొక్కయు, శ్రోణి- పిరుదులయొక్కయు - బింబ, ప్రదేశములవిషయమయి - స్తిమిత, నిశ్చలమైనటువంటి - నయనాంభోజ, తామరరేకులవంటికన్నులచేతను - సుందరములయినయదియు - పునః, మఱియు, పులకితగిరాం- పులకిత, సంజాతపులకములుగలగిరాం- వాక్యములుగల, నైగమగిరాం- వేదాంతవాక్యములకు, శ్లాఘాభూమిం- కొనియాడదగినభూమియయినయదియు- ఘనశ్యామం, ఘన, వారిదమువలె- శ్యామం, నల్లనయినయదియు, మహనీయాకృతి, మహనీయ- స్పృహణీయమయిన, ఆకృతిం- స్వరూపముగలయదియు, కిమపి,

విలాసమృదురీతికి హేతువునై మనోహరా। కృతిగనుపించునా
సుకృతి కేవల తేజము మమ్ము బ్రోచుత౯॥

తా॥ బాల్యంబున విలాససంపదకు మూలకారణంబయి భక్తులయ
పరాధ వీధివిషయమై స్వభావసిద్ధంబుగ జడంబయి విద్వాంసులమనంబుల నే
కాగ్రపాత్రంబు సుకృతులయందు జేయంబడిన నివాసంబుగలిగి వెలుంగు తే
జంబు మమ్ము బ్రోచుగావుతయనుట॥

శ్లో॥ అపహసితసుధామదావలేపైరధిక మనోహరయార్ద్రి
మందహాసైః। వ్రజయువతివిలోచనావలేహ్యాం రమయతు రా
మరమాంపరోధనం నః॥ ౪౪

టీ॥ అపహసితసుధామదావలేపైః-అపహసిత- యెగతాళిచేయఁబడిన- సుధా,
అమృతముయొక్క-మద, మదహేతుకమైన అపలేపైః- గర్వముగలిగిన- ఆర్ద్రిమందహా
సైః- ఆర్ద్రిణా, రసయుక్తమైన- మందహాసైః, చిఱునగవులచేతను, అధికమనోహరం-
అతిశయమైన మనోహరమైన, వ్రజయువతివిలోచనావలేహ్యాం, వ్రజయువతి-అభీరస్త్రీ
లయొక్క, విలోచన-కన్నులచేత, అవలేహ్యాం-అత్యాదరణచేజూడఁదగిన- రమాపరో
ధనం-రమాలక్ష్మీదేవికి-ఆపరోధనం, అంతఃపురమైన-ధామ, కాంతి,నః-మంమును, రమ
యతు- ఆనందమునుబొందింప జేయుగాత॥

చ॥ నవసుధగ్రొవ్వణఁచు చిఱునవ్వులు మోమున గోముచూప
వల్లవలలనావిలోచనవిలాస విలేహ్యము నైన యూవణీభవన
భుజాంతరస్థలిసిభాసిలునందతనూః ప్రభావసం। భవపలమైన
ధాముముశుభంబులభంగురభంగినీవుత౯॥ *

తా॥ నవామృతంబుగర్వంబునపహసించుమందహాసంబు మోమునం గ్రొ
త్తనవ్వునుంజూప గోపికలవిలోచనంబుచే మిక్కిలియు జూడంబడుచున్నది
యై శ్రీమహాలక్ష్మికిఁ ల్లయి వెలుంగు తేజంబు మమ్ము సంతోషింపజేయుగాక॥

శ్లో॥ అంకురితస్మేరదశావిశేషైరశ్రాంతహర్షామృతవర్ష
మక్ష్ణామ్। సంక్రీడతాంచేతసిగోకన్యాఘనస్తనస్వస్త్యయన
యనం మహోనః॥ ౪౫

టీ॥ అంకురితస్మేరదశావిశేషైః, అంకురిత-అంకురించిన, స్మేరదశావిశేషైః-
మందహాసదశావిశేషములచేతను-అక్ష్ణాం, నేత్రములకు- అశ్రాంతహర్షామృతవర్షం,
అశ్రాంత- అవిచ్ఛిన్నమైన హర్షామృత-ఆనందామృతముయొక్క-వర్షం, వర్షమైన



యదియు- గోపకన్యాఘనస్తనస్వస్త్యయనం- గోపకన్యా-గోపకన్యలయొక్క-ఘన్య,ఘ
న్యములయిన స్తన స్తనములయొక్క- స్వస్త్యయనం- మంగళాయతనయమైనయదియునైన
మహః, కాంతి-నః-మాయొక్క- చేతసి, మనమునందు - సంక్రీడతాం లెస్సగా గ్రీడించు
గాక॥ *

చ॥ అతులితమందహాసరుచిరాననముల్విలసిల్లదక్ష్ణనో। ద్యతజని
తావలోకఘనహర్షసుధామయవర్షరూపమై। సతతము
గోపికాఘనకుచస్థలసుస్థలదివ్యమంగళా। యతనమునైనధా
మము నిరంతరముం జరియించునామది౯॥

తా॥ మొలకలెత్తుచున్న చిఱునగవుచేతం జూపఱులకన్నులకు సంతోషా
మృతంబు వర్షించుచు గోపకన్యలకుచములకు మంగళాయతనంబయి వెల
యు తేజంబు నామనంబునం జరియించుంగాతయనుట॥

శ్లో॥ మృగమదపంకసంకరవిశేషితవన్య మహాగిరితటగండగైరిక
ఘనద్రవవిభ్రమితమ్। అజితభుజాంతరంభజత హే వ్రజగో
పవధూస్తనకలశస్థలీఘుసృణమర్దనకర్దమితమ్॥ ౪౬

టీ॥ మృగమదపంకసంకరవిశేషితవన్యమహాగిరి తటగండగైరికఘనద్రవవిభ్రమి
తం, మృగమద- కస్తూరియొక్క, పంక- బురదయొక్క-సంకర, సంబంధముచేత, విశే
షిత- మిక్కిలియు నతిశయింపఁబడిన, వన్య- అడవియందుబుట్టిన- మహాగిరి - గొప్పప
ర్వతముయొక్క, తట, చరియయందలి- గండస్థూలోపలములయొక్క-గైరిక- గైరికా
దివిశేషములయొక్క, ఘన- సాంద్రమయిన- ద్రవ, ద్రవముచేత- విభ్రమితం, పవడ
ముగఁజేయఁబడినయదియు, వ్రజగోపవధూస్తనకలశస్థలీఘుసృణమర్దనకర్దమితం,
వ్రజనందునివ్రేపల్లియందలి, గోపవధూ- గోపస్త్రీలయొక్క- స్తనకలశ- కలశముల
వంటి స్తనములయొక్క-స్థలి, ప్రదేశమండలి, ఘుసృణ-కుంకుమగంధముయొక్క-మర్ద
న-ఒరియుటచేత, కర్దమితం, బురదగలిగినదిగాఁజేయఁబడినదియునగునటువంటి,
అజితభుజాంతరం, అజిత- శ్రీకృష్ణస్వామియొక్క- భుజాంతరం- భుజమధ్యమును, భ
జిత- సేవింపుడు॥ ౪౭

చ॥ మృగపదపంకసంకరగిరిస్థితగైరికధాతురక్తిమం। దొఁగరు
వహించివల్లవవధూపృథులస్తనకుంకుమంబున౯। ద్విగుణిత
కాంతివక్షుఁడగునీరరుహాక్షుఁగృపాకటాక్షునిం। దగిలిభజిం
పనిల్వుడు ముదంబున నుత్తములార చిత్తముల్॥ *

తా॥ కస్తూరీకర్దమముయొక్క సంబంధముచేనతిశయింపబడినగిరిప్రదే

శంబుగండశిలయందలి ధాతువిశేషముయొక్క యతిశయంబగుద్రవంబుచే నరుణంబయి వ్రేపల్లియందలి గోపికలకుచంబులయంగరాగ విశేషంపు మర్దనంబుచే బంకిలంబగు శ్రీకృష్ణునివక్షంబు సేవింపుడనుట॥

శ్లో॥ ఆమూలపల్లవితలీలమపాంగజాలై రాసిఞ్చతీ భువనమద్భు
తగోపవేషా। బాల్యాకృతిర్మృదులముగ్ధముఖేందుబింబా మా
ధుర్యసిద్ధిరవతాన్మధువిద్విషో నః॥ ౪౭

టీ॥ ఆమూలపల్లవితలీలం, ఆమూల- మూలపర్యంతము, పల్లవిత - చిగిరించినటువంటి, లీలం- లీలలుగలుగునట్లుగా- అపాంగజాలైః, అపాంగ-క్రీగంటిచూపులయొక్క, జాలైః సమూహములచేత- భువనం- లోకములను ఆసించతీ- తడుపుచున్నయదియు- అద్భుతగోపవేషా, అద్భుత-ఆదరణచేయబడిన- గోపవేషా, గోపాలకవేషము గలయదియు, మృదులముగ్ధముఖేందుబింబా-మృదుల-కోమలమయినయదియు-ముగ్ధ,సుందరమయినయదియునగు, ముఖేందుబింబా- చంద్రబింబముతోసమానమయినముఖము గలయదియు, మాధుర్యసిద్ధిః, మాధుర్య-మధురత్వముయొక్క, సిద్ధిః- ప్రాప్తియైనయదియునగు మధువిద్విషః- శ్రీకృష్ణమూర్తియొక్క- బాల్యాకృతిః,బాల్య- బాలభావమందలి, ఆకృతిః- రూపము- నః- మమ్ము- అవతాత్ -రక్షించుగాత॥

చ॥ కరుణనుబాదుకొల్పిజగంబుకటాక్షసుధారసాప్తిచే బరిణ
తపల్లవప్రసవపక్వఫలంబుగానొనర్చుచుం। జిరుతవిటా
రిప్రాయమునజెల్వగునకర్దనాలపటంబు। మురహరుబా
లచంద్రముఖమోహనపల్లవవేషగోల్చెదన్॥ ❋

తా॥ మొదలంటజిగిర్చినవిలాసంబులుగలుగునటుల నపాంగనిరీక్షణంబుల జగంబుంజూచుచున్నదియయి కోమలంబునుసుందరంబునైచంద్రబింబంబుబోలిన నెమ్మొగంబుగలిగి యందఱచేనంగీకరింపబడిన గోపాలాలంకారంబుగలిగి సౌందర్యంబుల కాటపట్టయివెలయునట్టిశ్రీకృష్ణుని బాలభావంబునందలి యాకారంబు మమ్ము రక్షించుగావుత॥ ❋

శ్లో॥ విరణన్మణినూపురం వ్రజే చరణాంభోజముపాస్వశార్ఙ్గి
ణః। సరసే సరసి శ్రియాశ్రితం కమలం వా కలహంసనాదితం॥

టీ॥ వ్రజే నందునిగొల్లపల్లియందు, విరణన్మణినూపురం, విరణత్- ధ్వనిచేయుచున్న-మణి, మణిమయములయిన- నూపురం-అందెలుకలయదియు-సరసే- రసయుక్తమైన, సరసి-సరస్సునందు, శ్రియా-కాంతిచేత, శ్రితం-ఆశ్రయింపబడినదగియు,కలహంసనాదితం, కలహంస- రాజహంసలచేత-నాదితం-ధ్వనికలదిగాచేయబడి



నటువంటికమలం-కమలములవలెనున్నదియునగు, శార్ఙ్గిణః- శ్రీకృష్ణస్వామియొక్క, చరణాంభోజం.కమలములవంటిపాదములను, ఉపాస్వ-సేవింపుము, ఇచట చరణాంభోజం- అనుపదమునుద్విశేషణపదములను- జాత్యేకవచనముగా- బ్రయోగింపబడియె॥

ఉ॥ సారసరోమరాళపగసారసనన్నిభనూత్నరత్నసం। జేరవి
లాసపాదములచేజరియించుచుపీధీలేగలం। వారగదోలివెం
బడినెపర్వువారుచుజేరిపట్టుచుం। గేరినటించుచిన్నియదు
కేసరిపాదమదినాశ్రయించెదన్॥ ❋

తా॥ సారవంతంబగుస్వరంబునమరాళధ్వనితోడంగూడిన కమలంబుకరణియందియలమ్రోతచే రవళించు శ్రీకృష్ణుని కాంతియుతంబగు పాదకమలంబును సేవింపుమనుట॥

శ్లో॥ శరణముశరణానాం శారదాంభోజనేత్రం నిరవధిమధురి
మ్ణాలీలయా శిక్షయన్త్యా। స్మరశరపరతంత్రైస్స్మేరనేత్రాంబుజా
భిర్వ్రజయువతిభిరవ్యాద్బ్రహ్మసంవేష్టితం నః॥ ౪౮

టీ॥ అశరణానాం-రక్షకులులేనివారలకు-శరణం, రక్షకమయినయదియు-శారదాంభోజనేత్రం,శారద-శరదృతుసంబంధములయిన,అంభోజకమలములవంటి- నేత్రం- కన్నులుగలయదియు, నిరవధిమధురిమ్ణా, నిరవధి- అవధిలేని- మధురిమ్ణ- సౌందర్యాతిశయముగలిగిన వేషేణ, కల్లనివేషముచేత- రమ్యం- మనోహరమయినయదియు- స్మరశరపరతంత్రైస్స్మేరనేత్రాంబుజాభిః, స్మరశర- మన్మథబాణములచేత-పరతంత్రపరాధీనులైనవారును-స్మేర-వికసించిన- నేత్రాంబుజాభిః - పద్మములవంటికన్నులుగలవారునగు వ్రజయువతిభిః గొల్లపల్లెయందలిస్త్రీలచేత-వేష్టితం- చుట్టబడిన, బ్రహ్మ-శ్రీకృష్ణునిరూపమగుపరబ్రహ్మము, నః- మమ్ము, అవ్యాత్- కాపాడుగావుత॥ ౪౮

మ॥ శరదంభోరుహనేత్రమున్ స్థలకళాసౌంద్యపాత్రమున్నానో। హ
రవోరందనిలిగాత్రగునుమస్తాత్రివేశజాతస్మితాం। కుర
నదమ్రందనుందరీపరిష్కృతమంగోపాంగనాళింగితు। స్మరత్రా
ణనమస్మఋనంద్యదయనిరోన్నతంగొల్చెదన్॥ ❋

తా॥ రక్షకులులేనివారలకు రక్షకంబయి శరత్కాలంబున విరిసినతెల్లదామరరేకలంబోలుకన్నులుగలిగి నిరవధికసౌందర్యంబుగల నీలవర్ణంబుచే నతిమనోహరంబయి మన్మథబాణంబులచే బడలినకతంబునబరాధీనంబులయిన లోచనకమలంబులుగల గోపయువతులచేతంబరివేష్టింపబడియున్న శ్రీకృష్ణరూపంబగు పరబ్రహ్మంబు మమ్ముబ్రోచెడుమనుట॥

శ్లో॥ సువ్యక్తకాంతిభరసౌరభదివ్యగాత్రమవ్యక్తయౌవనపరీత
కిశోరభావమ్ । గవ్యానుపాలనవిధావనుశిష్టమవ్యాదప్యాజ
రమ్యమఖిలేశ్వరవైభవం నః॥ ౫౦

టీ॥ సువ్యక్తకాంతిభరసౌరభదివ్యగాత్రం-సువ్యక్త-ప్రకాశించుచున్న- కాంతి-కాంతులయొక్క-భర-అతిశయముగలిగినదియు, సౌరభ-పరిమళయుక్తమయిన, దివ్య గాత్రం- దివ్యమంగళవిగ్రహముగలదియు-అవ్యక్తయౌవనపరీతకిశోరభావం- అవ్యక్త-అస్ఫుటమైన- యౌవన-జవ్వనముచేత - పరీత-వ్యాప్తమైన-కిశోరభావం- బాల్యము గలయదియు, గవ్యానుపాలనవిధౌ, గవ్యగోసమూహముయొక్క, అనుపాల - రక్షణముయొక్క, విధౌ- విధానమందు - అనుశిష్టం - శిక్షితమైనయదియు, అవ్యాజరమ్యం- అవ్యాజ, ఉపాధిరహితముగా-రమ్యం- మనోహరమయిన యదియునగు-అఖిలేశ్వరవైభవం-అఖిలేశ్వర-నారాయణునియొక్క- వైభవం-శ్రీకృష్ణాఖ్యవైభవము-నః-మంము, అవ్యాత్-రక్షించుగావుత॥ ౫౦

చ॥ ప్రకటితకాంతిసౌరభకరంచిత గాత్రము యౌవనాస్ఫుటీ। చ
తకితకిశోరభావము నిసర్గమనోహరరూపధేయమై। సకలజ
గన్నియంతయగుశౌరిమహత్త్వము గొల్లపల్లెబా । యకయొక
యింటనాపశులనారసిమేపెనిదేమిచిత్రమో॥ ❋

తా॥ ప్రకాశమానంబగు కాంత్యతిశయంబుగలిగి పరిమళయుతంబగు న దివ్యమంగళశరీరంబును మొలకలెత్తుజవ్వనంబుచే వ్యాప్తంబునునగు బాల్యంబునుంగలిగి గోపరిపాలనవిధియందు శిక్షితంబగున శ్రీకృష్ణాఖ్యవైభవంబు మమ్ముబ్రోచుగావుతయనట॥ ❋

శ్లో॥ అనుగతమమరీణామమ్బరాలమ్బినీనాం నయన మధురిమ
శ్రీనర్మనిర్మాణసీమ్నామ్ । వ్రజయువతివిలాసవ్యాపృతాపాం
గమవ్యాత్త్రిభువనసుకుమారం దైవతం నః॥

టీ॥ అంబరాలంబినీనాం-ఆకాశమునాశ్రయించియున్న, నయన మధురిమశ్రీనర్మనిర్మాణసీమ్నాం, నయన, నేత్రములయొక్క, మధురిమశ్రీ- సౌందర్యసంపత్సంబంధములయిన- నర్మనిర్మాణ విలాస ... దలుగల-అమరీణాం-దేవతాస్త్రీలచేత-అనుగతం-అనుసరించ... యువతివిలాసవ్యాపృతాపాంగం-వ్రజయువతి- ... లయొక్క, విలాస- లీలయందు- వ్యాపృత-ఉన్నట్టి- ... యు- త్రిభువనసుకుమారం- త్రిభువన- మూడులోకములకు- సుకుమారం- సుందరమై



నయదియునయిన- దైవతం- దైవతమైన- శ్రీకృష్ణమూర్తియొక్క-కిశోరరూపము-నః-మంము, అవ్యాత్- పాలించుగాక॥ ౫౧

శా॥ లోలాలోకనసహావభావములనాలోకించుచుం దేవతా। నారీ
కాస్యములిట్లు వెంటబడగ నందవ్రజాంభోరుహా । క్షీలీలా
ర్ద్రకటాక్షవీక్షలనురక్తిం బర్వు త్రైలోక్యర । మ్యాలంకార
మునైచెలంగుహరిబాల్యప్రౌఢసంబ్రోవుతన్॥ ❋

తా॥ ఆకసంబునుండి నేత్రసౌందర్యసంపదచే సంకేతంబులుదెల్పుదేవ స్త్రీలచేననుసరింపబడుచు గోపాంగనలవిలాసంబులపై గడగంటిచూపులనెలకొల్పుచు త్రైలోక్యసుందరంబయి వెలయు శ్రీకృష్ణునిబాల్యంబు మమ్ముం బ్రోచుగావుతయనట॥ ❋

శ్లో॥ ఆపాదమాచూడమతిప్రసక్తై రాపీయమానా యమినాం
మనోభిః । గోపీజనజ్ఞాతరసావతాద్వో గోపాలభూపాలకు
మారమూర్తిః॥ ౫౨

టీ॥ ఆపాదమాచూడం - పాదములుమొదలుకొనిశిరస్సుపర్యంతము, అతిప్రసక్తైః- అత్యావశ్యముగ ప్రవర్తించుచున్న- యమినాం-మునీశ్వరులయొక్క, మనోభిః- మనస్సులచేత- ఆపీయమానా-పానముచెయబడుచున్న-గోపీజనజ్ఞాతరసా- గోపీజన-గోపికాస్త్రీలచేత-జ్ఞాత-తెలియంగబడిన-రసా, రసముగల- గోపాలభూపాలకుమారమూర్తిః-గోపాలభూపాలల-గోపాలభూపాలకుడైనశ్రీకృష్ణస్వామియొక్క-కుమారమూర్తిః బాల్యరూపము,వః-మిమ్ము- అవతాత్-రక్షించుగాక- గోపాలభూపాలకుమారమూర్తిః-అనుపదమునకు-గోపాలభూపాల-గోపాలపతియైననందునియొక్క-కుమారపుత్రుడైన శ్రీకృష్ణస్వామియొక్క- మూర్తిః - శరీరము, అనియర్థాంతరముగలదనిబాల్యఖ్యాతి భావము॥ ❋

మ॥ విమలాపాంగవిలాసగోపమహిళావిజ్ఞాతస్వారస్యముం ।
దమితోసువ్రీశులూజుడెందములచేతం జానులాపాదము। స్త
మునాపోవగ నానుచుట్టిసుమయ్యా సౌభాగ్యధారామనోజ్ఞము
గోపాలకబాలరూపముమహానందంబుమీకీవుతన్॥ ❋

తా॥ ఆపాదమస్తకముగ నత్యాసక్తులగుమునులచే ధ్యానంబు సేయంబడుచున్నదియై గోపికాజనంబుచే నెఱుంగంబడినస్వారస్యంబుగలిగి వెలుంగుశ్రీకృష్ణుని బాలరూపంబుమిమ్ముబ్రోచుగావుతయనట. ❋

శ్లో॥ దిష్ట్యా బృన్దావనమృగదృశాం విప్రయోగాకులానాం ప్రత్యా
సన్నం ప్రణయచపలాపాఙ్గవీచీతరఙ్గైః। లక్ష్మీలీలాకువల
యదళశ్యామలం ధామ కామాన్ పుష్ణీయాద్వః పులకముకుళా
భోగభూషావిశేషమ్। ౫౩

టీ॥ విప్రయోగాకులానాం- విప్రయోగ- విరహముచేత- ఆకులానాం- మిక్కిలి వ్యాకులలైన-బృందావనమృగదృశాం-బృందావనమునందలిగోపికాస్త్రీలయొక్క-ప్రణయచపలాపాంగవీచీతరంగైః-ప్రణయ-ప్రేమాతిశయముచేత- చపల-మిక్కిలిచంచలమైన-అపాంగ-క్రేగంటిచూపులయొక్క-వీచీ- ఊర్ములయొక్క-తరంగైః సంతతులచేతను-దిష్ట్యా,దయివముచేతను- పులకముకుళాభోగభూషావిశేషం- పులకముకుళ- మొగ్గలవంటిగగ్గురుపాట్లయొక్క-ఆభోగవిశ్రాంతిమనియెడి-భూషావిశేషం- అలంకారములుగలుగునట్లుగా- ప్రత్యాసన్నం- ప్రత్యక్షమైనదానివలెనున్నయదియు, లక్ష్మీలీలాకువలయ-దళశ్యామం- లక్ష్మ్యాః శ్రీరమాదేవియొక్క- లీలా- కువలయ-విలాసముగాధరించిననల్లకలువలయొక్క- దళ- రేకులవలె- శ్యామం-నల్లనయిన- ధామ, కాంతి-వః- మీయొక్క- కామాన్- మనోరథములను- పుష్ణీయాత్-పోషించుగాక॥

మ॥ విరహార్తాస్మర వ్రజభామినుల్గనగియుష్వివ్రీడాఙ్గభాగ్యంబునం।
దరళాపాంగతరంగసంతతులసేదల్ చేర్చుచున్వచ్చి నిర్భర
రోమాంచవిశేషభూషుఁడగు గోపాలుండు పద్మాలయా ।
కరలీలోత్పలనీలవర్ణుఁడొసగుంగళ్యాణపారంపరల్॥ *

తా॥ఆక్రూరుండు గంసునపంపునం గృష్ణుని మథురకుం దోడ్కొనిపోవ శ్రీకృష్ణవియోగంబున మన్మథబాణపీడితలైనగోపస్త్రీలకు ప్రేమచేతఁ జంచలంబులగునపాంగదృష్టిసంతతులచే దైవయోగంబున మొగ్గలవంటిగగ్గురుంనిమెడియలంకారవిశేషంబుగలుగునటుల గోపీజలసిద్ధిధ్యానంబున ప్రత్యక్షంబైనదానివలె నుండినదియై లక్ష్మీదేవి కరంబున విలాసార్థంబుగ ధరించిననల్లకలువరేకులవలె నీలవర్ణంబగు నతేజంబు మీమనోరథంబులనిచ్చుఁగాక యనుటక్కృష్ణుండు మథురాపురంబుననుండియు గోపికలసిద్ధి ధ్యానంబున ప్రత్యక్షుఁడయిన కరణి నుండుననుట. *

శ్లో॥ జయతి గుహశిఖీన్ద్రపిఞ్ఛమౌళి స్సురగిరిగైరికకల్పితాఙ్గరా
గః । సురయువతివికీర్ణసూనవర్షస్నపితవిభూషితకున్త
లకుమారః॥ ౫౪



టీ॥ గుహశిఖీంద్రపింఛమౌళిః- గుహః-షణ్ముఖస్వామియొక్క-శిఖీంద్ర- నెమలియొక్క-పింఛ- నెమలిపురి-మౌళిః- సిగయందుగలవాఁడును, సురగిరి గైరికకల్పితాంగరాగః-సురగిరి-దేవస్థానమయిన మేరుపర్వతముయొక్క-గైరిక- గయిరికారాధాతువిశేషములచేత-కల్పిత-కల్పింపబడిన, అంగరాగః-అనులేపముగలవాఁడును, సురయువతివికీర్ణసూనవర్షస్నపితవిభూషితకుంతలః-సురయువతి-దేవతాస్త్రీలచేత-వికీర్ణ-వెదచల్లబడిన-సూనవర్ష-స్నపితవిభూషితకుంతలః-పుష్పవర్షముచేతఁదడుపఁబడినటువంటి యనలంకరింపబడిన కేశములుగల- కుమారః- శ్రీకృష్ణస్వామి-జయతి- సర్వోత్కృష్టుఁడయి వర్తించుచున్నాఁడు॥ ౫౪

మ॥ సురకన్యాకరముక్తకల్పకుసుమస్తోమంబులొయ్యారముం ।
దడుచుంబెన్నెఱికుఁపుపైనిలిపి చెంతం దారమేతుల్నటిసి। ర్గర
ధాత్రీనరధాతుధారజెలువారంబూని సేనానిపా। వురపు
బింఛపుతావళంబమరు దేవుండొప్పుబాల్యోన్నతిన్॥ *

తా॥ కుమారస్వామివాహనంబగు మయూరశ్రేష్ఠపింఛంబు సిగయందలంకరించి మేరుగిరియందలిధాతువిశేషంబుగలిగి దేవస్త్రీలుగురియించు కల్పతరుప్రసూనవర్షంబుచే స్నానంబుచేయించుటవలన నలంకరింపబడినశిరోజంబులుగలిగి వెలుంగు శ్రీకృష్ణదేవుండు సర్వోత్కృష్టుఁడయి యుండుననుట.

శ్లో॥ మధురమన్దహసితమఞ్జులం వదనపఙ్కజమఙ్గజవెల్లి
తం । విజయతాం వ్రజబాలవధూజనస్తనతటీవిలుఠన్నయ
నం విభోః॥ ౫౫

టీ॥ మధురమందహసితమంజులం-మధుర- మనోహరమయినయదియును-మంద- కొంచమైనదియు-శుచి-శుద్ధమైనదియునగు- స్మిత- నవ్వుచేత-మంజులం- సుందరమైనయదియు- అంగజవెల్లితం, అంగజ-మన్మథునిచేత-వెల్లితం-చలింపబడుచున్నదియును- వ్రజబాలవధూజనస్తనతటీవిలుఠన్నయనం-వ్రజ-వ్రేపల్లెయందున్న-బాలవధూ-గోపబాలికలయొక్క- స్తనతటీ- స్తనప్రదేశములయందు-విలుఠత్-తిరుగుచున్నటువంటి-నయనం-నేత్రములుగలదియునగు- విభోః, శ్రీకృష్ణమూర్తియొక్క- వదనపంకజం- ముఖకమలము, విజయతాం-సర్వోత్కర్షముగానుండుగాక॥ ౫౫

మ॥ మురిపెంపుంజిఱునవ్వునివ్వటిలు కెంమోవిన్ సుధాబిందువు
ల్। గురియంజొక్కపు మోముఁజిత్తజుని సొంపున్ సకల్గా
దీప్పన । బ్బురపుంబ్రాయపుగొల్లపల్లెసతులుత్తుంబులన్ బోండ్ల
పాలిండ్లని। త్తరపుంజప్పులజూచుచూపుగలధూర్తస్వామి

సెల్వొందెడుఁగాక॥ ❋

తా॥ హృద్యంబునుస్వల్పంబునుపరిశుద్ధ బునగువుచే సుందరంబయిమ స్మథావిష్టంబై వ్రేపల్లియందలి బాలికలచక్రప్రదేశంబుల బరిభ్రమించుచు న్ననయనంబులుగలిగి తేజరిల్లు శ్రీకృష్ణునినెమ్మోముదామర సర్వోత్కృష్టం బయియుండుననుట. ❋

శ్లో॥ అలసవిలసన్ముగ్ధస్మితం వ్రజసుందరీమదనకదనస్విన్నంద
స్యామహద్వదనామ్బుజమ్ । తరుణజ్యోత్స్నాకృత్స్నస్మిత
స్నపితాధరం జయతివిజయ న్ శ్రేణీమేణీదృశాంమదయన్మహః॥

టీ॥ అలసవిలసన్ముగ్ధస్మితం-అలసం-మందమయినదియు-విలసత్-ప్రకాశించుచున్నయదియు-ముగ్ధ-సుందరమైనయదియునగు-స్మితం-చిఱునగవుగలయదియు-వ్రజసుందరీమదనకదనస్విన్నం, వ్రజసుందరీ-గోపికాస్త్రీలయొక్క-మదనకదన-మన్మథచేష్టచేత-స్విన్నం-చెమటతోఁగూడుకొన్నయదియు, తరుణం-నూతనమయినదట్టి, అరుణజ్యోత్స్నాకృత్స్నస్మితస్నపితాధరం-అరుణ,ఎఱ్ఱనైన-జ్యోత్స్నా-వెన్నెలయొక్క-కృత్స్న-అంతయువలెనున్న-స్మిత-నగవుచేత-స్నపిత,వ్యాప్తమైన- అధరం-అధరోష్ఠముగలయదియు- ధన్యం- నిరుపాధికసుందరమయినదియు- మహః- తేజోరూపమయినయదియునగు-మహద్వదనాంబుజం-మహాత్-శ్రీకృష్ణస్వామియొక్క-వదనాంబుజం-కమలమువంటిముఖము-ఏణీదృశాం-స్త్రీలయొక్క-శ్రేణిం-వరుసను, ... -మదింపఁజేయుచున్నయదై-జయతి-సర్వోత్కృష్టమయివర్తించుచున్నది. ౫౬

మ॥ పొగరుంగెంపులసొంపునింపులలితంపుంకేటకెంమోవిపై ।
సొగసున్నిద్దపుదళుకులేనగవు మోముల్మీరబృన్దావనీ మృగ
నేత్రారతశ్రసుతశ్రమాంబుకణికావ్యద్వాన నాబ్జంబుతో
జిగురుంబోండ్లవిరాళిగొల్పురసికున్సేవించిభావింతువఁక॥ ❋

తా॥ అల్పంబై ప్రకాశించుచుసుందరంబునుస్వచ్ఛంబునువెలయునగవుగలిగి గోపస్త్రీలతోడసురితంబుసలిపిన కతంబునంబొడమిన శ్రమంబుచేతంజెమ్మటవిన్నమై క్రొత్తపుగట్లచెన్నగజిగిందొరసినకారణంబునంబున్నమదోలిదెసంబోదుచందురు నందలినునుగెంపుల వెన్నెలవిన్నను వెన్న నే వగింపజాలుక్రొన్నగవుచే వన్నియమించు మోవిచేతం దేజరిల్లుచునెద్దియేనియుంగయిసేయకను సోయగంబుమెలంగుచున్న శ్రీకృష్ణునినెమ్మొగంబులేడికన్నులంబోనికన్నులుగల నెలతలకు నేవుగలిగించుచునన్నిటికన్నమిన్నయై వెలయుచున్నయదియనుట. ❋



శ్లో॥ రాధాకేళీకటాక్షవీక్షితమహావక్షస్థలీ మండనాజీయ్యాసుః
పులకాఙ్కురాస్త్రిభువనస్వాదీయసస్తేజసః। క్రీడాంతేప్రతిసుప్త
దుగ్ధతనయాముగ్ధావబోధక్షణత్రాసారూఢ దృఢోపగూ
హనఘనాస్సామ్రాజ్యసాన్ద్రశ్రియః॥ ౫౭

టీ॥ రాధాకేళీకటాక్షవీక్షితమహావక్షస్థలీమండనాః, రాధా-రాధయొక్క-కేళీ, లీలాయుతమైన-కటాక్షః-క్రేగంటిచూపులచేత-వీక్షిత-జూడఁబడుచున్న-మహావక్షస్థలీ-విశాలమైనఱొమ్మును-మండనాః, అలంకరించుచున్నవియు-క్రీడాంతే, సురతాంతమందు-ప్రతిసుప్తదుగ్ధతనయాముగ్ధావబోధక్షణత్రాసారూఢదృఢోపగూహనఘనాః-ప్రతిసుప్త-మిక్కిలినిదురించుచున్న-దుగ్ధతనయా-లక్ష్మ్యంశసంభూతురాలైనరుక్మిణీదేవియొక్క-ముగ్ధ-సుందరమైన-అవబోధక్షణ-నిద్రావస్థాక్షణమువలననయిన,త్రాస-భీతివలన-ఆరూఢ-ఆవిర్భవించిన- దృఢోపగూహన - గాఢమైనయాలింగనముచేత - ఘనాః-స్థూలములైనవియు-సామ్రాజ్య సాంద్రశ్రియః-సామ్రాజ్య-మిక్కిలియునతిశయమైనయదియు- సాంద్ర-ఇనుమడించినయదియునగు-శ్రియః-కాంతులుగలయవియు- త్రిభువనస్వాదీయసః,త్రిభువన, మూడులోకములకు-స్వాదీయసః- ప్రీతివిషయమయిననదియునగు-తేజసః శ్రీకృష్ణరూపతేజస్సుయొక్క-అంకురాః-పులకలు-జీయ్యాసుః - జయశీలములయివర్తించుగావుత॥ ౫౭

మ॥ రతికేళింరమిదీఱఁగానలసినిద్రంజెందిస్వప్నంబుచే। నతిభీతిఁ
రమగౌగిలింపనిబిడంబై రాధికాపాంగవీ। క్షితవక్షస్థలసిస్తు
లాభరణమై చెన్నొందుకోమాంచసం । తతిసామ్రాజ్యర
మానుభూతిపరమానందాకృష్ణశౌరికిఁ॥ ❋

తా॥ రాధయొక్కవిలాసంబులతోడంగూడిన కడకన్నులచేఁజూడబడుచున్న వక్షస్థలంబునలంకరించుచుసురతాంతంబున నిదురించురుక్మిణిదేవిస్వప్నంబునకాంచిభీతింబొందికౌగిలింపనిబిడంబులయి నిరతిశయకాంతులచే జేజరిల్లుచుత్రిలోకప్రీతి విషయకంబగు శ్రీకృష్ణునిపులకాంకురంబులు సర్వోత్కృష్టంబులయివర్తించుననుట. ❋

శ్లో॥ స్మితస్నుతసుధాధరా మదశిఖండిబర్హాంకితా విశాలనయ
నాంబుజా వ్రజవిలాసినీవాసితాః । మనోజ్ఞముఖపంకజామ
ధురవేణునాదద్రవాజయంతిమమచేతసశ్చిరముపాసితావా
సనాః। ౫౮

టీ॥ స్మితస్నుతసుధాధరాః- స్మిత, నవ్వుననదియే-స్నుత, జాలుచున్న- సుధా,

అమృతమువలెనున్న-అధరాః-ఓష్ఠములుగలయవియు, మదశిఖండిబర్హాంకితాః-మదశిఖండి- మదించిననెమళ్ళయొక్క-బర్హ-పింఛముచేత-అంకితాః-చిహ్నితములయినయవియు- విశాలనయనాంబుజాః-పెద్దవులయిననేత్రపంకజములుగలయవియు - వ్రజవిలాసినీవాసితాః-రేపల్లెయందలి స్త్రీలయందునివాసముచేసియున్నయవియు, మనోజ్ఞముఖపంకజాః-మనోహరములయిన ముఖకమలములుగలయవియు, మధురవేణునాదప్రవాహాః-మనోజ్ఞములయినవేణుగానగతులుగలయవియు, మమ- నాయొక్క-చేతసః- చిత్తమునకు-చిరం, బహుకాలము- ఉపాసితాః-సేవ్యంబులగునవియునగు, వాసనాః-శ్రీకృష్ణరూపసంస్కారములు- జయంతి, సర్వోత్కృష్టములయివర్తించుచున్నవి॥ ౫౮

చ॥ చెలువగు మోముతో దళుకుచెక్కులతో మధురాధరంబుతో |
సుళువగునవ్వుతో సొలపుచూపులతో వ్రజబాలికాళితో | లలి
తకలాపభూషణ విలాసముతో మురళీరవంబుతో | బలుమఱు
మీరు గాక మధుభంజనవాసనలెల్లదిక్కులన్॥ *

తా॥ చిఱునగవుని మోదునమృతంబుచేఁ జెలువగు కెంపుమోవియు నేపారు నెమలిపురిదిస్నెవియువిశాలంబులగు కనుదామరలుంగలిగి గోపికలతోడం గూడి వేణునాదగతులవిస్తారిల్ల నా చిత్తంబుచే సేవింపబడుచున్న శ్రీకృష్ణరూపసంస్కారంబులు సర్వోత్కృష్టములయి యతిశయిల్లుచున్నది.

శ్లో॥ జీయాసనసౌ శిఖిశిఖండకృతావతంసా సాంసిద్ధికీ సరసకాంతి
సుధాసమృద్ధిః | యద్బిందులేశకణికాపరిణామభాగ్యసౌభా
గ్యసీమపదమశ్నుతి పంచబాణః॥ ౫౯

టీ॥ పంచబాణః-మదనుఁడు, యద్బిందులేశకణికాపరిమాణభాగ్యసౌభాగ్యసీమ, యత్-ఏయతిశయముయొక్క-బిందు-బిందువులయొక్క-లేశ, కణములయొక్క-కణికా-సూక్ష్మావయవముయొక్క-పరిమాణ-పరిమితియనియెడి-భాగ్య- భాగ్యమువలననైన- సౌభాగ్య- సౌందర్యముయొక్క - సీమ, స్థానముయొక్క, పదం, స్థానమును, అంచతి- పొందుచున్నాఁడో. అసౌ- ఈశిఖి- శిఖండకృతావతంసా- శిఖి- మయూరములయొక్క, శిఖండ-పింఛముచేత-కృత-చేయబడిన, అవతంసా- శిరోభూషణముగలయదియు- సాంసిద్ధికీసరసకాంతిసుధాసమృద్ధిః, సాంసిద్ధికీ - స్వభావసిద్ధమయిన - సరస-రసయుక్తమయిన-కాంతిసుధాసమృద్ధిః - కాంతియనునమృతాతిశయము, జీయాత్ - సర్వోత్కృష్టమైవర్తించుగాక॥ ౫౯

మ॥ అరుణంబగుచిన్నిదామముకముస్నిగ్ధంబు ప్రభాసంపదన్ | ధ్వ
వలీలామృతభాగ్యల్ల సెనపింఛాకల్లచెల్వారుసోం | హావ



హారోస్పదరూపధేయసుకుమారాంశప్రభావంబులో | లవ
మాత్రంబొదవన్మనుండు జగమెల్లంగెల్చు లీలాగతిన్॥ *

తా॥ మదనుండే సమృద్ధియొక్క బిందులేశంబులో నొకభాగంబుమాత్రపుసౌందర్యపదంబునొందెనో యట్టి యీయగుపడుచున్న యదియు నెమలిపురిచేతం జేయంబడిన శిరోభూషణంబుగలిగి స్వభావసిద్ధంబయి వెలయునదినగు కాంతియనునమృతసమృద్ధి సర్వోత్కృష్టమయి వర్తించుచున్నది. *

శ్లో॥ ఆయామేన దృశోర్విశాలతరయోరక్షయ్యమార్ద్రస్మితచ్ఛా
యాదర్శితశారదేందులలితం చాపల్యమాత్రం శిశోః | ఆయాసా
నపరాన్విధూయ రసికైరాస్వాద్యమానం ముహుర్జీయాదు
న్మదవల్లవీకుచభరాధారం కిశోరం మహః॥ ౬౦

టీ॥ విశాలతరయోః, మిక్కిలిపెద్దవులైన-దృశోః-కన్నులయొక్క- ఆయామేన-పొడవుచేత-అక్షయ్యం-క్షయరహితమైనయదియు-ఆర్ద్రస్మితచ్ఛాయాదర్శితశారదేందులలితం- సరసమైనచిఱునగవుయొక్క కాంతిచేత తిరస్కరింపబడినశరత్కాలసంబంధచంద్రసౌందర్యముగల-శిశోః, బాలునియొక్క- చాపల్యమాత్రం- చపలసర్వస్వభూతమయినయదియు, అపరాన్-అన్యములైన-ఆయాసాన్- ప్రయాసములను, విధూయ-విడిచి-రసికైః- విద్వాంసులచేత, ముహుః-మాటిమాటికిని- ఆస్వాద్యమానం-ఆస్వాదింపబడుచున్నయదియు, ఉన్మదవల్లవీకుచభరాధారం-ఉన్మద-అధికమదముగల-వల్లవీ- గోపికలయొక్క- కుచభర- స్తనాతిశయమే, ఆధారం-ఆశ్రయముగాగలయదియునగు-కిశోరంమహః-బాలతేజము, జీయాత్- సర్వోత్కృష్టమయివర్తించుగాక॥ ౬౦

ఉ॥ క్రొన్ననబోండ్లు గబ్బిచనుగుబ్బలనానుచు గారవింపగా | వె
న్నెలనవ్వునవ్వులరవింబము చందముగ్రించుచేయుచుం బాల్యచాపల
విలాసముమీఱ రసజ్ఞలోకమీయన్నియు సుజ్జ
గింపహృదయంగమమైన వెలుంగు గాంచెదన్॥ *

తా॥ విశాలంబులగునేత్రంబులచే నక్షయ్యంబౌ సుందరంబయి సరసంబగు చిఱునగవుకాంతిచేతం దిరస్కరింపబడిన శరత్కాలచంద్రసౌందర్యంబు గలిగి చపలసర్వస్వంబయి యన్యప్రయాసంబుమానిరసజ్ఞులచేత ధ్యానంబుచేయంబడుచున్నదియై యధికమదంబుగలగోపికలకుచభారంబయాశ్రయంబుగగలిగి వెలుంగు బాలతేజంబు సర్వోత్కృష్టంబయి వర్తించుననుట.

శ్లో॥ సరంధ్రాహారసదభ్రజాతికతిపయే గోపాంగనాస్వాం
గనాస్సరంధ్రాలంబిసవస్సభాభిన్నఘనదాగోపాస్సహాయా

దయః। శృంగారాగిరిగయిరికం శివశివ శ్రీమంతి బర్హాణివా
శృంగగ్రాహికయాశధాపితవిదం ప్రాహుస్త్రిలోకేశ్వరమ్॥

టీ॥ గోష్ఠం-గొల్లపల్లియ-స్కంధావారసదం-స్కంధావార-పాళెముయొక్క-సదం-ఆస్థానమంటపము (ఈకాలంబునమందియుల్ల యినసు లేదనినూచింపబడియెను) గోపాంగనాః- గోపస్త్రీలు, స్వాంగనాః- స్వకీయలయిన భార్యలు- ఈహేతువువలన-భార్యలయిననుమందివారలు లేరనిసూచింపబడియెను- ధనదాః- పన్నిచ్చువారు- ప్రజాః- ప్రజలు, కతిపయే, కొందఱు, (దీనిచేఁదఱు పన్నిచ్చువారు గలవారసంపద యయిన సువిస్తారము లేదని సూచింపఁబడినది) వత్సదామ్ని - వత్సబంధనరజ్జువిశేషము, స్కంధాలంబిని- భుజశిఖరమునాశ్రయించియుండగా-గోపాః, గోపాలురును - సహాయాశ్చ యః, భటులు మొదలైనవారలు (ఈహేతువుచేతబరివారసంపత్తియు లేదనిసూచింపబడియెను) శృంగారాః- అలంకారములుగిరిగయిరికం- పర్వతమందలి గైరికాదిధాతువిశేషములు, శ్రీమ తిబర్హాణివా, శ్రీమంతి- కాంతిగలిగిన, బర్హాణివా- పింఛములే నియు (ఈహేతువలనభూషణసంపత్తియు లేదనిసూచింపబడియెను) తథాపి, అటులైనప్పటికిని-శృంగగ్రాహికయా, చిన్నగ్రహణముచేత, తత్, అప్రసిద్ధమైన,ఇదం-ఈ వస్తువు, త్రిలోకేశ్వరం=త్రిలోకేశునిగాను,వృద్ధాః= పెద్దలు,వదంతి=చెప్పుచున్నారు॥

ఉ॥ బాలిశులైనగోపకులు బంధులు పాళెముగొల్లపల్లెయు। త్యాల
సగాలువామెవలుదారలుగోపికలంగరాగముల్। శైలకటం
కధాతువులుచారువిభూషలుపింఛదామముల్। పోలినయిట్టి
విష్ణునిబుద్ధి నెఱుంగుదు రెల్లపెద్దలున్॥ *

తా॥ గోష్ఠంబుస్కంధావారంబుగోపకులుభటాదులు గోపాంగనలు భార్యలుపన్నిచ్చువారలప్రజలంబులు అలంకారంబుగయిరికంబు భూషణంబులు నెమలిపురిదండలుఇట్టివిగలదియైననునీతేజంబును సర్వలోకేశ్వరుండగు విష్ణునిగానోకానోక యభిజ్ఞాతంబునబుధులెఱుంగుదురనుట. *

శ్లో॥ శ్రీమద్బర్హిశిఖండమండనజుషే శ్యామాభిరామత్విషే లావ
ణ్యైకరసావసిక్తవపుషేలక్ష్మీసరఃప్రావృషే। లీలాకృష్ణర
సజ్ఞధర్మమనసేలీలామృతస్రోతసేకేవానస్పృహయాన్నితీహం
తమహసేగోపీజనప్రేయసే। ౫౨

టీ॥ శ్రీమద్బర్హిశిఖండమండనజుషే, కాంతిగలిగిననెమలిపురి యలంకారమును బొందినటువంటిదియు, శ్యామాభిరామత్విషే-నల్లనైనమనోహరమైనకాంతిగలదియు,లావణ్యైకరసావసిక్తవపుషే, కాంతియనిమోడిమఖ్యమైన రసముచేతఁదడుపఁబడినశరీర



ముగలయదియు, లక్ష్మీసరఃప్రావృషే- లక్ష్మియనియెడిసరస్సునకు వర్షర్తువైనయదియు, లీలాకృష్ణరసజ్ఞధర్మమనసే-విలాసముచేతనాకర్షింపబడిన విద్వాంసులయొక్క-ధర్మప్రధానములైన మనస్సులుగలయదియు, లీలామృతస్రోతసే - విలాసమనియెడి యమృతప్రవాహమైనయదియు, గోపీజనప్రేయసే-గోపికాజనులకు ప్రియతరమైనయది యునగు, మహసే - తేజముకొఱకు, కేవా - యెవ్వరు, నస్పృహయంతి, ఆసచేయరు హంత, ఆశ్చర్యము॥ ౫౨

శా॥ లావణ్యామృతసేవగండళితలీలా రాములక్ష్మీశరః। ప్రావృ
ట్కాముని తాంతసంయమితబర్హశ్రీసముద్ధాముఁరా। ధావి
ర్భూతవయోభిరాముఁవిలసీద్ధా రాధరశ్యాముని౯। సేవింప
న్మదిగోరరేరసికులాసీమాఖిల ప్రేముని౯॥ *

తా॥ కాంతియుతంబగు నెమలిపురియలంకారంబుగధరియించికాంతి విశేషంబనురసంబుచేతందడుపంబడినదివ్యమంగళవిగ్రహంబుగలిగిసిరియనుసరోవరంబునకు ప్రావృట్కాలంబై రసజ్ఞుల మనంబులనఖిల విలాసంబులచే నాకర్షించుచు విలాససుధాప్రవాహంబై గోపిజనప్రియతరంబై వెలయుతేజంబుకొరకు నెవ్వారలాసంజేయరు అనంగానందఱు నాసంజేయుదురనుట॥

శ్లో॥ ఆపాటలాధరమధీరవిలోలనేత్ర మామోదనిర్భరిత మద్భు
తకాంతిపూరమ్। ఆవిస్మితామృతమనుస్మృతిలోభనీయ
మాముద్రితాననమహోమధురంమురారేః। ౫౩

టీ॥ ఆపాటలాధరం- అంతటతెల్లనైన, మోవిగలయదియు, అధీరవిలోలనేత్రం-చంచలములై - తృష్ణాయుక్తములైన నేత్రములుగలయదియు, ఆమోదనిర్భరితం- పరిమళముయొక్క- సంజాతాతిశయముగలయదియు,అద్భుతకాంతిపూరం- ఆశ్చర్యకరమైనకాంతిప్రవాహము గలయదియు, ఆవిస్మితామృతం - ప్రకాశించుచున్న యమృతమువంటిదియునగువుగలయదియునగు-మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క-, మధురం- సుందరమగు, ఆముద్రితాననం-కొంచెముతెరువఁబడినకన్నులుగలముఖము, అనుస్మృతిలోభనీయం-నిరంతరస్మరణచేత, నాసజేయతగినదిగా, భవతి-అగుచున్నది, అహో- ఆశ్చర్యము॥

మ॥ అతులానందరసామృతార్ణవమపాంగాభంగరంగత్తరంగత
తింబొంగుచుగెంపుమోవినరిదాకం దత్సుధాబిందువుల్।స్మిత
లీలన్విలసిల్లెనంచుజనముల్చిత్తంబులన్ హెచ్చునద్భుతశృం
గారరసైకముద్రితముఖాంభోజున్ హరిన్ గొల్చెదన్॥

తా॥ ప్రకాశించుచున్న చిఱునగవను జ్యోత్స్నలం జేయు కెంమోవియు నతిచపలంబులయి ప్రేతలంజూడ నాశంజేయుకన్నులు నతిశయంబై నపరిమళంబు నచ్చెరువగు కాంతిప్రవాహంబు నొక్కొ-క్క- పరియర మోడ్చుకన్నగవయు నుగలిగి సుందరంబయి వెలుంగు వెన్నుని నెంమొగంబెప్పుడును ధ్యానంబు చేయదగినదియుననట॥

శ్లో॥ జాగృహి జాగృహి చేతశ్చిరాయ చరితార్థతా భవతః। అను
భూయతామిదమిదం పురస్థితం పూర్ణనిర్వాణమ్॥ ౬౪

టీ॥ హే చేతః- ఓచిత్తమా, భవతః-నీయొక్క, చరితార్థతా- కృతార్థత్వము, చిరాయ- తడవుగా, సంజాతా-అయినది, జాగృహిజాగృహి- మోహమునువిడువుము, ఇదమిదం పురస్థితం- ఈముందున్న, పూర్ణనిర్వాణం- శ్రీకృష్ణరూపనిరతిశయసుఖము, అనుభూయతాం- అనుభవింపదగినది॥ ౬౪

వ॥ వెనుకటివేళలందనుభజించిన జన్మశతంబులట్లనే। డనుభ్రమ
మోసపోవకగడుందెలివొందుము డెందమా చిరం। తనతప
ముల్ఫలించిపురతస్థితినున్నదికృష్ణరూపమై। యనవరతాను
చింతనసుధారసవీచులనోలలాడుమీ॥

తా॥ ఓమనంబా యనేక కాలంబునకు నీకృతార్థత్వంబు ఫలియించెనిక నజ్ఞానంబుబోవనడిచి యీముందు గానంబడుచున్న శ్రీకృష్ణరూపనిరతిశయసుఖంబను భవింపుమా యనుట॥

శ్లో॥ చరణయోరరుణం కరుణార్ద్రయోః కచభరే బహుళం విపు
లం దృశోః। వపుషి మంజుల మంజనమేచకే వయసి బాలమ
హో మధురం మహః॥ ౬౫

టీ॥ అహో- ఓజనులారా, చరణయోః-పాదములయందు, అరుణం-ఎఱ్ఱనయినదియు, కచభరే-శిగయందు, బహుళం- విస్తారమయినయదియు- కరుణార్ద్రయోః-కరుణా, దయచేత- ఆర్ద్రయోః- తడసిన, నయనయోః-నేత్రములయందు- విపులం,విశాలమయినయదియు- అంజనమేచకే, కాటుకవలెనల్లనైన-వపుషి-శరీరమందు-మంజులం, సొగసయినయదియు- వయసి, ప్రాయంబున- బాలం-కిశోరమయినయదియునగు-మహః, శ్రీకృష్ణాఖ్యతేజము- మధురం- హృద్యము॥ ౬౫

ఉ॥ మేనుఘనాఘనప్రతిభమించియు పాదపయోరుహంబు గెంపూ
నెవిలోలమయ్యానుదయోర్జితమయ్యెనుగన్నుదోయి తే.జోనిధి



యమ్యోహ్యాత్సరసిశోభితుడయ్యె బురాణుడయ్యె నారానెరు
లందునల్పనెలప్రాయము గాంచుటవింత వెంతయు న్॥

తా॥ పాదంబులనరుణంబై కృపారసంబుదొలుకుకన్నుంగవయందు విశాలంబై నీలమేఘంబుదెగడుశరీరంబున సుందరంబై, ప్రాయంబున బాల్యంబై వెలయు శ్రీకృష్ణుని తేజంబతిమనోహరంబో జనులారా యనుట॥

శ్లో॥ మాలాబర్హ మనోజ్ఞకుంతలభరాం వన్యప్రసూనోక్షితాం
శయిలేయద్రవక్లృప్తచిత్రతిలకాం శశ్వన్మనోహారిణీమ్। లీలా
వేణురవామృతైకరసికాం లావణ్యలక్ష్మీమయీం బాలాం బాల
తమాలనీలవపుషం వందే పరాం దేవతామ్॥ ౬౬

టీ॥ మాలాబర్హమనోజ్ఞకుంతలభరాం-మాలా-వనమాలికలచేత-మ-బర్హైః నెమలిపింఛములచేతను, మనోజ్ఞ- సొగసైన- కుంతలభరాం- కేశములయొక్క- భారాతిశయముగలయదియు, వన్యప్రసూనోక్షితాం-వన్య- వనమందుబుట్టిన-ప్రసూన- పుష్పములచేత,ఉక్షితాం-తడుపబడినయదియు, శైలేయద్రవక్లృప్తచిత్రతిలకాం- ధాతువిశేషములయొక్క-ద్రవములచేత జేయబడిన- చిత్రమయినతిలకముగలయదియు, శశ్వన్మనోహారిణిం-అంతటనుమనోహరమైనయదియు-లీలావేణురవామృతైకరసికాం- విలాసార్థమైనవేణురవామృతముచేత ముఖ్యముగారసికసికమైనదియు, లావణ్యలక్ష్మీమయీం-కాంతివిశేషసంపద్వికారమయినయదియు- తమాలనీలవపుషం- కానుగుపువ్వువలెనల్లనైనశరీరముగలయదియు- బాలాం- బాల్యముగలయదియునగు, పరాం - దేవతాం-పరదేవతనుగూర్చి- అహం - నేను, వందే- నమస్కరించెదను॥ ౬౬

ఉ॥ వింతలుగాగలాపముబువేనలిజుట్టియువన్యమాలికా। సం
తతిజుట్టిజేగురురసంబున దోన్తరబొట్టుపెట్టిచె। ల్వంతయు
రాశిచేసినక్రియన్మురళీతరళీకృతామృతా। భ్యంతరసాదమై
పరగునావిభుమేచకధామముగొల్చెదన్॥

తా॥ వనంబునం బొడమినపువ్వులదండయు నెమలిపురిదండలుం జుట్టినసిగయును జేగురురసంబునందొంతరులుగనిడిన తిలకంబులునుంగలిగివన్యప్రసూనవర్షంబుచేతం గప్పబడిమిక్కిలియు మనోహరంబయి వేణురవామృతంబున సరసంబయిలెతకానుగుంబోలె నల్లనైన శరీరంబుగలిగి సౌందర్యసంపచ్చే దేజరిల్లుపరదైవంబుంగూర్చి మ్రొక్కుచున్నాను.

శ్లో॥ గుణమృదుపదే గూఢంగుల్భేఘనజఘనస్థలే నళినముఖ రేవిద

రంభా హ్యూర్వోర్విశాలమురఃస్థలే। మధురమధురేమఃగ్ధంవక్త్రే
విశాలవిలోచనే బహుకచభరేవస్యవేషేమతోజ్ఞమహో
మహః॥ ౬౫

టీ॥ మృదుపదే- మృదుకోమలమైన, పదే-పాదమునందు, గుఢ-దుర్భదమైనయది యు, గుల్భే-గుల్ఫమందు, గూఢం- గూఢమయినయదియు, జఘనస్థలే-కటీశబ్దాద్భాగమందు, ఘనం- గొప్పదైనయదియు, ఉదరే - గర్భమునందు, నమ్రం- కమలముగలయదియు, బాహ్వోః-భుజములయందు, దివరం- రంధ్రమైనయదియు, ఉరస్థలే - వక్షస్థలమందు- విశాలం-విస్తారమైనయదియు, అధరే- మోవియందు, మధురం-మనోహరమైనయదియు- వక్త్రే-ముఖమునందు, ముగ్ధం, సుందరమయినయదియు- విశాలవిలోచనే విశాల-పెదలైన-విలోచనే-కన్నులయందు, విపులం- విస్తృతములైనయదియు, కచభరే-సిగయందు, బహు- అధికమైనయదియు, వేషే- అలంకారమందు-వన్యం- వనభవ్యరూపమైనయదియునగు-మహః- తేజము - మనోజ్ఞం - మనోహరమైనది, ఇతి-అని-అహం- నేను, వచ్మి- చెప్పుచున్నాడను॥ ౬౬

చ॥ గురుపదముల్ని గూఢతరగుల్ఫములుంబలు పాపిఱుందువి।
స్ఫురదురునాభిదీర్ఘకరముల్ పృథువక్షముచావి మోవిసున్న।
వదనంబుబద్మనయనంబును నీలశిరోజముల్మనో। హరసుకు
మారవేషమోఱమైతగు తేజమునాత్మనెంచెదన్॥

తా॥ దుర్భరంబులగు పదంబులను గూఢంబులగు గుల్ఫంబులను గొప్పలగు పిఱుందులును విశాలంబులగునురంబును దీర్ఘంబులగునయనంబులును గలిగినాభిసరోజంబుచేతం దేజరిల్లు తేజంబతి మనోహరంబయి యున్నది.

శ్లో॥ జీవనంజీవనం సుజానేనమాధ్ర్యంమ హానందు హానంసు
ధాంవేణునాదైః లిహానంలిహానంసుదీర్ఘైరపాంగైర్మహా
నందసర్వస్వమేకంనమస్తాత్॥ ౬౭

టీ॥ జానేన-యౌవనముచేత, మాధ్ర్యం-సౌందర్యమును,జీవనం-జీవనం,మిక్కిలియుంబొందుచున్నవాడును,వేణునాదైః-వేణుధ్వనిచేత,సుధాం- అమృతమును, దుహానంధుహానం- మిక్కిలియువర్షించుచున్నవాడును, దీర్ఘైః- పొడవులయిన, అపాంగైః- కడగంటిచూపులచేత, లిహానంలిహానం- మిక్కిలియుజూచుచున్నవాడును, మహానందసర్వస్వం- మహానంద,మిక్కిలి సంతోషముయొక్క- సర్వస్వం- సర్వస్వరూపుడైనవాడునగు, ఏకం-ఒకడైనకృష్ణునిగూర్చి- నమస్తాత్-నమస్కరించుచున్నాను॥



ఉ॥ అందరుగోరగాదగినయౌవనకాంతినిరూఢిసంపదముం। జెం
దికటాక్షవీక్షణముచేవలపించుచుబిల్లగ్రోవిచే। డెందముసల్ల
గాసుధగడించి జెడెన్నిగుడించుచున్మహా। నందనిధానమైచెల
గునందకుమారకుగాంచిమ్రొక్కెదన్॥

తా॥ ఎల్లవారిచేనాశ్రయణీయంబగుయౌవనంబుచే నధికంబగు సౌందర్యంబునొంది వేణునాదంబులచే సుధనతిశయంబుగవర్షించుచుంబొడవులగు కన్నులచే నాశ్రితులంజూచుచు నిరతిశయానందస్వరూపుండై వెలయుశ్రీకృష్ణునింగూర్చి నమస్కరించుచున్నాను॥

శ్లో॥ లసద్బర్హాపీడంలలితస్మేరవదనంభ్రమత్క్రీడాపాంగంప్రణతజనతానిర్వృతిపదమ్। నవాంభోదశ్యామంనిజమధురిమా
భోగభరితంపరంవేవంవందేపరిమళితకైశోరకరసమ్॥౬౮॥

టీ॥ లసద్బర్హాపీడం-ప్రకాశించుచున్న నెమలిపురి భూషణంబుగాగలిగినవాడును, లలితస్మేరవదనం- మిక్కిలిసుందరమైనచిఱునగవులోగూడిన ముఖంబుగలవాడును, భ్రమత్క్రీడాపాంగం-చలించుచున్న విలాసప్రధానములైన కడకంటిచూపులుగలవాడును, ప్రణతజనతానిర్వృతిపదం- నమ్రమైనజనసమూహముయొక్క-సుఖమునకుగారణమయినవాడును- నవాంభోధశ్యామం-నూతనమయినమేఘమువలెనల్లనైనవాడును, నిజమధురిమాభోగభరితం-స్వకీయమయిన సౌందర్యముయొక్క- పరిపూర్ణతయొక్క- సంజాతాతిశయముగలిగినవాడును- పరిమళితకైశోరకరసం - వ్యాప్తములయి-కిశోరసంబంధములయిన - శృంగారాదిరసములుగలవాడును, పరం - ఉత్కృష్టుడయినవాడునయిన, దేవం- శ్రీకృష్ణమూర్తిని గూర్చి, వందే-నమస్కరించుచున్నాను॥

మ॥ పటుధారాధరశోభితాంగువిలసద్బర్హోత్తమాంగున్సదా।
త్తటమంధస్మితసుందరున్వలదపాంగశ్రేణికాడంబరుం। స్ఫుట
కయిశోరకలాపుమోహనకళాభోగిస్వరూపున్వశం। కటసం
సేవకనిర్వృతిప్రదుశుభాకారాస్పదుంగొల్చెదన్॥

తా॥ ప్రకాశించుచున్న నెమలిపురిసిగయందలంకరించిమిక్కిలి సుందరంబగు చిఱునగవుతోడంగూడిన ముగంబుగలిగి సంచరించుచున్నవిలాసప్రధానంబులయిన కడకన్నులుగలిగినమ్రులగుజనంబులకు సుఖంబులీయగారణుండయి వర్షాకాలమేఘంబుబోలె నీలవర్ణంబుమెఱయు స్వకీయంబయినసౌందర్యపరిపూర్ణత్వంబుననతిశయంబుల్లివ్యాపించుచున్న బాల్యంబుచేతం- దేజరి

ల్లడునుతత్కృష్ణుండగు శ్రీకృష్ణమూర్తికినిగూర్చినమస్కరించుచున్నాను.

శ్లో॥ సారస్యసామగ్ర్యమివాననేన మాధుర్యచాతుర్యమివస్మితేన
తారుణ్యకారుణ్యమివేక్షితేన చాపల్యసాఫల్యమిదందృశోర్మే॥

టీ॥ ఆననేన- ఈ ముఖము చేత, సారస్యసామగ్ర్యమివ- సారస్య- సౌందర్యముయొక్క- సామగ్ర్యమివ- పూర్తివలెను- స్మితేన - చిఱునగవుచేత, మాధుర్యచాతుర్యమివ- మాధుర్య- మనోహరభావముయొక్క- చాతుర్యమివ- చమత్కారమువలెను- ఈక్షితేన- చూపుచేత, తారుణ్యకారుణ్యమివ- తరుణ- భావముగలదయవలెను, ఇదం- ఈ కానంబడుచున్న, శ్రీకృష్ణాఖ్యవస్తువు, మే- నాయొక్క- దృశోః - నేత్రములయొక్క- సాఫల్యం- ఫలసంబంధమయినది॥ ౭౦

చ॥ మురిపెపునవ్వుకాదిదివిమోహకరసాస్పదరాశిగానిది। త్తరమ
గుచూపుగాదిదినితాంతదయానిధిగానిమోముదా। ముమర
యిదిగాదఖండరసమాధురిగానవ్రజాలయాంగనాం। తరిను
దిగాదునాదునయనంబులభాగ్యముకానిచూడగన్॥

తా॥ సౌందర్యసంపూర్తిగలనెంమోమును మనోహరత్వంబుచేజతురంబయినచిఱునగవునుదరుణభావంబుగల దయచెవెలయునీక్షితంబుగలిగిఈకానంబడుచున్న శ్రీకృష్ణరూపంబగువస్తువునాకన్నులచాపల్యంబునకుఫలంబయియున్నది. ❋

శ్లో॥ యత్రవాతత్రవాదేవయదివిశ్వసిమస్త్వయి। నిర్వాణమపిదు
ర్వారమర్వాచీనానికింపునః॥ ౭౦

టీ॥ హేదేవ- ఓకృష్ణ, యత్రవా- బ్రాహ్మణజన్మమందయినను మఱియొకజన్మమందైనను, తత్రవా- ప్రసిద్ధంబగు గార్హస్థ్యాశ్రమంబుననయినను, మఱియొకయాశ్రమంబునైనను (పక్షాంతరంబున, యత్రవా- శ్రీకృష్ణావతారవ్యతిరిక్తావతారమందైనను- తత్రవా- కృష్ణావతారమందైననుఅనియుంగలదు) త్వయి- నీయందు, విశ్వసిమోయది- విశ్వాసముజేయువారలమైనట్లుల య్యేనేని, నిర్వాణమపి- ముక్తియును- దుర్వారం- వారింపనశక్యమైనది- అర్వాచీనాని- మోక్షవ్యతిరిక్తధర్మాదిపురుషార్థములు, కిం- పునః, ఎమిచెప్పను॥ ౭౧

మ॥ క్రతుహవ్యాదివిశిష్టభావనలధారావాక్యసుజ్ఞానసం। తతినై
నైననువిశ్వసించిననునాత్మంగొల్వమోక్షంబనా। వృతమై
వర్తిలునీకృపారసలసద్వీక్షాప్తిచేసట్టిసు। వ్రతముంగాన్చమ

హాత్మకోటికిలనర్వాచ్యవముల్ భ్రాంతియే॥ ❋

తా॥ ఏజన్మంబుననే యాశ్రమంబుననేని శ్రీకృష్ణావతారంబున మఱియొకయవతారంబుననేనియునీయందవిశ్వసించితిమైనట్టులయ్యేనేని మోక్షంబుస్వతస్సిద్ధంబై తోచు ధర్మాదిపురుషార్థంబులులభించుటకేమియాశ్చర్యవనుట.

శ్లో॥ రాగాన్ధగోపీజనవందితాభ్యాం యోగీంద్రభృంగేంద్రనిషే
వితాభ్యాం। ఆతామ్రపంకేరుహవిభ్రమాభ్యాంస్వామిన్ప
దాభ్యామయమంజలిస్తే॥ ౭౨

టీ॥ హేస్వామిన్- ఓకృష్ణ- రాగాంధగోపీజనవందితాభ్యాం- రాగ- అనురాగముచేత, అంధ- అంధులైన- గోపీజన- గోపికాస్త్రీజనులచేత- వందితాభ్యాం- నమస్కరింపబడుచున్నవియు, యోగీంద్రభృంగేంద్రనిషేవితాభ్యాం- యోగీశ్వరులనియెడి- భ్రమరశ్రేష్ఠములచేత, సేవింపబడుచున్నయదియు- ఆతామ్రపంకేరుహవిభ్రమాభ్యాం- ఆతామ్ర- అంతటఎఱ్ఱనయిన, పంకేరుహ- కమలములయొక్క- విభ్రమాభ్యాం- విలాసములవంటి విలాసములుగలవియునగు, తే- నీయొక్క, పదాభ్యాం- పాదములకొఱకు, అయం- అంజలిః, ఈనమస్కారము- కృత, చేయబడియెను॥ ౭౨

మ॥ అరుణాంభోజవిలాసమై ప్రబలమోహావేశగోపీమన। స్సరసీ
శోభితమై మునీంద్రజనచంచచ్చంచరీకవ్రజా। కరమై హంసక
నాదమేదురమునయి కన్పట్టుపాదాబ్జముం। గరయుగ్మంబు
నసంటియంటితుదసోకస్వీకనోలార్చెదన్॥ ❋

తా॥ ఓకృష్ణాయనురాగంబుననిరంబుమఱచి సేవించు గోపికాజనంబులచే నమస్కరింపంబడుచు యోగీశ్వరులను చంచరీకశ్రేష్ఠంబులచెసేవింపబడుచునెఱ్ఱతామరల విలాసంబులవంటి విలాసంబులుగలిగి మెఱయు నీపదంబులకొఱకునమస్కరించుచున్నాను. ❋

శ్లో॥ అర్థానులాపాన్వ్రజసుందరీణామకృత్రిమాణాంచసరస్వతీ
నాం। ఆదాగ్రశయేనశ్రవణాంచితేనసమ్భావయన్తంత
రుణంగృణీమః॥ ౭౩

టీ॥ వ్రజసుందరీణాం, గోపికాస్త్రీలయొక్క- అకృత్రిమాణాం- కపటరహితములైన, సరస్వతీనాం- వాక్యములయొక్క- అర్థానులాపాన్- అర్థములయొక్క- యేకదేశపునరుచ్చారణములను- శ్రవణాంచితేన- శ్రోత్రములయొక్క- ప్రాంతములచేత- ఆదాగ్రశయేనచ- సరసహృదయముచేతను, సంభావయంతం - బహూకరించుచున్న, తరుణం,

యౌవనవంతుడైనకృష్ణమూర్తిని, గృణీమః- ఉచ్చరించుచున్నాను॥ ౭౩

చ॥ చుళికితమైనచూపులొకచోటనెఱుంగనివుప్పబోండ్లమేల్ ।
సొలపుమిటారిచూపులసోకుచుఁ గెలంగెడు తేటమాటలు। న్వల
పులుదేఁప గానినిమనంబుననుప్పొంగులూరుచేయ్వనిక్ । లలితవ
యోవిలాసునినారతమున్నతియింపఁజెల్లదే॥ ✻

తా॥ గోపికలకుటిలంబులగు వాక్యంబులకున్ శిశుపుసరుచ్చారణంబుల జెవికిం పుగనుమనంబునకనుకూలంబుగను వినుచుబహూకరించుచున్నయౌవనవంతుండగు శ్రీకృష్ణునిస్మరించుచున్నాను. ✻

శ్లో॥ మనసి మమ సన్నిధత్తాం మధురముఖా మన్దరాపాంగా। కరక
లితలలితవంశా కాపికిశోరా కృపాలహరీ॥ ౭౪

టీ॥ మధురముఖా- సుందరమయినముఖముగలయదియు, మందరాపాంగా-మందర- అలసములయిన-అపాంగా- క్రేగంటిచూపులుగలయదియు, కరకలితలలితవంశా- కర-హస్తముచేత,కలిత-కూడుకొన్నటువంటిదియు, లలిత- సుందరమైనట్టిదియగు- వంశా- వేణువుగలయదియు, కాపి-వాచామగోచరమైనయదియు- కిశోరా-బాల్యముగలయదియనగు-కృపాలహరీ-దయాతిశయము, మమ-నాయొక్క-మనసి- మనమునందు, సన్నిధత్తాం- సన్నిధిచేయుగాక॥ ౭౪

ఉ॥ అందమునొందునెమ్మొగమునందుగృపామృతవృష్టిపైపయిఁ।
గ్రందుకొనంగనొప్పకడకన్నులు గెన్నులరంగ వేణువం। దంద
గరంబులం జెలఁగనంగజమోహనమూర్తియైనకరం। బుందన
రాయు బాలకుఁడు బోల్చు మదీయహృదంతరంబునన్॥ ✻

తా॥ సౌందర్యముచేతం దేజరిల్లు నెమ్మొగంబుగలిగి యలసంబులగు నపాంగంబుగలిగి కరంబుల వేణువలరం జెప్పనలవికానిదై బాల్యంబుచె మెలగు దయాతిశయము నామనంబునందోచుగాకయనుట॥

శ్లో॥ రక్షన్తు వశ్శిక్షితపాశుపాల్యా బాలావృతా బర్హిశిఖావతం
సాః। ప్రాణప్రియప్రస్తుతవేణుగీతాస్సీతా దృశశ్శీతలగోప
కన్యాః॥ ౭౫

టీ॥ శిక్షితపాశుపాల్యాః- అభ్యసింపబడినగోరక్షణముగలయదియు, బాలావృతాః-బాలురచేత బరివేష్టింపబడినయదియు,బర్హిశిఖావతంసాః, నెమలిపురిశిరోభూషణముగాగలయదియు, ప్రాణప్రియప్రస్తుతవేణుగీతాః - ప్రాణములకుఁ నిష్టమైన వేణు



గానముగలయదియు,దృశః- నేత్రములకు-శీతాః-గ్రహింపదగినదియు,శీతలగోపకన్యాః- సమీచీనులైనగోపకన్యలుగలయదియనగు, లీలాః- శ్రీకృష్ణవిలాసములు, నః- మమ్ము, రక్షంతు-రక్షించుగాక॥ ౭౫

మ॥ పొలుపొందకన్వ్రజబాలకుల్గొలువ రేపుల్ గ్రేపులన్మేపి మా। పు
లుగుంజామణిపుంజరంజితకరాంభోజంబుతో బింఛభూ। షల
తోజల్లనిచూపుతో మధురవంశప్రౌఢితో వచ్చి కాం। తలలాలిం
చుచుగాక దీప్సుహరినిత్యంబున్మముం బ్రోవుతన్॥

తా॥ అభ్యసింపబడినగోరక్షణంబుగలిగి బాలురచే నావృతంబులగుచు నెమలిపురియవతంసంబుగలిగి ప్రాణంబులకన్నను బ్రియంబగు వేణుగానంబు నవిలసిల్లుచు హృద్యంబులయి సమీచీనలగు గోపకన్యకలు వరియించు చుండ వెలయు శ్రీకృష్ణవిలాసంబులు మమ్ముఁ బ్రోచుగాకయనుట॥

శ్లో॥ స్మితస్తబకితాధరం శిశిరవేణునాదామృతం ముహుస్తరళలో
చనం మదకటాక్షమాలాకులమ్। ఉరస్థ్సలవిలీనయా కమలయా
సమాలింగితం భువస్తలముపాగతం భువనదైవతం పాతునః॥

టీ॥ స్మితస్తబకితాధరం-స్మిత-నవ్వుచేత, స్తబకిత-సంజాతగుచ్ఛములుగల,అధరం-అధరోష్ఠముగలయదియు, శిశిరవేణునాదామృతం - చల్లనయినవేణురవమనియెడియమృతముగలయదియు, ముహుః - మాటిమాటికిని, తరళలోచనం-చలించుచున్న నేత్రములుగలయదియు, మదకటాక్షమాలాకులం - మదించిన క్రేగంటిచూపులయొక్క- పంక్తులచేత వ్యాపింపబడినయదియు- ఉరస్థలవిలీనయా - వక్షస్థమందు నుంచిన, కమలయా లక్ష్మీదేవితోడ- సమాలింగిత - ఆలింగనముచేయబడుచున్న యదియు - భువః, భూమియొక్క- తలం, ప్రదేశమునుగూర్చి-ఉపాగతం-పొందినయదియనగు- భువనదైవతం-లోకదైవతముయిన-శ్రీకృష్ణపరబ్రహ్మము,నః-మమ్ము పాతు-రక్షించుగావుత॥ ౭౬.

చ॥ ఉరమునసిస్థురాజసుతనుంచియు గౌరిటగారవించియున్। ధ
రణికిడిగ్గి ఈభువనదైవతమెవ్వతవేడిగాంచెనో। తరళమదాల
సేక్షణసుధారసమున్మధురాధరోష్ఠము। న్శిశిరవామృతం
బును మనోజ్ఞదరస్మితబింబవృందమున్॥

తా॥ మొలకలెత్తుచిఱునగవుచే సుందరంబగు నధరంబును జల్లనైన వేణునాదామృతంబును పారెసారెకు జ చలంబులగు లోచనంబులును మద ప్రధాన

బులగుకడకన్నులుంగలిగియు రమ్మనమెఱయుకమలాదేవిచే నాలింగనంబుచే యుంబడుచున్నదై వెలుంగుచుబుడమికెందగినలోకదైవతంబగు శ్రీకృష్ణాఖ్య తేజంబుమమ్మురంక్షించు గాకయనుట॥

శ్లో॥ నయనాంబుజేభజతకామదుఘంహృదయాంబుజేకిమపికారు
ణికమ్। చరణాంబుజేమునికులైకధనంవదనాంబుజేవ్రజవధూ
విభవమ్॥ ౭౭

టీ॥ నయనాంబుజె-కమలములవంటి నేత్రములందు, కామదుఘం-కోరికలనుబిడుకు చున్నయదియు, హృదయాంబుజే-హృదయకమలమందు, కిమపి-చెప్పనలవిగాని- కారుణికం, దయావంతమయినయదియు - చరణాంబుజె-పాదపద్మమందు, మునికులైకధనం- మునిసమూహమునకు ముఖ్యమైనయదియు, వదనాంబుజే- ముఖపద్మమందు, వ్రజవధూవిభవం-వ్రజవధూ-గోపస్త్రీలయొక్క-విభవం- ఐశ్వర్యమైనయదియు, మహః, తేజము ను- భజత- సేవింపుడు॥ ౭౮

ఉ॥ కన్నులెచాలుగోర్కులొసగన్ హృదయాబ్జరుచాలుజెల్మికిన్।
సన్నుతపాదపంకజముచాలుమునీన్ద్రజనానురూపసం। పన్న
ధనాస్తికిన్వదనపద్మముచాలువ్రజాంగనావిలాసోన్నతికట్టివి
వ్యవిభవోజ్జ్వలునామదినాశ్రయించెదన్॥

తా॥ ఓయింద్రియంబులారా యాశ్రయించినవారలోకసరి నూచినన్ నేత్రమ్ములుదయారసంబుప్పతిలనఖిలకామంబులనీజాలు హృదయంబెప్పుడును దయాకరంబగుచునుండుబాదంబులునెల్లమునులకుమూలధనంబగుచునుండు నెమ్మొగంబు గోపికలకైశ్వర్యంబిచ్చుచునుండునట్టి శ్రీకృష్ణరూపతేజంబునాశ్రయింపుడనుట॥

శ్లో॥ నిర్వాసనంహంతరసాంతరాణాంనిర్వాణసామ్రాజ్యమివావకీర్ణం అవ్యాజమాధుర్యమహానిధానమవ్యాత్ప్రజానామధి
దైవతంనః॥ ౭౯

టీ॥ రసాంతరాణాం-రసవిశేషములయొక్క, నిర్వాసనం - తిరస్కారమైనవాడును-అవకీర్ణం-వ్యాప్తమైన- నిర్వాణసామ్రాజ్యమివ- నిర్వాణ-ముక్తియొక్క - సామ్రాజ్యమివ- సర్వస్వమువలెనున్నవాడును, అవ్యాజమాధుర్యమహానిధానం,నిరుపాధికమైనసౌందర్యనిక్షేపమైనవాడును, ప్రజానాం- ప్రజలకు-అధిదైవతం- దేవుడైనశ్రీకృష్ణుడు-నః- మమ్ము, అవ్యాత్-రక్షించుగాక॥ ౭౯



ఉ॥ ఇతరరసంబులేమటికినీనవమోహనమాధురీసిధిన్।సతతము
గాంచినందనివిచాలునెముక్తిసుఖానుభూతియా। కృతియల
రారగాదనువరించెననందగుగోపరూపసం। గతమగుదైవ
తంబఖిలకాంక్షితముల్ జతగూర్చుగావుతన్॥

తా॥ రసవిశేషంబులందిరస్కరించుచుముక్తిసర్వస్వంబుంబోలె వెలుంగుచునిరుపాధికసౌందర్యంబునకునిక్షేపంబయియెల్లరకునేలికయై వెలయుశ్రీకృష్ణాఖ్యదైవతంబునన్నురక్షించుగావుతయనుట॥

శ్లో॥ గోపీనామభిమతగీతవేషహర్షాదాపీనస్తనభరనిర్భరోప
గూఢః। కేళీనామవతురసైకతపాస్యమానం కాళిందీపులినచ
రంపరంమహోనః॥

టీ॥ అభిమతగీతవేషహర్షాత్ - అభిమత,అంగీకరింపదగిన,గీత-గానముచేతను, వేష-అలంకారముచేతనునయినయట్టి-హర్షాత్-సంతోషమువలన- గోపీనాం - గోపికలచేత, ఆపీనస్తనభరనిర్భరోపగూఢం-ఆపీన - స్థూలములయిన - స్తన- స్తనములయొక్క-భర-అతిశయముచేత-నిర్భర-గాఢముగా- ఉపగూఢ- అలింగనముచేయబడునదియు-కేళీనాం- క్రీడలయొక్క-రసైకిర, సాతిశయముచేత-ఉపాస్యమానం-సేవింపబడినదియు-కాళిందీపులినచరం-కాళిందీ-యమునయొక్క, పులిన- ఇసుకదిబ్బలయందు- చరం- తిరుగుచున్నయదియు- పరం, ఉత్కృష్టమైనయదియు-మహః-తేజస్సు- నః- మమ్ము- అవతు-రక్షించుగాక॥ ౮౦

మ॥ నవలావణ్యవయోవిలాసమురళీనాదంబులంజొక్కినల్లవకాం
తల్ యమునాఘనపులినలీలావేదికిందార్చిగా। రవమొప్పం
గుచకుంభసంభృత పరిరంభంబులన్సంధిబంధవిశేషంబులదె
ల్పమెచ్చుభువనాధారుణ్ణునన్బ్రోవుతన్॥

తా॥ ఇష్టంబులగు గానవేషంబులనైనసంతోషంబున గోపస్త్రీలువలుదచన్నుంగవలెదనాటంబైకొనియాలింగనంబుజేయసంతసిల్లుచునెల్లవిలాసంబులచే సేవింపబడుచు యమునానదియందలియిసుకదిన్నెలంజరియించుచునధికంబై వెలుంగు తేజంబునన్నురక్షించుగాకయనుట॥

శ్లో॥ ఖేలతాంమనసిఖేచరాంగనామానసీయమృదువేణునిస్వనైః
కాననేకిమపినీలకృపాస్పదం కాలమేఘకలహోద్వహంమ
హః॥ ౮౧

టీ॥ ఖేచరాంగనామానసీయమృదువేణునిస్వనైః-దేవతాస్త్రీలచేత గౌరవింపఁబడుచున్న వేణుధ్వనులచేతను, కాననే-బృందావనమందు, కాలమేఘకలహోద్వహం-నీలమేఘముతోడఁ గలహముచేయుచున్నయట్టిదియు, కృపాస్పదం - దయాధారమైనయట్టిదియునగు, కిమపి- వాచామగోచరమయిన, మహః- శ్రీకృష్ణాఖ్యతేజస్సు,నః-మాయొక్క, మనసి- మనస్సునందు, ఖేలతాం-సంచరించుగాక॥ ౮౦

మ॥ అమరీమానితవేణుగానమునబృందారణ్యమందారబృం । ద
ముక్రిందఁ యమునాతరంగకణికాంతర్వేదికామధ్యదే।శము
నఁ సాంద్రఘనాఘనప్రతిభటశ్యామద్యుతిన్బొల్చుధా।మము
నామానసపీఠికన్గరుణఁగ్రమ్మన్బిల్చుగాకెప్పుడున్॥

తా॥ దేవతాస్త్రీలచేసమ్మానింపబడిన వేణుగానంబునబృన్దారణ్యంబున నీలమేఘంబు కోడంగలహంబుచేయంగ మకించునెమ్మేనిచాయన్దులకించుచుదయాధారంబైవాచామగోచరంబై తేజరిల్లు తేజంబునామనంబునుంజరియించుగాక యనుట॥

శ్లో॥ ఏణీశాబవిలోచనాభిరలసశ్రోణీభరప్రౌఢిభిర్వేణీభూతరసక్రమాభిరభితశ్శ్రేణీకృతాభిర్వృతః। పాణిద్వ్యేచవినోదయన్ రతిపతేస్తూణీశయానైశ్శరైర్వాణీనాముపదంపరంవ్రజపతిఃక్షోణీపతిఃపాతునః। ౮౧

టీ॥ అలసశ్రోణీభరప్రౌఢిభిః- అలస- మందములైన, శ్రోణీ-పిరుదులయొక్క-భర-అతిశయముయొక్క- ప్రౌఢిభిః సామర్థ్యముగలయదియు, వేణీభూతరసక్రమాభిః- వేణీభూత- ప్రవాహముగజేయబడిన-రస-మాధుర్యాదిరసములయొక్క - క్రమాభిః - సంచారములుగలవదియు, శ్రేణీకృతాభిః- పంక్తిగాజేయబడిన, ఏణీశాబవిలోచనాభిః- లేడిపిల్లకన్నులవంటి కన్నులుగలగోపికలతోడ-ఆవృతః- బరివేష్టింపబడినయదియు, రతిపతేః-మన్మథునియొక్క- ద్వే- రెండయిన-పాణీ-హస్తములను - తూణీశయానైః, దొనలను - సాయకైః- బాణములచేత, వినోదయన్- వినోదములుగలవానిగాజేయుచున్నయదియు, అభితః- అంతటను, వాణీనాం - వేదాంతవాక్యములకు, పరం-మిక్కిలియును, ఆపదం- విషయముగానియదియు, వ్రజపతిః, వ్రజ- నందవ్రజమందలి జనులకు- పతిః- విభుడైన-క్షోణీపతిః భూపాలకుడైన శ్రీకృష్ణుడు, నః-మము-పాతు-రక్షించుగాక॥ ౮౧

మ॥ సొలపుంజూపులుగబ్బిగుబ్బలుఘనశ్రోణీభరప్రౌఢిమ। స్తులశృ



ఙ్గారరసోర్మికల్గలుగునింతుల్వారలై కొల్వఁగం । ధిలతూణీశయబాణమంగజుడు పాణింబూనగా జేయున।చ్చెలువున్వాఙ్మనసాతిలంఘితుబరున్సేవింతునన్దాత్మజున్॥

తా॥ సొలపులగుచూపులునుగొప్పలైయల సంబులగుపిఱుందులుంగల్గి ప్రవాహీకృతంబులగు మాధుర్యాదిరసపరంపరలుంబోనిగోపయువతులుబారులై కొల్వనూరునికరంబుల బాణంబులచేతంగొమరొప్పంజేయుచు(అనఁగామన్మథునకవసరంబుసంపాదించుచుననుట) వేదాంత వాక్యంబులకు బ్రతిపాదింపనలవిగాకధరణీమండలంబునెల్ల నేలుచు నందవ్రజంబునేలువెన్నుండు నన్నుంబ్రోచుగాక యనుట॥

శ్లో॥ కాళిన్దీపులినేతమాలనిబిడచ్ఛాయేపురస్సంచరత్తోయేతోయజపత్రపాత్రనిహితందధ్యన్నమశ్నాతియః। వామేపాణితలేనిధాయమధురం వేణుంవిషాణంకటిప్రాన్తేగాశ్చవిలోకయన్ప్రతికలంతంబాలమాలోకయే॥

టీ॥ యః- ఏబాలకృష్ణమూర్తిః- వామే-డాపలిదియైన-పాణితలే-హస్తమునందు, వేణుం-పిల్లనగ్రోవిని-కటిప్రాన్తే-నితంబప్రదేశమునను విషాణం-శృంగీభూతముఖపాత్రావిశేషమును,నిధాయ-ఉంచి-ప్రతికలం- ప్రతిక్షణమందును,గాశ్చ- గోవులను,విలోకయన్- చూచుచున్నవాడగుచు,తమాలనిబిడచ్ఛాయే-తమాల, చీకటిమ్రాకులయొక్క, నిబిడ-దట్టమైన, ఛాయే-నీడగలయదియు, పురస్సంచరత్తోయే,పురః- ముందరను,సంచరత్-చరించుచున్న- తోయే-ఉదకముగల, కాళిందీపులినే,కాళిందీ- యమునయొక్క-పులినే- ఇసుకదిన్నెయందు,తోయజపత్రపాత్రనిహితం,తోయజపత్ర-తామరసవళమనియెడి,పాత్ర-పాత్రమందు-నిహితం-ఉంపబడిన, దధ్యన్నం,చల్దిని,అశ్నాతి-భుజించుచున్నాడో,తం-ఆప్రసిద్ధుడయిన,బాలం-బాలకృష్ణమూర్తిని-ఆలోకయే-చూచుచున్నాను॥ ౮౨

ఉ॥ చీకటిమ్రానినీడఁ జొంపమున జెన్నగు సైకతవేదిసీలపుం । న్వాకజలంబులోమురళివామకరంబునబట్టిగట్టిపై। దాకొనగొమ్ముజెక్కుకొనితామరపాకునజల్దిమెక్కుచున్।గోవులముంబ్రతిక్షణముగూరిమిగన్గొనుబాలుగాంచెదన్॥

తా॥ డాపలికేలంబిల్లనగ్రోవియునుంబిఱుదుప్రాంతంగొమ్మునుమొఱయజీకటిమ్రాకులనీడముంగలంజరియించుతోయంబుగల యమునానదిఇసుకదిన్నెలయందుగూర్చుండిగోవులంజూచుచు దామరపాకులోనిచల్దిదినుచుండుబాల

కృష్ణునింజూచుచున్నాను॥

శ్లో॥ యద్గోపీవదనేన్దు మండలమభూత్కస్తూరికాపత్రకం
యల్లక్ష్మీకుచశాతకుమ్భకలశవ్యాకోచమిందీవరమ్। యన్నిర్వాణ
నిధానసాధనవిధౌ సిద్ధాఞ్జనం యోగినాం తన్నశ్శ్యామలమావి
రస్తుహృదయే కృష్ణాభిధానం మహః॥

టీ॥ తత్-ఏప్రసిద్ధమయిన, కృష్ణాభిధానం-శ్రీకృష్ణాఖ్యమైన, మహః-తేజము, గోపీవదనేందు మండలం-గోపస్త్రీలయొక్క ముఖచంద్రమండలమందు-కస్తూరికాపత్రకం-కస్తూరితిలకము, అభూత్-అయ్యెనో, యత్-ఏతేజము-లక్ష్మీకుచశాతకుంభకలశవ్యాకోచం-లక్ష్మీదేవియొక్క స్తనములనియెడు బంగారుకలశములయందువికసించిన, ఇందీవరం-నల్లగలువ-అభూత్, అయ్యెనో-యత్-ఏతేజము-యోగినాం-ఋషులకు, నిర్వాణనిధానసాధనవిధౌ, నిర్వాణ-ముక్తియనియెడి, నిధాన-నిక్షేపముయొక్క-సాధన-సాధించుటయొక్క-విధౌ-విధానమందు సిద్ధాంజనం-నిక్షేపప్రదర్శకమైన కాటుక-అభూత్-అయ్యెనో, తత్-ఆప్రసిద్ధమైన-శ్యామలం, శ్యామలవర్ణమైన, మహః-తేజము, నః-మాయొక్క-హృదయే-హృదయమందు, ఆవిరస్తు-ప్రకాశించుగాక॥ ౭౩

ఉ॥ ఏహరివల్లవీజనముఖేందుకుకస్తూరికమృగనాభిచిత్రకం। బేహరిలక్ష్మికొమ్మకుచహేమఘటంబులనొప్పునుత్పలం। బేహరిముక్తిసేవధి మునీంద్రులకుంగనజేయునంజనం। బాహరినీలమూర్తిహృదయంబునసన్నిధిజేయుగావుతన్॥

తా॥ ఏతేజంబుగోపికలనెమ్మోముచందురునకుఁగస్తూరీతిలకంబయ్యెనే తేజంబురమాదేవికుచకనకకలశంబులందునుత్పలంబయ్యెనే తేజంబుయోగులకుమోక్షునిక్షేపంబుగననంజనంబయ్యె నట్టిశ్యామలవర్ణంబయిన శ్రీకృష్ణాఖ్యతేజంబునామదంబ్రకాశించుగాకయనుట।

శ్లో॥ ఫుల్లేన్దీవరకాన్తిమిన్దువదనం బర్హావతంసప్రియం శ్రీవత్సాఙ్కముదారకౌస్తుభధరంపీతామ్బరంసుందరం। గోపీనాంనయనోత్పలార్చితతనుంగోగోపసంఘావృతం గోవిందంకలవేణునాదనిరతందివ్యాఙ్గభూషంభజే॥

టీ॥ ఫుల్లేందీవరకాంతిం-వికసించినసల్లకలువలకాంతివంటి-కాంతిగలవాడును-ఇందువదనం-చంద్రునివంటిముఖముగలవాడును, బర్హావతంసప్రియం-నెమలిపింఛభూషణమేయిష్టముగాగలవాడును, శ్రీవత్సాంకం-శ్రీవత్సమనుమచ్చచిహ్నముగాగల



వాడునో, ఉదారకౌస్తుభం-దోషరహితమైనకౌస్తుభరత్నమునుధరించుచున్నవాడును-పీతాంబరం-పచ్చనైనవస్త్రమునుధరించినవాడును, సుందరం-సుందరుడైనవాడుగను-గోపీనాం-గోపికలయొక్క-నయనోత్పలార్చితతనుం-నేత్రములనియెడినల్లగలువలచేతబూజింపబడినశరీరముగలవాడును-గోగోపసంఘావృతం-గోవులయుగోపాలకులయుసమూహముచేత బరివేష్టింపబడియున్నవాడును, కలవేణునాదనిరతం-అవ్యక్తమధురమైన వేణుధ్వనియందు నాసక్తుడైనవాడును-దివ్యాంగభూషం-శ్రేష్ఠములయినశరీరాలంకారభూషణములుగలవాడునునగు-గోవిందం-గోవిందుని-భజే-సేవించుచున్నాను॥ ౭౪

శా॥ శ్రీవత్సాంకితుగోపికానయనరాజీవార్చితుంగోపగోసేవాభావితుగౌస్తుభోల్లసితువంశీనాదమోదాన్వితు। న్గోవిన్దున్నవషింఛయుక్తుశశివక్త్రున్ఫుల్లనీలోత్పలశ్రీవిభ్రాజితుహాటకాంబరయుతున్సేవింతుభూషాంచితున్॥

తా॥ శ్రీవత్సాంకుండును గోపికలనయనోత్పలంబులచేతం బూజింపబడువాడునుగోగోపాలసేవితుండును గౌస్తుభవత్సుండును వేణునాదవినోదుండునుబర్హిబర్హావతంసుండును బూర్ణచంద్రాననుండును నీలోత్పలకాంతిశరీరుండును బీతాంబరుండునుహారకేయూరాద్యలంకారశోభితుండు నునగుగోవిందునిసేవించుచున్నాననుట॥

శ్లో॥ యన్నాభీసరసీరుహాంతరపుటేభృఙ్గాయమాణోవిధిర్యద్వక్షఃకమలావిలాససదనంయచ్చక్షుషీచేన్దినౌ।యత్పాదాబ్జవినిస్సృతాసురనదీశంభోశ్శిరోభూషణంయన్నామస్మరణంధునోతిదురితంపాయాత్సనఃకేశవః॥ ౭౫

టీ॥ యన్నాభీసరసీరుహాంతరపుటే-ఎవ్వనిబొడ్డుదమ్మిమధ్యప్రదేశమునందు విధిః, బ్రహ్మదేవుడు, భృంగాయమాణః-తుమ్మెదవలె నాచరించుచున్నవాడగుచు, తిష్ఠతి, ఉన్నాడో, యద్వక్షః-ఎవనిభుజాంతరము, కమలావిలాససదనం-లక్ష్మీదేవియొక్క-విలాసార్థమైనగృహమో-యచ్చక్షుషీచ-ఎవని యొక్క కన్నులును, ఇందినౌ-చంద్రసూర్యులో, యత్పాదాబ్జవినిస్సృతా-ఎవనిపాదకమలమువల్లబయలువెడలిన-సురనదీ-గంగానది-శంభోః-శివునియొక్క-శిరోభూషణం, అవతంసమో-యన్నామస్మరణం-ఎవనిపేరుదలచుట, దురితం-పాపమును-ధునోతి-కంపింపజేయుచున్నదియో-సః-ఆప్రసిద్ధుడయిన-కేశవః-శ్రీకృష్ణమూర్తి-నః-మమ-పాయాత్-రక్షించుగాక॥ ౭౬

మ॥ ఎవ్వనినాభికంజమునభృంగముభంగిజెలంగుజన్మజుం। డెవ్వ

నికన్నులింపురవులెవ్వనిపక్షములచ్చికాట। పచ్చెవ్వనిపాదస
ద్మజలమీశుజటాటవిబాల్పు భూషణంబెవ్వనిపేరొగ్గనంగలు
షమిగునోయాహరినన్నుబ్రోవుతన్॥

తా॥ ఎవ్వనిబొడ్డుతామరయందునలువ తేటివలె జెలంగుచునుండు నెవ్వా నియురంబుకమలాదేవికిలీలామందిరంబై వెలయు నెవ్వనికన్నులసిందురవులు వెలయుచు రెవ్వనిపాదకమలంబునం బొడమినగంగానది శివునకుశిరోభూష ణంబై వెలయు నెవ్వనినామంబులుస్మరింపనఖిలదురితంబులడంగునట్టి కేశవుం డునన్నుంబ్రోచుగాకయనుట॥

శ్లో॥ రక్షన్తుత్వామసితజలజై రంజలీకి పాదమూలేమీనానాభీసర
సిహృదయేచూ రబాణామురారేః। హారకఃకణ్ఠేహరిమణిమ
యావక్త్రపద్మేద్విరేఫాఃపింఛాచూడాశ్చికురనిచయే ఘోష
యోషిత్కటాక్షాః॥ ౮౬

టీ॥ యః-ఏ-ఘోషయోషిత్కటాక్షాః- గోపస్త్రీకడగంటిచూపులును- మురారేః శ్రీకృష్ణునియొక్క-పాదమూలే- పాదమూలమున- అసితజలజైః- నల్లగలువలచేనయిన- అంజలీః-దోయిలియును-నాభీసరసి-బొడ్డనియేడికొలను- ౦న్మీనాః-మీనములును,హృదయే-మనస్సునందు, మారబాణాః-మదనబాణములును- కంఠే- కంఠమందు, హరిమణిమయాః- ఇంద్రనీలవికారములయిన, హారాః- హారములును- వక్త్రపద్మే- ముఖకమలమునందు- ద్విరేఫాః, భ్రమరములును, చికురనిచయే-కేశసమూహమునందు - పింఛాచూడాః-పింఛరూపకశిరోభూషణములును-ఆభూవన్-అయినవియో- తే- ఆగోపికల కడకంటిచూపులు, త్వాం- నిన్ను- రక్షంతు, రక్షించుగాక॥ ౮౬

చ॥ కమలదళాక్షునంఘ్రులకు గల్వలదోయిలినిమ్నునాభికూపము
నకుమీలుపేరెదకుభావజువాలుశిరోధికింద్రర। త్నములసరా
లుమోమువిరిదమ్మికిదుమ్మెదచాలుమౌళికి। న్విమలపుబీలిడా
లుదగువ్రేతలచూపులునిన్నుబ్రోవుతన్॥

తా॥ ఏగోపికలకడగంటిచూపులు వెన్నునిపాదపద్మంబులకు గలువలదో యిలియును బొడ్డుకొలకునందుమీనంబులును రంబునమారుని బాణంబులును గ రంబునందు నింద్రనీలంబులసరంబులను మోముదామరయందు భ్రమరంబు లను సిగయందు నెమలిపురిసొంములునయ్యెనోయట్టి కడకన్నులు నిన్నుర క్షించుగాక॥



దధిమథననినాదైస్త్యక్తనిద్రఃప్రభాతే నిభృతపదమగారంవల్లవీనాంప్రవిష్టః
ముఖకమలసమీరైరాశునిర్వాప్యదీపాన్కబళితనవనీతఃపాతుగోపాలబాలః॥

టీ॥ ప్రభాతే, తెల్లవారిఝామున, దధిమథననినాదైః,దధి-పెరుగుయొక్క-మథన,చిలుకుటవలనగలిగిన- నినాదైః- ధ్వనులచేత-త్యక్తనిద్రః-విడువబడిననిద్దురగలవాడగుచు-వల్లవీనాం- గోపికలయొక్క- ఆగారం-గృహమునకు-నిభృతపదం,నిభృత-మ దమైన - పదం, పాదములుగలుగునట్టులుగా - ప్రవిష్టః, ప్రవేశించినవాడగుచు, ముఖకమలసమీరైః, ముఖకమల- కమలమువంటిముఖముయొక్క- సమీరైః- వాతములచేత,దీపాన్-దీపములను, ఆశు, శీఘ్రముగా- నిర్వాప్య- పోవనడచి,కబళితనవనీతః- మ్రింగబడినవెన్నగలిగిన, గోపబాలః, బాలకృష్ణమూర్తిః, నః-మః ను-పాతు-రక్షించుగాక॥ ౮౭

ఉ॥ ప్రొద్దునజల్లజిల్కురవముల్చెవిసోకిన యంతలోపల। న్నిద్దురలేచిగో పరమణీసదనంబుల జొచ్చియొయ్యన। న్నద్దుమణంచియాస్యపవనంబుననాళ ముబూనిదీపము। ల్పెద్దయొనర్చి వెన్నగబళించిన గోపకుమారు గాంచెదన్॥

తా॥ ప్రభాతంబునం బెరుగుచిల్కురవంబులువినినిద్దుర మేలుకాంచి గోపికా సద నంబులంజొచ్చసద్దుగాకుండబాదంబులూనుచుంబోయి ముఖమారుతంబున దీపంబులార్చి వెన్నమ్రింగుబాలకృష్ణుండు నన్నుబ్రోచుగాకయనుట॥

ప్రాతస్స్మరామిదధిఘోషవినీతనిద్రం నిద్రావసానరమణీయముఖారవిందం।
హృద్యానవద్యవపుషంనయనాభిరామమున్నిద్రపద్మనయనంనవనీతచోరం॥

టీ॥ దధిఘోషవినీతనిద్రం-దధిఘోష-దధిమథనజన్యధ్వనిచేత-వినీత-పోగొట్టబడిన-నిద్రం-నిద్రగలవాడును,నిద్రావసానరమణీయముఖారవిందం-నిద్రాంతమందుసుందరమైనముఖకమలముగలవాడును, హృద్యానవద్యవపుషం-మనోహరమైదోషరహితమైనశరీరముగలవాడును- నయనాభిరామం- నేత్రములకు నుత్సవస్వరూపుడైనవాడును- ఉన్నిద్రపద్మనయనం- వికసించినతామరరేకులవంటినేత్రములుగ[illegible]డునునగు,నవనీతచోరం- వెన్నదొంగయైనబాలకృష్ణుని, ప్రాతః- రేపకడ-స్మరామి- స్మరించుచున్నాను॥

చ॥ పెరుగుమధించువేళగనిపెట్టుకలేచిననిద్రమబ్బుతో। నరుణిమజెందుకన్నుగ వయందముజారుముఖారవిందమున్। సరసతనూవిలాసముల చందముబూర్ణికివేడ్కజేయగా। బరగెడువెన్నదొంగనబభావమునన్నుతియిస్తునామదిన్॥

తా॥ పెరుగుచిల్కురవంబులచే మేల్కాంచినిదురమబ్బుచేతం జెన్నలరు నెంమోము తామరవిలసిల్లమనోహరంబులైన శరీరవిలాసంబులచే దేజరిల్లుచు నయనాభిరాముండైనా న్నలుదొంగలించు పుండరీకాక్షుని రేపకడంగొలుచుచునుతియించుచున్నానుట॥

శ్లో॥ ఫుల్లహల్లకవతంసకోల్లసద్గల్లమాగమగవీగవేషితమ్। వల్లవీ
చికురవాసితాంగుళీపల్లవంకపిమువల్లవంభజే॥

టీ॥ ఫుల్లహల్లకవతంస కోల్లసద్గల్లం- వికసించిన యెఱ్ఱదామరలనియెడి కర్ణావతంసము చేత ప్రకాశించుచున్న చెక్కిళ్లుగలవాడును, ఆగమగవేషితం- వేదాంతవాక్యముల చేత వెదుకబడుచున్నవాడును, వల్లవీకబరీసురభితాంగుళిపల్లవం- గోపికలయొక్క కుంతలముల చేత పరిమళముగలవిగా జేయబడిన చిగుళ్ళవంటి వేళ్లుగలవాడును- కమపి వాచామగోచరుడైనవాడుగు-వల్లవం- గోపాలకృష్ణుని భజే, సేవించుచున్నాను॥ ౮౯

ఉ॥ హల్లకతల్లజశ్రుతిపుటాభరణోజ్జ్వలగల్లభాగునిన్। వల్లవకామినీచికురబంధసుమోత్కరవాసితాంగుళీ। పల్లవుమానిమానసవిభాసితు వేదగవీగవేషితున్। సల్లలితారుణాంబుజవిశాలవిలోచనుగొల్చెదన్మదిన్॥

తా॥ చెవిసందులవిలాసంబుకొరకు నిడిన యెఱ్ఱని తామరలచేతం దేజరిల్లు చెక్కిళ్లు గలిగి గోపికలకొప్పులలంకరించు కతంబున నంబరిమళించు పల్లవంబులంబోని వ్రేళ్ళు గలిగి వేదాంతవాక్యంబుల చేన న్వేషింపంబడుచు వాచామగోచరుండయి వెలయు గోపాలకృష్ణుని సేవించుచున్నాను॥

స్తేయంహరేర్యదిరతియన్నవనీతచౌర్యంజారత్వమస్యగురుతల్పకృతాపరాధం హత్యాదశాననహతిర్మధుపానదోషం యత్పూతనాస్తనపయస్సపునాతుకృష్ణః॥ టీ॥ హరేః-శ్రీకృష్ణమూర్తియొక్క- నవనీతచౌర్యం-వెన్నదొంగతనము, యత్-ఏది-అస్తి-కలదో-తత్-అది-స్తేయం-చౌర్యమును, హరతి-హరియించుచున్నదియో-అస్య ఈ శ్రీకృష్ణమూర్తియొక్క- యత్, ఏ, జారత్వం, విటభావము - భణితం సత్-చెప్పంబడుచున్నదియై- గురుతల్పకృతాపరాధం- గురుభార్యాసంగము జేయబడిన యపరాధమును, హరతి, హరించుచున్నదియో, హరేః- శ్రీకృష్ణమూర్తియొక్క- యా, ఏ - దశాననహతిః- రావణసంహారము, వర్ణితా సతీ- వర్ణింపబడినదియై-మధుపానదోషం- మద్యపానదోషమును హరియించుచున్నదియో, యత్పూతనాస్తనపయః-యత్-ఏ కృష్ణమూర్తియొక్క- పూతనాస్తనపయః-పూతనయొక్క స్తన్యము పాలు-హరతి-హరించుచున్నదియో-సః- అప్రసిద్ధుడయిన- కృష్ణః- కృష్ణమూర్తి-అస్మాన్- మమ్ము-పునాతు-పవిత్రుల జేయునుగాక॥ ౯౦

చ॥ గురుసతికూడినట్టి యఘకోటి జమన్ వ్రజజారతారతిం। బోరయ పుమద్యదోషములు పూతనచన్నులు చేవు బెంచినం। దెరలును హత్య రావణహతిన్ వినజౌర్యము వాయు వెన్నదొం। గరికములెన్న నట్టికథగల్గిన శౌరి పవిత్రు జేయుతన్॥

తా॥ శ్రీకృష్ణుని వెన్నదొంగరికము స్మరింప జౌర్యదోషంబులడంగు వెన్ను నిజారత్వంబు వర్ణింప జారత్వంబువలనం బొడమిన పాపంబులు రూపుమాయు శ్రీమన్నారాయణు డొనరించిన రావణసంహారంబు దలంప బ్రహ్మహత్యయైనం బోవు నందసూనుండు సేసిన పూతనాస్తన్యపానంబు జింతించిన మద్యపానంబున నైన కలుషంబులు రూపుమాయు నట్టి హ



ర్యం-హత్యను, శ్రీకృష్ణుండు నన్ను బవిత్రుం జేయుగాక యనుట॥

శ్రీకృష్ణుని పైని విరహంబు చే మదనాతురయగు నొక గోపిక మన్మథుని పాలంభించు రీతిం జెప్పుచున్నాడు॥

శ్లో॥ మారమామవ మదీయ మానసే మాధవైకనిలయే యదృచ్ఛయా। శ్రీరమాపతిరిహాగమేదసౌ కస్సహేత నిజవేశ్మలంఘనమ్॥

టీ॥ హేమార-ఓయిమన్మథుడా- మాధవైకనిలయే- విష్ణువునకు ముఖ్యస్థానమయిన-ఇహ-ఈ, మదీయమానసే- నా సంబంధమయిన మనస్సునందు-యదృచ్ఛయా-విచ్చలవిగా, మామవ- ఉండకుము- అసౌ- ఈ- శ్రీరమాపతిః- లక్ష్మీనాయకుడు-ఆగమేత్- వచ్చెనా-నిజవేశ్మలంఘనం-నిజ-స్వకీయమైన; వేశ్మ-గృహమునందు-లంఘనం- ప్రవేశించుటను-కః-ఎవ్వడు-సహేత-సహించును॥ ౯౧

చ॥ అనుపమదివ్యధామము మురారికి నా మనమట్లు గావున। న్మనసిజ నిల్వవద్దు చనుమా వినుమా యనుమాన మేటికి। న్వనరుహలోచనుండిటకు వచ్చిన నేరము వచ్చు నెమ్మెయిం। దనగృహసీమ నొండొకడు దారొగిన నెవ్వడు సైచు జెప్పుమా॥

తా॥ ఓయి మదనుడా నామనంబు- శ్రీనాయకుండగు విష్ణుదేవునకు-నాలయంబుగావున నిక్కడ నిల్వకుమా-శ్రీసతివచ్చిన నీకు నేరంబు దొరకొను దన ఇంట జొచ్చిన నెవ్వని నెవ్వండు సయిచునింకనయిన వెడలిపొమ్మనుట॥

శ్లో॥ ఆకుంచితం జానుకరం చ వామం న్యస్య క్షితౌ దక్షిణహస్తపద్మే। ఆలోకయంతం నవనీతఖండం బాలం ముకుందం మనసా స్మరామి॥

టీ॥ ఆకుంచితం-ముడువబడినయట్టియు-వామం, డాపలిదియైనట్టియునగు, జాను మోకాలిని-కరంచ-హస్తమును, క్షితౌ-భూమియందు-న్యస్య-ఉంచి-దక్షిణహస్తపద్మే-వలపలిదగు కరకమలమందు-నవనీతఖండం-వెన్నముద్దను- ఆలోకయంతం-చూచుచున్నవాడును-బాలం, బాలుడయినవాడునయిన- ముకుందం-శ్రీకృష్ణమూర్తిని, మనసా- మనస్సుచేత-స్మరామి, స్మరించుచున్నాను॥ ౯౨

చ॥ డాపలి కేలు జానువును దారగతిన్ ధరణీతలంబున। న్మోపియు పానతాంగమున నూల్కొని దక్షిణహస్తపంకజ। స్థాపితమైన వెన్న ప్రమదంబున జూచి చెలంగు చెల్వు। గ్గోపకుమారు దంతిగమనున్ సతతంబు మదిందలంచెదన్॥

తా॥ ముడువంబడిన డాపలి మోకాలును గరంబు బుడమి పైనిడి వలపలి కేలనుండు వెన్నముద్దం గనుంగొనుచున్న బాలకృష్ణు ముకుందు నా మనంబున సంస్మరించుచున్నాననుట

శ్లో॥ జానుభ్యామభిధావంతం పాదాభ్యామపి సుందరం। సకుండలాలకం కృష్ణం ధ్యాయామ్యుపసి బాలకమ్॥

టీ॥ జానుభ్యాం, మోకాళ్ళచేతను-పాదాభ్యామపి-పాదములచేతను, ధావంతం, పరువులిడుచున్నవాడును, సుందరం, సొగసయినవాడును; సకుటిలాలకం, కుటిలములతోఁగూడినముంగురులుగలవాడును, బాలకం- బాలుడునయిన-కృష్ణం- శ్రీకృష్ణమూర్తిని- ఉషసి, ప్రాతఃకాలమున, ధ్యాయామి-ధ్యానముచేయుచున్నాను. ౯౩

ఉ॥ నిద్దపుముద్దికాయలరసికఁబదంబునుజానుయానము। న్ముద్దుమొగంబునన్జెలగుముంగురులన్దపురావిరేకయుం। గద్దిరిబెళ్కుఁజూపులుజోకాటపునవ్వులుఁగల్గుబాలకుం। బ్రొద్దునమేలుకాంచిదివమున్మదినెంచెదనందనందనున్॥

తా॥ మోకాళ్ళచేతంబాదంబులచేతంబరువులిడుచుమనోహరుండయి కుటిలంబులపైబ్రాలినముంగురులు మెఱయబాలకుండయిమెలంగెడు - శ్రీకృష్ణదేవుని రేపకడధ్యానించెదననుట॥

అవతారిక॥ భగవంతుండు లీలాశుకయోగికిగలయవతారాంతరభక్తిని శోధింపగోరి శ్రీకోదండరాముండై యావిర్భవించి దర్శనమీయగా లీలాశుకయోగీంద్రుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ విహాయకోదండశరౌముహూర్తం గృహాణపాణౌమణిచారువేణుం। మయూరబర్హంచనిజోత్తమాంగే సీతాపతేత్వాంప్రణమామిపశ్చాత్॥

టీ॥ హేసీతాపతే-ఓశ్రీరామస్వామి, కోదండశరౌ-ధనుర్బాణములను-విహాయ-విడిచి-పాణౌ-హస్తమునందు-ముహూర్తం-ముహూర్తమాత్రము- మణిచారువేణుం-మణివికారమగుటచే-సుందరమైన పిల్లనగ్రోవిని-నిజోత్తమాంగే- స్వకీయమైనశిరమునందు, మయూరబర్హంచ- నెమలిపురిని-గృహాణ-గ్రహింపుము, పశ్చాత్-అనంతరము-అహం-నేను-త్వాం-నిన్నుగూర్చి-ప్రణమామి, నమస్కరించుచున్నాను॥ ౯౪

మ॥ శరచాపంబులుమానిమానికపువంశంబున్నతింగేలుఁదా। మరలంబూనికిరీటమందమగునీమౌళింగలాపంబుఁదా। ల్చిరవాణంబుగనిల్చినన్మతిఁగన్సేవించి సీతామనో। హరనామ్రుచ్చటదీరునప్పుడుగదాయాత్మంబ్రశంసించెదన్॥

తా॥ ఓశ్రీరామస్వామీధనుర్బాణంబులువిడిచిహస్తంబునమణివికారంబయిసుందరంబయినవేణువును బూనిశిరంబునఁగిరీటంబుమాని నెమలిపురియును ముహూర్తమాత్రకాలంబుధరియించినవిభవనేను నిన్ను సేవించుచున్నాననుట॥

ఈశ్లోకార్థంబు గోపాలబాలకవాక్యంబుగాఁజెప్పంబడుచున్నది.

శ్లో॥ అయంక్షీరాంభోధేఃపతిరితిగవాంపాలకఇతిశ్రితోస్మాభిఃక్షీరోపనయనధియాగోపతనయైః। అనేనప్రత్యూహోవ్యరచిసతతంయేనజననీస్తనాదప్యస్మాకంసకృదపిపయోదుర్లభమభూత్॥

టీ॥ అయం. ఈ-గోపతనయైః- శ్రీకృష్ణమూర్తిః క్షీరాంభోధేః. పాలకడలికి-పతి



రితి-డొరయనియు-గవాం-గోవులకు-పాలకఇతి-పాలకుడనియును-క్షీరోపనయనధియా-క్షీర-పాలయొక్క- ఉపనయనధియా, సంపాదించుకొనియెడిబుద్ధిగల- అస్మాభిః, మాచేత-శ్రితః- ఆశ్రయింపబడియెను-యేన- ఏహేతువుచేత-సతతం - ఎల్లప్పుడును అస్మాకం-మాకు- జననీస్తనాదపి-జననీ-తల్లియొక్క, స్తనాదపి- కుచమువల్లనయినను - సకృదపి-ఒకానొకప్పుడయినను- పయః-పాలు-దుర్లభం-పొందనశక్యమైనది-అభూత్-ఆయెనో-అనేన-ఈ-శ్రీకృష్ణునిచేత-ప్రత్యూహః-విఘ్నము-వ్యరచి-చేయంబడియెను॥ ౯౫

చ॥ చెలువుడుగోగణాధిపతిక్షీరపయోధివిహారియాతనిం। గొలిచినబాలుగల్గుననుకోరికెతోఁగడుభక్తిసేయగా। ఛళిఛళిమాదుతల్లిచనుబాలకునైతమువిఘ్నకర్తయై। యలవడనెట్టుగొల్తుమికనకటా యీడనినమ్మిగోపకుల్॥

తా॥ ఈశ్రీకృష్ణుండుపాలకడలికిదొరయనియుగోగణంబులకు బాలకుండనియుం బాలుదొరకునను నాసంజేసియాశ్రయించితిమియితండుతల్లులపాలునుమాకులేకుండునట్లువిఘ్నంబుచేసెనింక నేమనియాతనిం గొల్తుమనిగోపతనయులు వాక్రుచ్చుదురనుట అనగా బాలింతలతోడనయినమదనకదనం బొనర్చుననుట॥

ఈశ్లోకంబొకగోపికయొక్కవిరహవచనంబుగాఁజెప్పబడుచున్నది,

శ్లో॥ హస్తమాక్షిప్యయాతోసిబలాత్కృష్ణకిమద్భుతం। హృదయా
దపినిర్యాసిపౌరుషంగణయామితే॥

టీ॥ హేకృష్ణ-ఓయికృష్ణుడా- బలాత్-బలాత్కారముగా-హస్తం-కరమును, ఆక్షిప్య-విదలించి, యాతోసి- పోయినవాడవైతివి, కిమద్భుతం-ఏమియాశ్చర్యము, హృదయాదపి, హృదయమునుండియును-నిర్యాసి, బయలువెళ్లితివి- తే, నీయొక్క-పౌరుషం-పౌరుషమును-గణయామి, లెక్కించుచున్నాను॥

చ॥ వలచితిరాయటంచుచెయిపట్టినగౌగిటఁగారవించిచే। కిఁకిఁకొనగోటనొక్కఁకరగింపకచింముకబోయెదిక్రియం। దలపుననల్పజిక్కఁకకటాచనగల్గినపౌరుషంబునీ। కలవడెనంచుబలుకఁజెలినకుఁనజేర్చినశౌరిగాంచెదన్॥

తా॥ ఓకృష్ణానాచేతంబట్టిన చెయివిదలించిచనిపోయెదవిదియేమియచ్చెరువెదలిఎనన్నిలువకపోయెదవిట్లుచేయుటకేమి పౌరుషంబువచ్చెనని యొకనెలతయనెననుట॥

శ్లో॥ తమసిరవిరివోద్యన్మజ్జతామంబురాశౌప్లవఇవతృషితానాం స్వాదువర్షీవమేఘః। నిధిరివవిధనానాందీర్ఘతీవ్రామయానాంభిషగివకుశలంనోదాతుమాయాతుశౌరిః॥

టీ॥ తమసి-చీకటియందు-ఉద్యత్, ఉదయించిన- రవిరివ- సూర్యునివలెను, అంబురాశౌ- సముద్రమునందు- మజ్జతాం- మునుఁగుచున్నవారలకు - ప్లవఇవ-తెప్పవలెను తృషితానాం-పిపాసార్తులగువారలకు, స్వాదువర్షీ- సుగంధయుక్త వర్ష...

వర్షించుచున్న- మేఘఇవ- మేఘమువలెను- విధనానాం- ధనములేనివారలకు- నిధిరివ- నిక్షేపమువలెను- దీర్ఘతీవ్రామయమానాం- రొడతెగని తీవ్రములైన రోగములుగలవారల కు- భిషగివ; వైద్యుని వలెను- శౌరిః; శ్రీకృష్ణుడు- నః - మాకు- కుశలం- కుశలమును, దాతుం- ఇచ్చుటకొరకు, ఆయాత్- వచ్చుంగాక॥

మ॥ అడవిం జీకటబోవువానికుదయం బైనట్టి సూర్యాకృతిన్ । జడధిం గ్రుంగగ నావ డగ్గరిన యోజం బేదకున్ లిబ్బిచా । ప్పడు రీతిం దృషదీర్ప గాజడి మొగుల్ వైకొన్న చందాన నే । వ్వడరన్ వైద్యువట్ల హరి డాయన్ వచ్చినన్ బ్రోవుతన్॥

తా॥ కటికచీకటిలోబడి దుఃఖించువానికి సూర్యుడుదయించినటులనంబుళాసింబడి మునుంగువానికి నావ సమీపించినకైవడి నీరువట్టుడయ్యువానికి జడిమొగులు వైకొన్నవడు ప్రనంబేదకు లిబ్బియబ్బినచందంబున రోగంబులచే నొవ్వడరినవానికి వైద్యుండు డాయుకరణి శ్రీకృష్ణమూర్తి నాకు కుశలంబొసంగ వచ్చుగాకయనుట॥

కోదండం మసృణం సుగంధవిశిఖం చక్రాబ్జపాశాంకుశాన్ । హైమీం వేణులతాం కరైశ్చదధతం సింధూరపుంజారుణం। కందర్పాధికసుందరం స్మితముఖం గోపాంగనావేష్టితం। గోపాలం సతతం భజామి వరదం త్రైలోక్యరక్షామణిమ్

టీ॥ మసృణం- చిత్రవర్ణమైన- కోదండం- ధనువును, సుగంధవిశిఖం, పరిమళించుచున్న బాణమును, చక్రాబ్జపాశాంకుశాన్- చక్రశంఖపాశాంకుశములను- హైమీం- స్వర్ణవికారమైన- వేణులతాం - తీగెవంటి పిల్లనగ్రోవిని, కరైః - హస్తములచేత - దధతం- ధరించుచున్నవాడును, సింధూరపుంజారుణం- సింధూరపురాశివలె- నెఱ్ఱనయినవాడును, కందర్పాధికసుందరం, మన్మథునికన్నను- సుందరుండయినవాడును - స్మితముఖం- చిఱునగవుతోగూడిన- ముఖముకలవాడును, గోపాంగనావేష్టితం- గోపస్త్రీలచే తబరివేష్టింపబడినవాడును- త్రైలోక్యరక్షామణిం- లోకత్రయరక్షకుడైనవాడును- వరదం - వరములిచ్చుచున్నవాడును నగు, గోపాలం- శ్రీకృష్ణమూర్తిని, సతతం, ఎల్లప్పుడున్ను- భజామి- సేవించెదను॥

చ॥ అలరులకోరి యుంచు విలునంకుశ పాశరథాంగశంఖవం । శలతెలుబాహులన్ వ్వెలయుజకర్ణని గోపకుమారమన్మథున్ । లలితదరస్మితాననుద్రిలోకజనావనుగుంకుమారుణో । జ్జ్వలతరగాత్రు గోపజలజాతముఖీసుఖపాత్రు గొల్చెదన్

తా॥ చిత్రవర్ణంబయి మెఱయు చెఱకువిలునలరుటంము శంఖంబు జక్రంబు నంకుశంబు బాశంబును గాగరంబుల ధరియించి మదనుని కన్న సుందరుండయి చిఱునగవు నెంమొగంబునందొలుకాడ గోపయువతులు చుట్టును బలిసికొలువ ముల్లోకంబులం బ్రోచుచు వరదుండయి వెలయు గోపాలదేవుని సేవించుచున్నాననుట॥



శ్లో॥ సాయంకాలే వనాంతే కుసుమితసమయే సైకతే చంద్రికాయాం । త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికామోహనాపాంగమూర్తిం । సేవ్యం శృంగారభావైర్నవరసభరితైర్గోపకన్యాసహస్రైర్వందేహం రాసకేళీరతమతిసుభగం వశ్యగోపాలకృష్ణమ్॥

టీ॥ కుసుమితసమయే- వసంతకాలమందు, వనాంతే- వనమందు- సాయంకాలే సాయంకాలమందు- చంద్రికాయాం- వెన్నెలగాయుచుండగా - సయికతే - ఇసుకతిన్నియయందు - త్రైలోక్యాకర్షణాంగం - ముల్లోకముల వశపఱచి కొనునవయవములనుగలవాడును, సురనరగణికామోహనాపాంగమూర్తిం- దేవతలయొక్కయు మనుష్యులయొక్కయును, వేశ్యాస్త్రీలకు మోహజనకమైన కటాక్షవిక్షేపములుగలవాడును, నవరసభరితైః - నూతనశృంగారాదిరసభరితములయిన - గోపకన్యాసహస్రైః- గోపస్త్రీసహస్రములచేత శృంగారభావైః - శృంగారచేష్టలతోడ- సేవ్యం- సేవింపబడినవాడును, రాసకేళీరతం- రాసక్రీడయందాసక్తుడయినవాడును- అతిసుభగం- మిక్కిలి సుందరుడైనవాడునైన- వశ్యగోపాలకృష్ణం, సర్వజనకామవిషయుడైన కృష్ణుని గూర్చి- అహం, నేను- వందే, నమస్కరించుచున్నాను॥

మ॥ పటుశృంగారతరంగితాంగులగు గోపాలాంగనల్గొల్వను । త్కటబృందావనసైకతంబుల వసంతజ్యోత్స్నలన్ రోదసీ । తటవేశ్యాతతి దృగ్విలాసములచే తన్రాసక్రీడా । నటనాటోపవశీకృతత్రిభువనున్ సంజన్ముడిం గొల్చెదన్॥

తా॥ వసంతకాలమందు బృందావనంబులో రాత్రియందు వెన్నెలగాయుచుండగా నిసుకదిన్నియలపై జేరి ముజ్జగంబులవలపించెడు సొగసుగలవాడై స్వర్గలోకభూలోకములవెలయాండ్రనుమరులుకొలిపెడు క్రేగంటిచూపులందగి యప్పటికప్పటి కుప్పతిలు శృంగారరసంబులబొంగారెడు వేవేలగోపకన్యలు శృంగారచేష్టలతోడం దనచుట్టుంజేరి సేవించుచుండగా రాసక్రీడసలుపుచు సకలజనంబుల కోరికలు దీర్చుచుండెడు శ్రీకృష్ణునింగూర్చి నమస్కరించుచున్నాననుట॥

శ్లో॥ కదమ్బమూలే క్రీడన్తం బృందావననివేశితం । పద్మాసనస్థితం దేవం వేణుం గాయన్తమచ్యుతమ్॥

టీ॥ బృందావననివేశితం- బృందావనమందు ప్రవేశించినవాడును, కదంబమూలే కడిమిచెట్టు మొదటియందు, క్రీడంతం, క్రీడించుచున్నవాడును, పద్మాసనస్థితం- పద్మాకారపీఠమునందున్నవాడును, వేణుం, పిల్లనగ్రోవిని- గాయంతం- గానముచేయుచున్నవాడును, అచ్యుతం- నాశరహితుడయినవాడునైన శ్రీకృష్ణునిగూర్చి- వందే- నమస్కరించుచున్నాను॥

ఉ॥ పావనయామునాంబుకణభావితశీతలవాతధూతబృం।దావనపాళికుప్పితకదంబకమూలకేళిరా । జీవనవీనపీఠికవసించుచు వేణువినోదనాదియా। నావనజాయతేక్షణునహర్నిశమెన్నెదనిష్టసిద్ధికిన్॥

తా॥ బృందావనమందు శ్యైకడిమిచెట్టు మొదలం గ్రీడసలుపుచుఁ దంమిగద్దియపై గూర్చుండి వేణుగానము జేయుచుండెడు శ్రీకృష్ణునింగూర్చినమస్కారించెదదనుట॥

శ్లో॥ బాలంనీలామ్బుదాభంనవమణివిలసత్కింకిణీజాలబద్ధ శ్రోణీజంఘాంతయుగ్మంవిపులగురునఖప్రోల్లసత్కంఠభూషం।ఫుల్లాంభోజాభవక్త్రంహతశకటమరుత్పూతనాద్యం ప్రసన్నంగోవిందం వందితేంద్రాద్యమరవరమజం పూజయేద్వాసరాదౌ॥

టీ॥ నీలాంబుదాభం-నల్లనిమేఘముయొక్క- కాంతివంటికాంతిగలిగినవాడును-నవమణివిలసత్కింకిణీజాలబద్ధశ్రోణీజఘాంతయుగ్మం-నవ-తొమ్మిదివిధములయిన, మణి-నవరత్నాదిమణులచేత, విలసత్ - ప్రకాశించుచున్న - కింకిణి - చిఱుగంటలయొక్క, జాల, సమూహముచేత, బద్ధ- కూర్పబడిన, శ్రోణిజంఘాంతయుగ్మం- పిరుదులయొక్కయు పాదములయొక్కయు ద్వంద్వముగలవాడును, విపులగురునఖప్రోల్లసత్కంఠభూషం మిక్కిలిప్రకాశించుచున్నపులిగోరుభూషణముగాగలవాడును, ఫుల్లాంభోజాభవక్త్రం, వికసించినకమలముల యొక్క-కాంతివంటికాంతి గలిగినముఖముగలిగినవాడును, హతశకటమరుత్పూతనాద్యం-నశింపజేయబడినతృణావర్తశకటాసురపూతనాదులుగలవాడును, ప్రసన్నం-నిర్మలుడైనవాడును, వందితేంద్రాద్యమరవరం- నమ్రులైనయింద్రాదిదేవశ్రేష్ఠులుగలవాడును, అజం-ఉత్పత్తిరహితుడైనవాడునైన, బాలం- బాలుడయిన- గోవిందం-శ్రీకృష్ణుని, వాసరాదౌ- ప్రాతఃకాలమందు, పూజయేత్ -పూజింపవలయును॥

ఉ॥ బాలుబయోదనీలుసురపాలకవందితశీలుఘంటికా। లోలకటీతటీపదతలున్ హతచక్రసమీరశాంబరీ। జాలుప్రఫుల్లపద్మవిలసన్ముఖువ్యాఘ్రనఖాభిరాముగో। పాలుప్రసన్నవచ్యుతు ప్రభాతసమర్చితుజేయగాదగున్॥

తా॥ నీలమేఘంబులంబోలు నెంమేనిచాయందగలిగి కటితటపాదంబులయగజాల మొదలగుతొమ్మిదిజతరతనములవెలిగెడిచిఱుగజ్జెలగుమిచిందులాడ వెడదయగుపులిగోరుం జెలువొందుకంఠభూషణంబున మెఱసివికసించిననెత్తమ్మియనందగిమొగు- నెంమోముగలిగిబండిరక్కసునిందృణావర్తునిఁ బూతనను మొదలగురక్కసులంజిదిమియింద్రాదిసురసన్నుతుండటుపుట్టువులేని శ్రీకృష్ణుని వేకువంబూజింపవలయుననుట॥

శ్లో॥ వంద్యం దేవైర్ముకుందం వికసితకురువిందాభ మిందీవరాక్షం గోగోబృందవీతంజితరిపునివహంకుందమందారహాసం । నీలగ్రీవాగ్ర్యపింఛాకల



సువిలసత్కుంతలంభానుమంతం దేవంపీతాంబరాఢ్యం జయజయదినశోమధ్యమాహ్నేరమాయై॥

టీక॥ దేవైః- వేల్పులచేత, వన్ద్యం- కొనియాడదగినవాడును, వికసితకురువిన్దాభం- ప్రకాశించుచున్న కెంపులయొక్క- కాంతివంటి కాంతిగలిగినవాడును, ఇందీవరాక్షం- నల్లకలువలవంటి నేత్రములుగలవాడును, గోగోపీబృందవీతం- గో- గోవులయొక్క, గోపీ- గోస్త్రీలయొక్కయు, బృంద- సమూహములచేత, వీతం- చుట్టబడినవాడును, జితరిపునివహం- జయింపబడ్డశత్రుసమూహముగలిగినవాడును, కుందమందారహాసం- కుంద- మల్లెపువ్వులవంటియు, మందార- మందారపుష్పములవంటియు, హాసం- చిఱునగవుగలవాడును, నీలగ్రీవాగ్ర్యపింఛాకలనసువిలసత్కుంతలం- నీలగ్రీవ- మయూరముయొక్క, అగ్ర్యపింఛ- శ్రేష్ఠమైనబర్హముయొక్క, ఆకలన- కట్టుటచేత, సువిలసత్- మిక్కిలిప్రకాశించుచున్న- కుంతలం- కురులుగలవాడును- భానుమంతం- సకలాభరణభూషితాంగుడైనవాడును- పీతాంబరాఢ్యం- కనకాంబరముచేతప్రకాశించుచున్నవాడునగు- ముకుంద దేవం- శ్రీకృష్ణ దేవుని- దినశః- ప్రతిదినమందును- మధ్యమాహ్నే- మధ్యాహ్నకాలమందు- రమాయై- సంపదకొఱకు- జయజయ- పూజింపుముపూజింపుము॥

మ॥ కురువిందప్రతిమానమోహనతనున్ గోగోపికాసంవృతున్ । సురసందోహమునీంద్రవందితుముకుందుంగుందమందారసుం । దరమందస్మితుపింఛభూషణురిపుధ్వంసిన్సువర్ణాంబరున్ । సరసీజాక్షునిమధ్యమాహ్నమునబూజల్సేసి శ్రీలొందెదన్॥ తా॥ వేల్పులచేతంగొనియాడందగి ప్రకాశించుచున్న కెంపులజిగింబోలెడునెమ్మేనిచాయగలిగి కలువలనందగి మెఱుకన్నుగవం దేజరిల్లి గోవులును గోపికలుదనచుట్టునుం జేరి సేవించుచుండ శత్రుసమూహంబులపొగరడంచి మొల్లపూలవలెను మందారపువ్వులవలెనుం దెల్లనైనచిఱునగవుగలిగి నెమలిపురింజుట్టిననెఱికురులం బ్రకాశించి సకలభూషణభూషితుండై సువర్ణవస్త్రముగలిగిన శ్రీకృష్ణదేవుని బ్రతిదినము మధ్యాహ్నకాలంబున సంపదకొఱకు బూజింపుమనుట॥

శ్లో॥ చక్రాంతధ్వస్తవైరివ్రజమజితమపాస్తావనీభారమాద్యైరావీతం నారదాద్యైర్మునిభిరభినుతంతత్వనిర్ణీతహేతోః। సాయాహ్నే నిర్మలాంగం నిరుపమరుచిరంచింతయేన్నీలభాసం మంత్రీ విశ్వోదయస్థిత్యుపహరణపదం ముక్తిదంవాసుదేవమ్॥

టీ॥ మంత్రీ-గోపాలమంత్రజపశీలుడు- చక్రాంతధ్వస్తవైరివ్రజం-చక్రాంతః సుదర్శనాగ్రముచేత- ధ్వస్త- ధ్వంసముచేయబడిన-వైరివ్రజం- శత్రువులయొక్క-సమూహముగలవాడుగనుక- అజితం- శత్రువులచేతజయింపనశక్యుడైనవాడును-అపాస్తావనీభారం-అపాస్త- పోగొట్టబడిన-అవనీభారం- భూభారముగలవాడును-ఆద్యైః-బ్రహ్మాదులచేత-ఆవీతం- పరివేష్టింపబడినవాడును-నారదాద్యైః-నారదాదులు మొదలైన-మునిభిః-మునులచేత- తత్త్వనిర్ణీతహేతోః తత్త్వముయొక్క-నిర్ణయహేతువువలన- అభినుతం-స్తోత్రముచేయబడుచున్నవాడును- నిరుపమరుచిరం- సరిలేనియట్లుప్రకాశించుచున్నవాడును-నీలభానం-ఇంద్రనీలవర్ణుడైనవాడును, విశ్వోదయస్థిత్యపహరణపదం,విశ్వ-జగత్తుయొక్క-,ఉదయ-ఉత్పత్తికిని, స్థితి-ఉనికికిని,అపహరణ-లయమునకును,పదః-కారణుడైనవాడును,ముక్తిపదం,మోక్షప్రదాయకుడయినవాడును,వాసుదేవం-వసుదేవకుమారుడైనయిన శ్రీకృష్ణ ని సాయాహ్నే-సాయంకాలమందు,చింతయేత్-ధ్యానముచేయవలయును॥

మ॥ క్షితిభారాపహు నారదాదిమునిబాజీ సేవ్యవిశ్వోదయ। స్థితిసంహారవిశారదున్నిరుపమశ్రీనిర్మలాంగున్సమున్నతచక్రాయుధఖండితారిన జితున్సాయంబున న్గోల్వసంతతవిజ్ఞానముభుక్తిముక్తులమరుందన్మంత్రసంసిద్ధికిన్॥ తా॥ సుదర్శనాగ్రముచేత సకలశత్రువులసమయజేసినవాడు గావున నెవ్వారిచేతను జయింపనలవిగాక భూభారంబుడిపి బ్రహ్మాదులచే నావరింపబడి నారదాదిమునులకుంబరతత్త్వంబిట్టిదియని తెలుపుచు వారిచేనుతింపబడుచు సరిలేనిసొగసు గలిగి ఇంద్రనీలంబులంబోలు నెమ్మేనిచాయలం దేజరిల్లి యెల్ల జగంబులింబుట్టింప నురక్షింపను లయంబునొందింపను తానకారణంబై మోక్షప్రదాయకుడైవసుదేవునకు ముద్దుపట్టియైన శ్రీకృష్ణుని గోపాలమంత్రజపశీలుడైనపురుషుడు సాయంకాలమందు ధ్యానము సేయవలయుననుట॥

శ్లో॥ కోదండమైక్షవమఖండమిషుంచ పౌష్పం చక్రాబ్జపాశసృణికాంచన వంశనాళమ్। బిభ్రాణమష్టవిధబాహుభిరర్కవర్ణం ధ్యాయేద్ధరిం మదనగోపవిలాసవేషమ్॥

టీక॥ అఖండం- సంపూర్ణమైన, ఐక్షవం- చెఱకుసంబంధమయిన,కోదండం- దనువును, పౌష్పం-పుష్పసంబంధమైన, ఇషుంచ - బాణమును, చక్రాబ్జపాశసృణికాంచనవంశనాళం, చక్ర- చక్రమును, అబ్జ- తామరను,పాశ పాశమును,సృణి - అంకుశమును,కాంచనవంశనాళం- పసిడివిల్లనగ్రోవిని,అష్టవిధబాహుభిః- యెనిమిదివిధములయినచేతులతో, బిభ్రాణం- ధరించుచున్నవాడును ,అర్కవర్ణం సూర్యునియొక్క-వర్ణమువంటివర్ణముగలవాడును, మదనగోపవిలాసవేషం, మన్మథసమానమైనవిలాస స్వరూపములుగలవాడునగు,హరిం-విష్ణువును,ధ్యాయేత్- ధ్యానముసేయుగాక

చ॥ విరులలకోరియుం జెఱకువిల్లు గుణాంకుశశంఖచక్రముల్। కరములనాత్తిటుంజెలగ గాంచనవేణువు రెండుచేతులన్। మెరయగ గొట్టి సూర్యరుచిమీఱి నగోపకుమారవేషధు। స్మరివవమోహనాంగుని మనంబున నిల్పెద సిద్ధసిద్ధికిన్॥ తా॥ రెండుచేతులతో దామరనిడికొని వేణువుబట్టి వాయించుచు రెండుచేతులతో శంఖచక్రంబులను వేఱు రెండుచేతులతో పాశాంకుశంబులను వేఱు రెండుచేతులతో నరుకబడిన చెఱకువిల్లును బుష్పబాణంబునుగా విలసిల్లుచున్న ఎనిమిదిబాహువులు గలిగి సూర్యునివలెనెఱ్ఱని కాంతిగలవాడై కోటిమన్మథలావణ్యంబుతో గోపాల విలాసవేషంబమరియున్న భగవంతునిత్రైలోక్యమోహనార్థంబైన గోపాలమంత్రము నుపాసించుభక్తుడు ధ్యానము సేయువలయుననుట॥

శ్లో॥ యాప్రీతిర్విదురార్పితే మురరిపో కుంత్యర్పితే యా దృశీ యా గోవర్ధనమూర్ధ్ని యా చ పృథుకే స్తన్యే యశోదార్పితే। భారద్వాజసమర్పితే శబరికాదత్తే ధరే యోషితాం యా ప్రీతిర్మునిపత్నిభక్తిరచితే ప్యత్రాపి తాం తాం కురు॥

టీక॥ హే మురరిపో- ఓయి మురాసురసంహారకుండగు శ్రీకృష్ణస్వామీ, విదురార్పితే- విదురునిచే సమర్పింపబడినయన్నంబునందు- యాప్రీతిః- ఏప్రీతి గలిగెనో, కుంత్యర్పితే - కుంతీదేవిచేత సమర్పితంబైనయన్నంబునందు, యాప్రీతిః- ఏప్రీతిగలిగెనో, గోవర్ధనమూర్ధ్ని- గోవర్ధనపర్వతశిఖరంబున, యా- ఏప్రీతిగలిగెనో, పృథుకే - అటుకులయందున్ను, యాచ- ఏప్రీతియో, యశోదార్పితే- యశోదాదేవిచేతనివ్వబడిన, స్తన్యే- చనుబాలయందు,యాచ - ఏప్రీతిగలిగెనో, భారద్వాజసమర్పితే - భారద్వాజమహర్షిచేతనివ్వబడినయాహారమందును, శబరికాదత్తే- శబరిచేతనివ్వబడినఫలాదులయందును, యోషితాం- గోపస్త్రీలయొక్క, అధరే - మోవియందును, మునిభక్తిరచితే పి- మునిపత్నులచేత భక్తితో సమర్పింపబడిన యన్నాదులయందును, యాప్రీతిః- ఏప్రీతిగలిగెనో, అత్రాపి- ఈకర్ణామృతమందున, తాంతాం - ఆయాప్రీతిని,కురు- చేయుము॥

మ॥ శమనాపన్నము గాంగ నాగ్రసముభారద్వాజువిందున్ముని। ప్రమదాభక్త

ము మాతృదత్తకుచధారల్విపుల్యముంగాంగుభ । క్త్యముగోవర్ధనపూజయు
న్విదురసమృష్టాన్నంబుకుంతీసపర్యమదిం గైకొనునట్లు నాకవితగృష్ణాప్రీతి
తోఁగదే॥ తా॥ శ్రీలీలాశుక కవీశ్వరుండింత పర్యంతము భగవంతునియొక్క నా
నావిధస్వరూపంబులను మంత్రాధిష్ఠాన స్వరూపంబులనుభక్తిపారవశ్యం
బునస్తుతించియిప్పుడుతాను బూర్వోక్తవిధంబుగాజేసిన స్తోత్రరూపంబైన
కర్ణామృతమనునీప్రబంధంబును బ్రీతితోడనంగీకరింపవలయునని భగవంతుని
వేడుచున్నాఁడు - ఓయికృష్ణదేవా - ఈయవతారమందు విదురుఁడునీకుఁజేసిన
విందునందును [illegible]కాలమంద కుంతిచేసినవిందునందును నీబోధనఁబనిగొ పాల
కులుగోవర్ధనంబునకు బూజచేసిపర్వతదేవతారూపుండవైననీకు దానశిఖ
రంబునఁబడినయన్నంబునందును కుచేలముని తెచ్చియిచ్చిన యటుకులయందు
నుయశోదచంటి పాలయందును రామావతారమందు భరద్వాజమునియి
చ్చిన కంద[illegible]మూలాదులయందును శబరిఇచ్చినఫలములయందును నీయవతా
రమందే ప్రేమాపరవశులైన [illegible] । వేతలయధరరసమందును యాగమందుముని
పత్నులు భక్తితోడనిచ్చినవాయసాదులయందును నీకెట్టిసంతోషంబుగలి
గెనోయట్టి సంతోషంబునాచేతరచించి సమర్పింపబడినఈకర్ణామృత ప్రబం
ధమందునునీకుగలిగిదీనినంగీకరించినన్నురక్షింపవలయుననుట॥

క॥ వనజాక్షుఁడుకర్ణామృత । మునుజదివినవ్రాయవినిన బురుషుల
కునుగా । ధనకనకవస్తువాహన । తనయాదిసమృద్ధిశాశ్వతంబుగనొసగుఁ॥

మాలినీవృత్తము॥ జలరుహదళనేత్రా సర్పరాడ్వైరిపత్రా । ఖలజన
ఘనవాతాకంజసంజాతతాతా । సలలితగుణభూషా సత్యనిత్యైకభాషా । వి
లసితసితహాసా వేంకటాహార్యవాసా॥

మ॥ ఇదికృష్ణాశ్రయయోగిపుంగవకృపావీక్షాత్తసారస్యతా । భ్యుదయ
శ్రీవిభవ ప్రసిద్ధచిదచిద్బోధక్షమాశాంతిస । హృదయాభూషణవెల్లపూడి
మణిపెద్దామాత్యవెంగాగ్రణీ । గదితాశ్వాసమువొల్చుమూడవదియైకర్ణా
మృతశ్రీకృతిన్॥

శ్రీకృష్ణకర్ణామృతము - సర్వంబును -

తృతీయాశ్వాసము.

సమాప్తము.

